కృష్ణం వందే జగద్గురుమ్

# భాగవతరహస్యోపన్యాసములు



రచయిత :

పులిపాటి వేంకటసుబ్బయ్య, M. A.,

1984

BHAGAVATHA RAHASYOPANYASAMULU

Pulipati Venkatasubbaiah, M.A.

ప్రథమ ముద్రణ – 1984

2000 ప్రతులు



ప్రతులకు :-

పులిపాటి వేంకటసుబ్బయ్య. M. A.,
రిటైర్డు లెక్చరర్.
1—2—123/1 స్టేషన్ రోడ్డు
మహబూబ్‌నగర్ — 509 001

మూల్యము : **30—00**

ముద్రణ :-

శ్రీ బాలాజీ ప్రెస్.
**గాంధీరోడ్ - చిత్తూరు (ఆం. ప్ర.)**

ఓం



# ప్రేమాభినందనము

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు"

మా మిత్రుడు ఆత్మీయ భక్తుడు మంచివక్త; మంచి రచయిత, "సత్యమేవ జయతే" - అనే ఋషివాణిపై ఆయనకు శ్రద్ధవుంది; "శ్రమఏవ జయతే" - అనే యుగవాణి ఆయనకు అనుభవంలో వుంది. ఆయన యీ వరకు అనేక గ్రంథాలను రచించారు. ఈ మధ్య వరంగల్లులో భాగవతంపై ఉపన్యాసాలు చేశారు. ఆ ఉపన్యాసాలకు "భాగవత రహస్యోపన్యాసములు" అనే పేరుపెట్టి లిపిబద్ధంచేసి గ్రంథరూపం కల్పించారు. ఆయన శ్రద్ధకు ఆయన శ్రమకు శతధా ధన్యవాదాలు.

మా స్వాములు శ్రీ శంకరానందస్వాములువారు అంటూండే వారు - "భగవద్గీత యెవని నోటినుండి వస్తుందో - ఆ నోరు భగవంతుని నోరే సుమా!"-అని. భగవంతుని నోరు కాకపోతే - ఆ నోటినుండి భగవద్గీత యెలా వస్తుంది?

భాగవతమును గురించిన మాటా అంతే! "నా స్వరూపాన్ని భాగవతంలో వుంచా"నంటూ - భగవంతుడే స్వయంగా ఉద్ధవునితో భాగవతము యేకాదశస్కంధంలో సెలవిచ్చాడు. భాగవతాన్ని రచించి శ్రీవ్యాసమహర్షి శాంతి సమృద్ధిని సంపాదించాడు. పోతనామాత్యుడు దానిని తెనింగించి జన్మరాహిత్యం సాధించాడు. దానిని పలికి పలికి మన పులిపాటి వెంకటసుబ్బయ్య అమృత స్వరూపుడై వెలసినాడు.

భాగవతం పలికితే పఠిస్తే మనం "భాగవతాం" - "బాగు అవుతాం" - అని యీ గ్రంథం రెండవపుటలో గ్రంధకర్త వ్రాశారు. "ఆ విధంగా ఒక మహాత్ముడన్నా"డని తనమీద వేసుకోకుండా - "ఒక మహాత్ము"డని తన బరువు తప్పుకొన్నారు. ఆయన సాధు స్వభావానికి ఆయన కృతజ్ఞతానీతికి మరోసారి హృత్పూర్వక శుభాభినందనలు.

"బాగు కావాలె; బాగు చేయాలె" - అని నీతిశాస్త్రం చెబుతుంది. "బాగంటే యేది?" అనే మాటకు సమాధానం అధ్యాత్మ శాస్త్రం చెప్పాలె. "భగవంతునికి భాగంగా బ్రతక" మని భాగవతము బోధిస్తుంది. అదే నిజమైన బాగు. అనిత్యమైన సంసారానికి భాగమై కాక, నిత్యమైన భగవంతునికి భాగమై

వుండాలె, విభాగం కారాదు. "సర్వమున్నలెని దివ్యకళామయు మంచు విష్ణునందుల్లముచేర్చి" – బ్రతుకుచే భాగని ప్రహ్లాదుని పరమసందేశం. భగవంతుడు కూడా భగవద్గీత పదైదవ అధ్యాయం యేడవ శ్లోకంలో "మమైవాంశః" – "అరే! నాయనా! నీవు నా అంశమే సుమా! దేహానికి కాదు; సంసారానికి కాదు; పంచ భూతాలకు కాదు; జీవుడు దేవుని అంశం" – అని ప్రబోధించే వున్నాడు. ఆయనేమో చెప్పాడు. కాని, యీ మూఢజీవుడు, "నేను నీ అంశమే! నేను నీ వాడినే!" – అని అనడే! ప్రహ్లాదుని వలె అంబరీషునివలె రంతిదేవునివలె జడభరతునివలె గోపికలవలె భగవంతునివాడై బ్రతకడం లేదే! కలి మాయా విముగ్ధులైన మానవప్రాణుల కళ్లు తెఱపించేకోసం భాగవతరూపంలో భగవంతుడే అవతరించాడు.

భాగవతము నాకుకూడ అభిమాన గ్రంథమే. "సద్గురు వాణి" పత్రికలో నియతంగా 'భాగవత సుధ' అనే నా వ్యాసం ప్రకటింప బడ్తూనే వుంది. నా భాగవతోపన్యాసాలను మిత్రుడు వెంకటసుబ్బయ్యగారు పలుమార్లు వినేవున్నారు. ఆయన వ్యుత్పన్న ప్రతిభకలవారు. వారి ద్వారా ఆ గ్రంథం వ్రాయబడింది. నా బరువును కొంత తగ్గించారు. నాకు పరమానందమైంది.

ఈ గ్రంథము మూడు స్కంధాలవరకే పరిమితమైంది. మిగిలిన గ్రంథం కూడా రామభద్రుడో శ్యామభద్రుడో వీరి నుండి పలికించుగాక! ప్రకటింపజేయుగాక!

వరంగల్లు భక్తులకు యీ పుణ్యాం పండింది. ఆ భక్తులు యితోధికంగా చేయూత నిచ్చి భగవత్కృపకు భాగవతకృపకు పాత్రులగుదురు గాక!

మీద మీద పర్యటనలతో శరీరంలో శక్తి, మనస్సులో ఓపిక క్షీణించి యీ సందేశాన్ని పంపడంలో జాగుచేశాను. మా మిత్రుడు అన్యథా భావించడని విశ్వసిస్తాను. వారికి నాపై గల గౌరవాతిశయం కూడ నాకు తెలుసు. మా భాగవత సంబంధ సఖ్యతలు తామరతంపరగ విస్తరిల్లు గాక!

ఓం తత్సత్.

భాగవతసేవలో
శ్రీ రామకృష్ణానందస్వామి,
'గీతావాణి సంపాదకుడు'

క్యాంపు :
శ్రీ శివరామానందాశ్రమం
వాగలమట్టి.



అసతోమా సద్గమయ

తమసోమా జ్యోతిర్గమయ

మృత్యోర్మా అమృతంగమయ



# ఇందులోని విషయాలు సంక్షిప్తముగా:-

## మొదటిరోజు ఉపన్యాసము 1 నుండి 20వ పేజీవరకు

కర్మ ఎట్టిదో ఫలమట్టిది:— స్థూలశరీరానికి నోరున్నట్లే సూక్ష్మ శరీరానికి చెవులు — సంస్కారమే సూక్ష్మశరీరము — చెవులు, కన్నులు, నోరు యీ మూడింటి ద్వారా భగవంతుడు హృదయమనే భవనములో చేరుతాడు. అంటే ఈ మూడు ఆయన ఆగమనానికి ద్వారాలు — భాగవతము నిగమ కల్పతరుఫలము — జీవుడు ఆలయ మయ్యేవరకు ఈ ఫలరసం త్రాగాలి. ప్రపంచము అసజ్జడదుఃఖాయిష్ఠము. అల్లుడు అత్తవారింటికి పోయిన కథ — భగవంతుడు సచ్చిదానందస్వరూపుడు — సత్, చిత్ ఆనందముల వివరణ — ముసలమ్మ సూదికథ — భగవంతునికి నమస్కారము చేయాలి — ఎందుకు? భగవంతుడు వస్తుభుక్కుకాదు భావభుక్కు — ఆయనను సత్యభామ తూకం వేయుట — నమస్కారములో "నమమ" భావముండాలి — ప్రపంచములో అంతా పరమాత్మ సొత్తే—అతిథి పాయసం వేసే గరిటకు నమస్కరించుట — సర్వము భగవత్స్వరూపమేనని నమస్కరించాలి.

## రెండవరోజు 21వ పేజీనుండి 35వ పేజీ వరకు

మనుష్యుని సర్వకార్యములలోని లక్ష్యము ఆనంద ప్రాప్తి:— ఒకని భార్యకు తేలు కుట్టుట — భోగములలోని నిస్సారం - భాగవతము జీవితమును భగవన్మయము చేస్తుంది - తద్వారా కర్మ భగవత్సేవగా మారుతుంది - నారదున్ని బదరిలో సనత్కుమారులు కలియుట - నారదుడు భక్తి, జ్ఞాన, వైరాగ్యముల విషయము చెప్పి సత్కర్మ ఏదియో సనత్కుమారుల నడుగుట - కలియుగములో భాగవత మహిమ - ఆత్మ దేవుని కథ.

## మూడవరోజు ఉపన్యాసము 36 నుండి 60పేజీల వరకు

మరువరాని విషయాలు రెండు మరణము దేవుడు:— అంత్యకాల స్మరణము - Income Tax లెక్కలు చూపినట్లు - మనుష్యుడు ఇల్లు కట్టించవలెనంటే, పెండ్లి చేయవలెనంటే దీర్ఘకాలము ఆలోచిస్తాడు - మరి మరణమును గురించి ఎప్పుడైనా ఆలోచించినాడా - వర్ణాశ్రమశాస్త్రప్రయతేత

మోసాన్ అను శ్లోకవివరణలో లాలాజీకథ - నారదుడు వేదవ్యాసులకు భాగవతము రచించే ఉపదేశము చేయుట భక్తి మహిమను తెలుపుటకై నారదుడు తన కథ చెప్పుట - పూలకంపుకథ - పోతన అనువాదములోని నిశ్చయమైన భావము పునర్జన్మరాహిత్యము - అనువాదములోని అన్నియు కాకనూ, అయ్యేనుండు వస్తువివరణ - అస్తి భాతి. ప్రీతులు.

## నాలుగవరోజు 61 నుండి 82 వ పేజీ వరకు

వ్యాసుడు బ్రహ్మనొక వ్రాతకాని నిమ్మనుట:- గణేశుడు వచ్చి భాగవతము వ్రాయుట - దాని ప్రచారార్థమై శంకరున్ని తన కుమారుడుగా పుట్ట వలసిందని వేదవ్యాసుడు కోరుట - శుకుడు పుట్టి తపస్సుకై పోయి రెండు భాగవత శ్లోకాలు విని ఆసక్తితో తండ్రి వద్దకు వచ్చి భాగవతము వినుట - పరీక్షిత్తు వద్దకు పోవుట - పరీక్షిత్తు దేవలోకములోని అమృతమును నిరాకరించి భాగవతామృతమును కోరుట - అశ్వత్థామ ఉపపాండవులను చంపుట - ద్రౌపతి దీనాలాపము - రామాయణములోని ఋషివ్యాఘ్రసంవాదపుకథ - ఏకనాధు వారి చంద్రభాగస్నానము - అపాండవమగునట్లు అశ్వత్థామ అస్త్రప్రయోగము - పరీక్షద్రక్షణము - కుంతీదేవి స్తోత్రము.

## అయిదవ రోజు 83 నుండి 103 వ పేజీ వరకు

ఆనందాన్వేషణ: — జ్ఞానము సౌఖ్యసాధనము - భీష్మపరిచయము - ద్రౌపదికి భీష్మనిచేవరప్రదానము - కృష్ణున్ని మరణకాలములో నా ఎదుట నిలబడ వలసినదని భీష్ముడు కోరుట - నముద్రై ఉంచుటలోని గొప్పతనము - దుర్యోధనార్జునులు కృష్ణుని వద్దకు సహాయార్థమై పోవుట - అర్జునుడు తన జీవిత రథాన్నే భగవంతునకర్పించినాడు - ఎట్లు - దాని ఫలమేమి? ఏకనాధు భార్య, తుకారాం భార్యల కథ - భీష్మప్రతిజ్ఞ చక్రము చేతపట్టిస్తానని - ధర్మరాజును కృష్ణుడు భీష్మని వద్దకు తీసుకపోవుట - భీష్ముడు కర్మగతికి విస్మయపడుట - భీష్మస్తుతి, నిర్యాణము -

## ఆరవరోజు 104 నుండి 127 వరకు

మరణకాలములో భగవత్స్మరణ: — నారాయణ అనుటరాదు - ఇద్దరు నదిని దాటుట - మరణకాలములో రెండు ప్రతిబంధకాలు - ఎక్కడి నుండి వచ్చిన వస్తు అక్కడ చేరాలి - మట్టినుండి వచ్చిన శరీరం మట్టిలో చేర్తుంది.

జీవుడో॥ పరమాత్మలో చేరాలి - కబీరుదాసు ఉక్తి - కృష్ణుడు ద్వారకకు పోవుట- పరీక్షిత్తు జననము - అతని జోస్యము - సర్పదంశపు పరిణామము - విదురా గమనము - ధర్మరాజు గౌరవించుట విదురుడు ధృతరాష్ట్రునికి కాలగతిచెప్పి హిమాలయమునకు తీసుకొని పోవుట - ధర్మరాజు దుఃఖము - నారదుడు వచ్చి హితవు చెప్పుట - విధి బలీయము కథ.

## ఏడవరోజు 128 నుండి 160 వ పేజీ వరకు

భాగవత శ్రవణమువలన మనస్సు పొందే ఫలము:—— మనుష్యుడు కర్మాధికారము కలిగి ఉన్నాడు - వివేకము కలిగి యున్నాడు - భగవంతుడు తాను పుణ్యపాపముల నివ్వడు - మనుష్యుడెట్టి కర్మ చేసుకుంటే అట్టి ఫలము పొందుతాడు - భాగవత శ్రవణ మింతటి వివేకాన్ని కలిగిస్తుంది ధర్మరాజు ఒకదినం వాహ్యాళికి పోయి ఒకని చేతిలో తాళము చూచి విస్మయపడుట. - బంగారుకుండకథ - కలియుగ విశేషాలు భీమునికో చెప్పుట - అర్జునుడు ద్వారకనుండి వచ్చుట - గతవిషయములను స్మరించుట, - దూర్వాసమహర్షి చాతుర్మాస్యకథ - అర్జునుడు విరక్తుడగుట - మహాప్రస్థానము - పరీక్షిత్తు రాజ్యమేలుట - కలిని నిగ్రహించుట - ధర్మాంగములు సత్యము, తపస్సు, పవిత్రత- దానము - పరీక్షిత్తు వేటకు బోవుట - శృంగిశాపము - పరీక్షిత్తు పశ్చాత్తాపము - అంతా మన మేలునకే కథ - పరీక్షిత్తు ప్రాయోపవేశము -

## ఎనిమిదవరోజు 161 నుండి 194 వ పేజీ వరకు

భౌతికైశ్వర్యమెంత ఉండినను తృప్తి కలుగదు:- కాశీలో ధనికుడు గంగలో కొట్టుకొని పోయే వస్తువులను గడ్డకు వేసుకొనుకథ - పరీక్షిత్తు ప్రార్థన - ఆ సందర్భమున శ్రీశుకులవారి ఆగమనము.

## ద్వితీయ స్కంధము

పరీక్షిత్తు ప్రశ్న - శ్రీశుకుల సంతోషము - రాత్‌గంవాయే సోయికర్, వంటి జీవితము - రామాయణము విని దంపతులు సీతారాములవలె ఉండుటకు ప్రయత్నించుట - భగవత్సృష్టిలోని రచన పూర్ణము - సొరకాయ, మామిడికాయ ఉదాహరణ - మరణ సూచనలు - నిర్భయమునకు వివేకానందుని ఉదాహరణ - ఖట్వాంగుని కథ - ప్రపంచమును బ్రహ్మమయముగా చూడాలి - ద్వేషము వద్దు-

హావు-జాయికర - గురువు ఆరటి పండిచ్చి ఎవరూ లేనిచోట తినిరమ్మనుట - నక్క భూదేవితో అప్పు తీసుకొనుట - భగవంతుడు లైటువంటివాడు కథ - భాగవతములోని పాండిత్యము చూచి దక్షిణ యిమ్మని ఒకడు రాజా నడుగుట - సార్థక జీవి శుకులు తెలుపుట - దేవుడు చెవులెందుకిచ్చినాడంటే బీడీతుంట పెట్టుకొనుట కనుట.

## తొమ్మిదవరోజు 195 నుండి 221 పేజీ వరకు

ప్రపంచమెచ్చటినుండి వచ్చినది:- ప్రకృతి లక్షణము లసజ్జడదుఃఖములైతే యీప్రపంచమింత మధురముగ ఎట్లుంటుంది? మమకారమే బంధం - అదేపాశం - చెరకులకట్టకథ - అంతాహరిమయము - కోరికలు లేకుండా ఉండాలి - అక్బరుకు బీరబల్ తరగని కథ చెప్పి బహుమానము పొందుట - శ్రీశుకులవారు భక్తి శ్రేష్ఠమని నిరూపించి "అహమేవాసమేవాగ్రే" అనే సిద్ధాంతమును బోధించుట - దుర్యోధనాదులు పాండవులను మోసపుచ్చుట - శ్రీకృష్ణుడు రాయబారియై వచ్చుట - దుర్యోధనుడు భోజనమునకు పిలిస్తే వాటి నియమాలు చెప్పుట - కృష్ణుడు విదురునింటికి భోజనమునకై పోవుట - హస్తినాపురమునుండి విదుర నిష్క్రమణము - విదురుడు తన అవమానములో కూడ తన శుభమును కనుగొనుట - కౌరవుల పుణ్యమును తీసుకొని పోవుట - ఉద్ధవుని కలయిక.

## పదియవ దినము 222 నుండి 244 పేజీవరకు

మనుష్యుడు తన సుఖమునకై అనేకములైన వస్తువుల వెంట పడ్డాడు:- దానికి భగవత్ప్రాప్తి మార్గము శ్రేష్ఠము- వేదములో వి మూడు ప్రధానవిషయాలు - చిత్తశుద్ధయే కర్మ - ఏతద్వ్యతిరేకమైన కర్మ నరకమునకు తీసుకపోతుంది - క్షయపతనసాతిశయం ప్రపంచం - వ్యసనాలు కల వారు మరణించిన పిమ్మట పొందేగతి - ఉత్తమవ్యక్తులు మరణిస్తే - ఉపాసనా కాండ మనస్సుకు సంబంధించినది - ఇట్టి మానసిక సంస్కారముపైననే ఉన్నతి గాని, అవనతిగాని ఆధారపడుతుంది - ప్రపంచాన్ని చూచే చూపులు మూడు విధాలు - మనస్సుకొరకు మానవుడు లేడు - ఒకవ్యక్తి గొప్ప గొప్ప కార్యాలు చేయదలంచి తపస్సుచేసి భూతమును తెచ్చుకొనుట - దీనిలోని దార్ష్టాంతము - మనస్సుకున్న అవస్థలు మూడు - విదురుడు మైత్రేయ మహర్షితో సుఖము కొరకు

వరుడు పనిచేసి దుఃఖమెందుకు పొందుతాడని ప్రశ్నించుట - సుఖదుఃఖముల విమర్శ - కష్టమును చూచి భయపడేవాడు ఉన్నతికి రాలేడు - కర్మను పెంచు కొంటారు - దుఃఖమునకు కారణము - ప్రధానము, గౌణము - నీవెంట ఏది వస్తుంది? కాశీలో అన్నపూర్ణసత్రము కథ - సంసార శబ్దము యొక్క అర్థము - నిరంతర భజన అంటే అర్థమేమి? - సూక్ష్మశరీరమునకు కథామృతము శ్రేష్ఠమైన ఆహారము - ఇంద్రియములంటే? - విదురుని పూర్వకథ -

## పదునొకండవ దినము 245 నుండి 266 వ పేజీ వరకు

### జీవితములో సాంగత్యము చాలా ప్రధానమైనది:—

నామాట వినుటకు వీలున్నదా? కథ - జీవితలక్ష్యమేది? - భగవంతుని చేష్టలు లీలలు - మానవునివి కర్మలు - విదురుడు మైత్రేయున్ని అగుణుడైన భగవంతుడు సగుణుడై జగదుత్పత్తికార్యాలు ఎట్లు చేస్తాడు అని ప్రశ్నించుట - అర్భకుని గతి అంటే మరల ప్రశ్నిస్తాడు విదురుడు - నిర్గుణశబ్దార్థవివరము - ప్రతివస్తువులోను అస్తి, భాతి, ప్రియము, రూప, నామమున్నాయి - మానవుని స్వభావము సచ్చిదానందములు - మనుష్యులకి మరణమంటే ఎందుకిష్టములేదు? - పెండ్లికొడుకు మరణించు కథ - ఆధారము పూలమాలలో దారమే - రూపనామములకు అస్తిత్వములేదు - దేహేంద్రియ మనోవికారాదులాత్మను అంటజాలవు - అవిద్య అంటే-భార్య విధవయైనదని చెప్తే భర్త ఏడ్చినాడట-దైవీమాయ అనుకూలమగు మార్గము - మైత్రేయ మహర్షి సృష్టిక్రమమును చెప్పుట - పంచీకరణము -

## పంద్రెండవ దినము 267 నుండి 297 వ పేజీ వరకు

### ప్రాతఃకాలము బంగారువంటి సమయము:- చీకటితో లేస్తే

చాలా లాభములు - నిద్రకూడ ప్రార్థన అయ్యేమార్గము - భోగులకు, యోగులకు 36 సంబంధం - అనుకూలదాంపత్యమంటే 63 సంబంధము - సహనముతో వ్యవహరించాలి - ఎనిమిది విషయాలు గోప్యముగ ఉంచదగ్గవి - 20 వుల్లిగడ్డ తైనా 20 కొరడాదెబ్బలైనా శిక్ష - క్షమ కవచము - హరినామము సత్యము - వార్ధక్యము దైన్యము - దైవమార్గసాధనలో వృద్ధులైతే చిత్తశాంతి, గౌరవము ఉంటాయి - భక్తి అనంతశక్తిని ప్రసాదిస్తుంది - మానవజన్మలో కోరిన

ఫలాన్ని పొందవచ్చు - విదురుడు తన సంశయములన్నియు తీర్చిన మైత్రేయున్ని ప్రశంసించుట - సృష్టి విస్తారమును గురించి మరల విదురప్రశ్న - దితికశ్యపుని వద్దకు కామముతో వచ్చుట - జీవితములో భార్య ఋణము - ఋణత్రయము - యజ్ఞములు - ఒక్క మహూర్తమాగమంటే దితి వినదు - ఆమెకు కలిగిన దోషాలు 4 - రాక్షసులు పుట్టి చస్తారంటే దితిదుఃఖము - జయవిజయుల శాపము - అవతారరహస్యము - పదారువేల గోపికలేవి? మహాత్ములు మృత్యుభయమును దూరముచేస్తారు - దితి భేదబుద్ధి - దాని పెద్దకొడుకహంకారి - కన్ఫ్యూజియస్ సందేశము-చిన్నరైతు ఎద్దు పెద్దరైతు ఎద్దును చంపుట - అహంకారం ఎక్కడ వస్తుంది? - కాశీతలవాహినీ గంగా - వరాహమంటే అర్థము - హిరణ్యకశిపుడు తల్లిని ఓదార్చుట - సంసారములోని అందరి కలయిక ఎట్టిది? - సునందోపాఖ్యానము - యమున్ని గురించి మనహెచ్చరిక - ఇంటిలో అతిధి మాదిరి ఉండాలె - ఇల్లు సత్రమే - భగవంతున్ని చేరుటకీ మానవజన్మయే సాధనము -

## పదుమూడవ దినము 298 నుండి 306 వ పేజీ వరకు

మానవజన్మ సుదుర్లభము:- అర్థదం, అనిత్యం - విషయాలలో గడపడం ఆత్మహత్యాసదృశం - పాంచభౌతికదేహం, - హిరణ్యకశిపుడు మందర పర్వతము పైకి తపస్సుకు పోగా విఘ్నము-ఇంటికి వచ్చి విఘ్నకారణము చేసితే లీలావతి నారాయణ అని 108 మార్లు పలికించడము-మరుదినం వాడు తపస్సుకు పోతాడు - బ్రహ్మవరాలిస్తాడు -

## పదునాల్గవ దినము 307 నుండి 333 వ పేజీ వరకు

మరణకాలము జీవితానికి- Judgement జడ్జిమెంటు - ఇన్కంటాక్సు లెక్కలు చూపినట్లు ఇంద్రియాల లెక్కలు చూపాలి - అంతఃకరణమొక పాత్ర - వస్తువుల ననుసరించి వాసన - మరణమంటే దేహానికి అవస్థలు మారినట్లే - ఇందులోని సందేహం - హామేహామిలానా - పది అంతస్తుల మేడ కథ - ప్రహ్లాదుడు ఆకారజన్మ విద్యార్థవరిష్ఠుడు - కిముయత్రచతుష్టయమ్? - యువకులు బాగుపడితే దేశము యొక్క స్వరూపమే మారుతుంది - ప్రహ్లాదుని గుణము లనంతములు - అట్టివానిని చంప బంపుట ఎట్లు? ధర్మరాజు ప్రశ్న -

ప్రహ్లాదుని చదువుకు పంపుట - ఒక దినం చదువును తెలుసుకొనుటకు పిలువ నంపుట - మనుష్యుడు తన స్వభావాన్ని కూడ మార్చుకొనగలడు - వేమన, రత్నాకరుడు - ప్రయత్నిస్తే అంతా సాధ్యమే - హిరణ్యకశిపుడు నీకు భద్రమే దంటాడు - ప్రహ్లాదుని సమాధానము - ఒక సత్యము: పిల్లలు సదాచారులు కావాలంటే ........ - పరమాత్మ అందరికి ఉపద్రష్ట - మనుష్యులు దీనిని తెలుసుకొనరు - ఒకడు తనప్రియురాలికి ఉత్తరము వ్రాయుట - చండామార్కులు మరల చక్కగ చదివిస్తామని తీసుకపోవుట -

## పదునైదవ దినము 334 నుండి 350 వ పేజీవరకు

ఇప్పటి ప్రభుత్వలక్ష్యములు మూడు పొట్ట, బట్ట, నీడ:— శరీరమునకు సుఖము, మనస్సుకు శాంతి, ఆత్మకు ఆనందము మానవునికి కావాలి — ఆనందము ఏ బజారులో చిక్కుతుంది? భగవంతుడెంత మేలు చేసినాడు మనకు? — నమస్కారము చేయవద్దా మరి? — చండామార్కులు మరల పిల్లవాన్ని తెస్తారు — తండ్రి ప్రేమతో తీసుకొని పద్యము చెప్పి తాత్పర్యము తెలుపమంటాడు — ప్రహ్లాదుని సమాధానము విని హిరణ్యకశిపుడు చండామార్కులపై కోపగించుకుంటాడు. సర్వశాస్త్రముల లోని సారం మింతేనంటాడు ప్రహ్లాదుడు — చంపమని ఆజ్ఞయిస్తే దానవులు వ్యర్థప్రయత్నము చేస్తారు — తండ్రి పశ్చాత్తాపము

## పదునారవ దినము 351 వ పేజీ నుండి 370 వ పేజీ వరకు

ప్రపంచములోని సత్యము:— శరీరము మట్టినుండి వచ్చినది అచ్చటికి చేరుకుంటుంది. జీవుడో? — శరీరము రైలు — దానికి స్టేషను స్మశానము — జీవితము మరణకాలాన్ని సంస్కరించేదిగా ఉండాలి — చండామార్కులు మరల ప్రహ్లాదున్ని తీసుకవెళ్లుతారు — రాక్షస బాలుర కితడు ఆత్మోపదేశం చేస్తాడు — సంసారములో మానవుడుండాలి — అతనిలో సంసారముండరాదు ఎట్లు? నీటిలో పడవవలె — మనుష్యుడు కామినీహేలా కృష్ణుడు — జైమినిమహర్షి ఉదాహరణ — పరమాత్మ నాశ్రయిస్తే సర్వాంగీణాభివృద్ధి — ఒక గ్రుడ్డి ఈశ్వరున్ని గురించి తపస్సు

చేయుట — సంసారము బుద్ధి సాధ్యము — ఒక మనిషి కూర్చున్నాడు పలువురు పలువిధాలుగ చూస్తారు, పిలుస్తారు. ఈ సృష్టి ఎవరిది ? పలుగురు సాధకులు—గుణకర్మములు రెండు మాయ—వాటిని జ్ఞానాగ్నిచే కాల్చాలి.

## పదునేడవ రోజు 371 నుండి 386 వ పేజీవరకు

జీవితములో నేవిషయము ప్రధానమని వ్యవహరిస్తామో మరణ కాలములో అదే స్మరణకు వస్తుంది — భగవత్స్మరణ రావాలంటే అభ్యాసము చేయాలి — ఇద్దరు మనుష్యులు నదిని దాటుట — బంగారు వ్యాపారస్థుడు డాక్టరు మాటవిని అరచుట — మనస్సుకు మంచి శిక్షణ నివ్వుకోవాలి — కర్మలుచేయు విధానము ప్రహ్లాదుడు చెప్తాడు. హరేరాం భజన అందరు చేయుట — స్వయముగా హిరణ్యకశిపుడు వెళ్లి భజనను సిలిపి స్తంభమును వేయుట — నరసింహస్వామి ప్రత్యక్షము —

## పదునెనిమిదవ రోజు 387 నుండి 399 వ పేజీ వరకు

ప్రహ్లాదుడు నరసింహస్వామిని ఇంద్రియములు ఎంపతు పెడుతాయనుట — పదిమందికి ఒకడు గులామైనట్లు — శబ్దస్పర్శ రూప రసగంధములచేత కురంగ, మాతంగ, పతంగ, మీన, భృంగములు చిక్కుపడుట — ప్రపంచము కంటకావృక్షమే కాని స్వామిరెండమృతాల నిచ్చినాడు — ప్రపంచమనేబావి దానిలోపడి చచ్చుటకు కాదు — నరసింహ స్వామి ఏమైనా కోరుకొమ్మనుట — ప్రహ్లాదుడు కోరుట - కఠోపనిషత్తులో కోరికలు లేనివాని వైభవము.

## పందొమ్మిదవ రోజు 400 వ పేజి నుండి 423 వరకు

భక్తిచే మానవుడు సర్వదుర్గాలను తరిస్తాడు —దాని పరిమితి ఎంతవరకుండాలి ? - రామానుజాచార్యుల శిష్యుడు వేంకటేశ్ కథ మూడవ స్కంధములోని కథను చెప్పుట - . సృష్టిలోని మొదటి సంతతి మనువు, శతరూప - దేవహూతి కర్దముని భార్య అవుతుంది - కర్దముడంటే ? - తీర్థస్వరూపులు ఇంద్రియములను తమ అధీనములో పెట్టుకున్నవారు - పర

స్త్రీని లక్ష్మిగా చూసే – శంకరాచార్యుల ఉదాహరణ – పండరినాథున్ని వారుచూచి భావించడము - కర్దముడు మోక్షమునెందుకు కోరలేదు ? – గృహస్థాశ్రమముయొక్క ఘనత – స్త్రీపురుషుల సహకారము –కర్దముడు దేవహూతిని పెండ్లాడుతాడు – ఒక యువకునికి పెండ్లి సుఖకరమా, సన్న్యాసము సుఖకరమా అని శంకకలిగితే కబీరుదాసు సమాధానము–ఆదర్శమైన భార్య లక్షణాలు – దేవహూతి పతిభక్తి అద్భుతముగా చేస్తుంది.

## ఇరువదవ రోజు 424 నుండి 441 వ పేజీ వరకు.

లైటు వెలుగుటకు మైన్‌పవరుతో సంబంధము – మనకు మైన్‌పవర్ ఏది ? – భగవంతునితో సంబంధమంటే ఏమి ? – మాయ యేమంటుంది ? – వ్యాపారస్థుడు ధ్యానానికి కూర్చున్నాడు – ఇంకొక మనిషికి అలుగడ్డలో అని వినిపించింది –. దేవహూతి పతిసేవలో కృశీభూత శరీరయౌతుంది – విమానరచన – వందసంవత్సరాలు విహారము–తొమ్మిది మంది కూతుర్లు పుట్టుట – కర్దముడు కపిలుడు పుట్టిన పిమ్మట సన్న్యాసము తీసుకుంటాడు – వృద్ధు డెవరు ? – కపిలబోధ – చిత్తమే బంధానికి, మోక్షానికి కారణము – భావశుద్ధి వుండాలి – గంధపు చెక్కల వ్యాపారస్థుడు రాజుకథ – అన్నదమ్ముల ప్రేమ – భగవద్రచనా వైభవము – కొందరు స్త్రీలు మహాత్ముని వద్దకు పోవుట – భక్తివిధము తెలుపమని దేవహూతి అడుగుట – భక్తి లింగదేహమును నశింపజేస్తుంది – కొందరు భక్తులు మోక్షము కోరరు – అట్టివారిని కాలచక్రగ్రసనమునుండి రక్షిస్తాను – అరటిపండు – మృత్యురూప సంసారమునుండి కాపాడుతాను.

## ఇరువది ఒకటవ రోజు 442 నుండి 457 వ పేజీ వరకు

కపిలుని ఉపదేశం – సుసంస్కారం — అదృష్టమంటే — ముహూర్తమపి జీవేత – భర్తృహరి ఉరుతరపర్వతాగ్ర – మధ్యయాత్ వాతి వాతోఽయం ఆత్మతత్త్వము – అవిద్యోపాధిగల జీవుడు ప్రకృతిలో ప్రవేశించి తాదాత్మ్యము చెందుతాడు. ప్రకృతి 5 విధములు – 25 వ తత్త్వము కాలమనబడుతుంది – అది పురుషతత్త్వము – ఆపురుషుడు ప్రకృతి యందు తనవీర్యమును నిలుపుతాడు – నాలుగు వ్యూహములు – ఊర్మ్యులు

తైజసాహంకారము మనస్సు - ప్రకృతితో వికారము చెందని పురుషుడు - మోక్షార్థియైన వానివిధానము - తీవ్రమైన భక్తియోగప్రాప్త్యుపాయములు - జీవుడు ఈశ్వరుడంటే - కంటితో సూర్యున్ని దర్శించినట్లు నారాయణ దర్శనము - నామరూపాల సృష్టి ఎందుకు? కారణములేమి ఇది అతని లీల - ఆత్మజ్ఞుడు ఎట్లు పరమాత్మను తెలుసుకుంటాడు? - దేవహూతి ప్రకృతికిని ఆత్మకు వియోగమెట్లు సంభవమని ప్రశ్నిస్తుంది - వీటి యథార్థ జ్ఞానమే ముక్తికి కారణము - నావదప్రాప్తిమతి కలుగుతుంది - యోగలక్షణ ప్రకారములు - స్వధర్మాచరణము తప్పక ఉండాలి - ఆసనవిధానము - భగవద్రూపధ్యానము -

## 22 నుండి 28 వదినముల ఉపన్యాసములు 458 నుండి 498 వ పేజీ వరకు.

భగవద్రచన - మామిడిపండు ఎందుకు తీయగా ఉన్నది? సోఽయం రామ ఎద ప్రసంగ మహిమాలోకే సముజ్జృంభతే అని సమాధానము - విద్యారణ్యస్వాములవారి ఉపదేశము - ఒక వ్యక్తి బొంబాయినుండి ముక్కుష టుక తెచ్చిన కథ - ప్రకృతిచింతన-లోభిమానసిక ధ్యానము - నిజమైన వైరాగ్యము - మద్యము త్రాగి ఒడలు తెలియనివానివలె జ్ఞాని - ఈ సృష్టి యందు బ్రహ్మమే వున్నాడు - ఆయనప్రకటితరూపమే ప్రకృతి - ప్రకృతి సద సదాత్మకము - తామస, రాజస, సాత్త్వికభక్తులు - చతుర్విధ ముక్తులు - పుణ్యాత్ముడగు విధానము - నాకల్యాణగుణములు వారికి ప్రాప్తమగు విధానము - భస్మమాహాత్మ్యమెట్టిది? - చేతనాచేతనములలో నేవి గొప్ప - ఏనుగుకాలిలోని ముల్లుతీయుట - చెట్లకంటే జంతువులు శ్రేష్ఠములు - మనుష్యులలో శ్రేష్ఠులు - ఆత్మజ్ఞానమునకు కారణము - ప్రపంచము భగవదాజ్ఞాబద్ధము - దుఃఖకారణము - మాయామోహితుడైన జీవుని విధానము - వృద్ధుని దుస్థితి - యమభటులు - పిండోత్పత్తి విధానము - దానిలోని కష్టములు - పశ్చాత్తాపము - జననము. దైన్యత్వము - మరల అజ్ఞానకారణ రతుడు - సద్గుణములు సహవాసదోషముచేత నశిస్తాయి - స్త్రీ సాంగత్యమునకు బ్రహ్మయే లొంగినాడు - స్త్రీ రూపమెట్టిది? - కర్మఫలము తప్పదు - నిరంతరము స్త్రీని కోరేవానికి స్త్రీ జన్మవస్తుంది - సంసారబంధమే

మృత్యువు - అడవిలోని వేటకానివలె ప్రాపంచిక సుఖములు - చూపుటి ఎట్లుండాలి ? - దీనిలో నిత్యానందమార్గము - కామము జీవితముతో చెలగాటము – అది ప్రజాసర్గమునకే - చతుర్ముఖుడు సరస్వతి వెంటబడుట అనగా నేమి ? - ధూమగతియనే చంద్రలోకము - సజ్జనులైనను మోక్షమును పొందజాలనివారు - మోక్షమును పొందేవారు_మోక్షమార్గము అర్చిర్మార్గము – పుణ్యలోకమార్గము ధూమమార్గము–మోక్షము వెలుగుదారి-భోగమార్గము పొగదారి - భస్మము, పొగ, మంట - జీవులు దిగివచ్చేదారి కృష్ణగతి, ఎక్కిపోయేదారి శుక్లగతి - పితరులుచేసే కర్మ - తిరిగిరానివారెవరు ? – ప్రజ్ఞామయులు – భగవంతుడే సగుణుడై అనంతకోట్ల రూపములతో నున్నాడు. భగవంతుడు వినుతగుణోత్తరుడు - ఈలోకమున శ్రేష్ఠులు - పునరావృత్తిలేని మార్గము - త్రిపుటి ఏకమగుట – అహంకారము త్రిగుణములచే మూడు విధములు - జీవుడు - విరాట్పురుషుడు - నిస్సంగము కలుగు విధానము - జ్ఞానయోగము, భక్తియోగము రెండును ఒకటే - భక్తులు నాలుగు- ఈరహస్యమార్గము ఎవనికి చెప్పాలి? దేవహూతి కపిలున్ని ప్రశంసిస్తుంది – నీ నామము జిహ్వయందు ధరించిన శ్వపచుడును బ్రాహ్మణుని కంటే శ్రేష్ఠుడు – అట్టివారే మాన్యులు - ధన్యులు – కపిలుడిట్లుపదేశించి వెళ్లిపోతాడు - దేవహూతి కుమారుడు, భర్తల వియోగతాపమునను భవిస్తుంది - తరువాత ఆమెకు బ్రహ్మజ్ఞానము సిద్ధించుట - మోక్షప్రాప్తి - వాసుదేవునియందు కలిసినది. ఆ పుణ్యభూమికి సిద్ధిపదమనే పేరుకలిగినది.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## మొదటి రోజు ఉపన్యాసము

"గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥"

"యోఽంతః ప్రవిశ్యమమవాచ మిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిలశక్తి ధరస్స్వధామ్నా ।
అన్యాంశ్చహస్త చరణ శ్రవణత్వగాదీన్
ప్రాణాన్నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥"

"శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు కేళిలోల విలసద్దృగ్జాలసంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్."

"వాలినభక్తి మ్రొక్కెద నవారిత తాండవ కేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖపద్మ మయూఖమాలికిన్
బాల శశాంక మౌళికిఁ గపాలికి మన్మథ గర్వపర్వతో
న్మూలికి నారదాది మునిముఖ్య మనస్సరసీరుహాళికిన్."

"ఆదర మొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగ సం
పాదికి దోషభేదికిఁ బ్రపన్న వినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేషజగజ్జననంద వేదికిన్
మోదక ఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్.

"అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడుపాఱడి పుచ్చినయమ్మ తన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనంబుల నుండెడి యమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదల్."

పుణ్యాత్ములారా! భాగవత శ్రవణాసక్త చిత్తులారా!

మానవుడు జీవితంలో అనేక కార్యములను చేస్తాడు. ఆ యా కార్యములలో వాటికి తగినంత ఫలము పొందుతూంటాడు. ఆ ఫలములయొక్క సుఖదుఃఖములే జీవితములో అనుభవమునకు వస్తూంటాయి. ఆ విధముగ జీవితము కర్మబద్ధమై నడుస్తూంటూంది. ప్రతి కార్యమునకు ఫలితము నిర్ధారితమై ఉంటుంది. దాని ననుభవించక తీరదు. వాటిలో నీ భాగవత శ్రవణమనునది ఉత్తమమైన శుభ కార్యములలో చేరినది. భాగవతము వింటే బాగవుతామన్నాడొక మహాత్ముడు. అది విన్న శ్రోతలలో నొకవ్యక్తి "ఇపుడు మేము బాగాలేమా?" అని ప్రశ్నించినాడు. దానికేమి సమాధానం చెప్పాలి? ఆ వక్త సమాధానమిది. "దానిని విన్న తరువాత ఆ విషయము స్వయముగా అనుభవములోనికి రావలసినదే నాయనా! ఇది చెప్పేదికాదు." అందువలన పుణ్యాత్ములారా! ఈ భాగవత కథా కాలక్షేపము నేర్పాటుచేసినవారు పూజ్యులు శ్రీ ముడుంబై రామానుజాచార్యులవారు. వారు ఈ గీతా భవనాన్ని నిర్మించి నిరంతరము గీతాచార్యుల సేవలో కాలమును పవిత్రముగ గడపుచున్నారు.

నేను కాజీపేటలో మా కూతురు – అల్లుడు ఉన్నందువలన చూచి పోదామని వచ్చి పూజ్యులు శ్రీ రామానుజాచార్యుల వారికి విషయము తెలియజేయుచూ ఒక వారము రోజులుంటాను. భాగవత సప్తాహమేర్పాటు చేయవచ్చునని తెలుపగనే అంగీకరించి ప్రెస్సులో

కరపత్రములను ముద్రించి యీ కార్యక్రమమును ఈ గీతామందిరము లోనే యేర్పాటు చేసినారు. దీనికి ప్రప్రథమములో శ్రీ గీతాచార్యులైన శ్రీకృష్ణభగవానునికి, పితృతుల్యులు పూజ్యులైన శ్రీరామానుజాచార్యులవారికి నేను కృతజ్ఞతా పూర్వకముగ ప్రణమిల్లి కార్యక్రమమును ప్రారంభించుచున్నాను.

భగవంతుడు మానవునకు సమస్తేంద్రియములను ప్రసాదించి నాడు. వాటిలో అన్నియు ప్రధానమైనవే. కాని చెవులు కన్నులు మిక్కిలి ప్రధానమైనవి. మన మేవిషయాలు వింటామో వాటి యొక్క సంస్కారము మన హృదయములో అంటుకుంటుంది. ఆ సంస్కారము ననుసరించి మన చిత్తము రూపమును ధరిస్తుంది.

ఈ స్థూల శరీరానికి బలము కలిగించేది ఆహారము. ఆ ఆహారమును లోపలికి తీసుకొని శరీరపోషణకు హేతుభూతమైనది నోరు. ఈ స్థూలశరీరానికి నోరు ఎటువంటిదో లోపలి సూక్ష్మశరీరానికి నోరువంటివి చెవులు. చెవుల ద్వారా మానవుడనేక విషయాలను వింటాడు. ఇట్లు విన్న విషయాలు లోపల నున్న లింగశరీరానికి (సూక్ష్మశరీరమునకు) ఆహారము తౌతాయి. వినే విషయాల వలన లోపల సంస్కారము యేర్పడితే ఆ సంస్కారమే తత్సంబంధమైన వాసనగా యేర్పడుతుంది. సూక్ష్మశరీరము ఒక్కరొక్కరికి ఒక్కొక విధమైనదిగా ఉంటుంది. ఒక్కొక్కరికి అగ్గిరాముడు సినిమా చూడడమంటే, చీట్లు పేకాట అంటే ఆసక్తి ఉంటుంది. ఒక్కొక్కరికి భాగవతమంటే, పెద్దల పలుకులంటే, సద్గ్రంథపఠనమంటే ఆసక్తి వుంటుంది. ఈ భేదానికి కారణం సంస్కారమే. కావున మానవుడు ఉత్తమ సంస్కారవంతుడు కావాలి, ఉత్తమ సంస్కార మెచ్చట చిక్కుతుంది? ఏ బజారులో ఎంత వెలకు చిక్కుతుంది? ఎక్కడా చిక్కదు. కాని ఇటువంటి సత్సంగముల యందు చిక్కుతుంది.

భగవంతుడు హృదయమనే భవనము లోనికి చేరేందుకు రెండు ప్రధానమైన ద్వారాలున్నవంటారు పెద్దలు. అవి చెవులు, కండ్లు. మంచిమంచి విషయాలు వింటూాంటే భగవంతుడు హృదయమనే భవనములోనికి చేరుకుంటాడు. అటులనే కన్నులు కూడ, మంచి మంచి దివ్యమైన మూర్తులను, మహాత్ములను, పెద్దవారిని దర్శించుచూ, వారియందు దైవభావన కలిగియుంటే భగవంతుడు హృదయమనే భవనము లోనికి ప్రవేశిస్తాడు. ఈ రూపముగా చెవులను, కన్నులను సార్థకము చేసుకోవాలి.

భగవంతుడెట్లు చెవుల ద్వారా, కన్నుల ద్వారా హృదయ భవనములోనికి చేరుకుంటాడో అటులనే పాపము కూడా వీటి ద్వారానే హృదయములో ప్రవేశిస్తుంది. దుష్టమైన విషయాలు వింటూ, ఆ దుష్టమైన చూపులతోనే ప్రపంచాన్ని భోగ్యవస్తువుగ చూస్తే దాని ద్వారా పాపము హృదయము లోనికి చేరుకుంటుంది. కాని మానవజన్మ నావిధముగ గడిపేవాడు వ్యర్థజీవనుడు. వస్తువుల విలువ తెలుసుకొనుటకు ఉత్తమ సంస్కారము కావలెను. ఒక డింభకనిని ప్రశ్నించినాడట. భగవంతుడు చెవుల నెందు కిచ్చినాడని? దానికి సమాధానముగ నతడు "దేవుడు చెవులను బీడీ తుంటలను పెట్టుకొనుట కిచ్చినాడన్నా"డట. వాని సంస్కారమంత మాత్రము గానే యున్నది.

మరి ఒక మనిషి కన్నులు చెవులు మాత్రమే కాదు, భగవంతుణ్ణి లోపల చేర్చుకొనుటలో ప్రధాన సాధనము నాలుక కూడ అన్నాడు. నిజమే. నాలుకతో నిరంతరము భగవన్నామోచ్చారణ చేస్తూంటే భగవంతుడు తప్పక హృదయములో ప్రవేశిస్తాడు ఈ రూపమున చెవులు, కన్నులు, నాలుకను మానవుడు ప్రయత్నపూర్వకముగ సఫలము చేసుకోవాలి.

ఆ విధముగ సఫలము చేసుకొనుటలో భాగవత శ్రవణము మహత్తరమైన సాధనము. ఎందుకంటే "నిగమ కల్పతరోర్గలితం ఫలం, శుకముఖాదమృత ద్రవసంయుతం, పిబత భాగవతం, రసమాలయం, ముహురహో రసికా భువి భావుకాః" భాగవతముయొక్క స్వరూపమిందు పొందించి చెప్పినారు శ్రీ వేదవ్యాసులవారు.

'నిగమ'మంటే వేదము. 'నిగమకల్పతరోర్గలితం ఫల'మంటే వేదములనే కల్పవృక్షము నుండి జారిన ఫలమని అర్థము. అంతే కాదు, "శుకముఖాదమృత ద్రవసంయుతం" అంటే శ్రీ శుకులవారి అమృతవాక్ద్రవముతో కూడియున్నది. ఇక్కడ శ్లేషార్థము. శుక మంటే చిలుక. చిలుక కొరికిన పండు అంటే దానికొక ప్రత్యేకత వుంటుంది. చిలుక తీపైన పండునే కొరుకుతుంది. అందువలన మధుర మైన పండని ఒక అర్థము. శ్రీ శుకులవారి శ్రీముఖము నుండి బయలు వెడలినదని మరొక అర్థం. ఈ విధముగా నీ పండు లభ్యమైనది. "పిబత భాగవతం రసమాలయం" అంటే భాగవతమనే యీ ఫలరస మును త్రాగండి. ఈ పండు త్రాగే పండు. ప్రపంచములోని పండ్లను 'తినండి' అంటాము. ఎందుకంటే వాటిలో భాగత్యాగ వస్తువులుంటాయి. మామిడి పండులో లోపలి విత్తనము బయటి తోలు తీసి పారవేయబడునవి. అటులనే అరటిపండు పైన తోలు తీసి పారవేయబడునది. ఈ విధముగ భాగత్యాగ లక్షణాలుండే పండ్లను తినండి అంటాము. కాని భాగవతమనే ఫలము భాగత్యాగ లక్షణాలతో కూడి యుండునది కాదు. అది కేవలము రసమే. అంతటిని త్రాగవలసినదే కాని పారవేసేవి దానిలో లేనేలేదు. అందువలన త్రాగండి అని చెప్పబడినది. "రసమాలయం." ఆలయం అంటే ఇల్లు, మందిరము అనికూడ ప్రసిద్ధమైన అర్థముంది. ఇక్కడ గమనించ వలసినది యేమంటే, ఆలయం అంటే లయమయ్యేవరకు త్రాగండి అని తెలుసుకోవాలి. ఎవరు యెవరిలో లయమయ్యేవరకు ? అంటే

జీవాత్మ పరమాత్మలో లయమయ్యేవరకు త్రాగండి. జీవుడు ముక్తుడై పరమాత్మలో కలిసేంతవరకు త్రాగండి. బ్రతికిన కాలమంతా త్రాగండి. ఒకవేళ ఈ జన్మలో జీవుడు పరమాత్మలో లయం కాజాలకపోతే వచ్చే జన్మలోకూడ త్రాగండి. దీనిని త్రాగడములో జీవన సాఫల్యమున్నది. ప్రపంచములో దీనిని త్రాగే వారికి గౌరవం పెరుగుతుంది. శాంత్యానందములు వృద్ధి పొందుతాయి. అయితే ఈ యమృతమును త్రాగవలయునంటే అందరు త్రాగలేరు. రసికులు భావుకులై ఉండాలి. రసికులంటే ఎవ్వరు? భగవంతుడే రస స్వరూపుడనియు ఆయన ఆనందానుభూతియే జీవితములో పరమమైన రసమని భావించేవారు. భగవంతుడు నిజముగా రసస్వరూపుడు. ఆయన రసాస్వాదనము చేసినపుడే జీవుడానందుడౌతాడు. అందువలననే శృతి చెబుతుంది. "రసో వై సః రసం హ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి, కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్, యదేష ఆకాశ ఆనందో నస్యాత్" రసోవై సః అంటే ఆయనే ఆనంద స్వరూపుడు. "రసం హ్యేవాయం లబ్ధ్వా ఆనందీ భవతి," అంటే జీవుడు ఆ పరమాత్మను పొందినపుడే ఆనందుడౌతాడు. ఆ భగవదానందమే లేకపోతే యీ లోకములో ఎవడు బ్రతుకుతాడు? అని పై మంత్రార్థము.

కాబట్టి ఈ సత్యము నెరిగేవాడు రసికుడు. భావుకుడంటే ప్రపంచములోనుండి విశేషమును గమనించువాడు. ఈ ప్రపంచమంతా ఎవని ఆధారముతో నిలిచియున్నదని విచారించువాడు. పరమాత్మే ప్రపంచాధారుడు అని భావించేవాడు. ఈ విధముగ రసికులు, భావుకులై తేనే ఈ భాగవత ఫలరసము నాస్వాదించగలరని చెప్పబడినది. ఇట్టిదీ భాగవతము. ఇట్టి భాగవతమును శ్రవణముచేస్తే శాంతి లభిస్తుందనుమాట సత్యమైనదే కదా!

మానవుడు ముఖ్యముగా గమనించ వలసిన విషయమొకటున్నది. వాని భావప్రవాహము ఎట్టి విషయము పైన అసక్తి కలిగి ప్రవ

ర్తిస్తుందో ఆ ఫలితమును వాడు పొందుతాడు. ప్రపంచము యొక్క లక్షణములు వేరు. పరమాత్మ లక్షణములు వేరు. అంటే ప్రకృతి లక్షణములు అసజ్జడ దుఃఖములు. పరమాత్మ లక్షణములు సచ్చిదానందములు. ప్రకృతియొక్క మొదటి లక్షణము అసత్తు, ఏ పరిస్థితి కానీ, పదవికానీ, వస్తువుకానీ అన్నియు అసత్యములే. అంటే ఒకే రూపమున ఎల్లప్పటికి వుండేవి కావు. మారి మారి పోతుంటాయి. ఈ నాడు ఒక పరిస్థితి మదికింపుగ ఉంటే ఇది ఇట్లే ఉండదు. ఉండవలెనని మనమనుకుంటాము. అది ఉండకపోతే దుఃఖపడుతాము. కాని అది మన యిష్టప్రకారముండదు.

ఒక అల్లుడు అత్తవారింటికి వెళ్ళినాడు. ఇంకా కొత్తదనమే వున్నది. అత్తకు అల్లుడు దైవము మాదిరి కనిపించినాడు. ఆదరముతో అల్లుని విచారించడం మొదలు పెట్టింది. తెల్లవారుతూనే బెడ్ కాఫీ, ఎనిమిది గంటలకే టిఫెన్, పదుకొండు గంటలకే భోజనము. మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. అల్లుడూ! బోర్నవీటా త్రాగుతావా? హార్లిక్స్ త్రాగుతావా? బ్రూ త్రాగుతావా? అని అడిగడిగి విచారిస్తుంటే మా యింటిలో ఇంత బాగాలేదే! ఇక్కడ బాగుంది. ఇక్కడనే ఉందామనుకున్నాడట ఆ అల్లుడు. మరి ఇచ్చటనే ఉంటే మర్యాద ఎప్పటికీ ఇటులనే ఉంటుందా? ఉండదు. పది దినములైన పిమ్మట మామ అనుకున్నాడు. ఏమిరా? మా అల్లుడు వచ్చినాడు, పదిరోజులైనా పోదామనుకోవడము లేదు. అని తన బిడ్డను పిలిచి అల్లుడు వినునట్లుగా అన్నాడు. ఏ మమ్మా! నీ మొగుడు ఇన్నిరోజులైనా పోదామనుకోవడం లేదు? ఏదో అత్తగారింటికి వస్తే మూడు రాత్రులుండాలి, వెళ్ళిపోవాలి. ఈ మాటలను ఆ అల్లుడు విని ఎదుటకు వచ్చి మామా! మామా! నేను మూడు రాత్రులే ఉండి పోదామని వచ్చినాన''న్నాడు. మామ ఏవి ఆ మూడు రాత్రులూ? అంటే అల్లుడు, "సంక్రాంతి, శివరాత్రి, నవరాత్రి'' అన్నాడట.

అప్పుడు మామ నా కొంప ముంచడానికే వచ్చినావని "ఎవడురా అక్కడ" అని కేక వేసినాడు. సేవకుడు వచ్చినాడు. "ఒరే, మా అల్లుని సామాన్లు, బస్తరు, సూటుకేసు, అన్ని బస్సుస్టాండుకు తీసుకొనిపోయి బస్సు ఎక్కించి రమ్మ"న్నాడు. ఈ విధముగ ఏ అల్లుడు ఇంటిలో దేవుని మాదిరి కనిపించినాడో వాడే ఇంటినుండి గెంటివేయబడ్డాడు. దీనినిబట్టి మనకు స్పష్టంగా తెలుస్తుంది. ఈ ప్రపంచములో నేపరిస్థితికాని ఎప్పుడూ ఒకే రూపమున నుండదు. కావున ప్రపంచపు మొదటి లక్షణం అసత్తు.

రెండవ లక్షణము "జడము". జడముయొక్క స్వరూపము తనను తెలుసుకో లేనిది. ఇతరులను తెలుసుకోజాలనిది. ఇంటిలో ననేకములైన వస్తువులుంటాయి. బంగారం, నోట్లకట్టలు మొదలగునవి. వాటిపైన మనిషికి ఎంతో ప్రేమ వుంటుంది. పాపము. అవి వానియొక్క ప్రేమను, భక్తిని గమనిస్తాయా? లేదు. వంద రూపాయల నోట్ల కట్టలను పెట్టి మనిషి సాగిలపడి నమస్కారము చేస్తూన్నాడనుకోండి. ఆ నూరు రూపాయలు నోట్ల కట్టలు "అయ్యో మమ్ములను ఇంత భక్తితో ఈ మానవుడు గౌరవించుచున్నాడే! ఇతనిని కొంచెము ఆశీర్వదించుదామనుకుంటాయా ఆ నూరు రూపాయల నోట్లు? కాదు. అవి జడములు. కావున తెలుసుకునేది, ఆశీర్వదించేది చైతన్యలక్షణాలు. వాటిలోనవి లేవు. మానవుడు తానొకరిని ప్రేమిస్తే ఎదుటివారుతనను నిర్లక్ష్యముచేస్తే వాని ప్రేమ భగ్నమైనట్లే కదా? నేను మీ యింటికి వచ్చినాను. అయ్యో! మిత్రుడు వచ్చినాడని ఆదరముతో మాట్లాడి ఆతిథ్యమొసంగుటే నాకు సంతోషముగ ఉంటుంది. అట్లుగాక నన్ను మీరు పట్టించుకోక మీ పనులు మాత్రం మీరు చేసుకుంటూంటే నాకు అవమానమయినట్లే కదా? ఈ ప్రపంచముపై ఈ ప్రపంచములోని వస్తువులపై ప్రేమ పెట్టితే అటులనే మన ప్రేమ వ్యర్థమవుతుంది. ఒక చోట ఒక సంఘటన జరిగింది. ఒకని భార్య చనిపోయినది.

కుటుంబానికి వచ్చి కొలది కాలమే అయినది. మంచి రూపవంతు రాలు, గుణవంతురాలు, భర్తకు చాలా సంతోషమును కలిగిస్తూండి నది. ఆమె మరణిస్తే వానికి చాల దుఃఖము కలిగింది. "నా పైన ఇంత దయలేదా? అపుడే నన్ను విడిచిపోవడం నీకు న్యాయమా! నేనేమి గతి కావాలి? నిన్నే నమ్ముకొనియుంటినే? నా కెంతెంత సంతోషమును కలిగిస్తూంటివి! ఎల్లెట్లు ప్రీతితో మాట్లాడుతూంటివి? ఇప్పుడెందుకు మాట్లాడవు? నన్ను విడిచిపోవడం నేనెట్లు భరించగలను?" అని విపరీతముగా దుఃఖపడుతున్నాడు. అయితే నా కొరకు ఇంతగా దుఃఖపడుతూన్నాడు. పాపము, లేచి రెండు మాటలు మాట్లాడుదామనుకుంటుందా ఆ శవము? ఎంతకాల మేడ్చినా వాని ఏడ్పు వ్యర్థమే కాని సార్థకమవుతుందా? ఇదుగో, వస్తువులపై తీవ్రమమకారము, ఆసక్తి, పెట్టుకొన్నవాని ప్రేమ, ఈ విధముగ నిష్ఫలమవుతుంది. అంతే కాదు, నిరాదరము చేయబడుతుంది. కావున వస్తువులు జడములు.

పరిణామములో అవి ఇచ్చేదికూడ దుఃఖమే, ఏ వస్తువుపైననైనా అధికమైన ప్రేమనుంచుతే అది దుఃఖమునకే పరిణామమున దారి తీస్తుంది. కావున ప్రకృతి లక్షణములు, అసత్తు జడము దుఃఖము.

పరమాత్మ స్వరూపలక్షణములు దీనికి వ్యతిరేకములైనవి, అవి సచ్చిదానందములు. సత్ అంటే శాశ్వతము. ఆయన స్వరూపము అనాది మధ్య లయమైనది. ఆది మధ్య అంతములయందు లయమగునది కాదు. ఒకే రూపమున నుండునది. "సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్" అదియే పూర్వముండినది. అంతేకాదు. ఇప్పుడు ఆ స్వరూప మటులనే యున్నది, ఇంక ఎల్లప్పటికి అది అటులనే ఉంటుంది. ఆ పరమాత్మ స్వరూపమును గురించి శ్రుతి చెప్పినది గమనార్హము. "సదితి శ్రౌత ప్రతీతి లక్ష్యం సత్యం. అసదిత్యవాచ్యం సత్యం."

"త్రికాలాబాధ్యం సత్యం. ఏకమేవాద్వితీయం సత్యం. సజాతి విజాతి స్వగత భేదరహితం సత్యం. సర్వకల్పనాధిష్ఠానం సత్యమ్"

శ్రుతులయందు ఆ సత్యస్వరూపమే లక్ష్యమైయున్నది. దానిని గురించి అసత్తని చెప్పుటకు వీలు కానిది. త్రికాలములయందు బాధింపబడక ఏకరూపముగ ఉండునది. రెండవది లేక ఏకముగానే ఉండునది. సజాతి, విజాతి స్వగత భేదములేనిది. సజాతి అంటే మానవున కింకొక మానవుడు సజాతి, చెట్టున కింకొక చెట్టు సజాతి. ఈ విధముగా ఆయనతో సమానమైన వాడింకొకడు లేనిది. కావున సజాతి భేద రహితుడు. విజాతి అంటే రాళ్ళు, పాలు ఉన్నట్లు ఈ విధముగా కూడ విజాతి ఆయనకంటె వ్యతిరేకమైనది లేదు. స్వగతమనగా మానవుని శరీరములో నెన్నో అవయవములు ఉన్నాయి. కాలు, చేయి, నోరు మొదలగునవి. కాలు చేయి కాదు. చేయి కాలు కాదు. ఈ విధమైన స్వగతభేదములు లేనిదా సత్య స్వరూపము. అది సర్వసృష్టి కల్పనకు ఆధారభూతమైనది. సర్పపు భ్రాంతికి త్రాడు ఎట్లు ఆధారమో ఆ విధముగ సృష్టికి ఆధారభూతమైనది.

ఇంక భగవంతుడు చిత్ స్వరూపుడు. చిత్ అంటే జ్ఞానమని అర్థము. ఆయన చైతన్య స్వరూపుడు. కావున అన్నింటిని తెలుసు కుంటాడు. చైతన్యముయొక్క లక్షణము తనను తెలుసుకొనుట, మరియు ఇతరులను గురించి తెలుసుకొనుటయునై ఉంటుంది. భగవంతుని జ్ఞానము పూర్ణము. మానవుడు భగవంతున్ని తలచినంత మాత్రమున ఆయన భక్తునియొక్క భక్తిని గమనించి ఆశీర్వదిస్తాడు, అనుగ్రహిస్తాడు. ఆయన అనుగ్రహం పొందుతే మూగవాడు వాచాలుడౌతాడు. కుంటివాడు కొండ నెగుర గలుగుతాడు. అంతటి ప్రశంసనీయ ప్రగతిని ప్రసాదిస్తాడు భగవంతుడు. కావున వైరి మానవులమై భగవద్విముఖులమై దుఃఖాలయమైన ప్రపంచములో నుండి భగవంతుని కృపకు దూరము కారాదు. మనము మనసార స్మరించినంత మాత్రమున అక్కడికక్కడనే ఆయన అనుగ్రహిస్తాడు.

ఆయన అనుగ్రహముచేత కలిగే ప్రయోజనము ఆనందము. ప్రపంచములోని మానవులందరు ఆనందము కావలెనని కోరుతారు. కాని ఆనందమెక్కడ లభించునో అచ్చట ప్రయత్నం సాగాలి. వస్తువులేని చోట దానికై వెతుకుట నిష్ప్రయోజనము కదా!

దీనిని గురించి రామకృష్ణ పరమహంస చెప్పిన ఒక ఉదాహరణ సరిపోతుంది. ఒక ముసలామె సాయంత్ర సమయములో మేడమీద నొక రూములో కూర్చొని గుడ్డ కుట్టుచుండినదట. సూది చేతిలో నుండి జారి క్రింద బడినది. రూములో వెలుగు లేదు. దీపములేదు. ఆ ముసలామె కిటికీనుండి బయటకు చూస్తే మునిసిపల్ వీధిలైటు వెలుగుచుండినది. ఆమె రూమునుండి బయటకువచ్చి ఆ లైటుక్రింద వెతక నారంభించినది. అయితే దీనివలన ప్రయోజన ముంటుందా? దారిన పోయే ఒక మనిషి నిలిచి ఏమి వెతుకుచున్నావమ్మా!'' అని అడిగినాడు. ఆ ముసలమ్మ చెప్పింది "సూది వెతుకుచున్నాను నాయనా!'' అని. "ఎక్కడ పడిందమ్మా ఆ సూది?'' అన్నాడా పాంథుడు. అదిగో ఆ మేడపైనున్న రూములో పడింది నాయనా! అని చెప్పింది. "మరి యిక్కడ వెతుకుతే నీకు చిక్కుతుందామ్మా?'' అని అతడు ప్రశ్నిస్తే ఆమె అన్నదట. "నాయనా! అక్కడ వెలుగు లేదు, ఇక్కడ వెలుగుంది. కావున వెతుకుతున్నానన్న''దట.

ఈ దృష్టాంతాన్ని దార్ష్టాంతములోనికి మార్చుకుందాము. ఇచ్చట గమనించ వలసిన విషయ మేమంటే వస్తువున్న చోట వెలుగులేదు. వెలుగున్నదని వెతికే చోట వస్తువు లేదు. అంటే వస్తువున్నచోట మనకు ఆసక్తి లేదు. ఆధ్యాత్మ మార్గములో జ్ఞాన తత్త్వము లభిస్తుంది. దానిచే ఆనందము లభ్యమవుతుంది. కాని అక్కడ మనకాసక్తిలేదు. ప్రపంచములో ఆనందము లేదు, అక్కడనే మన కాసక్తి యున్నది. కావున ఆధ్యాత్మ మార్గమునందు శ్రద్ధ వహించి కృషిచేస్తే పరమాత్మ ప్రాప్తి అవుతుంది, ఆనంద లబ్ధి

తప్పను. ప్రాపంచిక విషయములయందు ఆనందములేదు. అచ్చట వెతుకుతే ఆనందమునకు బదులు దుఃఖమే ప్రాప్తిస్తుంది.

ఈ విధముగా ప్రపంచ స్వరూపము, పరమాత్మస్వరూపమును గురించి తెలుసుకొంటే భగవంతునిపైన శ్రద్ధ కలుగుతుంది. అందువలననే భాగవత ప్రారంభములో

'సచ్చిదానందరూపాయ విశ్వోత్పాదిహేతవే!
తాపత్రయ వినాశాయ శ్రీకృష్ణాయ వయం నుమః ॥

అని భగవత్ప్రార్థన ప్రథమములో చేయబడినది, భగవంతునికి కృతజ్ఞతతో నమస్కారము చేయాలి.

ప్రపంచములో ఎక్కడనైనా ఒక మానవునికి ఇంకొక మానవుడు కొద్దిపాటి మేలుచేస్తే అతనికి కనబడినచోటనల్లా నమస్కారము చేస్తూంటారు. భగవంతుడు ఎంత మేలు చేసినాడో చూడుడు. చూచుటకు కన్నుల నిచ్చినాడు. వినుటకు చెవుల నిచ్చినాడు. తినుటకు మాట్లాడుటకు నాలుక నిచ్చినాడు. సంకల్పించుటకు మనస్సు నిచ్చినాడు. నిశ్చయించుటకు బుద్ధి నిచ్చినాడు. ఈ విధముగా సర్వాంగ సుందరమైన యీ శరీరము నిచ్చినాడు. ఇంతేకాక బయటిలోకములో చూస్తే పంచభూతముల నిచ్చినాడు.

అనేకములైన తినుబండారముల నిచ్చినాడు. ఆయన ప్రేమమయుడు. కావున మన కనంతమైన వస్తువుల నిచ్చి ప్రేమతో మనలను రక్షించుచున్నాడు. "ఏ ప్రేమ మహిమచే యీ ధారుణీచక్ర మిరుసులేకుండనే తిరుగుచుండె, ఏ ప్రేమ మహిమచే నింగి నక్షత్రాలు నేల రాలక మింట నిలిచియుండె, ఏ ప్రేమ మహిమచే, యీ రేడు భువనాలు గాలిదేవుడు సురటీలు విసరె, ఏ ప్రేమ మహిమచే పృథ్విపై బడకుండ కడలి రాయుడు కాళ్ళు ముడుచుచుండె,"

ఈ రూపముగా భూమి ఇసుక లేకుండనే తిరుగుచున్నది. గాలి దేవుడు 14 లోకాలలో సురటీలు విసురుచున్నాడు. సముద్రుడు తన కాళ్ళను ముడుచుకుంటూ భూమిపై నుండి అలలను తిరిగి తీసుకుంటున్నాడు. ఈ కార్యాలన్నియు, ఏ ప్రేమ మహిమతో నడుస్తున్నాయి? కావున భగవంతుడు ప్రేమమయుడు. మన కొరకై ఇన్ని వస్తువులను సృష్టించి మన జీవితమును సుగమము చేసినాడే! ఆయనకు నమస్కారము చేయవద్దా మరి!

✓ఇన్ని యిచ్చినాడే? మన మేమిస్తాము ఆయనకు? దేనిని మనము యిచ్చినా అది ఆయనదే. ఇన్నిటిని యిచ్చిన స్వామీ! నీకు నేనేమి యిస్తాను? మనుష్యుడు రెండు పూలు తెచ్చి అర్పిస్తాడు? ఈ పూల నతడు సృష్టించినాడా? దుకాణములో నుండి టెంకాయ తెచ్చి కొట్టాడు. అది ఇది అంతా భగవంతునిదే గదా? మరి ఈ విధముగ భావించినప్పుడు మానవునివద్ద భగవంతుని కిచ్చుటకు ఏమున్నది? వీనివద్ద యేమియులేదు. అందువలన నమస్కారము చేయాలి. స్వామీ! ఇన్నియిచ్చిన నీకు నేనేమి యివ్వగలను. ఇదిగో నమస్కారము తండ్రీ! అని భక్తితో భావుకమైన చిత్తముతో నమస్కారము చేయాలి.

✓మనము భగవంతునికి నివేదన చేస్తూంటాము. ఆ విధముగ నివేదన చేయుటలోని ఆంతర్యమేమి? అది మన భక్తిని తెలియ జేయుట కొరక ప్రతీకము. గుర్తు. అయితే భగవంతుడు నీవు నివేదన చేసిన వస్తువు స్వీకరించడు. ఆ విధముగ ఆయన మనము నివేదన చేసిన దానిని తినబట్టితే మనము పెట్టగలమా? ఆయనకు నివేదన చేసి మనమే తీసుకుంటాము. ఆయన దేనిని స్వీకరిస్తాడు? నీలోని భక్తిని స్వీకరిస్తాడు. కావున ఆ భగవంతునిచేత యివ్వబడిన అనంతమైన వస్తువులను తలంచుకుంటే హృదయము నమ్రము కాదూ? ఆ

విధమైన పరవశ భావముతో నమస్కారము చేయాలి. భగవంతుడు వస్తు భుక్కు కాదు. భావభుక్కు. కావున ఆయనకు ఏమి అర్పించినా అంటే, పత్రం, పుష్పం, ఫలం, తోయము (నీళ్ళు) భక్తి భావముతో అర్పించాలి. ఆ భక్తిని ఆయన స్వీకరిస్తాడు. భక్తిగలవారికి ఆయన కామధేనువు. కల్పవృక్షము. అహంకారము ఏ రూపమున నైనను పనికిరాదు.

సత్యభామ అనుకున్నదట, నా వద్ద ఎంతో బంగారున్నది. నారదునికి పుణ్యకమనే వ్రతములో కృష్ణుణ్ణి దానము చేసి బంగారుతో తూకము వేసుకొని తీసుకుంటా. ఇట్లు తలంచి దానము చేసేటపుడు కృష్ణుడు "నన్ను తూకమేసుకొని నీవు త్వరగా తీసుకోక పోతే సత్యా! నారదుడు నన్ను తిప్పలు పెట్టుతాడు." అంటే "నాథా! నీ కెందుకు ఆ చింత? ఈ చేత దానముచేసి ఆ చేత తీసుకుంటా! ఏమి సంశయ పడకు నాథా!" అంటుంది. దానమిస్తుంది. సత్యభామకు హిమాలయ పర్వతమంత అహంకారం. తూకమేసుకునేటప్పుడు బంగారు దూలాలు తెచ్చిపెట్టుతుంది. ఎన్ని పెట్టినను ఒక ఇంచుక కదలడు శ్రీకృష్ణుడు. నారదుడపుడు, "సత్యభామా! నీవు తూకమేసుకోజాలక పోయితివి. కృష్ణా! ఇటురమ్మని" వీధులలో అమ్మ జూపుతాడు. అప్పుడు సత్య ఏడుస్తుంది. "మునివరా! తుదకిట్లు ననున్ మోసపుత్తువా?" అని పలవరిస్తుంది. అపుడు కృష్ణుడంటాడు:-

"అతివరో, నన్ను తూచెడి ధనాదులు నీకడ లేకయున్న, దు
ర్గతులకు లోనుగా నగుదు గావున సుంత యోచన చేసి చేయుమీ
వ్రతమన అలకింపక ప్రవర్తిలి యీగతి నాడెదు అయ్యయో
గతజల సేతు బంధములు కావొకో తామొక కోటి యోచనల్"

సత్యా! నేను మొదటనే చెప్పితే వినక పోతివే! అని ఆయన కూడ దీనవదనముతో విషాదపడుతాడట. సత్యభామ విపరీతముగ దుఃఖ

పడి రుక్మిణీదేవిని పిలుచుకొనివస్తే ఆమె కేవలము ఒక తులసీదళము తీసుకొని బంగారు దూలాలన్ని తీయించి భక్తితో కృష్ణా! అని త్రాసులో పెట్టిందట. ఇంకేమున్నది? కృష్ణుడు పైకి లేచినాడు. ఇట్టిది భక్తిప్రభావము. ఆ భక్తికి భగవంతుడు లొంగుతాడు. ఆయన వస్తువుయొక్క బరువుకు లేయలేదు. భక్తి భావముయొక్క బరువుకు లేచినాడు, అట్టి భావముతో మనము భగవంతునికి నివేదన చేయాలి. నమస్కరించాలి.

ఒక తూరి కృష్ణుడు విదురునింటికి పోయినాడు. అప్పుడు విదురుడు లేడు, ఆయన భార్య యుండినది. ఆ కృష్ణుడు తన యింటికి వచ్చినాడనే సంతోషముతో తన్మయత నొంది ఇంటిలో అరటిపండ్లుంటే తెచ్చి వాటి తోలుతీసి కృష్ణున కిచ్చుచున్నది. లోపలి పండును పారవేయుచున్నది. అప్పుడు కృష్ణుడు, ఆ పండ్లతోలును ఎంత బాగున్నది? ఎంత రుచిగానున్నదని అంటూ నములుకొని తింటూన్నాడట. ఇంతలో విదురుడు వచ్చి చూచినాడు. తోలు తీసిన పండ్లన్ని బయటుపడియున్నవి. తోలు మాత్రము కృష్ణుడు తింటూన్నాడు. విదురుడు చూచి పరిస్థితిని అర్థము చేసుకొని ఎంతటి అపచారము చేసితినని పరవశించి కృష్ణుని పాదములపై పడ్డాడు. కృష్ణుడా భార్యాభర్తల నిద్దరిని ఆశీర్వదించినాడట. వస్తువా ఇచ్చట ప్రధానము? కాదు. భావము ప్రధానము. భక్తి ప్రధానము. భగవంతునికి మనమేమి యివ్వగలము? కావున స్వామీ! నమస్కారము ప్రభో! అని మనము భక్తిని ప్రకటించుకోవాలి.

నమస్కారములో మొదట భావన ఏమి ఉండాలి? "న మమ" అనే భావముండాలి. స్వామీ! అంతా నీదే, నాదేమియు లేదు తండ్రీ! అనే భావముండాలి. ఆ విధమైన నమ్రతతో, భావపారవశ్యముతో ఒక్కతూరి నమస్కారము చేస్తే చాలు.

ఇట్టి భావపారవశ్యము ఊరక వచ్చేది కాదు. అది పెద్దల సాంగత్యముతో, భగవంతుని అపారమైన విభూతులను స్మరించుటలో భగవంతుని దయకు పాత్రమైతే ఇట్టి పవిత్రమైన భావపారవశ్యము లభ్యమవుతుంది. ఆ విధముగా భగవంతునికి నమస్కారము చేసుకొని యీ విధమైన భాగవత శ్రవణమనే సదవకాశాన్ని యిచ్చినాడని భావించి భాగవతాన్ని ప్రారంభము చేసుకుందాము.

వాస్తవములో మనము చేసే ప్రతిక్రియకు ఫలముంటుంది. Action to reaction. ఇప్పుడు నా మాటలు మీరు వింటున్నారు. ఈ మాటలు చెప్పడములో నాకు ఆనందము కలుగుచున్నది. వినుటలో మీకు ఆనందము కలుగుచున్నది. ఇప్పటి ఈ క్రియ కిప్పుడే యీ ఆనందమనే ఫలము లభించుచున్నది. ఇది సత్క్రియ కావున ఆనందమనే ఫలము లభించుచున్నది. అటులనే సత్క్రియ గాకపోతే దాని ఫలము దుష్టముగ వుంటుంది.

ఇది మహత్తరమైన కార్యము. ప్రపంచములోని వస్తువులలో నిట్టి శాంతి, ఆనందము లభించవు. ప్రపంచములోని వస్తువుల, భోగములను గురించి తెలుసుకుంటిమి గదా! ఎటువంటి వస్తువైనను దాని నుండి భోగము కోరితే రోగమే ప్రాప్తమవుతుంది. అంటే దుఃఖమే ప్రాప్తమవుతుంది. ఒక్కొక్క యువకుడనుకొంటూంటాడు. ఆహా! ఆ సౌందర్యవతి నాకు వశమైతే నా జీవితము ధన్యమవుతుంది. ఆమె వశమైన పిమ్మట అది అధర్మ కార్యమైనప్పుడు వాడు పొందే దుఃఖానికి మేరయుండదు.

దీనిని బుద్ధిమంతుడు తెలుసుకోవాలె. ప్రపంచములోని కామోప భోగములు, అందునను అధర్మపూర్వకమైనవి వదలు. అసజ్జడ దుఃఖముల జాలములో ఇరుక్కోవద్దు. పరమాత్మ వైపు మరలు. ఆయన అనంతశక్తి సంపన్నుడు. సకల కల్యాణగుణాభి

రాముడు. నిత్యానంద స్వరూపి. ఆయన్ను ఆశ్రయిస్తే సచ్చిదానంద ములు అనుభవమున ప్రతిబింబిస్తాయి. కాబట్టి భాగవతము ఆ విధ మున భగవద్భక్తిని. భక్తి పారవశ్యమును ప్రసాదించేది. భక్తి ద్వారా జ్ఞానము, వైరాగ్యము సంప్రాప్త మౌతాయి. భాగవతము భక్తి, జ్ఞాన వైరాగ్యాలను ప్రసాదిస్తుంది.

సామాన్యముగా మానవులు ధనముపైన, వస్తువులపైన నాది అనే మమకారముద్ర వేసుకుంటారు. ఈ ప్రపంచములోని యే వస్తువు పైనను మానవునకు నాది అనే అధికారము లేదు. ఒకడు ఒక నూరు రూపాయల నోటును జేబీలో పెట్టుకుంటూ నాది అనుకున్నాడు. ఆ నూరు రూపాయల నోటు నవ్వింది. "ఏమే నూరు రూపాయల నోటూ నన్ను చూచి నవ్వుతావు." అంటే "ఏమి చెప్పుదు సోదరా! ప్రొద్దున నుండి నేను ఎన్నో జేబీలు మారితిని. ప్రతివాడు నన్ను నాది అనుకుంటూనే ఉన్నాడు. కాని ఎవడును నన్ను తనవద్దనే ఉంచుకోవడం లేదు. ఈ వెర్రి మానవులను చూచి నవ్వక ఏమన మంటావు?" అన్నదట ఆ నోటు. అందువలన నాదను కొనే దేదియు లేదు. అంతా భగవంతునిదే. ఈ సిద్ధాంతము అందరు బాగా గమ నించదగినది. అందువల్లనే ఉపనిషత్తులో ఇట్లు చెప్పబడినది :—

"అథ నిత్యో నారాయణః బ్రహ్మా నారాయణః శివశ్చ నారా యణః, శక్రశ్చ నారాయణః, ద్యావాపృథివ్యౌ చ నారాయణః, కాలశ్చ నారాయణః, దిశశ్చనారాయణః, ఊర్ధ్వం చ నారాయణః, అధశ్చ నారాయణః, అంతర్బహిశ్చ నారాయణః, నారాయణ ఏ వేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యం, నిష్కలో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాతః శుద్ధోదేవ ఏకో నారాయణః, నద్వితీయోఽస్తి కశ్చిత్ య ఏవం వేద సవిష్ణురేవ భవతి సవిష్ణురేవ భవతి,"

నారాయణే సమస్త ప్రపంచము. ఆ నారాయణ శుద్ధుడు. ఏకుడు, అద్వితీయుండు అని ఎవరు తెలుసుకుంటారో అతడు విష్ణువే అవుతాడు. అతడు విష్ణువే అవుతాడు. అని రెండు మార్లు నొక్కి చెప్పుట జరిగినది. అందువలన సత్యమైన విషయము తెలుసుకుంటే మానవుడు సత్యస్వరూపుడౌతాడు. వేయేల సమస్త వస్తువులు ఆయనవే. ఆయనే సమస్త వస్తువులలో వ్యాపించి ఉన్నాడు.

ఒక గృహస్థు ఇంటికి ఒక అతిథి వచ్చినాడు. ఆ యింటి గృహిణికి దగ్గరి చుట్టము. ఆయనకు భోజనము చేసేటపుడు "కాజు" మొదలగు వస్తువులను వేసి పాయసము చేసింది. ఆమె పీటవేసి అతడు కూర్చున్న పిదప వడ్డించుచున్నది. కొంత అన్నము తిన్న తరువాత పాయసము వేసింది. వేస్తూనే పాయసమును తీసుకొని నోటిలో వేసుకున్నాడు. అద్భుతమైన రుచిగా కనిపించినది. అబ్బ ఎంత రుచి! అనుకొని, గరిటను చూస్తే అది పాయసములో మునిగి తన విస్తరలో పాయసాన్ని వేస్తూండడము చేత ఆ గరిటయే అతనికి దేవుని మాదిరి కనిపించినది. దానికి నమస్కారము చేస్తూ "నీవింతటి రుచికరమైన పాయసము వేస్తూన్నందుకు ధన్యవాదములే గరిటా!" అన్నాడు. ఆ గరిట "నాకు నమస్కారము చేస్తే నీకేమి వస్తుందినాయనా? నన్ను పట్టుకొనివేసే ఆమెకైనా నమస్కారము చేస్తే నీ ఆకులో ఇంకా నాలుగు గరిటలు పాయసం పడుతుంద"న్నది. అపుడతడు, ఆ అమ్మకు నమస్కారము చేసినాడు. అప్పుడామె, "నాయనా! మా యింటి, ఆయన బజారుకు వెళ్ళి ఎండనక, వాననక, వ్యవహారమో, వ్యాపారమో చేసి కష్టపడి తెచ్చియుంటే వండిపెడుతున్నాను. కావున ఆయనకు నమస్కారము చేయి" అన్నది. అప్పుడతడు ఆమె భర్తకు నమస్కారము చేసినాడు. ఆయన "నాయనా! భూమాత ప్రసాదించకపోతే మనము తినేదేముంది? భూమాతకు నమస్కారము చేయ" మన్నాడు. అతడు భూమాతకు నమస్కారము చేసినాడు. —

భూమాత "జలదేవత నాకు ఆధారము. కావున జలదేవతకు నమస్కారము చేయమన్నది. జలదేవత అగ్నిదేవతకు, అగ్నిదేవత వాయుదేవునికి, ఆ వాయుదేవుడు ఆకాశానికి నమస్కారము చేయ" మన్నాడు. ఆకాశమన్నది, "అయ్యా! మా అందరి ఉత్పత్తికి కారణామైన పరమాత్మ ఉన్నాడు. ఆయన సర్వాధారుడు. అన్నింటిని పుట్టించేవాడు. అతనికి నమస్కారము చేయ"మన్నది. అంటే ఇక్కడ తినే పాయసానికి ఆ పరమేశ్వరునికి సంబంధము ఉన్నది. అంటే ప్రతివస్తువు ఆ పరమాత్మదే కాని నాది కాదు అని న మమ, అనుకొని భగవంతునికి నమస్కారము పెట్టాలి.

అంతా నీదే స్వామీ! అనే భావన ఉండాలి. నమస్కారము చేసేటపుడు రెండు చేతులు జోడిస్తాము. అంటే ఈ చేతులు సకలేంద్రియములకు ప్రతీకలు. కాబట్టి మేము చేసే కర్మములన్నియు నీకే సేవగా అర్పిస్తామన్నట్లు, ఇంతేగాక నమస్కారము చేసేటపుడు తల వంచుతాము. తలవంచడమంటే ఈ బుద్ధితో చేసే పనులన్నియు నీ సేవగానే చేస్తాము ప్రభూ! అని చెప్పుకున్నట్లు, ఆ విధముగ సర్వము భగవన్మయమే. అంతా భగవంతునిదే కాని నా దేమియు లేదు. అనే సత్యాన్ని భాగవతము బోధించి భగవంతునిపై భక్తి శ్రద్ధలను కలిగిస్తుంది. మరి యిట్టి భాగవతము శ్రవణము చేస్తే బాగుపడమా మరి!

శ్రీకృష్ణ గోవింద హరే మురారే
హే నాథ నారాయణ వాసుదేవా!

మొదటి రోజు ఉపన్యాసము సమాప్తము.

*



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## రెండవ రోజు ఉపన్యాసము

"ఏ విభు వందనార్చనము లే విభు చింతయు నామకీర్తనం
బే విభులీల లద్భుతము లెవ్వని సంశ్రవణంబు సేయ దో
షావళి బాసి లోకము శుభాయత వృత్తి జెలంగు నంద్రు, నే
నా విభు నాశ్రయించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్"

మానవుడు ఆనంద పిపాసి, రేయింబవళ్ళు ఆనందప్రాప్తికై నిరంతర కృషి చేయుచున్నాడు. కాని ఆ యానందము ఎక్కడ చిక్కుతుందో దానిని తెలుసుకొని చేస్తే బాగుంటుంది. వాని ప్రయత్నము తత్ప్రాప్తికి అనుకూలముగా లేదు. బొంబాయికి పోవలెనని టిక్కెట్లు కొన్నాడు. కాని మద్రాసుకు పోయే రైలు నెక్కినాడు. ప్రయాణం చేసే కొద్ది వానికి బొంబాయి దూరమే అవుతుంది. ఎచ్చటికి పోవలెననుకున్నాడో అచ్చటికి పోయే రైలునే ఎక్కాలి. అదే విధముగ మనుష్యునికి ఆనందము కావలెనని వాడు దానిని ప్రపంచములో వెతకుచున్నాడు. ఈ ప్రపంచములో సినిమాలలో, స్త్రీలలో, బ్రాంది సీసాలలో, తక్కిన భోగములలో వాడు ఆనందాన్ని వెదకుతే చిక్కుతుందా? ఒకడు తన భార్యను మిక్కిలి ప్రేమించేవాడు. భార్య అంటే అందరికి ప్రీతియే. కాని వాని ప్రేమ అధికముగ

ఉంది ప్రపంచములో దేనిపైన నైనను అతిగా ప్రేమను కలిగి యుండరాదు. వాడట్లు పరవశుడై భార్యయే సర్వస్వమన్నట్లు కాలము గడుపుచున్నాడు. ఒకనాడు వాని భార్యకు తేలు కుట్టినది. ఆమె యేడ్వడము ప్రారంభము చేస్తే భర్త కూడ ఏడ్వసాగినాడు. దాని కామె "నీవు కూడ ఏడుస్తే ఏమి వస్తుంది? డాక్టరు వద్దకు పోయి మందు తెమ్మ"న్నది. వాడు డాక్టరు వద్దకు పరుగెత్తుతూ పోయి, "డాక్టరు గారూ! డాక్టరు గారూ! నా ప్రియతమమైన భార్యకు తేలు కుట్టిందండీ, మంచి మందివ్వండి. ఎంతైనా డబ్బిస్తా" నని ప్రార్థించినాడు. ఆ డాక్టరు పైకమిప్పించుకొని "ఈ మందు తేలు కుట్టిన చోట వేయమని" ఇచ్చినాడు. వాడు ఇంటికి పరుగెత్తుతూ పోయి "తేలు ఎక్కడ కుట్టిందే," అని భార్య నడిగినాడు. ఆమె ఆ రెండు గోడల నడుమ కుట్టిందన్నది. అక్కడ మన వాడు మందు వేస్తున్నాడు. తేలు నొప్పి పోతుందా? ఇట్లున్నది నేటి మానవుని ఆనందాన్వేషణ.

భగవంతుడు పూర్ణానంద స్వరూపుడు. వాని నాశ్రయించినప్పుడే, జీవునికి ఆనందము కలిగేది. ప్రపంచ వస్తువులలో వానికి కలిగే సుఖం అల్పం దాని ఫలరూపమున వచ్చే దుఃఖం అధికం. ఇట్టి అపూర్ణానందము వాని శక్తిని క్షీణింప జేస్తుంది. వానిని అగౌరవానికి పాత్రుణ్ణి చేస్తుంది. ఇట్టి సుఖము రహస్యస్థలాన్నపేక్షిస్తుంది. ఎంతో కష్టపడి మానవుడు భోగ సుఖాన్ని పొందదలచుకుంటే అది కొన్ని నిమిషాలలోనే అంతరిస్తుంది. తరువాత అది విపరీతమైన దుఃఖానికి కారణభూతమవుతుంది. అందువలననే కాళహస్తీశ్వర శతకములో నిట్లు చెప్పబడినది.

"అమరస్త్రీల రమించినన్ జెడదు కామంబింతయున్ బ్రహ్మ ప
ట్టము సిద్ధించిన నాశదీరదు. నిరూఢ క్రోధమున్ సర్వ లో

కములన్ ద్రిమ్మింగిన మానదిందు గల సౌఖ్యంబొల్ల నీ సేవ జే
సి, మహాపాతక వారి రాశిఁ గడతున్ శ్రీకాళహస్తీశ్వరా?

కావున నీ పాదసేవలోను, నీ ధ్యానములోను, నీ అనుగ్రహ ప్రాప్తిలోను మాత్రమే ఆనందమున్నది. ప్రాపంచిక భోగములెంత గొప్పవైనను మానవుని వికారములు తొలగవు. భగవంతుడందు వలననే గీతలో "అనిత్య మసుఖం లోకం" అన్నాడు. ఈ లోక మనిత్యము అశుభకరము. కావున ఊబిలో ధాన్యమెట్లు లభ్యమవు తుంది.

భాగవతము మానవ జీవితమును భగవన్మయము చేస్తుంది. నిత్యజీవితమును భగవంతునితో సంబంధము కలదిగా మార్చివేస్తుంది. మనుష్యుడు సంసారములో ఉండడము తప్పుకాదు. సంసారము తనలో పెట్టకోవడం తప్పు. సంసారమును వదలి ఎక్కడికి పోతాడు? ఎక్కడికో పోయినను వేళకు సరిగా భోజనము ఎక్కడ చిక్కుతుంది? శరీర యాత్ర ఎట్లు జరుగుతుంది? ఎక్కడనో పర్వతాలలో ఉండి ఇంటినే అనుకుంటే ఇంట్లో ఉన్నట్లే కదా!

నావ నీళ్ళలోనే ఉండాలి. కాని నావలోనికి నీళ్ళురారాదు. దోమలలోనే దోమతెర ఉండాలి. దోమ తెరలోనికి దోమలు రారాదు. వస్తే ప్రమాదమే. అటులనే మానవుడు సంసారములో ఉండాలి. వానిలో సంసారము ఉండరాదు. హృదయములో పర మేశ్వరుడుండాలి. వాడు సంతోషపడేట్లు సంసార వ్యవహారముం డాలి. ఇది ఎట్లు సాధ్యమవుతుంది. భాగవతము మార్గము చూపు తుంది. ఏమని? —

"కాయంబుతో చేయు కార్యంబు లెల్లను
నోట నాడుచు నుండు మాటలెల్ల,
తన మనస్సున గల్గు తలపుల నన్నిటి
పది యింద్రియంబుల పనుల నెల్ల

బుద్ధిలో నుండెడు పూనిక లెల్లను
చిత్తంబు నందలి చింతలెల్ల
అవశత తన తోంటి యభ్యాసబలమున
నగుచుండు పనులు సమస్తములును,
లౌకికంబులో వైదిక వర్తనములో
ఏవి తాజేయునవి యెల్ల యీశ్వరునకు
తానొనర్చెడి సేవగా ప్రథిమసేయ
అఖిలమును భాగవత మార్గమగు నరేంద్ర.

ఈ విధముగా తాను చేయు సమస్త కార్యములను భగవంతుని సేవగా భావించుకొని చేస్తే ఇది భాగవత మార్గమవుతుంది. నిరంతరము తాను జేయు పనుల నన్నిటిలోను భగవంతునితో సంబంధముంటుంది.

భాగవతమంటే భక్తి, జ్ఞాన, వైరాగ్య తత్వముముక్తుల నొసంగేది అని అర్థము. కావున ఇట్టి భాగవతమును శ్రవణము చేస్తే భాగివృతామనుటలో సందియ ముండునా? భాగవత మహిమను గురించి చెప్పబడిన విషయమును పరికించుడు. ఒక పర్యాయము బదరీలో నారదుడు తొందర తొందరగ వచ్చుచున్నాడు. సనత్కుమారుడు చూచి "ఏమి నారదా! ఏమట్లు విచారగ్రస్తుడవై త్వరత్వరగా పోవుచున్నా"వని అడిగినాడు, దానికి నారదుడు ఆయనతో తన విషయము చెప్పుతాడు. "మహాత్మా! నేను బృందావనములో ఒక విచిత్రమైన దృశ్యమును చూచితిని. ఒక యువతి నిలుచున్నది. ఆమె కుమారులు ఇద్దరు వృద్ధులు. వారు రోగగ్రస్తులై భూమిమీద పడి యున్నారు. ఆ మార్గమున నేను పోవుచుండుట చూచి ఆమె నన్ను పిలిచింది. "మహాత్మా! వీరిద్దరు నా కుమారులు. రోగగ్రస్తులై అచేతనులై పడియున్నారు. వీరిని మీ దివ్య ప్రభావముతో

లేపవలసినదని" ప్రార్థించింది. అపుడు నాకు ఆశ్చర్యమైనది. ఎందు కంటే ఆమె యువతి, యౌవనములో నున్నది. క్రింద పడియుండేవారు వృద్ధులు. అప్పుడు నేనామెను "నీవెవరమ్మా! వివరము చెప్ప వలసిన"దంటిని.

ఆమె చెప్పినది. నారదా! నేను భక్తిని, వీరిద్దరు నా కుమా రులు. ఒకడు జ్ఞానము, ఇంకొకడు వైరాగ్యము. వీరిద్దరీ అస్వస్థతలో పడి తమ సత్త్వము కోల్పోయినారు. వీరిద్దరిని స్వస్థులనుగ చేయ వలసినది.

భాగవత భాష వ్యంగ్య భాష, భక్తి భాష, లేక సమాధిభాష. వాచ్యార్థము దానియందు కుదరదు. ఈ దృశ్యములో గమనించ వలసిన విషయమేమంటే! బృందావనములో భక్తి ప్రాముఖ్య మెక్కువ, అందువలన ఆమె యౌవనములో నున్నది, ప్రజలలో జ్ఞానవైరాగ్యములు దుర్బలముగ ఉంటాయి. ఈ విషయము సర్వ సామాన్యమైనది. వైరాగ్యము - పురాణాన్ని వినేటపుడు, స్మశాన ములో చితి మండేటపుడు, భోగము ముగిసినపుడు కలుగుతుంది. "ఏమున్నది? జీవితములోని భోగములు తుచ్ఛమైనవి కదా? వీటి కొరకై మనుష్యులు ఎంతెంత తాపత్రయ పడుతారు"? అనిపిస్తుంది. కాని మరుక్షణములోనే మరల విషయ భోగములవైపు - మనస్సు పరవశమై మరలుతుంది కదా!

అటులనే జ్ఞానమునందుకూడ. మానవులందరికి తెలుసు. ఈ దేహము అనిత్యము. దీనికి సంబంధించిన వస్తువులు అనిత్యము. ఇవన్నియు నేను కాదు; నావి కాదనే విషయము తెలిసి తెలిసి అహం కార మమకారములలో పడిపోతాము జ్ఞాన వైరాగ్యములను గురించి మానవులలో నుండి యీ దుర్బలత్వమును సూచించుటయే భక్తియనెడు తల్లికి జ్ఞానవైరాగ్యులు రోగగ్రస్తులై ఉండుటను ప్రతీకముగ సూచింపబడినది.

నారదుడు సనత్కుమారునితో చెప్పుచున్నాడు.

మహాత్మా! నేనా యిద్దరిని స్వస్థులను చేయగోరి వేదాలు వల్లించితిని. ఉపనిషత్తులు పారాయణము చేసితిని, కాని వారు లేవరైరి. అప్పుడు నాపైన నాకనుమానము కలిగినది. నేను బ్రహ్మ మానస పుత్రుడనేనా? నిరంతరము భగవన్నామోచ్చారణము చేయుట వ్యర్థమా! అని సందేహించుచుండగా ఆకాశవాణి పలికింది. "నారదా! నీ శక్తిని గురించి సందేహింపకుము. ఈ జ్ఞాన వైరాగ్యులిద్దరు స్వస్థులు కావలెనంటే మహత్తరమైన ఒక పుణ్య కార్యము చేయుము. ఇది విని "ఆ మహత్తర కార్యమేదో నాకు తెలుపుతే, తప్పక చేస్తాను. దానిని తెలియపరచవలసినది తల్లీ!" అని ఆకాశవాణి నడిగితిని. "నీవు మహాత్ముల నడుగుతూ పో, వారు చెప్పుతా"రని ఆకాశవాణి అగోచరమైంది. కావున మహాత్ములు మీరు. ఆ కార్యమేదో నాకు చెప్పవలసినదని ప్రార్థించినాడు.

దానికి సనత్కుమారులు "నారదా! నీవు భాగవత సప్తాహము చేస్తే జ్ఞానవైరాగ్యములు స్వస్థులగుటయే గాక భక్తి కద్భుతమైన శక్తి కలుగుతుం"దన్నాడు. అప్పుడు నారదుడు గంగాతీరమున భాగవత సప్తాహము నేర్పాటుచేసి అందరు "హరయే నమః" అని ప్రారంభించినారు. భృగుమహర్షి ఆ సందర్భమున ఇల్లిల్లు, వాడ వాడ తిరిగి శ్రోతలను పిలుచుకొని వచ్చినాడు. భాగవతము సమాప్తమవుతూనే 'భక్తి, జ్ఞాన, వైరాగ్యములు ఆ మండలి చుట్టూ చిందులు త్రొక్కుతూ తిరుగ సాగినారట. ఈ విషయము నిట్లు తెలుపుటలో మనము గమనించవలసిన విషయమేమంటే భాగవతము చదివినను, శ్రవణము చేసినను భక్తి జ్ఞాన వైరాగ్యాలు మనలో దృఢముగ నేర్పడుతాయని తాత్పర్యము.

భాగవత మాహాత్మ్యమును గురించి కలియుగములో జరిగిన ఒక సంఘటన పద్మపురాణములో చెప్పబడియున్నది. దాని నిచ్చట పేర్కొనుటుచితము. కావున భాగవత శ్రవణాసక్త చిత్తులైన పుణ్యాత్ములారా వినండి. —

తుంగభద్రానదీ తీరములో ఆత్మదేవుడనే బ్రాహ్మణుడుండినాడు. ఆయన భార్య పేరు ధుంధిల. ఆయనకు సంపదకేమి లోటు లేదు కాని సంతానములేదు. ఐశ్వర్యముండి సంతానము లేకపోతే విపరీతమైన దుఃఖము కలుగుతుంది ప్రాపంచికులకు. ఆయన కూడ సంతానము కొరకై వ్రతాలు, పూజలు, ఉపవాసాలు బాగా చేసినాడు. ఇవన్నియు వ్యర్థమైతే అధికమైన దుఃఖము కలిగింది. జీవితముపైన రోతపుట్టింది. ఒకనాడు అరణ్యములోనికి పోయినాడు. అచ్చట ఒక మునీశ్వరుడు తపస్సు చేసుకుంటూండినాడు. ఆయన కాళ్ళపైబడి ఆత్మదేవుడు తన స్థితిని చెప్పుకున్నాడు. నాకక్కైనను సంతానమును ప్రసాదించమని వేడుకున్నాడు. ఆ మునీశ్వరుడు యోగదృష్టితో చూచి చెప్పినాడు:—

"సప్త జన్మావధి తవ పుత్రోనైవ చ నైవ చ"

నాయనా! సప్త జన్మలవరకు నీకు సంతానము కలిగే యోగము లేదు పొమ్మన్నాడు. దీనికా ఆత్మదేవుడు "మహాత్మా! పున్నామ నరకాత్ త్రాయతీతి పుత్రః" అని కదా! పుత్రుడు కలిగి తండ్రికి పిండప్రదానము చేస్తే తండ్రికి సుగతి కలుగుతుంది కదా! అన్నాడు. దానికా మహాత్ముడు, "నీకు ప్రారబ్ధములో లేని దాన్ని కోరుటచేత దుఃఖమే కలుగుతుంది, నాయనా! ఇదిగాక నీవు పిండప్రదానము చేసేవాడని అడిగితివి కదా? దీనికి నీ శరీరమే పిండము. నీవు దానిని భగవన్మయము చేయుట లేక భగవంతుని కర్పించుటయే పిండప్రదానమని తెలుసుకో," అని అనేకములైన ఉత్తమమైన సలహాల

నిస్తాడు. ఆయన చెప్పే బోధ నేమాత్రము వినకుండ ఆత్మదేవుడు "నీవు నాకు సంతానయోగాన్ని ప్రసాదిస్తావా? లేదా ఇచ్చటనే నేను ప్రాణహత్య చేసుకుంటాను. చూస్తూండడమువలన నీకీ పాపము తగులుతుం"దని చాలా దుఃఖితుడై ప్రాధేయపడుతాడు. దానికా ముని చేయునది లేక ఒక పండు నిచ్చి దీనిని నీ భార్య కిమ్ము. ఒకడు సత్పుత్రుడు పుట్టాడని చెప్పి పంపినాడు.

ఆత్మ దేవునికి మహాసంతోషము కలిగింది. ఆ పండును తీసుకుని హర్షముతో ఇంటికి వచ్చినాడు. తన కథ నంతయు ఆనందముతో భార్యకు చెప్పి పండిచ్చినాడు. ఆమె వెంటనే తినలేదు. ప్రక్కన పెట్టింది. ఆత్మదేవుడు లేనప్పుడీవిధముగ విచారింపసాగినది.

ఈ పండు తింటే కడుపు బరువైతుంది, ఆహారము తక్కువై బలము క్షీణిస్తుంది. ఊరిలో ఏదైనా ఉపద్రవము వచ్చినపుడు పరుగెత్తి పోవలెనంటే సాధ్యము కాదు. ఒకవేళ పిండము అడ్డము తిరిగితే నాకే మృత్యువు వస్తుంది. చాలా సంకటమైన పరిస్థితి దాపురించెగదా ? అని క్లిన్నవదనయై కూర్చున్నది.

"అహో చింతామహోత్పన్నా ఫలం చాహం నభక్షయే."

కావున నాకు విపరీతమైన చింత కలుగుచున్నది. ఈ ఫలము నేను తినను. —

"తిర్యక్ చేదాగతే గర్భః తదా మే మరణం భవేత్ ।
ప్రసూతౌ దారుణం దుఃఖం సుకుమారీ కథం సహే ॥"

ఒకవేళ పిండమే గర్భములో అడ్డము తిరుగుతే నా ప్రాణమే పోతుంది. అంతేగాక ప్రసూతి సమయములో భయంకరమైన దుఃఖం కలుగుతుంది, నేను సుకుమారిని ఎట్లు సహించగలను.

"వంధ్యా వా విధవా నారీ సుఖినీ చేతి మే మతిః ।
ఏవం కుతర్కయోగేన తత్ఫలం నైవ భక్షితమ్ ॥

ఆమె అనుకొంటూంది. వంధ్యయైనను, విధవయైనను వారే సుఖార్హులు ఈ విధముగా కుతర్కముతో ఆలోచన చేయుచూ ఆ పండును తినలేదు.

ఇప్పుడు చూడండి! ఆమెకు ఆ బ్రాహ్మణుడు అంతగా కష్టపడి ఫలమును తెచ్చి యిస్తే ఎట్లు ఆలోచించుచున్నదో, మనిషి యెటువంటివాడ నేది వాని ఆలోచనలు విచారాలు వాని వ్యక్తిత్వాన్ని తెలుపుతాయి. ఆమె కడుపు ముందుకు వస్తే "నాకు బాధకదా! ఏవైన కష్టసమయాలు, కాని సుఖసమయాలు కాని వస్తే పరుగెత్తుటకు నాకు వీలుకాదని" అనుకుంటూంది. దైవచిత్రము. ఇటువంటి మనుష్యులు కూడ ఉంటారా అనిపిస్తుంది.

ఈ విధముగ ఆమె ఆలోచించే సమయములో ఆమె చెల్లెలు అచ్చటికి వస్తుంది. ఏమక్కా! అంత చింతగ ఉన్నావని ప్రశ్నిస్తుంది. ధుంధులి కథనంత చెప్పి చాలా సంకటము వచ్చిపడినదే అంటుంది. అపుడా చెల్లెలు "దీనికి ఉపాయము నేను చెబుతాను విను" అని ఇట్లు చెప్పుటకు ప్రారంభిస్తుంది. "ఇదుగో! నాకు ఈ నెల మానింది. నీవు కూడ గర్భము నిలిచినట్లు వేవిళ్ళు పొందినట్లు గర్భము ముందుకు వచ్చినట్లు నటన చేస్తూండు. ఎప్పుడు నాకు ప్రసవమవుతుందో అప్పుడు నా కుమారున్ని నీ ప్రక్కలో పండబెట్టి నీకు ప్రసవమైనట్లు అందరికి చెప్పుదాము". దానికి తగినట్లు రహస్యముగ విషయాన్ని ఉంచుటకు తగిన ఆలోచన చేసుకుంటారు. ఆ పండును తమ ఆవుకేస్తారు.

తాము అనుకున్నట్లు కాలము గడుపుచుండగ ధుంధులి చెల్లెలు దైవయోగంతో మగపిల్లవానిని ప్రసవిస్తుంది. రాత్రికి రాత్రియే తెచ్చి ఈమె ప్రక్కలో కుమారున్ని పరుండబెట్టి ఆ సమయాన ఆత్మదేవుడు పొరుగూరికి పోయియుంటే కుమారుడు పుట్టినాడు త్వరగా

రావలసినదని చెప్పిపంపుతారు ఆత్మదేవుడు చాలా ఆనందముతో రెక్కలు గట్టుకొని యింటికి వస్తాడు. ఆనందపరవశుడై బ్రాహ్మణు లకు దక్షిణలు దానాలు విందులు వినోదాలు విరివిగా చేస్తాడు. ఇంతకు ముందు ధుంధులి తన చెల్లెలికి జరిగిన మాటల ప్రకారం తనకు పాలు పడలేదనియు, తన చెల్లె కడుపుపోయి పాలున్నవి. కావున ఆమెను, ఆమె భర్తను తమయింటిలోనే ఉండేటట్లు భర్తను ఒప్పించి వారిద్దరిని తనయింటిలోనే ఉండేటట్లు యేర్పాటు చేసింది ధుంధులి. అందరు ఒకే చోట ఆనందముగ కలిసి వున్నారు.

> "లోకస్య సుఖముత్పన్నమాత్మ దేవప్రజోదయాత్।
> దదౌ దానం ద్విజాతిభ్యో జాతకర్మవిధాయ చ ॥"

ఆత్మ దేవునికి కొడుకు పుట్టుటవలన లోకానికే సంతోషము కలిగి నట్లైనది. బ్రాహ్మణులకు దానాలు ధర్మాలు చేసి పిల్లవానికి జాతక విధిని నిర్వహించాడు.

> "త్రిమాసే నిర్గతే చాథ సా ధేనుః సుషువేఽర్భకమ్।
> సర్వాంగ సుందరం దివ్యం నిర్మలం కనకప్రభమ్॥"

ఇట్లు మూడు మాసాలు గడువగా ఆ గోవు పిల్లవానిని ప్రసవించినది. బాలుడు సర్వాంగ సుందరుడు. దివ్యమైన నిర్మలమైన బంగారు వర్ణము కలిగివున్నాడు. ప్రజల కందరికి ఆశ్చర్యమైనది. అందరు అనుకోసాగారు.

> "భాగ్యోదయేఽధునా జాత ఆత్మా దేవస్య పశ్యత।
> ధేన్వా బాలః ప్రసూతస్తు దేవరూపేతి కౌతుకమ్॥"

ఆత్మదేవుని భాగ్యము చూడండి. భార్యకేకాదు, ఆయన గోవు కూడ మగపిల్లవానిని ప్రసవించింది. బాలుడు దేవరూపములో నున్నాడు.

లోపలి రహస్యం యెవరికి తెలియదు. ఆ పిల్లవానికి చెవులు గోరూపముగ నున్నాయి. కావున "గోకర్ణుడు" అను నామధేయము పెట్టిరి. కాలము శరవేగముతో గడచింది. ధుంధులికి పుట్టిన వాని పేరు ధుంధుకారుడు, ఈ ధుంధుకారుడు ఆ గోకర్ణుడు, ఆడుకుంటూ పాడుకుంటూ కాలము గడవగ యౌవనములో ప్రవేశించినారు ధుంధుకారుడు చేసే దుండగాలు ఇంతా అంతా కాదు. ఇద్దరి సంస్కారాలు వేరు. "గోకర్ణో పండితో జ్ఞానీ, ధుంధుకారీ - మహాఖలః" గోకర్ణుడు పండితుడు జ్ఞానిఅయ్యాడు. ధుంధుకారుడు మహాఖలుడైనాడు. స్నాన, శౌచక్రియా హీనుడైనాడు. "శవహస్తేన భోజనమ్" అంటే స్నాన శౌచ క్రియాహీనుడై శవభోజనము చేయుటకు పాల్పడినాడు. పరమాత్మ నారాధించని చేయి శవహస్తము, ధనము ఎంత యిచ్చినను చాలదు, ఒకతూరి తల్లి తండ్రులను కొట్టి వంటపాత్రలు కూడ ఎత్తుకొని పోతాడు. అపుడు —

"తత్పితా కుపితః ప్రోచ్చైః ధన హీనో రురోద హ।
వంధ్యాత్వం తు సమీచీనం కుపుత్రో దుఃఖదాయకః॥"

అపుడు తండ్రి రోదన చేస్తూ దుష్టమైన పుత్రుడు పుట్టేదాని కంటే వంధ్యాత్వమే శ్రేష్ఠము కదా! అని దుఃఖిస్తాడు.

మునీశ్వరుడు చెప్పిన మాటలు నేను వినక మొండికి పడి సంతానము కావలెనని ఎంతటి విపత్తును తెచ్చికొంటినని విచారిస్తాడు. ధనము లేదంటే ధుంధుకారుడు తంతాడు. దెబ్బలు తిని —

"క్వ తిష్ఠామి, క్వ గచ్ఛామి, కో మేదుఃఖం వ్యపోహయేత్"

నే నెచ్చట ఉందు? ఎచ్చటికి పోదు? ఎవ్వరు నా దుఃఖాన్ని దూరము చేసేవారు? అని విలపిస్తాడు. ఈ విధముగా తలంచి ఆత్మహత్య చేసుకోవడ మొకే మార్గమని భావిస్తాడు. ఇంతలో గోకర్ణుడు వచ్చి తండ్రికి ఉపదేశము చేస్తాడు.

తండ్రీ! ఈ ప్రపంచము అశాశ్వతమైనది, దుఃఖకరమైనది, కావున –

"దేహేఽస్థిమాంస రుధిరేఽభిమతిం త్యజత్వమ్
జాయాసుతాదిషు సదా మమతాం విముంచ।
పశ్యానిశం జగదిదం క్షణభంగనిష్ఠమ్
వైరాగ్యరాగరసికో భవభక్తినిష్ఠః ॥"

దేహము అస్థి, మాంస, రుధిరములతో కూడుకొన్నది. దీనిపైనున్న ప్రేమను వదలు. భార్యాబిడ్డలపైనున్న మమకారమును వదలు. ఈ జగత్తంతయు నశ్వరమైనదానినిగ భావించు. వైరాగ్యరాగ రసికుడవై భక్తినిష్ఠతో కాలము గడపమని గంగానది ఒడ్డులో ఉండి ప్రతిదినము భాగవతం దశమ స్కంధమును మరియు విష్ణుసహస్ర నామము పారాయణము చేయుమని చెప్పి బోధించి తాను తీర్థయాత్రలకు పోతాడు.

ఇటు ఇంటిలో ధుంధుకారుడు తండ్రిపోయిన పిదప తల్లిని ఎక్కడెక్కడ ధనము దాచినావో నాకు తెచ్చియీ అంటాడు. ఆమె ఇవ్వకపోతే కాలితో తంతాడు. దానికి ధుంధులి విపరీతముగ శోకిస్తుంది. నా పతికి మోసము చేస్తిని. ప్రపంచానికి మోసము చేసితిని. చివరకు నాకు ఏమి దుర్గతి కలిగె! ఇతరులను మోసము చేయుటయే కాదు. నేనే మోసపోయి పాపఫల మనుభవించవలసి వచ్చెనని పెరటిలో నున్న బావిలో పడి చచ్చిపోతుంది.

ధుంధుకారుడు తన కామము తీరక ఐదుగురు వ్యభిచారిణులను ఇంటిలో తెచ్చి పెట్టుకుంటాడు. ధనము లేకపోతే వారిని సంతోష పెట్టే కొరకు రాజభవనములో పెద్దగా దొంగతనము చేసి ధనరాసులను తెస్తాడు. ఆ ధనాన్ని వ్యభిచారిణులు చూచి ధుంధుకారుడు లేనప్పుడు అయిదుగురు కూర్చొని యీ విధముగ అనుకుంటారు. వీడు తెచ్చిన

ధనము అల్పము కాదు. రహస్యము బైటపడక పోదు. అప్పుడు అందరము జైలుకు పోవలసి వస్తుంది. కావున మనము ధుంధుకారున్ని చంపి ధనమంతయు పంచుకొని యెవ్వరి దారిన వారు పోదాము.

"నిహాత్యైనం గృహీత్వార్థం యాస్యామో యత్ర కుత్రచిత్"
అని నిశ్చయము చేసుకుంటారు. ఇంతలోనే ధుంధుకారుడు బయట నుండి వస్తాడు. వాణ్ణి అందరు కలిసి బంధించి ఉరివేస్తే చావడట అపుడు వాని ముఖముపైన నిప్పులుపోసి చంపుతారు. వారను కున్నట్లుగా ధనము పంచుకొని పారిపోతారు. ధుంధుకారుడు ప్రేతమై ఉంటాడు.

గోకర్ణునికి యాత్రలో నీ విషయము తెలుస్తుంది. గయకు వెళ్ళి శ్రాద్ధము పెట్టి వస్తాడు. గయలో శ్రాద్ధము పెట్టితే పుణ్యాగతులు కలుగుతాయని మన పురాణాలు చెప్పుతాయి. దాని విషయము తెలుసుకొనుట అవసరము. —

పూర్వకాలము గయాసురుడనే రాక్షసుడు బ్రహ్మను గురించి ఘోరముగ తపస్సు చేస్తాడు. బ్రహ్మ ప్రత్యక్షమై యేమి వరము కావలెనో కోరుకొమ్మంటాడు. అప్పుడు గయాసురుడు తపోహంకారముతో "నీవేమి యివ్వగలవు? నీకేమి కావలెనో కోరుకో నేయిస్తా" నంటాడు. దానికి బ్రహ్మదేవునికి భయం కలుగుతుంది. వీడు బ్రతికి యుంటే కష్టమని భావించి నీవక్షము మీద వేయేండ్లు యాగము చేస్తానని వాని వక్షస్సుపై వెయ్యేండ్లు యాగము చేస్తాడు. ఇంత దీర్ఘకాలము అగ్నికుండము రొమ్ముపై పెట్టి యాగముచేస్తే చచ్చిపోతాడని బ్రహ్మదేవుని ఊహ. కాని వాడు వేయేండ్లయిన తరువాత లేవబోతాడు. బ్రహ్మదేవుడు త్రివిక్రముడైన విష్ణువును స్మరిస్తాడు. వెంటనే విష్ణువు త్రివిక్రమ రూపముతో వాని రొమ్ముపై

కాలు పెడుతాడు. అప్పుడు వానికి ఊపిరాడక మరణకాలములో నేనొక కోరిక కోరుతాను, ప్రసాదించమని విష్ణువు నడుగుతే కోరు కొమ్మంటాడు విష్ణువు. అప్పుడు గయాసురుడు "ఈ ప్రాంతమున ఎవరేని తమ పితరులకు పిండప్రదానము చేస్తే వారికి సుగతి కలుగు నట్లు వరమిమ్మ"ంటాడు. విష్ణువు అటులనే నని వరము ననుగ్రహిస్తాడు. అందువలన గయలో శ్రాద్ధము పెట్టితే ఆ జీవికి పాపము పోయి సుగతి కలుగుతుందనే ప్రతీతి కలిగినది. ప్రజలు తరచుగ అక్కడ పిండప్రదానాలు చేస్తుంటారు. గోకర్ణుడు కూడ గయలో ధుంధు కారునికి శ్రాద్ధము పెట్టి తమ మొదటి గ్రామానికి వస్తాడు. ఆ దినము రాత్రి భోంచేసి పండుకుంటే సుమారు అర్ధరాత్రి మీరిన తర్వాత వివిధములైన ఆర్తనాదములు, కేకలు, పెడబొబ్బలు వినిపిస్తాయి.

"కస్త్వముగ్రతరో రాత్రౌ కుతో యాతో దశామిమామ్।
కిం వా ప్రేతః పిశాచో వా రాక్షసోఽసీతి శంసనః॥"

ఎవడవు నీవు? ఈ భయంకరమైన రాత్రి పూట ఇట్లు శబ్దము చేస్తున్నావు? నీవు ప్రేతమా? పిశాచమా? రాక్షసుడవా? నాతో చెప్పుమంటాడు.

ఆ పిశాచము మాట్లాడ బోతుంది. కాని మాటరాదు. అప్పుడు గోకర్ణుడు కమండలములోని నీరు తీసుకొని దానిపై చల్లుతాడు. అప్పుడు ప్రేతమంటుంది. నేను నీ సోదరుడను. ధుంధుకారుడను. భయంకరమైన పాపము చేసినాను. కావున నీ దుర్గతిని పొందినాను. అదివిని గోకర్ణుడు "నీవు తరించవలెనని నేను గయలో శ్రాద్ధము పెట్టితిని కదా!" అంటాడు. దానికా ప్రేతము నేను చేసిన పాపమతి భయంకరమైనది. సోదరా!

"గయాశ్రాద్ధశతేనాపి ముక్తిర్మే న భవిష్యతి।
ఉపాయమపరం కించిత్ త్వం విచారయ సాంప్రతమ్॥"

గయా శ్రాద్ధములు నూరు చేసినను నాకు ముక్తి కలుగదు. కావున వేరే ఉపాయమేదైనా ఉంటే చూడవలసినదంటాడు.

తెల్లవారు వరకు గోకర్ణుడు ఆలోచిస్తాడు. నూరు శ్రాద్ధక్రియలు చేసినప్పటికి వాడు పాపమునుండి తొలగడంటే ఏమిచేస్తే సరిపోతుంది? అని ఆలోచన చేయుచూ విద్వాంసుల నందరిని పిలుస్తాడు.

"విద్వాంసో యోగ నిష్ఠాశ్చ జ్ఞానినో బ్రహ్మవాదినః।
తన్ముక్తిం నైవ తేఽపశ్యన్ పశ్యంతః శాస్త్రసంచయాన్॥"

శాస్త్రములలో నిట్టి వానికెట్లు ముక్తి కలుగుతుందనే విషయము వారు చెప్పజాలక పోయినారు. గోకర్ణుడాదినము అందరిని సంప్రదించుటలో గడపుతాడు. కాని మార్గమెవరును చెప్పజాలరైరి. మరుదినము ప్రాతఃకాలము సంధ్యజేసి సూర్యున్ని అడుగుతాడు. "కర్మసాక్షీ, జనచ్చక్షూ! మా సోదరుడు ధుంధుకారుడు తరించే ఉపాయము చెప్పవలసినది." సంధ్యావందన శక్తి అది. నిత్యము సంధ్యావందనము చేస్తూండినవారికి ప్రకృతిలో ఏ శక్తియైనను వశమవుతుంది. దానిని సూర్యుడు విని —

"తచ్ఛ్రుత్వా దూరతః సూర్యః స్ఫుటమిత్యభ్యభాషత।
శ్రీమద్భాగవతాన్ముక్తిః సప్తాహం వాచనం కురు॥"

ఆ సూర్యుడు ఆ గోకర్ణుని మాటలు విని స్ఫుటముగ "శ్రీమద్భాగవతమునుండి ముక్తి కలుగుతుంది. భాగవత సప్తాహం చేయవలసినదని" అంటాడు.

అపుడు గోకర్ణుడు భాగవతము చెప్పుటకు పూనుకుంటాడు. గోకర్ణుడు భాగవతము చెప్పుతాడని తెలుసుకొని ఎక్కడెక్కడివారు ఇండ్లు వదలి సప్తాహ శ్రవణానికి వస్తారు. ఈ ప్రేతముకూడ వచ్చి తాను ఒక బొంగును ఏడు గెణుపులు గలదాని నాశ్రయించి శ్రద్ధగ

భాగవత శ్రవణము చేస్తాడు. ఒక్కొక్క దినము ఒక్కొక్క గెణుపు ఫట్ అని పగిలిపోతుంది. ఏడు రోజులకు ఏడు గెణుపులు పగిలిపోయి దివ్యరూప ధరుడై ధుంధుకారుడు బయటకు వస్తాడు. గోకర్ణునికి నమస్కారము చేస్తాడు. ఇంతలో దేవలోకమునుండి విమానము వస్తుంది. మాతలి గోకర్ణున్ని కూడ రమ్మంటాడు. అయితే గోకర్ణుడు ఈ శ్రోతల నందరిని ఎక్కించుకుంటే నేను విమాన మెక్కు తానంటాడు దానికి అందరు విమానములో ఎక్క వచ్చుటకు ధుంధుకారుడు ఎంత శ్రద్ధతో విన్నాడో అంతటి శ్రద్ధతో అందరు వినలేదంటాడు. మాతలి, అప్పటికి మాత్రము ధుంధుకారున్ని పంపి మరల శ్రావణ మాసములో భాగవత శ్రవణాన్ని యేర్పాటుచేసి అందరు శ్రద్ధగా వింటే గోకర్ణుడు అందరితో కలిసి విమానములో పోతాడు. ఈ విధముగ గోకర్ణుడు అందరు నా వెంట రావలెననే పరహిత వాంఛను కలిగి ఉండే ఉదాత్త చరిత్రకలవాడు. అట్టివాడు కావుననే ధుంధుకారున్ని తరింప జేసినాడు.

భాగవత శ్రవణ మహిమ ఇట్టిది. కావున భాగవతముయొక్క ఫలము పోతన మొదటి పద్యములో ప్రకటించినాడు. అదేమంటే!

"శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్" అనే ప్రార్థన. శ్రీకైవల్యం చేరే మార్గాన్ని చింతింప జేస్తుంది భాగవతము.

రెండవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## మూడవ రోజు ఉపన్యాసము

"తపములు సేసియైన మఱి దానము లెన్నియుఁ జేసియైన నే
జపములు సేసియైన ఫలసంచయ మెవ్వని జేర్పకున్న హే
యపదములై దురంత విపదంచిత రీతిగ నొప్పుచుండు న
య్యపరిమితున్ భజించెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్. 2-62

భాగవత ఫల రసాస్వాదన చిత్తులారా! పుణ్యాత్ములారా! సత్కార్య మేదైనా జరుపవలసి యుంటే భగవదనుగ్రహముతోనే జరుగుతుంది. ఈ కార్యక్రమ మింత శోభగా జరుగుచున్నదంటే గీతా భవనమునందు గీతాచార్యుడైన శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహము చేతనే. ఆ సర్వేశ్వరుని అనుగ్రహము చేతనూ పూజ్యులు శ్రీరామానుజాచార్యులవారి సంకల్ప బలముతోనూ, ఈ కార్యము నిర్వహింపబడుచున్నది. శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః అని జగదాచార్యులకు నమస్సు లర్పించి మూడవరోజు కార్యక్రమమును ప్రారంభించు కుంటున్నాము.

ఒక మహాత్ముడన్నాడు. ఈ ప్రపంచములో మానవుడు కల్యాణమును కాంక్షించినట్లైతే రెండు వస్తువులు మరువరాదు. అవి ఏవి? చూడండి.

"దో బాత న కో భూల్ మత్ జో చాహత కల్యాణ్।
నారాయణ ఇక మౌత్ కో దూజై శ్రీభగవాన్!॥"

మొదటిది మృత్యువు. రెండవది నారాయణస్మరణ మరువరాదన్నాడు. మానవుడు మృత్యువంటే భయపడుతాడు.

ఒక పర్యాయము ఏకనాథ మహారాజుగారి వద్ద కొకవ్యక్తి వచ్చి మహాత్మా! భగవంతున్ని మేము ఎంత శ్రద్ధగా స్మరణ చేస్తామనుకొన్నా మాకు మనస్సు ఆ వైపు సరిగాపోదు. మీరు నిరంతరము స్మరణచేస్తూంటారట. అది యెట్లు సాధ్యమో కొంచెము చెప్పండి అన్నాడట, దానికి ఏకనాథమహారాజు "నాయనా! నా కధ అట్లుండనీ, నీవు రేపు, గురువారం 10 గంటలకు మరణానికి గురియవుతావు." ఈ మాట వింటూనే వాడు కాళ్లపైబడి "స్వామీ! నాకు తరుణోపాయము చూపండి. ఏదేని మంత్రోపదేశం చెయ్యండి" అని ప్రాధేయపడ్డాడు. రామనామ మంత్రమిచ్చినాడు. గురువారం 10 గంటలకు వానికి మరణము రాలేదు. ఏకనాథమహారాజువచ్చి "నాయనా! నీవు మంత్రోపదేశం తీసుకున్న తరువాత ఏమేమి పనులు చేసినావ"ని అడిగినాడు. స్వామీ! నాకే విషయము బోధపడుటయే లేదు. కేవలము నామ జపములలోనే ఉన్నానన్నాడు, దానికా యేకనాథుడు "నాయనా! మాకు ఎల్లప్పుడు మృత్యుస్మరణ, ఉంటుంది. అందువలన భగవంతున్ని మరువకుండా ఉంటామని చెప్పినాడు. కావున ఈ రెంటిచేత మానవ కల్యాణము జరుగుతుంది.

నిరంతరము భగవంతుని స్మరిస్తూండినందున మరణకాలములో కూడ భగవంతుడే స్మరణకు వస్తాడు. భగవద్గీతాబోధ ఈ విషయములో అద్భుతమైన సత్యమును ప్రకటిస్తుంది. దానిలో అష్టాధ్యాయమున చెప్పిన విషయమిచ్చుట గమనార్హము.

"యం యం వాపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥"

మనుష్యుడు మరణకాలములో నెట్టి భావనను స్మరిస్తూ శరీరమును వదలుతాడో ఆ గతిని పొందుతాడు.

కావున మరణకాలములో భగవంతుని స్మరణ రావాలి అంటే సులభము కాదు. తులసీదాసు అంటాడు:—

"జన్మ జన్మముని జతనకరాహీం అంతరామకహా ఆవతనాహీం"

జన్మజన్మాల తరబడి ప్రయత్నము చేస్తే కాని అంత్యకాలములో భగవన్నామమురాదు. కావున నిరంతరము స్మరణ చేస్తూంటేనే అంత్యకాలములో ఆ నామము వచ్చేది. మన పెద్దలు సంధ్యావందనము పెట్టిన పద్ధతిలో ఉండిన రహస్యమది. సంధిలో వందనము ప్రతిరోజు చేస్తూంటే మరణకాలములో సహజముగ స్మరణ వస్తుంది. మానవునికి ప్రతిదినము ముఖ్యముగా రెండు సంధ్యలున్నవి. అస్సలు సంధి అంటే ఒకటి గడచినది. మరొకటి ప్రారంభమగుచున్నదని అర్థము. ఉదయసంధ్యలో రాత్రి గడచినది. పగలు ప్రారంభమగుచున్నది. సాయం సంధ్యలో పగలు గడచినది రాత్రి ప్రారంభమగుచున్నది. ఆ సంధిలో భగవంతునికి వందనము చేయవలెనని దాని భావము. ఆ సంధిలో సైంటిస్టుల ప్రకారము (Scientists) పంచభూతములలో నొక విధమైన ఆకర్షణశక్తి ఉంటుందట. అపుడు శ్రద్ధగ సంధ్యావందనము చేస్తే మానవుడు దైవమార్గములో మంచి ప్రగతిని పొందుతాడట.

నిజమైన సంధి మానవునికి మరణకాలమే. ఆ సంధిలో ఈ జన్మతో చేయవలసినదంతా ప్రారబ్ధము తీరినది. శరీరానంతరపు జీవనము ప్రారంభ మగుచున్నది. కావున మరణకాలమే మానవునకు నిజమైన సంధి. ఆ సంధిలో వందనము చేస్తే తప్పక భగవంతున్ని చేరుకోవచ్చు.

"అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।

యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥"

అంత్యకాలములో నన్నే భజించేవాడు శరీరమును వదలి నన్నే పొందుచున్నాడని భగవద్వాక్యము.

జీవితమంతా ఎట్లో గడపి మరణించే టప్పుడు భగవంతున్ని స్మరించడము సాధ్యముకాదు. నీళ్ళలో ఈదువాడు, సైప్పుచేయువాడు అభ్యాసము లేక ఆ పనులను చేయలేడు. బ్రతికిన కాలములో నొట్టి విషయానికి ప్రాధాన్యము నిచ్చి జీవితము గడపుతామో మరణించే టపుడు అదే జ్ఞాపకమునకు వస్తుంది. ఒక బంగారు వ్యాపారస్తుడు భగవంతుని నామ మెటువంటిదో ఎఱుగడు. ఒక తూరి జబ్బుతో పడినాడు. డాక్టరు వచ్చి టెంపరేచరు చూచి 105 ఉంది అన్నాడు. ఈ మాట విని 'ఓరే! మనము 90 రూపాయలతో కొన్నామంద్రా. 105 రూపాయల ధర ఉంటే వెంటనే అమ్మివేయంద్రా!' అని అరువ సాగినాడట. ఈ విధముగ జీవితములో నే విషయానికి అధిక ప్రాధాన్యము నిచ్చి జీవితము గడపుతామో ఆ విషయమే ప్రధానమై మరణకాలమున ముందుకు వస్తుంది. బంగారు వ్యాపారస్థుడు దానిని గురించియే రేయింబవళ్ళు చింతన చేస్తూండినాడు. కావున అదియే స్మరణకు వచ్చింది.

మరణకాలమున భగవంతుని స్మరణ చేయవలసియుంటే దాని మహిమను గురించి తెలుసుకోవాలి. భాగవతము దానిని గురించి చక్కగ తెలిపే శాస్త్రము. అటువంటి దానిని శ్రవణముచేసే భాగ్యము మనకు కలిగినది. ఇది భగవదనుగ్రహప్రభావ విశేషము.

మానవుని జీవితము మృత్యుకాలమును మంగళమయము చేసేదిగ కావలెను. మనుష్యుడిట్టి ఆలోచన ఉంటే పాపము చేయజాలడు. పాపము చేసేటపుడు మానవుడు నవ్వుతూ నవ్వుతూ చేస్తాడు. పాపము అనుభవమునకు వచ్చినపుడు ఏడుస్తూ ఏడుస్తూ అనుభవిస్తాడు.

ఒకతూరి కర్నూలు హాస్పిటలులో నేను రోగుల మధ్యన పోతూంటిని. ఒక రోగి నన్ను పట్టుకొని ఏడవడం ప్రారంభించినాడు. "ఏమి నాయనా! ఎందుకట్ల ఏడుస్తావు" అని నేనడుగగా అతడు

అంటాడు "ఏమి చెప్పుదు స్వామీ! నేను వయస్సులో వావి వరుస లేకుండా తిరిగినాను. ఇపుడిక్కడ రోగాలతో పీడింపబడుతున్నాను. బావిలోపడి చస్తే ఈ బాధ పోతుంది కదా! అనిపిస్తుంది" అంటాడు.

ఆ విధంగా పాపఫలము అంత భయంకరముగా ఉంటుందని మొదట తెలిస్తే చేసేవాడు కాదేమో! అయినా మానవుని అజ్ఞానానికి అంతులేదు. చాలామంది ఫలితము భయంకరముగా ఉంటుందని తెలిసికూడ వ్యసనాన్ని మానుకోలేరు.

మనుష్యుడు ఒక సంవత్సరము ఇన్ కమ్‌టాక్సు లెక్కలు చూపాలి అంటే భయపడుతాడే! మరణించిన తర్వాత భగవంతుని ముందర వీడు శరీరములోని ఒక్కొక్క అవయవముతో దాని ఉపయోగము సత్కార్యములు, దుష్కార్యములను గురించి అకౌంటు చూపాలి. అకౌంటు బాగా చక్కగ వ్రాసి వ్యాపారములో గోల్ మాల్ చేయని వ్యక్తి నిర్భయముగ పుస్తకాలను పారవేసి చూసుకొమ్మంటాడు. క్రిందపైన చేసి అకౌంటు సరిగాపెట్టని వ్యక్తికి భయము వుంటుంది. అటులనే భగవంతుడిచ్చిన ఈ శరీరమును దాని అవయవములను సన్మార్గములో వినియోగించుకున్న వ్యక్తి భయపడనవసరము లేదు. అట్టి వాని మృత్యువు మంగళమయముగా ఉంటుంది. భాగవత శ్రవణము మృత్యువును సంస్కరింపచేస్తుంది, జీవితంలోని సన్మార్గము మృత్యువును మంగళమయము చేస్తుంది. అట్టి మార్గమునందు నడచుకొన్న జీవియే సార్థకమైన జీవనము కలవాడు.

సామాన్యముగా మానవులు మృత్యువు అంటే చెవులు మూసుకుంటారు. భయపడతారు. భయపడడం చాలామంచిది. ఎందుకంటారా? ఇది మానవున్ని పాపపు కార్యాలనుండి దూరం చేస్తుంది. ప్రాపంచిక మానవుడు బాగుపడాలంటే మృత్యుభయం కావాలి. దాని చేత

మానవుడు పాపము చేయజాలడు. ఈ రూపమున మృత్యువు మానవునకు మంగళకారి.

పెద్దలు ఒక విషయమును గట్టిగా అడుగుతారు. ఓ మానవుడా! ఇల్లు కట్టించవలెనంటే, పెండ్లి చేయవలెనంటె నెలల తరబడి ఆలోచిస్తావు. సంవత్సరాలనుంచి విచారిస్తూంటావు. రేపు శరీరమును వదలి పోయే సమయములో ఏమేమి తయారు చేసుకోవలెనో ఆలోచించుకున్నావా? భార్యాబిడ్డలు, ధనము, ధాన్యము అంతటిని వదలి పెట్టి పోవలెనే! దానిని గురించి తత్సంబంధమైన తయారీని గురించి ఆలోచించినావా? ఆలోచించకపోతే మరణం నుండి తప్పించుకుందామనుకున్నావా? అది తప్పదే! ఎప్పుడో ఏ వేళనో, ఎవరికి తెలియకుండా వస్తుంది అది. కావున మిగతా పనులు చేసినా చేయకపోయినా మృత్యువును గురించిన జ్ఞానమును తెలుసుకొని పరలోక యాత్రను సఫలము చేసుకో అంటారు పెద్దలు.

ఒక రాజు. అతనికి ఒక ఉంపుడు కత్తె వున్నది. ఒక దినము రాజు రాత్రివేళ భోంచేసి తాంబూలము వేసుకొని మామూలు మనిషివలె వేశ్యవద్దకు పోవుచున్నాడు. దారిలో ఒక పండితుడు, జ్ఞాని అయిన వ్యక్తి భోంచేసి ఇంటిముందర అరుగుపై పండుకొని ఒక శ్లోకము చెప్పుకుంటూన్నాడు.

"వర్షార్థమష్టౌ ప్రయతేతమాసాన్ రాత్ర్యర్థ మర్థాదివసే యతేత।
వార్థక్య హేతోర్వయసా నవేన పరత్ర హేతో రిహజన్మనా చ॥"

దీని అర్థమేమంటే! వర్షాకాలము నాలుగు మాసాలు రైతుకు సంపాదించుకొని తినుటకు వీలుపడదు. కావున తక్కిన ఎనిమిది నెలల్లో ఆ నాలుగు నెలలు కూర్చొని తినుటకు సంపాదించుకొని పెట్టుకోవలెను. అటులనే రాత్రిపూట సుఖనిద్రవచ్చుటకు దినజీవితము శుద్ధముగ గడపవలెను. దినజీవితములో చేయరాని పనులు చేస్తే

రాత్రి నిద్ర సరిగా రాదు. అదే విధంగా ముసలితనములో సుఖముగా జీవితము గడుపుకొనుటకు వయస్సులో సంపాదించి పెట్టుకోవాలి. మరణానంతరం పరలోక యాత్రను సఫలము చేసుకొనుటకు కూడ ఇహలోకములోనే సంపాదించుకొని పెట్టుకోవలెను.

దీనిలో గమనించవలసిన విషయము అద్భుతముగా నున్నది. ముసలితనములో సుఖముగా బ్రతుకుటకు తన పేరుతో బ్యాంకులో నిల్వ ఉంటే పరవాలేదు. అది ఉంటే చిన్నకొడుకంటాడు "నాయనా! నావద్ద వచ్చి ఉండకూడదా. ఎప్పుడూ అన్న వద్దనే ఉండవలెనా! అని ఆప్యాయంగా అహ్వానము చేస్తాడు. అటులనే అన్నకూడ ఆహ్వానిస్తాడు. కాని తండ్రివద్ద యేమియూ లేకపోతే చిన్న కుమారుడు కాని పెద్దకుమారుడు కాని "ఏమి నాన్నా నేనొకడనే ఉన్నానా! ఇంకొక కొడుకు వద్దకు పో! నేనెంతకాలమని నీకు భోజనము పెడుతాను." అని నిర్దాక్షిణ్యంగా మాట్లాడుతాడు. బ్యాంకులో తన పేరుతో బాలన్సు ఉంటే కోడండ్రు కొడుకులు ఎంతో ప్రేమతో చూస్తారు.

ఒకచోట యిటులనే జరిగినది. తండ్రి గొప్పగా సంపాదించినాడు. కుమారులు అయిదుగురు. తండ్రి అయిదు లక్షలు సంపాదించినాడు. ఇట్టి సమయములో తల్లి మరణించినది. తండ్రికి మనస్సులో విపరీతమైన బాధ కలిగింది. అతని భార్య సాధ్వీమణి. అత్తమ్మ మరణిస్తూనే కోడండ్రమధ్య భేదాభిప్రాయాలు పుట్టినవి. ఒక్కొక్కచోట అత్తతో ఉండడము కష్టముగా ఉంటుంది కోడండ్రకు. ఆ అత్త అటువంటిది కాదు. కోడండ్రను కూతుర్లవలె చూచుకొంటున్నది. ఎవరిలోనైనా భేదాభిప్రాయము వస్తే అత్తమ్మ వద్దకు ఆ విషయము వచ్చేది. ఆమె వెంటనే దానిని సరిచేసేది. అట్టి అత్తమ్మ పోతూనే కోడండ్ర మధ్యలో పొరపొచ్చెములు బయలుదేరి వేరే పోదామని

తండ్రి వద్దకు వచ్చినారు. తండ్రికూడా దూరపు ఆలోచన చేసుకో కుండా అయిదు లక్షలు అయిదుగురు కుమారులకు పంచియిచ్చినాడు. తనదిగా ఏమియు ఉంచుకొనలేదు. కొన్ని రోజులు గడచిన పిమ్మట మామకు ప్రతిపూట నియమ పూర్వకముగా అన్నము పెట్టడం కోడండ్రకు కష్టమైంది. మామకు వయస్సుకూడ డస్సి పోయినది. శరీరము దుర్బలమైంది. తానున్న చోటికి కోడండ్రు తెచ్చిపెట్టవలె. "నేనే భోజనముచేసి తీసుకపోవలెనా! నేనే ...... పోవలెనా?" అనుకుంటూ ఒక్కొక్క దినము మామకు అన్నమే పెట్టని దినములు సంప్రాప్తమయినాయి. ఆ మామకు చిన్నతనమున నొక స్నేహితు డుండేవాడు. అతడు ఒకదినము వచ్చి ఎట్లున్నావోనని విచారిస్తే వృద్ధుడు కన్నీరు పెట్టుకొన్నాడు.

ఈ సంగతిని గమనించి ఆ స్నేహితుడొక ఉపాయము చేయవలె నని సంకల్పించినాడు. ఒకదినము అయిదుగురు కుమారుల సమక్ష ములో నొక ఇనప పెట్టెను కూలివానితో మోయించుకొని తెచ్చి "మిత్రమా! నీవు వృద్ధుడవైనావు నేనూ వృద్ధుడనైనాను. నీ పెట్టెను నీకిచ్చుచున్నాను. నీ యిష్టము" అని బీగం చెవులాతనికి యిచ్చి వెళ్లిపోయినాడు. అయిదుగురు కుమారులు చూచినారు. అరెరె ... ఇంకా ఇంతటి పెట్టె ఉన్నదే! మనకు తెలియక పోయె నని అందరు తమ తమ భార్యలను పిలిచి తమ తండ్రిని జాగ్రత్తగా చూడవలసినదిగా హెచ్చరిక చేసినారు. ఒక కోడలు లడ్డు చేసుకొని తెస్తే, మరొక కోడలు గులాబుజాము తెచ్చి మామగారిని మిక్కిలి ఆదరముగా విచారించడము ప్రారంభించినారు. అయితే ఆ పెట్టె తెచ్చి యిచ్చినతడు కుమారులందరికి మీరీ పెట్టెను ఇప్పుడే తీసి చూడవద్దు. మీ తండ్రిగారి మరణాంతరము అన్నిపరలోక క్రియలు చేసిన పిమ్మట దీనిని తెరచి చూడండి అని చెప్పి పోయినాడు. ఈ మాట

లను అందరూ విని తమలో తాము మనమే కదా ఉండేది. అటులనే చేస్తామని మాట యిచ్చినారు.

తండ్రిగారు దివంగతులైనారు. కుమారులు కర్మ చాలా వైభవముగా చేసినారు. భూదానము, గోదానము, హిరణ్యదానము, రజత దానము అన్ని దానములు యిచ్చి కర్మలన్ని తీర్చి, అయిదుగురు సోదరులు తలుపులు వేసికొని ఇనపపెట్టెను తీసి చూచినారు. దానిలో అన్నీ యిటుకలు ఉన్నాయి. అందరు ఆశ్చర్య, విషాదములతో విస్మితులయినారు.

ఈ విధముగా ముసలితనములో సుఖ జీవనము జరుగవలెనంటే వయస్సులో సంపాదించి తన పేరుతో బ్యాంకులో పెట్టుకోవలెను. ఈ శరీరము చక్కని ఆరోగ్యముగా ఉండినపుడే పరలోక సిద్ధికి కూడా కావలసిన జ్ఞాన సాధన చేసి పెట్టుకోవలెను. లేకున్న మరణించిన పిమ్మట జీవి మిక్కిలి యాతన ననుభవించ వలసి వస్తుంది. అని ఆ బ్రాహ్మణుడు శ్లోకము చెప్పుకుంటూండినాడు.

రాజు ఆ శ్లోకాన్ని విన్నాడు. దాని అర్థాన్ని బాగా గమనించినాడు. కావున ఆయన మనస్సులో నొక గొప్ప పశ్చాత్తాపము కలిగినది. పరలోకమును గురించి నేనింతవరకు ఆలోచనే చేయలేదే, ఎంతటి పొరబాటైనది? ఇంకనైనా తీవ్ర ప్రయత్నము చేసి పరలోకమును సాధించవలెను. ఇట్లు భావించి గ్రరున వెనక్కు తిరిగినాడు. మరు దినము నుండి ప్రతిరోజు శ్రవణ కార్యక్రమమును యేర్పాటు చేయించుకొని క్రమముగా దేహాంతర యాత్రను సఫలము చేసుకొన్నాడు. భాగవత మీ విషయములో మానవునకు సరియైన మార్గం నిర్దేశము చేస్తుంది.

ఉపనిషత్తొకమాట చెబుతుంది :

"ఇహ చేదవేదీద థసత్యమస్తి నచేదిహావేదీ న్మహతీవినష్టిః।
భూతేషు భూతేషు విచింత్యధీరాః ప్రేత్యాస్మాల్లోకాదమృతాభవన్తి॥"

ఈ లోకములో శరీరము ఉండగానే తెలుసుకోవలసిన విష యాన్ని తెలుసుకుంటే అది సత్యమైన జీవితము, సవ్యమైన జీవితము. ఎవరైతే ఆ విధముగా తెలుసుకోరో వారు చాలా నష్టమును పొందుతారు. జన్మ జన్మలోను ఈ విషయమును చక్కగా గమనించిన ధీరులు కాలమును సద్వినియోగము చేసుకొన్నవారు, శరీరమును వదలి ఈ లోకము నుండి అమృతత్వమును పొందుతారు.

ఇప్పుడు భాగవత నిర్మాణాన్ని గురించి తెలుసుకుందాము. ఒకనాడు వేదవ్యాసుడు వ్యాకులితస్వాంతుడై కూర్చొని ఉంటాడు. ఇట్టి తరుణమున నారదుడు వీణ మీటుకుంటూ ఆయనవద్దకు వస్తాడు. వ్యాసమహర్షి ఏమో తనకు తెలియని వ్యథను కలిగి ఉండడము ఆయన గమనిస్తాడు. వ్యాసమహర్షి, ఎందుకిట్లు క్లిన్న మనస్కుడవై, వున్నావు? నీవు సామాన్యుడవు కాదే! చాలా గొప్పవాడవు.

"ధాతవు భారతశ్రుతి విధాతవు వేదపదార్థజాత వి
జ్ఞాతవు కామముఖ్యరిపుషట్క విజేతవు బ్రహ్మతత్త్వ ని
ర్ణేతవు యోగినేతవు వినేతవు నీవు చలించి చెల్లరే
కాతరుకైవడిన్ వగవ కారణమేమి పరాశరాత్మజా" 1–87

నీవు బ్రహ్మదేవుని వంటివాడవు. భారతమనే పంచమ వేదాన్ని నిర్మించినావు వేదములో అర్థజాలాన్ని చక్కగా తెలుసుకున్నాడవు. అరిషడ్వర్గమును జయించినవాడవు. బ్రహ్మతత్త్వాన్ని బ్రహ్మసూత్రాల ద్వారా నిర్ణయించినాడవు. యోగ సూత్రముల ద్వారా యోగము యొక్క స్వరూపాన్ని చక్కగ ఎరిగినవాడవు. మంచి వినయాది సౌజన్యము కలవాడవు. ఇట్టివాడవు అజ్ఞానివలె వగయుటకు కారణ మేమో చెప్పుమా అన్నాడు నారదుడు.

ఈ మాటలు విని వ్యాసుడంటాడు –

"అస్త్యేవమే సర్వమిదం త్వయోక్తం
తథాపి నాత్మా పరితుష్యతే మే।
తన్మూల మవ్యక్త మగాధ బోధం
పృచ్ఛామహే త్వాఽఽత్మ భవాత్మభూతమ్॥"

నారదా! నీవు చెప్పేదంతా సరియే. కాని నా ఆత్మ తృప్తి పొందుటలేదు. దాని కారణము అవ్యక్తముగా, అగాధబోధముగా ఉన్నది. అందువలన బ్రహ్మాత్మభూతుడవైన నిన్ను అడుగుతున్నాను.

"నీ కెఱుగరాని ధర్మము లోకములను లేదు బహువిలోకివి నీవి
నా కొరత యెట్టి దంతయు నాకున్ వివరింపవయ్యా నారద
కరుణన్" 1-91

నీకు తెలియనిది మూడు లోకములలో లేదు నారదా! నాకీ విధమైన కొరత ఎందుకు కలిగినదో వివరించి చెప్ప వేడుచున్నాను. ఆ ప్రార్థనను విని నారదుడు అంటాడు.

"అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుక గాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణ విశేషము లెన్నినఁ గాక నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁగోరి నుతింపమి నార్యపూజితా" 1-93

వ్యాస భట్టారకా! మంచి మంచి ధర్మములను చెప్పితివి. కాని వాటిలో విష్ణుకథ లధికముగా చెప్పలేదు. కేవలము ధర్మములు చెప్పితే హరి మెచ్చడు. నీ మానసిక క్లిన్నత కిదియే కారణము.

"హరి నామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజ హంసావళీ
సురుచి భ్రాజితమైన మానస సర స్స్ఫూర్తిన్ వెలుంగొందు శ్రీ
హరి నామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితంబయ్యు శ్రీ
కరమై యుండ దయోగ్య దుర్మలిన వత్కాకోల గర్తాకృతిన్" 1-94

హరి నామ స్తుతి చేసే కావ్యము బంగారు కమలములతో మంజులమై మనోజ్ఞమైనట్టి మానస సరోవరమువలె శోభిస్తుంది. ఆ హరి నామస్తుతిలేని కావ్యము విచిత్రార్థములతో కూడియున్నదైనను మంగళకరముగ ఉండదు. అది మలినములతో కూడిన సర్పాల పుట్ట వంటిది.

భక్తి మహిమ అద్భుతమైనట్టిది. దానిని పాఠకుల హృదయము నందుత్పన్నము చేయు భక్తిరస ప్రధానమైన గ్రంథము నొకదానిని రచించితే నీ మనస్సులోని దుఃఖము దూరమవుతుంది. కావున భాగవతమును అంటే భగవత్సంబంధమైన గాథ వ్రాయవలసినది. భక్తి మహిమ అద్భుతమైనది. దాని శ్రేష్ఠత్వమును తెలియ జేయుటకు నారదుడు తన కథను చెప్ప దొడగినాడు.

కృష్ణద్వైపాయనా! పూర్వము నేనొక దాసీపుత్రుడను. మాతల్లి నాల్గిండ్లవద్ద అంట్లు తోముచూ వారికి వలసిన సేవచేస్తూ జీవనము గడపుకునేది. అట్టి తరి నాకు అయిదు యేండ్ల వయస్సు. ఒక దినము మా గ్రామమునకు ఒక మహాత్ముడు తమ శిష్యవర్గముతో వచ్చి చాతుర్మాస్యముచేయ బూనినాడు ఆ యూరిలోనే పటేలు పట్వారీలు నన్ను తీసుకపోయి ఆ మహాత్ముని వద్ద వదలి స్వామీ! ఈ పిల్లవాని కింత ప్రసాదము పెడుతుండండి. చెప్పినపని చేస్తూంటాడని నన్ను వదలి పోయిరి. ఆ మహాత్ముడు ఉదయ సాయంత్రముల యందు శ్రీకృష్ణుని చరిత్రమును అద్భుతమైన గానముతో చెప్పుతూండినాడు. అందరుకూడ పాడేవారు.

"వారల్ కృష్ణచరిత్రముల్ చదువగా వర్ణింపగా పాడగా
నా రావంబు సుధారస ప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన మది సంతోషించి నేనంతటన్
బ్రారంభించితి విష్ణుసేవ కితర ప్రారంభ దూరుండనై." 1-105

వారు కృష్ణుని చరిత్రములు వర్ణిస్తూ పాడుతుంటే, ఆ శబ్దము నాకు అమృతముతో సమానముగ తోచింది. నేను సంతోషించి విష్ణుసేవ చేయుటకు ప్రారంభించితిని.

కాని ఆ మహాత్ముడు కూడ నాపై వాత్సల్యము కలిగియుండి నాడు. నేనాయనకు సేవచేయుచు ఆయన వద్దనే ఉంటిని. నా సేవతో ఆయన మనస్సు ఆర్ద్రమైంది. నన్ను అనుగ్రహించినాడు.

మహాత్ములు తమ శిష్యులను మూడు సందర్భములలో అనుగ్రహిస్తారు. సేవ చేసేటప్పుడు దానితో సంతోషించి అనుగ్రహిస్తారు. తమ జపసమయములో జ్ఞాపకము వచ్చినట్లైతే ఆశీర్వదిస్తారు ఇతరులతో మాట్లాడే సమయమున సందర్భాను సారముగ శిష్యుని ప్రసంగము వచ్చినపుడు మనసుతో దీవిస్తారు. ఈ విధంగా ఈ మూడు సందర్భములలో గురువులు శిష్యులను కనికరిస్తారు. వారి అనుగ్రహము కలిగిందా ? ఇక తరించినట్లే.

ఒకనాడు ఆ మహాత్ముడు "అరే బాలుడా ! ప్రసాదము తీసుకున్నావా ? భోంచేసినావా ?" అని ప్రశ్నించాడు. నేను భుజించలేదంటిని. వెంటనే "మహా ప్రసాదము నీకోరకున్నది. పోయి భోంచేయి" అన్నారు. వారి ఉచ్ఛిష్టమును నేను పోయి భోంచేసితిని. భోంచేస్తే నాకు పాపమంతా తొలిగిపోయినట్లు అనుభవము కలిగినది. "ఉచ్ఛిష్ట తే పానను మోదితో ద్విజైః సకృత్స్మభుంజే తదపాస్త కిల్బిషైః", ఆ దినము కీర్తనలో నాకు కలిగిన ఆనందము పారము, గురుదేవుడు నన్ను అనుగ్రహించి నాకు మంత్రోపదేశము చేసినారు. అది ద్వాదశాక్షరి "ఓం నమో భగవతే వాసుదేవాయ" అనే మంత్రాన్ని తానే అనుగ్రహముతో ఉపదేశించిరి. నేనా మంత్రాన్ని నిరంతరము జపము చేయసాగితిని. అంతేకాదు నా కా మహాత్ముడు భగవంతుని రహస్యోదార స్వరూపము నంతటిని చక్కగ బోధించెను.

మంత్ర జపమంటే ఏకాగ్రచిత్తముతో చేయాలి. కొందరు 10, 12 మాలలు తిప్పవలెననే నియమాన్ని పెట్టుకుంటారు. జపమునకు కూర్చున్నప్పటి నుండి పెద్ద పూస ఇంకనూ రాలేదే? అనే వ్యగ్రతను పొందుతారు. అట్టి వ్యగ్రత కలిగితే జపము చేసిన ఫలము పోతుంది. "వ్యగ్ర చిత్తో హతో జపః" కావున నీకెంత అనుకూల సమయమున్నదో ఎంత జపమును వ్యగ్రత లేకుండా చేయగలుగుతావో అంతే చేస్తూండడము ఉత్తమ పద్ధతి.

కొందరు గీతా పారాయణమును కూడ 5, 6 అధ్యాయములు చేయవలెనని సంకల్పించి గీత ప్రారంభించి "ధర్మక్షేత్రే కురుక్షేత్రే" అంటూ తరువాత పేజీలను తిప్పుకుంటూ ఇన్ని పేజీలు ఉన్నాయే? ఎప్పటికయిపోతుందబ్బా? అనుకుంటూ పారాయణము చేస్తుంటారు. ఆ విధముగా చేయడము సరికాదు. దానిని కూడ ఎక్కువ చేయనవసరము లేదు. ఒకే అధ్యాయము చేయి. కాని చిత్తమును తొందర పెట్టుకోకుండా చేయి. ఇట్లు చేస్తేనే దానివలన ఫలితము.

నారదుడు చెప్పుచున్నాడు. "ఈ విధముగా, నేను నిరంతరము గురుసేవలోను, మంత్రజపములోను శ్రీకృష్ణ చరిత్ర శ్రవణములోను కాలము గడపుతూంటే నాలుగు మాసాలు క్షణములో గడచినట్లై పోయినవి." మనిషి దేనిలోనైనా నిమగ్నుడైతే, ఆనందపడుతూంటే కాలము క్షణములో గడచి పోయినట్లుంటుంది. ఆ విధముగ గాక శ్రమతోను, కష్టముతోను కాలము గడుపుతూంటే ఎంతో దీర్ఘముగ గడచినట్లుంటుంది.

నాలుగు మాసములు శీఘ్రముగా గడచినాయి. మహాత్ముడు అక్కడినుండి బయలు దేరుటకు సిద్ధమైనాడు. నేను వారివెంట వస్తానని ఎంతో ప్రాథేయ పడితిని. కాని నన్ను వారు వెంట తీసుకొని పోవుటకు నిరాకరించిరి. అప్పుడు నేను నా గురువుగారి పాదములపై

వడి "మహాత్మా! నేను మీతోనే కలిసివస్తా. మీ చరణముల నాశ్రయించుకొని కాలము గడుపుతా. నా కన్నము పెట్టకుంటే కూడా పరవాలేదని ఏడిస్తిని. ఆ మహాత్ముడు కొంచెము కన్నులు మూసుకొని నా భవిష్యత్తును దర్శించి "నాయనా! నీవు నీ తల్లికి ఋణపాతకపుత్రుడవు. మీ తల్లి సేవచేసికాని నీవు ఋణ విముక్తుడవు కావు. అందువలన ఇచ్చటనే ఉండు"మంటే నేను దుఃఖ పడితిని. దానిచేత ఆర్ద్రమనస్కుడై ఆ మహాత్ముడు "బాలకా! నీకు మేలు జరుగుతుంది. భగవంతుడేదో లీల చేస్తాడు. నీకు శుభ మగు గాక. మా వెంట వచ్చుటకు మాత్రము వీలు లేదని" ఖచ్చిత ముగా చెప్పి వెళ్ళిపోయిరి.

అంత నేను ఆ స్వామి నాకుపదేశించిన మంత్రజపమును చేసు కుంటూ కాలము గడపుచుంటిని. కొన్ని దినాలకు మా తల్లి పాలు పితుకుటకు ఆవు వద్దకు పోతే అక్కడ నాగుపాము మా తల్లిని కరచి నది. తత్క్షణమే మా తల్లి అసువులను బాసినది. ఆ మహాత్ముడు "భగవంతుడు లీల చేస్తాడు." అని చెప్పిన మాట నాకు స్ఫురణకు వచ్చినది. నేను ఇంటిలోని వస్తువులను వారికి వీరికి యిచ్చి ఇల్లు ఖాళీ చేసి ఉత్తర దిశగా పోతూంటిని. ఒకనాడు గంగలో స్నానముచేసి ధ్యానానికి కూర్చుంటే నాకు హృదయములో శంఖ, చక్ర, గదాధారి శ్రీమన్నారాయణుడు మెరుపు మెరచినట్లు, ప్రత్యక్షమయ్యెను. నేను పరవశుడనై కనులు తెరచితిని. రూపమదృశ్యమాయెను. అపుడా రూపము దర్శనము మరల కావలెనని ఆర్తితో అరచితిని. అపుడు ఆకాశమునుండి ఇట్లు వినపడెను.

"ఏల కుమార! శోషిలగ నీ జననంబున నన్నుఁ గానగా
జాలవు నీవు కామముఖ షట్కము నిర్దళితంబు జేసి ని
ర్మూలిత కర్ములైన ముని ముఖ్యులుగాని కుయోగిఁగానగా
జాలడు నీదు కోర్కె కొనసాగుటకై నిజరూపు జూపితిన్. 1-124

కుమారా! దుఃఖించవద్దు. ఈ జన్మములో నన్ను గానజాలవు. కామ క్రోధ లోభ మోహ మదమత్సరములనేవే అరిషడ్వర్గములు. అవి సంపూర్తిగా పోతే నా దర్శనమవుతుంది. కావున నీవింకను పవిత్రుడవు కావలెను. నీకోరిక ముందుకు సాగుటకై నా రూపు చూపినాను. బాలకా!

"నావలన కోర్కె యూరక పోవదు విడిపించు దోషపుంజములను మ
త్సేవం బుట్టును వైశమ భావింపగ నాదు భక్తి బాలక వింటే"
1-125

నాపైని ఆసక్తి నీకున్నా సమస్త దోషములను దూరము చేస్తుంది. నా సేవతో నీకు భక్తి కలిగినది. దీనితోనే సమస్త దోషములు తొలగి శుభము చేకూరుతుంది.

ఇవి జన్మాంతరముల యందు కూడ తొలగిపోను. నీవీ శరీరము విడిచి నా యనుమతితో పుట్టితావు. అప్పుడీ సృష్టి తీరి మరల సృష్టి ప్రారంభమవుతుంది. ఆ సృష్టిలో నిర్దోషుడవై పుట్టి నా కృపచేత శుద్ధ సాత్వికులలో అగ్రగణ్యుడవై తావు. అపుడు నిరంతరము నా సాన్నిధ్యము నీకు లభ్యమైతుందని శబ్దము వినబడినది. నేనటులనే పోతూ పోతూ చివరిసమయమున భగవంతుని స్మరిస్తూ, దేహము వదలితిని.

జీవితములో జీవితాంతము వరకు స్మరణ చేస్తుంటే ఆఖరు క్షణాలలో భగవంతుని స్మరణ వస్తుంది, మనుష్యుడు ఎట్లు బ్రతకాలో తెలుసుకోవడం కాదు - ప్రధానము. ఎట్లు మరణించాలో తెలుసుకోవలసి యున్నది. బ్రతుకుటకు కావలసిన అన్నమును ప్రారబ్ధమే పెట్టుతుంది, కాని మరణమును మంగళమయముగా చేసుకొనుట చాలా ప్రధానము.

ఎందుకంటే జీవిత విధానములో ఎట్టువంటి వాసన దృఢమైతే, ఆ సంబంధమైన రుచి యేర్పడుతుంది. కలకత్తాలో బెస్తవారు మగ

వారు గంగానదిలో చేపలు పట్టి అమ్ముటకుగాను తమ భార్యలను పంపుతారు. ఒక పర్యాయము ఇద్దరు ఆడవారు చేపల నమ్ముకొని తిరిగి యింటికి వస్తూండినారు. సాయంకాలము కొంచెము వర్షము కూడ రాబట్టినది. గమ్యస్థానము చేరుట ఆ చీకటిలో కష్టమనిపించి నది. ఇంతలో నచ్చట పువ్వులతోట కనిపించినది. ఆ పూలతోట వారందులో ఒకామెకు బంధువులు. కావున ఆమె వదినా! వదినా! ఈ రాత్రికిక్కడ ఉండి రేపు మనము ఇంటికి పోదాము రావే! ఈ పూలతోట వారు మాకు దగ్గరి బంధువు"లని అన్నది. ఇద్దరు ఆ పూలతోటలోనికి పోయినారు.

వారిని చూచి పూలతోట దంపతులు సంతోషముతో ఉడు కుడుకు వంట చేసిపెట్టి వారి చేపల బుట్ట లెచ్చటనో పెట్టి వీరిద్దరినీ మర్యాదగా నొక పూలకుటీరంలో పరుండబెట్టినారు. మల్లెపూల సుగం ధము ఆ ప్రాంతమంతయు వ్యాపించి ఘుమఘుమాలించుచున్నది. రాత్రి 11 గం॥ వరకు ఆ యిద్దరు స్త్రీలకు నిద్ర రాలేదు. అందులో నొకామె "వదినా! వదినా! ఈ పాడు పూలకంపుతో నాకు నిద్రవచ్చుటలేదే" అన్నది, ఇంకొకామె కూడా "అవునే నాకుకూడా నిద్రవచ్చుటలేదు. ఏం చేస్తాము?" అడిగింది. మొదటి స్త్రీ లేచిపోయి ఆ తోట గృహిణిని లేపి తమ చేపల బుట్టలు ఎక్కడ వున్నాయో తెలుసుకొని తెచ్చింది. వాటిని మొఖాలమీద పెట్టుకొని నిద్రపోయారట?

చూడండి వారికి పూల వాసన కంపైనది. చేపలకంపు ఇంపై నది. ఇట్టిది వారి సంస్కారము. మానవుడు జీవితములో ఉత్తమ మైన సంస్కారమును పొంది భగవంతుని భక్తియనే రుచిని అనుభ వించుటయే స్వభావముగ మార్చుకొని జీవితమును ధన్యము చేసు కోవాలి. నిరంతరము భగవన్నామమును స్మరణ చేస్తూండడము స్వభావముగా మార్చుకుంటే అంత్యకాలములో భగవంతుని స్మరణ

సాధ్యమవుతుంది. అట్టివారు మాత్రమే మరణమును మంగళమయము చేసుకుంటారు.

ఒక మహాత్ముని వద్దకు ఒక వ్యక్తి పోయి "స్వామీ! జపము ఎంతకాలము చేయవలె"నని ప్రశ్నించినాడట. దాని కాయన నాయనా! 'శ్వాస ఎంతకాలము తీసుకోవలె"నని తిరుగు ప్రశ్న వేసినాడట. మరణించేవరకు తీసుకోవలెను స్వామీ! అన్నాడితడు. ఆ మహాత్ముడు "జపముకూడా అట్టిదే నాయనా!" అన్నాడు. కావున అంతిమ శ్వాసవరకు జపము జరుగుతుండాలి. కూర్చుంటే, లేస్తే, తుమ్మితే, వేయేల అన్ని గడియలయందును భగవంతుని స్మరణ అప్రయత్నముగా జరుగుతూండాలి. అట్టివాని మరణము మంగళమయమవుతుంది. నారదుని మరణమట్లు జరిగినది.

తరువాత ఆయన జననమైనది. ఆయన వేదవ్యాసునితో చెప్పినాడు. ద్వైపాయనా! నేను దాసీ పుత్రుడనై యుండినప్పటికి ఆ భగవంతుని భక్తి మహిమచేత నిపుడు త్రిలోక పూజ్యుడనైనాను, భక్తిమార్గము పరుసవేది మార్గము. భగవంతుని అనుగ్రహము పొందుతే ఆ మనుష్యుడు సర్వలోక పూజ్యుడౌతాడు. ఆ విధమైన శ్రేష్ఠత్వమును కలిగించు భక్తి ప్రధానమైన ఒక సద్గ్రంధమును రచించుము. ఆ విధముగ రచిస్తే నీకు క్లేశములు తీరిపోతాయి అని ప్రబోధించి వెళ్ళిపోయినాడు. భక్తిని ఉత్పన్నము చేసే గ్రంథమును వ్రాయమన్నాడు. దాని ప్రకారము వేదవ్యాసుడు.

"అవనీ చక్రములోన నే మనుజుడే యామ్నాయమున్ విన్నమా
ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపగా జాలు భ
క్తి విశేషంబు జనించునట్టి భువన క్షేమంకరంబైన భా
గవతామ్నాయము బాదరాయణుడు దాఁగల్పించె నేర్పొప్పఁగన్.
1-135

అనగా ఈ భూమండలములో యే గ్రంథము చదువుతే మాధవునిపై, లోకశరణ్యునిపై భవబంధమును ఛేదించే భక్తి ఉత్పన్నమవుతుందో అట్టి భువన క్షేమకరమైన భాగవతమనే పేరుగల ఉత్తమ గ్రంథమును వేదవ్యాసుడు రచించినాడు.

ఈ విధముగ రచింపబడినదీ భాగవతము. ఇది ప్రేమ శాస్త్రము. ప్రత్యేకించి గృహస్థులకిది కల్పవృక్షము. ఇట్టి భాగవతమును వేదవ్యాసులవారు సంస్కృతములో రచించిరి

దీనిని పోతన తెలుగులోనికి అనువాదము చేసినాడు. పోతన మనస్సులో ఒకనాడీ సంకల్పము వచ్చినది.

"చేతులారంగ శివుని పూజింపడేని నోరునొవ్వంగ హరి కీర్తినుడువడేని దయయు సత్యంబులోనుగా దలపడేని కలుగనేటికి తల్లుల కడుపుచేటు"
1-12

శివుని పూజించక, నోరు నొచ్చేటట్లు కీర్తన చేయక, దయ, సత్యము, లేనివాడు పుట్టడము తల్లుల కడుపుచేటు మాత్రమే అనుకొని ఒకనాడు సాయంత్రమున నదికి వెళ్ళి, స్నానము చేసి ఇసుక దిన్నెపై కూర్చొని మహేశ్వర ధ్యానము చేస్తూంటే శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమైనాడు. పోతన పరవశుడై పాదములపై వ్రాలుతాడు. భాగవతమును తెనిగించి తనకంకిత మిమ్మని కోరినాడు శ్రీరాముడు. శ్రీరామచంద్రునితో ప్రభూ! నేను భాగవతము వ్రాయగలుగుతానా? అని ప్రశ్న వేస్తే "కలము పట్టుకో అదే సాగిపోతుందని" శ్రీరామచంద్రుడు ఆదేశిస్తాడు. దానిచేత పరవశము చెంది పోతన అంటాడు.

"పలికెడిది భాగవతమట పలికించువిభుండు రామభద్రుండట నే పలికిన భవహరమగునట పలికెద వేరొండుగాథ పలుకగ నేలా!" 1-16

అని భాగవతమును గురించి తెలుసుకొనుట ఎట్టిదో పోతన అంటారు.

"భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు శూలికైన తమ్మిచూలికైన విబుధ వరుల వలన విన్నంత కన్నంత తెలియవచ్చినంత తేటపఱుతు"

శూలి అంటే శంకరుడు, తమ్మిచూలి అంటే బ్రహ్మ. ఈ భాగవతము వారికి కూడ పూర్తిగా తెలుసుకొనుట కష్టము. అయినా పెద్దల వలన నేను విన్నంతి తెలుపుతానని వ్రాతకు పూనుకుంటాడు.

దీని అనువాదమును గురించి పోతనకెంతటి ఆనందమో! మరియు దాని ఫలితమును గురించి ఎంతటి నిశ్చయమైన విశ్వాస మున్నదో చూడుడు.

"ఒనరన్ నన్నయ తిక్కనాది కవులీయుర్విన్ బురాణావళుల్
తెనుగున్ జేయుచు మత్పురాకృత శుభాధిక్యంబు దానెట్టిదో
తెనుగున్ జేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబు జేసెద పునర్జన్మంబు లేకుండగన్. 1-19

తిక్కనాది కవులు ఎన్నో సంస్కృత గ్రంథాలు తెనిగించి దీనిని తెనిగించకుండ వదలడము తన అదృష్టమని భావిస్తాడు పోతన. దీనిని తెలుగు చేస్తే కలిగే ఫలితము పునర్జన్మరాహిత్యమట. దీనిని శ్రవణము చేస్తే కూడ పునర్జన్మ రాహిత్యమే. అందువలన ఆ కాలములో నుండిన రాజు తన ఆస్థానమునకు వచ్చి భాగవతమును, తన కంకితమిమ్మని చెప్పి పంపితే పోతన అంటాడు.

"ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట పోటులందినక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెరపోతరాజొకడు భాగవతంబు జగద్ధితంబుగన్" 1-11

ఈ మనుజేశ్వరాధములంటాడు రాజులను. ఎంతటి ధైర్యము! ఎంతటి భగవన్నిర్భర భావము! వీరికి అంకితమిచ్చి కాలుని చేతుల్లో

బడకుండా సమ్మతితో సూరికిచ్చి చెప్పుట ఎంతటి భాగ్యము.'' పోతన యొక్క ఉచ్ఛతమ భావమెంత ప్రశంసనీయమైనదో! ఆయన జగత్ప్రసిద్ధముగా రామునకంకిత మిచ్చినాడు.

ఇట్టి భాగవతమును తెనుగులో అనువాదము చేసి ఆ గ్రంథములోని విషయాన్ని గురించిన పోతన విధానమును పరికింపుడు.

''శ్రీమంతమై మునిశ్రేష్ఠ కృతంబైన భాగవతంబు సద్భక్తితోడ
విసగోరువారల విమల చిత్తంబుల చెచ్చెరనీశుండు చిక్కుగాక
ఇతర శాస్త్రంబుల నీశుండు చిక్కునె మంచివారలకు నిర్మత్సరులకు
కపట నిర్ముక్తులై కాంక్షచేయక యుండు దగిలియుండుట మహా
తత్త్వ బుద్ధి
పరగి నాధ్యాత్మికాది తాపత్రయంబు నడచి పరమార్థ భూతమై
యఖిల సుఖద
మై సమస్తంబు గాకయు నయ్యునుండు వస్తు వెఱుగంగ దగు
భాగవతము నందు'' 1-34

ఇది భాగవతమును చదివేవారి యొక్కయు, శ్రవణము చేసేవారి యొక్కయు విమలమైన చిత్తములయందు ఈశ్వరుడు చిక్కుతాడు. ఇతర గ్రంథములయందు మత్సరము లేనివారికి, కపటము లేనివారికైనను ఈశ్వరుడు చిక్కడు. దీనిని చదివేవారికి ఆధ్యాత్మికాది తాపత్రయములు పోతాయి. పరమార్థభూతమై, అఖిల సుఖాన్నిచ్చునట్టిదై సమస్తము కాకయు, అయ్యు ఉండు పరమాత్మ వస్తువును భాగవతములో తెలుసుకొనవచ్చును.

ఈ భాగవతములో భక్తి ఒకటే కాదు. జ్ఞాన వైరాగ్యాలు కూడ అతి గంభీరముగాను, పూర్ణముగాను ప్రకటీకరింపబడినవి. అఖిలము కాకయు నయ్యునుండు'' అను సూక్తిని కొంత వివరించవలసి యున్నది. సమస్త నామరూపములు కంటికి కనిపించునవి. మనము కంటికి కనిపించునదే ప్రపంచమనుకుంటాము. కాని ఇది స్థూలమైన

ప్రపంచము. ఈ స్థూలమైనదానికి సూక్ష్మమైన పరమాత్మ ఆధారము కారణము. ప్రపంచము గోచరించేది. పరమాత్మ గోచరించదు. కావున కనిపించే దానికి కనిపించనిది ఆధారమనే ఒక సూత్రమును తెలుసుకుందాము.

ఛాందోగ్యోపనిషత్తులో ఉద్దాలకుడనే తండ్రి శ్వేతకేతువనే కుమారునకు ఆత్మోపదేశం చేస్తాడు. కుమారుడు కంటికి కనిపించని దానిని వున్నదని నమ్మేదెట్లా? అని ప్రశ్న వేస్తాడు. తండ్రి మర్రి చెట్టు విత్తనం తెమ్మంటాడు. కుమారుడు తెస్తాడు. "కుమారా! దానిని పగులగొట్టి లోపల యేముందో చూడు" మంటాడు. కుమారుడు దానిని పగులగొట్టి చూస్తాడు. "ఏమీ లేదు తండ్రీ!" అంటాడు. తండ్రి "బాగా చూడు, ఏమియు లేదంటూనే ఆ కనిపించే గొప్పదైన వట వృక్షము ఎక్కడి నుండి వచ్చినది?" అని ప్రశ్నిస్తాడు. ఆ కనిపించే వటవృక్షము దీనిలో నుండి వచ్చినదే. ఈ విత్తనములో ఆ వటవృక్ష శక్తి ఇంతకే పరిమితము కాదు. ఆ వృక్షానికి ఎన్ని బీజములుంటాయో ఆ వృక్షములన్నియు యిందులో కనిపించకుండా ఉన్నాయి. అనంతములైన వృక్షములను పుట్టించేశక్తి ఇందులో నున్నది. ఆ ఆధారము కనిపించదు. గృహమునకు పునాది ఆధారము. అది కనిపించదు. ఇప్పుడు నేను మాట్లాడు చున్నానంటే నా స్థూల రూపమును మీరు చూచుచున్నారు. ఏ శబ్దమున, కేయర్థమో దానిని తెలుసుకొని గమనించి మాట్లాడే తెలివియొక్క స్వరూపమును మీరు చూచుట లేదు. ఆ తెలివి, దానికి ఆధారమైన చైతన్యాత్మ స్వరూపము నా యథార్థమైన తత్త్వము. అది కనిపించేది కాదు. ఈ రూపమున కనిపించే దానికి కనిపించనిది ఆధారము. ఈ కంటికి కనిపించే నామ రూపము కాకయుండి మరల యీ నామరూపముల కాధార రూప ములో తానేయై యుండునది భగవత్స్వరూపము. సమస్త ప్రపంచా నికి ఆధారము ఆ పరమాత్మ స్వరూపమే.

సర్పము కనిపించుచున్నది. దానికాధారమేది? త్రాడు. త్రాడు లేకుంటే సర్పము కనిపించదు. అసలు ఉండేదే అది. అస్తి భాతి, ప్రీతి స్వరూపమున ఆత్మ సర్వమునకు ఆధారము. దీనిని గురించి కూడ వివరమవసరమై యున్నది.

అస్తి అనగా "ఉన్నది" అని అర్థము. ప్రపంచములో అన్ని వస్తువులు దేనినాధారము చేసుకొని ఉన్నట్లు తోచుచున్నవి? చూడుడు పుస్తకము వున్నది. కలము ఉన్నది. త్రాడున్నది. అనే వాక్యాలలో రెండు అంశములున్నవి. వీటిలో ఉన్నది అనే అంశము సామాన్యాంశము. ఎందుకంటే అన్ని వాక్యములలోను ఉన్నది అనేది లేక పోతే అర్థమునకు పూర్ణత్వమే ఉండదు. కావున వాక్యములో సర్వవస్తువుల ఉనికికీ 'ఉన్నది' అనే అంశము ఆధారము. ఇంక రెండవ అంశము విశేషాంశము. విశేషమని యెందుకు చెప్పబడినది? అంటే అది సామాన్యముగ అన్ని వాక్యాలలోను ఉండేది కాదు. ఒక్కొక్క వాక్యానికి ఒక్కొక్కటిగా విశేషాంశముంటుంది. పుస్తకము ఉన్నది అనే దానిలో పుస్తకము విశేషాంశము. వున్నది సామాన్యాంశము. ఈ విధముగనే గడియారమున్నది అనే దానిలో విశేషాంశము మారినది. సామాన్యాంశము మారదు.

పై వాక్యములలో అస్తి అనే పదము సర్వవస్తువుల ఉనికికి ఆధారభూతమైనది. ఇది భగవత్స్వరూప లక్షణము. దీనిని ఆధారము చేసుకొనియే సమస్త వస్తువులు వున్నవి. ఇంక మరొక లక్షణము. భాతి అంటే ప్రకాశించునది. ఉన్నట్లు ప్రకాశించడం కూడ పరమాత్మలక్షణమే. ఎన్నో అనంతమైన వస్తువులు ఉన్నట్లు కనిపించుచున్నది. ఈ ప్రకాశము ఆ పరమాత్మ స్వరూపము. ఇంక మూడవ లక్షణము ప్రీతి. ప్రపంచములోని అన్ని వస్తువులు వాటి వాటి ఉపయోగమును బట్టి మానవునకు ప్రీతిగ కనిపించుచున్నవి. సింహము

పిల్లలు, పులిపిల్లలు మొదలగునవి కూడ ప్రీతిగా కనిపిస్తాయి. దీనికి కారణమేది ? అన్నింటిలో ఉండేది ఆ పరమాత్మ తత్వమొకటి కావడమే. కావున ఈ విధముగా అస్తి, భాతి, ప్రీతి ఈ మూడును కనిపించేవి కావు. నామము రూపములు కనిపిస్తాయి. ఈ కనిపించే నామ రూపాలను కనిపించని అస్తి, భాతి, ప్రియములు ఆధారములు. నామము రూపము ఆధేయములు ప్రతి వస్తువులోను అయిదంశము లున్నవని శంకారాచార్యులు చెప్పినారు. "అస్తి, భాతి, ప్రియం, రూపం నామ చేదంశపంచకమ్, ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తతోద్వయమ్." అంటే అస్తి, భాతి, ప్రీతి, రూపము, నామము, అనే అయిదంశములు ప్రతి వస్తువులోను వున్నాయి. వాటిలో మొదటి మూడంశములు అనగా అస్తి, భాతి. ప్రీతి అనేవి బ్రహ్మస్వరూపము. రూపము నామము జగద్రూపము. అంటే రూప నామములు రెండూ మాయా స్వరూపము. ఈ విధముగా మాయా స్వరూపమైన రూప నామములు లోపలి బ్రహ్మస్వరూపమును ఆధారము చేసుకొని ఉన్నాయి. వీటికి స్వాతంత్రపుటునికి లేదు. అయితే యీ లేనివే మనకు ఉన్నట్లు కనిపించి మోహములో ముంచేస్తాయి. ఉన్నదైన ఆత్మస్వరూపము యీ చర్మచక్షువులకు కనిపించదు దానిని బుద్ధితో వివేకముతో తెలుసుకోవాలి, గురుసేవ, సజ్జనసేవ, నిరంతర శ్రవణము మొదలగు వాటి ద్వారా దాని జ్ఞానమవుతుంది.

అయితే ఇపుడు నిష్కర్షయేమి ? ఏది వున్నది ? ఏది లేదు ? పరమాత్మే వున్నది. ప్రపంచము లేదు. కనబడేవి నామరూపములు వీటికి స్వాతంత్రపుటునికి లేదు. కనబడనివి అస్తి, భాతి, ప్రీతులు. అవి స్థిరమై సర్వాధారమైన ఉనికి గలిగి వున్నవి. కంటికి కనబడే దానికి కంటికి కనబడని పరమేశ్వర స్వరూపము ఆధారము. ఈ

సమస్త నామ రూపములు ఆ పరమాత్మ స్వరూపము కాదు. కాని ఈ నామరూపములకు అదే ఆధారము. నామరూపములు సత్యములు కావు. ఆత్మ స్వరూపాధారములో కాకయు అయియున్నాయి. ఆత్మ స్వరూపము కూడ నామరూపములలో నేదియూ కాదు. కాని వీటి కాధార రూపములో ఇదంతయు తానైయె యున్నది.

ఈ భాగవతములో "అఖిలము కాకయు నయ్యెనుండు" అనే ఆత్మపదార్థము లభ్యమవుతుందని అర్థము అట్టి "వస్తువెరుగంగదగు భాగవతమునందు" అనేది ప్రతిజ్ఞ. భాగవతము చదివే విధానములో చదివితే పరమాత్మతత్త్వము చక్కగా బోధపడుతుంది. ఈ రూపముగా నిది కల్పవృక్షము వంటిది.

సర్వేజనా సుఖినస్సంతు.

మూడవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## నాలుగవ రోజు ఉపన్యాసము

"అణువో కాక కడున్ మహామహిముడో యచ్ఛిన్నుడో భిన్నుడో
గుణియో నిర్గుణియో యటంచు విబుధుల్ గుంతీ భవత్తత్త్వ మా
ర్గణులై యే విభు పాదపద్మభజనోత్కర్షంబులన్ దత్త్వవీ
క్షణముం జేసెద రట్టి విష్ణుంబరమున్ సర్వాత్ము సేవించెదన్" 2-66

విష్ణు పదసేవాసక్త చిత్తాత్ములారా! పుణ్యాత్ములారా! భగవంతుని అపారమైన అనుగ్రహముచే యీ పవిత్ర కార్యమును మనము నిర్వర్తించుకొనగల్గుచున్నాము. గీతాచార్యుడైన శ్రీకృష్ణ భగవానుని సన్నిధానములో గీతాభవనమునందు మనమీ కార్యమును ఆయన అనుగ్రహ ప్రభావవిశేషమున నడుపుకొనుచున్నాము. కావున ప్రథమమున ఆ సర్వేశ్వరునకు ప్రాంజలులు ఘటించి నాలుగవ రోజు కార్యక్రమమున కుపక్రమించుదాము.

వేదవ్యాసులను గురించియు, పోతనను గురించియు మనము ముచ్చటించుకొన్నాము. ఈ దినము ప్రథమములో శ్రీశుకులవారిని గురించి కూడ కొంత చర్చించుకుందాము.

వేదవ్యాసులవారు భాగవతమును రచించినారు. దీనిని రచించిన పిమ్మట వారు మరొక గ్రంథమును రచించలేదు. అంటే భాగ

వతము వేదవ్యాసుల వారి వయః పరిపాకము, జ్ఞాన పరిపాకము, అను భవపరిపాకము, బుద్ధిపరిపాకము కలిగిన పిమ్మట రచించిన గ్రంథమని సుస్పష్టమగుచున్నది. ఇట్టి స్థితిలో వారీ భాగవతమును రచించినారు.

దీనిని వ్రాయుటలో వారికి కష్టమైనదట. వారు భాగవత గ్రంథ రచనాభావమును పొందు సరికి భాగవతము సెలయేరువలె పరవళ్ళు త్రొక్కుకంటూ ప్రవాహముగ బయలుదేరేదట. ఇంతటి వేగముతో పోయే ఈ ప్రవాహపు భావమును తానే కలము పట్టి వ్రాయుటకు వేదవ్యాసుల వారికి సాధ్యము కాకపోయినది. అపు డాయన బ్రహ్మదేవున్ని ప్రత్యక్షమగునట్లుగా సంకల్పించుకున్నాడు. బ్రహ్మదేవుడు ప్రత్యక్షమైనాడు. అపుడు వ్యాసులవారంటారు. మహాత్మా! నారదులవారు వచ్చి భాగవతమును వ్రాయుమని చెప్పి పోయిరి. దానిని వ్రాయుటకు నేను చెప్పుతూంటే వేగముగా వ్రాయ గల వ్రాతకాడినొకనిని నాకప్పగించవలసినదని కోరినాడు. అపుడు బ్రహ్మ గణపతిని ఆవాహనము చేసినాడు. గణపతి వచ్చినాడు. బ్రహ్మదేవుడు "నాయనా! ఈ వేదవ్యాసుడు చెప్పే భాగవతమును నీవు వ్రాయవలసినదని" ఆజ్ఞాపించినాడు. దానికా గణపతి స్వామీ! నన్ను ఊరికే వ్రాయమనుట కాదు. నాదొక మరతు ఉన్నదన్నాడు, అదేదో చెప్పవలసినదని బ్రహ్మ పలికినాడు.

వినాయకుడు "నేనెంత వేగముతో వ్రాస్తానో అంత వేగముతో వేదవ్యాసులవారు చెప్పాలి. లేకపోతే నేను లేచిపోతా" అన్నాడు. దీనిని విని వేదవ్యాసుడు "మహాత్మా! నాదికూడా ఒక మరతు ఉన్నది "నేను చెప్పిన ప్రతి శబ్దమును, శ్లోకమును అర్థము చేసు కొంటూ వ్రాయాలి. అర్థము కాకపోతే నిలిచి అర్థము చేసుకొని వ్రాయాలి"అని అన్నాడు. ఈ విధముగా వేదవ్యాసులచే చెప్పబడి గణపతి ద్వారా వ్రాయబడి భాగవతము తయారయినది.

ఇట్లు తయారైన భాగవతము నెవరు ప్రచారము చేయాలి? ప్రజలకు వినిపించి వారిని దీని ద్వారా ప్రభావితము చేసి జీవితములను సంస్కరించే వారెవరు? ఇది పెద్ద ప్రశ్నయైనది వేదవ్యాసులవారికి. అపుడాయన ఈశ్వరున్ని ప్రత్యక్షము చేసుకొని "మహాత్మా! నాదొక మనవి, ఏమంటే నేను నారదునిచేత ప్రబోధింపబడి భాగవతాన్ని వ్రాసినాను. మీకు తెలిసియే ఉంటుంది.

దానిని ప్రచారములోనికి తేవాలి. నీవు ధ్యానములో కూర్చున్నప్పుడే ఆనందాన్ని అనుభవిస్తూంటావో అట్టి ఆనందాన్ని శ్రోతలకు కలిగింప చేయుచూ వినిపించుటకై నా గర్భములో నీవు కుమారుడవై పుట్టాలి." అని విన్నవించుతే శంకరుడు ఆలోచించినాడు. కార్యము మహత్తరమైనది. భగవత ప్రచారము జరిగితే మహత్తరమైన లోక కల్యాణము జరుగుతుంది. కాబట్టి దీనికై పూనుకుంటానని సమ్మతిని కనబరచినాడు.

శ్రీ శుకులవారి జననమును గురించి పలు విధములుగా పెద్దలు చెబుతారు. ఇది ఒక పద్ధతి. అపుడు శంకరుడు వ్యాసుని భార్యయైన అరణి గర్భములో పడ్డాడట. పదారు యేండ్లు గడిచినను గర్భములో నుండి క్రింద బడలేదట. అపుడు వ్యాసులవారు గర్భములో నుండి క్రిందబడమని ప్రార్థించినారు. మాయ నాపైన పెత్తనము చేస్తుందేమో నని బయటికి రాజాలకున్నాను" అని గర్భములో నున్న పిండమునుండి శబ్దము వచ్చినది. వెంటనే శ్రీమన్నారాయణుడక్కడికి కరుదెంచి "నాయనా! మాయయొక్క ఆటలు నీ ముందర సాగవు. కావున వెంటనే భూమి మీదకు రావలసినదంటూనే" శ్రీశుకులవారి జననమైనది. కాని తక్షణమే శ్రీశుకులు అరణ్యానికి వెళ్ళిపోయినారు. హా శుకా! హా శుకా! అంటూ వేదవ్యాసుడు పరుగెత్తి, పోలేక, ఇంటికి వచ్చినాడు. ఆలోచించినాడు, నేనింతగా కష్టపడి పుత్రుని

కంటే అరణ్యానికి పోయె! తగిన ఉపాయమాలోచించి తన శిష్యుల నిద్దరిని పిలిచినాడు. వారితో భాగవత శ్లోకములను శుకుడు వినేటట్లు చెప్పవలసినదని శ్రీశుకులవారు ఉన్న చోటికి పంపుతాడు. వారల్లే శుకుని వద్దకు పోయి గట్టిగా ఉచ్ఛరించుచూ యీ శ్లోకాన్ని మొదట చెబుతారు.

"బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం
బిభ్రద్వాసః కనకకపిశం వైజయంతీచ మాలామ్।
రంధ్రాన్వేణో రధరసుధయా పూరయన్ గోపవృందైః
బృందారణ్యం స్వపదరమణం ప్రావిశత్ గీతకీర్తిః॥

అని యీశ్లోకమును చెబుతారు. ఇది శ్రీకృష్ణుని సగుణ సాకార సౌందర్య రూపాన్ని వర్ణించినది. నెమలి పింఛమును ధరించి కళాత్మక మైన శరీరముతో చెవులకు కర్ణికారములు ధరించి, కనకాంబరము తోను, వైజయంతిమాలతోనూ శోభాయమానుడై మురళిని వాయించుచూ ఆ గానముచేత దిక్కులను మోహింప జేయుచూ బృందావనము లోనికి శ్రీకృష్ణుడు పోయెనని అర్థము.

ఇంతటి మనోహరమైన శబ్ద సముదాయముతో భగవంతుని సాకార రూపవర్ణన విని శ్రీశుకులవారు ఆకర్షితులై శ్లోకము చెప్పు చున్నవారి వంక చూచాడు. శబ్దములో అద్భుతమైన ఆకర్షణ వున్నది. ప్రపంచములో శబ్ద స్వరూపము, దాని శక్తి అద్భుతము. దీనిని కళాత్మకము చేసుకుంటే దేవతలు ముగ్ధులౌతారు. మామూలు వ్యావహారిక జీవితములో కూడ వినయము, స్పష్టత, మాటల సొంపు కలిగి మాట్లాడువాడు తన కార్యాన్ని సులువుగా నెరవేర్చుకో గలుగు తారు. ఆకళ తెలియనివారు మాటలలో కాఠిన్యాన్ని కలిగి కార్యము విఘ్నము చేసుకుంటారు.

శ్రీ శుకులవారు ఆకర్షితులై వ్యాసులవారి శిష్యులవైపు చూచారు. దీనిని గమనించి వారింకొక శ్లోకమును గానము చేసినారు.

"అహో బకీయం స్తనకాలకూటం జిఘాంసయా పాయ
యదప్యసాధ్వీ
లేభేగతింధాత్ర్యుచితాం తతోఽన్యం కం వా దయాళుం
శరణం వ్రజామి"

అంటే బకుని చెల్లెలు పూతన. అది తన స్తనములయందు కాలకూట విషమును తగిలించుకొని కృష్ణున్ని చంపుటకు వచ్చింది. అయితే దాని పాలనేకాదు. ప్రాణాలనుకూడా త్రాగి తల్లికి సమానమైన సద్గతిని కలిగించిన శ్రీకృష్ణుడెంతటి దయామయుడు! ఇంతటి దయామయుడైన పరమాత్మున్ని వదలి మరెవనిని శరణుబొందాలి? అని అర్థము.

ఈ శ్లోకము వింటూనే శ్రీ శుకుడు అట్టే లేచి వారి వద్దకు వెళ్ళి, ఎక్కడివీ శ్లోకాలు? ఇవి శ్లోకాలు కాదు రత్నాలు. ఇవి ఎక్కడివి? అని అతి కుతూహలముతో వారిని అడుగుతాడు. అపుడు వ్యాసుని శిష్యులు మీ తండ్రిగారు భాగవతమనే ఒక మహత్తరమైన గ్రంథాన్ని వ్రాసినారు. ఆ ఖజానాలో ఇట్టి రత్నాలు పద్దెనిమిది వేలున్నాయి. ఈ మాట విని తక్షణం తండ్రి వద్దకు వచ్చి భాగవతము చెప్పించుకుంటాడు శ్రీ శుకులవారు. ఆ విధముగా చెప్పించుకొని పరమానందభరితుడై దానిని ప్రచారము చేయుటకై పరీక్షిత్తు వద్దకు వస్తాడు.

పరీక్షిత్తు కూడా ఆ సమయమున భాగవతం వినుటకు సిద్ధమై, అధికారియైయున్నాడు. ప్రపంచములో ప్రతి వస్తువును పొందటానికి అధికారి చాలా అవసరము. పరీక్షిత్తు అధికారియై ఉన్నాడు కాబట్టే శ్రీశుకులవారి గమనము సార్థకమైనది. ఆ పరీక్షిత్తు ఒకవేళ రాజ్యభోగాలలో ఉండినపుడు శ్రీశుకులవారు వెళ్ళియుండిన "స్వామీ!

ఈ దినం వినుటకు వీలులేదు, రేపు రాండి'' అని చెప్పియుండెడి వాడేమో! కావున భాగవతము వినడానికి కూడ అధికారి కావాలి.

ప్రజలు తమ శరీరము, గుడ్డలు, భోగవస్తువులను గురించి యెంతో శ్రద్ధచూపుతారు. మరణించిన తరువాత కూడ వెంట వచ్చు మనశ్శుద్ధిని గురించి జాగ్రత్త వహించరు. మరణించిన పిదపకూడ వెంట వచ్చేది సంస్కారము. సంస్కారములో క కారము తీసివేసిన సంసారము మిగులుతుంది. ఈ సంసారము మరణించేవరకే. మరణించిన తరువాత వెంట వచ్చేది సంస్కారమే. కావున సంసారమునకంటె సంస్కారమునకధిక ప్రాధాన్యము నివ్వాలి. కాని నేటి మానవునికి సంసారము ముందర సంస్కారము లెక్కలేనిదిగా కనిపించుచున్నది. భాగవతాన్ని వినాలని కోరుచున్న భాగ్యవంతులారా! ఈ సత్యాన్ని గమనించండి. ఆచార విచారములు మనశ్శుద్ధి కారకములు. మనశ్శుద్ధి లేక భక్తి కుదరదు. అట్టి మనశ్శుద్ధి పరిణామమును భాగవతము కలిగిస్తుంది. కనుకనే భాగవతము శ్రవణము చేసినను, చదివినను మనిషి బాగాతాడు.

మానవ జీవితములో సంయమము, వివేకము చాలా ప్రధానము, దానిద్వారా వాని స్వరూపమును గురించి తెలుసుకొనే అవకాశం లభిస్తుంది. మనుష్యుని స్వభావాన్ని గురించి శివానందస్వాములవారు వ్రాస్తారు. Man's essential nature is devine, the awareness of which he has lost. because of his animal profesities and the viel of ignorance. Mere intelligence without morality and spirituality is not helpful. It is dangerous. It will lead to disaster. అంటే మనుష్యుని స్వభావము దివ్యమైనది. ఆ హెచ్చరిక నతడు వెనుకటి పశు స్వభావము వలనను, మాయా ప్రభావమువలనను పోగొట్టుకొన్నాడు. సదాచారము, ఆధ్యాత్మికత్వము లేనట్టి చమత్కారబుద్ధి వానికి సహాయకారి కాజాలదు. మీదు మిక్కిలి అది వాని కనర్థకారి కూడ.

కావున మానవుని స్వభావము దివ్యమైనది కనుక దానిని మానవున కనుభూతము నగునట్లు చేసేదే భాగవత శ్రవణము. దాని కధికారి కావాలి. పరీక్షిత్తు మహారాజు సంపూర్ణ అధికారియై యున్నాడు. ఆ తరుణములో శ్రీ శుకులవారు వచ్చి భాగవతము చెప్పుట కుపక్రమిస్తున్నారు. ఇంతలో దేవతలు వచ్చి శ్రీ శుకులవారితో "స్వామీ! మా దేవలోకములోని అమృతమును పరీక్షిత్తు కివ్వండి. ఈ భాగవతామృతాన్ని మాకు ప్రసాదించండి" అని కోరినారు. అప్పుడు శ్రీ శుకులవారు "పరీక్షిన్మహారాజా! దేవతలు చెప్పిన మాట వింటివి కదా? కావున నీకు దేవలోకములోని అమృతము కావలెనా? లేక భాగవతామృతము కావలెనా? నీవే నిర్ణయించుకొని చెప్ప వలసినదని" తెలవిచ్చిరి. దానికి పరీక్షిన్మహారాజన్నాడట.

స్వామీ! దేవతలిచ్చే అమృతమును త్రాగితే భోగములు కలుగుతాయి. సుఖము లభ్యమవుతుంది. కాని పాపము పోదు. పుణ్యము తరిగి పోతుంది. ఈ విధమైన క్షుద్రమైన అమృతము నాకు వద్దు స్వామీ! భాగవతా మృతముతో పాపమూ పోతుంది, పాపము చేసే బుద్ధికూడ పోతూంది. అంతేకాదు. కైవల్యము లభ్యమవుతుంది. ఎక్కడ భాగవతామృతం? ఎక్కడ స్వర్గలోకామృతం? దీనిని మీరు నాకు ప్రసాదించుటకు వస్తే ఇదుగో! సనత్కుమారాదులు బ్రహ్మ లోకము నుండి దిగివచ్చినారు కదా? అంటే ఈ భాగవతామృతము బ్రహ్మలోకానందము కంటే మహత్తరమైనదని ఋజువవుతూంది కదా స్వామీ! కావున నాకు భాగవతామృతాన్నే అనుగ్రహించండి" అని ఖచ్చితముగ చెప్పినాడు. ఇదే పరీక్షిత్తులోని సంపూర్ణాధి కారిత్వానికి నిదర్శనము.

శ్రీ శుకులవారు వచ్చి భాగవతమును ప్రారంభము చేయు చున్నారు. వారెచ్చటినుండి ప్రారంభము చేయుదురో దానికంటే ముందటి విషయము సందర్భమును తెలుసుకొనవలసి యున్నది.

భారత యుద్ధములో కౌరవులందరు నాశనమైనారు. కాని దుర్యోధనుడొక మడుగులో దాగి యున్నాడు. ఆ సంగతి తెలిసి భీముడు పోయి మడుగు బైట నిలుచుకొని పరాక్రమమైన మాటలతో దుర్యోధనున్ని యుద్ధమునకాహ్వానించినాడు. రాకపోతే వాన్ని నిందా లాపము లాడుతాడు. ఆ అవమానమును భరింపజాలక దుర్యోధనుడు మడుగు వెలుపలికి వస్తాడు. ఇద్దరు గదా యుద్ధమునకు పూనుకుంటారు. ఆ గదా యుద్ధములో దుర్యోధనుడు నిహతుడౌతాడు. భూమిపై తొడలు విరిగి పడుతాడు. చనిపోడు. ఆ నాటి సాయంత్రం అశ్వత్థామ దుర్యోధనున్ని చూచుటకు పోతాడు. దుర్యోధనుడు ధూళీ, ధూసరి తాంగుడై పడియుంటాడు. అపు డశ్వత్థామకు చాలాఖేదము కలుగు తుంది. హంస తూలికా తల్పములపైన దాసదాసీజనములు పరిచర్య చేస్తుంటే భోగముతో తులదూగే రాజరాజు ఇప్పుడు నేలపై పొర్లుతూ ధూళితో కప్పబడిన శరీరుడై దీనావస్థలో పడియున్నాడు. ఆ దృశ్యము చూడజాలక బాష్పనయనుడై దుర్యోధనునితో ప్రేమ పూర్వకముగ అంటాడు. "రాజరాజా! ఏదైనా కోరిక ఉంటే కోరుకో నేను తీరుస్తా"నంటాడు. ఆ మాట విని దుర్యోధనుడు "అశ్వత్థామా! నా కోరిక తీర్చేటట్లైతే పాండవుల తలలు కోసుకొని తెచ్చి నా ముందర ఉంచవలసినది." అంటాడు. ఇది భయంకరమైన కోరిక. దానికి అశ్వత్థామ "అట్లే చేస్తానంటాడు". ఆ రాత్రి పాండవులు పండుకొనే చోట ద్రౌపదీ కుమారులను ఉపపాండవులను పండుకునే ట్లు నియమిస్తాడు కృష్ణుడు. అశ్వత్థామ వచ్చి ఉపపాండవులను తలలు కోసుకొనిపోయి దుర్యోధనుని ఎదుట పెట్టితే ఆ తలల నెంచి వాడు దేహత్యాగము చేస్తాడు.

ఈ విధమైన దుష్ట సంఘటన తెల్లవారుతూనే ద్రౌపదికి పాండవులకు తెలుస్తుంది. ద్రౌపది దుఃఖానికి మేరలేదు. అశ్వత్థామ

రాత్రి యీ పని చేసినాడు. తన అయిదుగురు కుమారులను సంహరించినాడనే విషయము కృష్ణుడు చెప్తాడు. కంటికి మింటికి ఏకధాటిగా దుఃఖ పడుతుంది ద్రౌపది. అర్జునుడు వాని శిరచ్ఛేదనము చేస్తానని శపథము చేసి ద్రౌపది వద్దకు వానిని యుద్ధములో కృష్ణుని సహాయముతో ఓడించి రథానికి కట్టుకొని తెస్తాడు.

ద్రౌపది అశ్వత్థామను చూచి వందనము చేస్తుంది. అశ్వత్థామా! నీవు గురుపుత్రుడవే. 'ఆత్మావై పుత్రనామాసి' అన్నట్లు గురువు యొక్క అంశము నీవు. నీవుకూడ మాకు గురువుతో సమానమే.

“పరఁగన్ మా మగవారలందరును మున్ బాణప్రయోగోప సం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి పుత్రాకృతినున్న ద్రోణుడవు నీ చిత్తంబులో లేశమున్
గరుణా సంగములేక శిష్యసుతులన్ ఖండింపగాఁ బాడియే.”1-160

మా భర్తలందరు మీ తండ్రితో బాణవిద్య నేర్చుకున్నారు కదయ్యా! నీకామాత్రము కరుణ లేకపోయెనా? శిష్యుల సుతులను చంపుటపాడియా? అంటూ ఆమె ఏమంటుందో చూడండి.

“అక్కట! పుత్రశోక జనితాకుల భావ విషణ్ణ చిత్తనై
పొక్కుచు నున్న భంగి నినుఁ ఘోర కిరీటి నిబద్ధుఁజేసి నే
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నే
డెక్కడ నిట్టి శోకమున నేక్రియ నేడ్చుచు పొక్కుచున్నదో?
1-163

అయ్యో! నాకు పుత్రశోకము కలిగి దుఃఖపడుచున్నట్లే నిన్ను కిరీటి తెచ్చి బాధించుట తెలిసి మీ తల్లి యెక్కడ నే రూపమున నేడ్చుచున్నదో కదా! అంటుంది.

అయిదుగురు కుమారులను చంపిన దుష్టుడు అశ్వత్థామ. వానిని చూచి మహాక్రోధముతో ఉగ్రరూపిణియై వానిని నిందించక

నాకు పుత్ర వియోగము కలుగుట వలన నెట్టి దుఃఖముతో బాధ పడుతున్నానో! ఇట్టి దుఃఖమే మీ తల్లికి కలిగి ఎంత బాధ పడు తూందో కదా! అందునను ద్రోణాచార్యుడు మరణించినపుడు మీ తల్లి మరణించక నీకొరకు బ్రతికి యున్నదని అంటుంది.

ఈ రూపమున తనవలెనే ఇతరులను చూచే వారే పండితులు. "ఆత్మవత్సర్వ భూతాని యః పశ్యతి సపండితః" ఇదియే కదా ధర్మానికి పరాకాష్ఠ. ఇంతటి వ్యాకులమైన పరిస్థితిలో కూడ ఆమె తనవలెనే ఇతరులను చూస్తున్నదంటే ద్రౌపదియొక్క సంస్కార మెంత గొప్పది! ఆమె భావ భూమికయొక్క ఉదాత్తత నేమని ప్రశంసించాలి.

ఇటువంటివారు కూడ ఉంటారా? అనే ఆశ్చర్యము గొలిపే వారు చరిత్రలో అరుదుగ ఉంటారు. రామాయణములో నొక ప్రసంగమున్నది. అది వ్యాఘ్ర భల్లూక సంవాదమనే పేరుగలది.

శ్రీరామచంద్రుడు రాక్షస సంహారము చేస్తాడు. ఆంజనేయునితో సీతను పిలుచుకొని రావలసినదిగ ఆజ్ఞాపిస్తాడు. హనుమంతుడు శీఘ్రముగ వెళ్ళి అమ్మతో వివరాలన్ని చెప్పి "శ్రీరామచంద్రుడు నిన్ను పిలుచుకొని రమ్మన్నాడమ్మా! పోదాము రా!" అంటూ ఆమె చుట్టూ ఉండిన రాక్షస మూకను చూస్తాడు. అలనాడు అశోక వృక్షము మీద నుండి ఆమెను వారు పెట్టిన బాధలు చూచి ఉంటాడు. కావున సీతమ్మతో "అమ్మా! నా దొక చిన్న ప్రార్థన. ఈ రాక్షసులు నిన్ను ఏ విధముగా బాధించినారో నాకు తెలుసు. ఇంతగా నిన్ను బాధించిన యీ దుర్మార్గులను ఊరికే వదలరాదు. నీవు దయచేసి నాకు అనుజ్ఞ యిస్తే నా తోకకు వారిని కొంచెపు సేపు జత చేస్తా"నంటాడు.

ఈ మాట విని సీతమ్మవారు అంటుంది, నాయనా! ఆంజ నేయా! వీరు నాకేమీ అపకారము చేయలేదు వత్సా! ఆ రావణా సురుని ఆజ్ఞను పాలించినారు. అంతేకాని వీరు నన్ను తాము బుద్ధి పూర్వకముగా బాధించలేదు. అని యీ వ్యాఘ్ర భల్లూక సంవాద మనే కథను చెప్పుతుంది. ఒక పాంథున్ని పులి తరుముకుంటూ వస్తూంటే వాడొక చెట్టు నెక్కుతాడు. చెట్టుమీద నొక ఎలుగుబం టుంటుంది. దానిని చూచి మానవుడు ప్రాణభిక్ష పెట్టుమని వేడు కుంటాడు. ఆ భల్లూకము వానికి అభయహస్త మిస్తుంది. వాడు తన కథ చెప్పి చెట్టుమీద కూర్చుంటాడు. అపుడు పులి ఎలుగుబంటుతో అంటుంది. "ఏమే భల్లూకమా! నీకేమైనా జ్ఞానమున్నదా? వీడు మానవుడు. మన జాతివాడు కాడు. అంతేగాక జన్మతః వాడు మనకు శత్రువు. అట్టివానికి అభయహస్త మిస్తావా? నెట్టివేయి క్రిందికి" అంటుంది.

దానికా ఎలుగుబంటి సమాధానము చెబుతుంది. ఓ పులీ! నాకు మిత్రుడుగానీ శత్రువుగానీ, ఒక పర్యాయము వాని ప్రాణాన్ని కాపాడుతానని మాట యిచ్చినాను. మరల మాటనుండి తిరగను. ఈ మాట విని పులి అక్కడనే చెట్టుక్రింద ఉంటుంది. రాత్రౌతుంది. అపుడు భల్లూకము మానవునితో అంటుంది. "రాత్రైనది మొదట నేను 12 గంటలవరకు పండుకుంటాను. అంతవరకు నీవు మేలుకో. ఆ పిమ్మట నేను మేలుకుంటాను. నీవు పండుకుందువుగానీ." ఈ మాటకు మనుష్యుడు సరేనంటాడు. భల్లూకము నిద్రించసాగినది. ఈ సందర్భములో పులి మానవునితో అంటుంది.

"ఓ మానవుడా! నీ కొరకు నేను వచ్చినాను. నీవు చెట్టుదిగే వరకు నిన్ను వదలను. ఒకవేళ నీవు నా నుండి కలిగే విపత్తును తప్పించుకోవలెనంటే ఒక ఉపాయము చెబుతా. ఆ భల్లూకమును

క్రిందికి నెట్టివేయి నేను వెళ్ళిపోతా''నంటుంది. ఈ మాటలు విని మానవుడు "అట్లైతే నీవు నన్ను వదలి వెళ్ళి పోతావా?" అంటాడట. ఔను! నేను నిన్ను వదలి పోతానన్నది పులి. అపుడా మానవుడు భల్లూకమును క్రిందికి నెట్టుతాడట. అయితే ఆ భల్లూకమునకు గోర్లు, పెద్దగా ఉండుటచేత అది మరల చెట్టుపైకెక్కినది. పాంథుడు నా కింక ప్రాణాలు పోయినాయి అనుకుంటాడు. కాని భల్లూకము గుర్ర్......మనుకుంటూ చెట్టుపై కూర్చున్నది. దీనిని పులి చూచి భల్లూకముతో అంటుంది. "తెలివి లేని ఎలుగుబంటూ, చూచితివా! నేను చెప్పినది యథార్థమాయెనా? ఎవరినైనా నమ్మవచ్చును కాని మానవున్ని నమ్మవచ్చునా? ఇపుడైనా వాన్ని క్రిందికి త్రోసివేయి. వాన్ని తిని నేను పోతా'' నన్నది. దీనికి భల్లూకమేమని సమాధానము చెబుతుందో చూడండి,

"పాపానాం వా శుభానాం వా వధార్హాణామపి క్వచిత్ ।
కార్యం కారుణ్యభావేన నకశ్చిన్నాపరాధ్యతి'' ॥

అంటే వ్యాఘ్రమా! నీవు పలికేది నీ దృష్టికి సరికావచ్చు, పాపుల విషయములో కాని, శుభుల విషయములో కాని వధించుటకు యోగ్యమైన వారిని గురించి కాని ఒక కార్యమును నిర్ణయించేటపుడు కారుణ్యభావముతో ఆలోచించాలి.

కరుణ యెపుడు కూడ నిర్దయతో యెవరిని చంపమనదు, వాడు నాకు నమ్మకద్రోహము చేసి క్రిందికి నెట్టివేసినాడు. దానిని నేను నమూనాగా తీసుకొని వాన్ని చంపడం కరుణా భావము కాదు. ఒక పర్యాయము వానికి నేను అభయమిచ్చినాను. అంతే! ఇంక తిరుగులేదు. నీవు వెళ్ళిపోవలసిందే నన్నది భల్లూకము. దానికా పులి ఎలుగుబంటును నిందించుకుంటూ వెళ్ళిపోయినదట. భల్లూకమా విధముగ ఆ పాంథున్ని రక్షించినది. ఆంజనేయా! కరుణ

గలిగిన మనము ఒకరిని హింసించలేము. ఈ కథతో మనకు యీ విషయము స్పష్టమైనది. కావున వీరిని మనము బాధించరాదని సమాధాన పరచినది.

ప్రపంచములో మనమూహింపజాలని సాత్విక స్వభావము కలవారుంటారు. ఒక పర్యాయము ఏకనాథస్వామి పండరిపురము నందు చంద్రభాగ నదిలో స్నానము చేసి బయటికి వస్తూనే ఆయన మీద ఒకడు ఆయనకు కోపము తెప్పింపవలెనని థూ... అని ఎంగిలి ఊసినాడు. ఆయన మరల వెళ్ళి చంద్రభాగలో స్నానము చేసి వచ్చినాడు. వీడు మరల ఊసినాడు. ఆ మహాత్ముడు ఏమి అనలేదు. మరల వెళ్ళి స్నానముచేసి వచ్చినాడు. ఈ విధముగ 10 మార్లు జరిగినది. ఏకనాథస్వామికి కోపమే రాలేదు. ఉమ్మే వ్యక్తి మనస్సు కరగిపోయింది. అయ్యో! ఈ మహానుభావున్ని గుర్తించక నేనింత పాపము చేస్తినే అనుకుంటూ ఏకనాథ మహారాజు పాదములపై బడి క్షమించే వరకు పాదములను వదలనని కన్నీటితో కాళ్లు కడిగినాడు. అపుడు ఏకనాథ మహారాజు "నాకు నీవలన మేలే జరిగినది నాయనా!" అన్నాడట. "ఏమి మేలు స్వామీ!" అని ఆశ్చర్యముతో ప్రశ్నించినాడు ఆ దోషి. దానికాయన "చూడు! నేను దినానికి ఈ చంద్ర భాగస్నానము ఒకతూరి మాత్రమే చేస్తాంటిని. నేను నీ కారణముగ పదకొండు మార్లు చేస్తిని. అని ధన్యవాద రూపముగ పలికి నాడట". మానవ స్వభావాలు మనము ఊహించలేనంత మంచివిగ ఉంటాయి. అట్టి వారిలో యీ ద్రౌపది చేరుతుంది.

కృష్ణుడింతకు ముందు అర్జునునితో "వీడు మహాపాపి. వీనిని వదలవద్దు. శిరచ్ఛేదనము చెయ్యవలసినదని ఆజ్ఞాపిస్తాడు.

"నైనం పార్థార్హసి త్రాతుం బ్రహ్మబంధుమిమంజహి।
యోఽసావనాగసః సుప్తాన్ అవధీన్నిశి బాలకాన్ ॥"

అంటే పార్థా! బ్రహ్మబంధువైన యీ అశ్వత్థామను రక్షించవద్దు. నిష్పాపులు, నిద్రించుచున్న బాలురను చంపినాడు. ఆతతాయి. ఆతతాయి అంటే —

"మత్తం ప్రమత్తం ఉన్మత్తం సుప్తం బాలం స్త్రియం జడమ్ ।
ప్రపన్నం విరథం భీతం నరిపుం హంతి ధర్మవిత్ ॥"

మత్తుడు, ప్రమత్తుడు, ఉన్మత్తుడు, నిద్రించే బాలుడు, ప్రసన్నుడు, విరథుడు, భీతుడు అయిన వారిని మోసపుచ్చి చంపేవాడు ఆతతాయి అని పెద్దలు చెప్పినారు.

కృష్ణుడీవిధముగా అర్జునునితో అశ్వత్థామను సంహారము చేయమంటాడు. కాని ద్రౌపది తన కుమారులను చంపినవాన్ని ఎదుటకు తెస్తే ఏ విధముగా వ్యవహరిస్తుందోనని అక్కడివారందరు నిరీక్షిస్తుంటే — అందరిని ఆమె ఆశ్చర్య విస్మయ సముద్రంలో ముంచేసింది.

"ముచ్యతాం ముచ్యతామేష బ్రాహ్మణోనితరాం గురుః"

అంటుంది. అంటే వదలండి, వదలండి. ఈ బ్రాహ్మణుడు గురువు. చంపవద్దండి అని గట్టిగా నివారించింది.

ద్రౌపది పలికే యీ పలుకులను విని ధర్మరాజుకు, అక్కడ ఉన్న విప్రులకు అద్భుతమైన ఆనందమైనది. ధర్మరాజంటాడు. "ద్రౌపదీ! ఏమి నీ మాటలు; ఎటువంటివి పలుకులు.

"ధర్మ్యం న్యాయ్యం సకరుణం నిర్వ్యలీకం సమం మహత్ ।
రాజాధర్మసుతో రాజ్ఞ్యాః ప్రత్యనం దద్వచో ద్విజాః॥"

ఆమె పలుకులలో ఇన్ని లక్షణాలున్నాయి. ధర్మ్యం, న్యాయ్యం కరుణ, నిర్దోషిత్వము, సమత్వము, మహత్వము ఈ విధమైన మహోత్తమమైన పలుకులివి. ధర్మరాజు, ద్విజులు ఆమెను ప్రశంసిస్తుంటే భీమునకిది గిట్టలేదు. అయన ముందుకు వచ్చి అంటాడు.

"కొడుకుల బట్టి చంపెనని కోపము నొందదు గాలఘాతకున్
విడువు మటంచు చెప్పెడిని వెర్రిది ద్రౌపది వీడు విప్రుడే!
విడువగ నేల చంపుడీటు వీనిని మీరలు చంప లేని నా
పిడికెటు పోటునన్ శిరము భిన్నము చేసెద చూడుడందరున్"
1-168

ద్రౌపదికి వెర్రిపట్టింది, అయిదుగురు కొడుకులను చంపితే వాన్ని వదలమంటుంది. వీన్ని మీరు చంపండి. ఒక వేళ మీరు చంపక పోతే నేను వాని తలను పిడికిటి పోటుతో ముక్కలు,ముక్కలు చేస్తాను. మీరంతా చూస్తూండండని ఉగ్రమును బూనినాడు. అయితే కృష్ణ పరమాత్మ అడ్డము వచ్చినాడు. భీమా! నీచేత వీనికి చావు లేదు తొలగుమన్నాడు. కృష్ణుడి మాటంటే భీమునికి మంత్రము. తొలగి నాడు. అపుడర్జునున్ని కృష్ణుడీ విధముగా ఆజ్ఞాపించుచున్నాడు.

"బ్రహ్మ బంధుర్నహంతవ్యః ఆతతాయీ వధార్హణః।
మయైవో భయమామ్నాతం పరిపాహ్యాను శాసనమ్॥"

వీడు బ్రహ్మ బంధువు. అంటే బ్రాహ్మణుడు. కావున చంప రాదు. ఆతతాయి కావున వధార్హుడు. అంటే చంపదగినవాడు. ఈ రెండు ఆజ్ఞలను నేను నీకు చేయమని చెప్పుచున్నాను. నా శాస నాన్ని పాలించుము అర్జునా అంటాడు.

ఈ మాటలు సందేహాన్ని కలిగించేవి, చంపవలెనా? వదల వలెనా? ఆతతాయి కాబట్టి చంపవలె. బ్రాహ్మణుడు కాబట్టి వదల వలె. ఈ సందేహమును కృష్ణుని వలననే తీర్చుకొని అర్జునుడు.

"విశ్వస్తుత్యుడు శక్రసూనుడు మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామ శిరోజముల్ దరిగి చూడాంతర్మహారత్నమున్
శశ్వత్కీర్తి వెలుంగ బుచ్చుకొని పాశవ్రాత బంధంబులన్
విశ్వాసంబున నూడ్చి ద్రొబ్బె శిబిరోర్వీ భాగమున్ బాసిపోన్"
1-171

అర్జునుడు కత్తి తీసుకొని అశ్వత్థామ వెంట్రుకలు తరిగి వాని తలలో నుండిన మహారత్నమును తీసుకొని వాని తలను పట్టి నూకి వేసినాడు. దానితో వాడు శిబిర భాగమును దాటి పోయినాడు.

అందరు ఏడుస్తుంటే శ్రీకృష్ణుడు వారినందరిని గంగవద్దకు తీసుకొనిపోయి ఓదార్చినాడు. క్రియాకర్మలన్ని చేయించి ఇంటికి వచ్చినాడో లేదో ఇంతలోనే ఉత్తర రోదిస్తూ వచ్చింది. ఆమె గర్భములోనికి అశ్వత్థామ అపాండవులగునట్లు అస్త్ర ప్రయోగము చేసినాడు, అది ఆమె గర్భాన్ని కలచివేయు చున్నది. అపుడు ఆమెకు కలిగిన దుఃఖములో తన ప్రాణము పోతుందని ఆమెకు బాధ లేదు. కాని పాండవవంశమున కాధార భూతమైన ఆ గర్భము పోతుందని బాధ.

"పాహి పాహి మహాయోగిన్ దేవదేవ జగత్పతే।
నాన్యత్త్వ దభయం పశ్యే యత్ర మృత్యుః పరస్పరమ్"॥

రక్షించు, రక్షించు, జగత్పతే! దేవదేవ! నీవుతప్ప నన్ను రక్షించేవారు లేరు ప్రభూ! ఇచ్చట పరస్పరం ఇద్దరిని మృత్యువు బాధించుచున్నది. స్వామీ!

"దుర్భర బాణానలమున గర్భములోనున్న శిశువు ఘన సంతాప్తా
విర్భావము బొందెడి నర్భకు కృప కావుమయ్యా నిఖిలస్తుత్యా."

అని ఈ విధముగా రోదిస్తుంటే కృష్ణుడు తక్షణం అశ్వత్థామ చేష్టితమును తెలుసుకొని పాండవులవైపు అయిదు బాణాలు వచ్చు చున్న వాటిని తన చక్రము చేత ఖండించి వెంటనే అతి సూక్ష్మమైన రూపమును ధరించి ఉత్తర గర్భములోనికి ప్రవేశిస్తాడు. తన చక్రము చేత అశ్వత్థామ వేసిన బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని నాశనము చేసి పిండాన్ని కాపాడుతాడు. ఆ విధముగా పిల్లవానిని బ్రతికిస్తాడు. ఆ పిల్లవానికి పరీక్షిత్తు అని పేరు పెట్టారు. పరీక్షిత్తు అంటే "పరితః

రక్షితః ఇతి పరీక్షితః'' అని పది దిక్కులనుండి భగవంతునిచే రక్షింపబడినాడు కావున పరీక్షిత్తు అను సార్థక నామమును పొందినాడు. ఇది భక్త పరాధీనతలో భగవంతునితో పొందే మహత్తర ఫలము.

ఈ విధముగ పాండవులకు కలిగిన మహావిపత్తును తొలగించి కృష్ణుడు కొన్ని దినాలుండి ద్వారకకు పోవలెనని ప్రయత్నం చేస్తాడు. అపుడు అందరితో సెలవు తీసుకొంటూ కుంతీదేవి దగ్గరకు వస్తాడు. ఆమెకు శ్రీకృష్ణున్ని చూస్తూనే ఒడలు పరవశిస్తాయి. భక్తితో భగవంతుణ్ణి స్తోత్రము చేస్తుంది. భాగవతములో కుంతీ స్తోత్రము, భీష్మ స్తోత్రము ప్రసిద్ధము. ఆమె యెట్లు స్తోత్రము చేస్తుందో చూడుడు:

''నమస్తే పురుషం త్వాద్యమీశ్వరం ప్రకృతేః పరమ్।
అలక్ష్యం సర్వభూతానాం అంతర్బహి రవస్థితమ్॥''

''కృష్ణాయ వాసుదేవాయ దేవకీనందనాయ చ।
నందగోప కుమారాయ గోవిందాయ నమో నమః॥''

''నమః పంకజనాభాయ నమః పంకజమాలినే।
నమః పంకజ నేత్రాయ నమస్తే పంకజాంఘ్రయే॥''

కృష్ణా! ఆద్యుడవు, ఈశ్వరుడవు, ప్రకృతికి పరుడైనవాడవునైన పురుషుడవు. సర్వభూతములలో లోపల వెలుపల వ్యాపించి ఉండికూడ నీవు అలక్ష్యుడవు. అంటే దర్శించుటకు సాధ్యము కానివానివి.

కృష్ణుడు, వాసుదేవుడు, దేవకీనందనుడు, నందగోపకుమారుడైనట్టి గోవిందునకు నమస్కారము.

పంకజనాభుడు, పంకజమాలి, పంకజనేత్రుడు, అయినట్టి భగవంతుని పాదపద్మములకు నమస్కారము.

ఆమె యింకను స్తోత్రము చేస్తుంది.

"తనయుల తోడనే దహ్యమానంబగు జతుగృహంబున బడిచావకుండ
కురురాజు పెట్టించు ఘోరవిషంబున మారుతపుత్రుండు మడియకుండ
ధార్తరాష్ట్రులు సముద్ధతి చీరలొలువంగ ద్రౌపది మానంబు తలగకుండ
గాంగేయకుంభజ కర్ణాది ఘనులచే నా బిడ్డలాజిలోన నలగకుండ
విరటు పుత్రిక కడుపులో వెలయు చూలు
ద్రోణనందను శరవహ్ని ద్రుంగకుండ 1-188
మరియు రక్షించితివి పెక్కు మార్గములను
నిన్ను నేమని వర్ణింతు నీరజాక్ష"

ఈ పద్యానికి అర్థము చాల సరళము. స్వామీ! నీవు ఎన్ని విధాలనో రక్షించితివి. నీవు రక్షించినట్టి మార్గములు అనేకములు. కాబట్టి నేనేమని వర్ణింతు తండ్రీ!

దేవదేవ! నాకు పాండవుల యందును, యాదవుల యందును, మోహము కలుగనీయకు కృష్ణా!

మానవున్ని అన్ని సంకటాలనుండి భగవంతుడే కాపాడాలి. భగవంతుడే సర్వశక్తి సమన్వితుడు. కావున ఆయననే నమ్ముకోవాలి. ఆయనను నమ్ముకొన్నవాని కెప్పటికిని ఉత్తమగతియే లభ్యమవుతుంది.

ఈ విషయముపై భగవంతునిపై నమ్మకము లేక మానవుడు లోకములోని వ్యక్తులను వస్తువులను నమ్మి నిరాశాపరుడవుతూంటాడు. మనుష్యుడు రోగము వచ్చి డాక్టరు వద్దకు పోతాడు. డాక్టరు బాగు చేసినాడంటాడు. సత్యమా? అట్లు బాగుచేసే శక్తి డాక్టరు వద్ద ఉంటే ఆయన వద్దకు పోయిన రోగులందరు బాగుపడాలి. ఆ విధముగ జరుగుచున్నదా?

ప్రపంచములోని వ్యక్తులపై, వస్తువులపై, విశ్వాసము కల వారు నూటికి నూరుపాళ్ళు, ప్రయోజన సిద్ధిని పొందజాలరు. ఎందు కంటె వ్యక్తులు, వస్తువులకు స్వతంత్రపు సత్తాలేదు. వాటినుండి మనకు కార్యసిద్ధి కలిగిందంటె అది భగవదనుగ్రహమే. డాక్టరు వద్దకు పోయిన రోగి బాగుపడవచ్చు, బాగుపడకపోవచ్చు. ఒక గర్భిణీ స్త్రీ మగపిల్లవాడు పుట్తాడా? ఆడపిల్ల పుడుతుందా? అని ఒక దైవజ్ఞున్ని ప్రశ్నించింది. దానికాతడు తొంబై తొమ్మిది భాగములు మగపిల్ల వాడు పుట్టవచ్చు, లేకుంటే ఆడపిల్ల తప్పదు అన్నాడట. ఈ మాట వాడు చెప్పవలయునా? ప్రపంచాన్ని ఆశ్రయించుకున్నవారికి ప్రతి కార్యమునందు నిరాశయే. అథవా సకృత్తుగా ఏదో ఒకటి జరిగితే అది by chance బై చాన్సే. కాని పరమాత్మ నాశ్రయించుకున్నవారి విషయమట్టిదికాదు. అక్కడ అది cash business నగదు వ్యాపారం వంటిది.

వస్తువులు కొనేవారు రెండు రకాలు. ఒక రకము అప్పు తెచ్చు కొనువారు. మరియొక రకము నగదు యిచ్చి తెచ్చుకొనేవారు. నగదు యిచ్చి తెచ్చుకునేవారు నాలుగు అంగళ్ళు తిరిగి తమకెక్కడ వస్తువు మంచిది చిక్కుతుందో అగ్గువకు చిక్కుతుందో చూచుకొని కొంటారు. అప్పువాని విషయమట్లు కాదు. వీనికి మంచివస్తువు చిక్కదు, అగ్గువకు చిక్కదు. ఒక్కొక్కరు ధరకూడ అడుగకుండా తెచ్చుకుంటారు. వస్తువు బాగలేదన్ననూ, ధర అధికమన్ననూ దుకాణాదారు దప్పివ్వడని ఇచ్చిన దానిని తెచ్చుకుంటాడు. ఇదుగో ప్రపంచముపైన ఆధారపడిన వారు అప్పు బేరము చేసేవారు. పర మాత్మను నమ్ముకొన్నవారు నగదుబేరము చేసేవారని ఒక మహాత్ము డన్నాడు. కావున భగవంతున్ని నమ్ముకున్నవానికి, ప్రపంచమునే నమ్ముకున్నవానికి గల భేదమిట్టిది. చూడండి.

కుంతీదేవి భగవంతుణ్ని నమ్ముకున్నది. కావున ఆమెకు సిద్ధి అక్కడికక్కడనే ఉన్నది. ఆమె పరవశమైన చిత్తముతో భగవంతునితో అంటూన్నది స్వామీ!

"కే వయం రూప నామాభ్యాం యదుభిః సహ పాండవైః।
భవతో దర్శనం యర్హి హృషీకానామివ వేశితుః॥"

మహాత్మా! యదువులతో కూడుకున్న ఈ పాండవులకు మీరు లేకుంటే రూపనామము లెక్కడివి? మిమ్ములను దర్శించుట వలన మాకు ఈశ్వరునిచేత ఇంద్రియములకు ప్రేరణ కలిగినట్లు శక్తి సమకూడినది, హృషీకములంటే ఇంద్రియములు. హృషీకేశుడు అంటే ఇంద్రియములకు ప్రభువు. ఆయన వలననే ఇంద్రియములు, శక్తిని బొంది వ్యవహరిస్తూన్నాయి. అటులనే మా శక్తికి, మా ప్రసిద్ధికి అంతా నీవే ప్రాణాధారము తండ్రీ.

నీరులేక నది, ప్రాణము లేక శరీరము. నొసట కుంకుమ లేక ముత్తైదువ ఎట్లు శోభించలేదో అటులనే నీవు లేక మాకు శోభ లేదు. ఆపద్బాంధవుడవు. అని స్తోత్రము చేస్తూంటే కృష్ణుడు అత్తమ్మా! కష్టాలన్నియు గడచినాయి. విజయము మీకు లభించింది. ఇంక ఏమి కావలెనో కోరుకో యిస్తానన్నాడు. అపుడు కుంతీదేవి అడిగిందట.

"విపదస్సంతునశ్శశ్వత్ తత్ర తత్ర జగద్గురో।
భవతోదర్శనం యత్ స్యాత్ అపునర్భవదర్శనమ్॥"

కృష్ణా! నాకు అడుగడుగున కష్టాలే యీ తండ్రీ. ఆ కష్టాలే నీ దర్శనాన్ని కలిగిస్తూన్నాయి. అసాధారణమైనట్టి, నీ దర్శనాన్ని కలిగించే కష్టాలు నేను కోర్తాను అన్నదట.

అపుడు కృష్ణుడన్నాడు. అత్తమ్మా! ఇన్నిదినాలు కష్టాలను భవించితిరే చాలదా! ఇంక కష్టాలు లేవు. సుఖపు దినాలు వచ్చినాయి అన్నాడు.

ఈ విధముగా కుంతీదేవి అడుగుటలోని రహస్యము సర్వులెరిగి నదే. మానవుడు కష్టాలుంటే భగవంతున్ని స్మరిస్తూంటాడు. ఒక భక్తుడంటాడు.

"విపదో నైవ విపదః సంపదో నైవ సంపదః।
విప ద్విస్మరణం విష్ణోః సంప న్నారాయణ స్మృతిః॥"

అంటే విపత్తు నిజమైన విపత్తుకాదు. సంపత్తు నిజమైన సంపత్తుకాదు. భగవంతున్ని విస్మరించడమే విపత్తు. భగవంతున్ని స్మరించడమే సంపత్తు.

ఒక గోపిక అన్నదట "ఎప్పుడూ నాకు తలనొప్పి వస్తే ఎంత బాగుండె"నని. ఇంకొక స్త్రీ వచ్చి "ఏమే! విచిత్రమైన కోరిక కోర్తావు?" అంటే ఆమె సమాధానము చెప్పిందట. "నీకేమి తెలుసునే నేను అనడములోని రహస్యము! నాకు తలనొప్పి వస్తే శ్యామసుందరుడు వచ్చి తలవత్తుతూ కూర్చుంటాడె? ఆ సుఖము ముందర తలనొప్పి ఒక లెక్కా! అందువలన నేనట్టి కోరికను కోరుచున్నాను" అన్నదట.

కష్టాలు వస్తే మనుష్యుడు దీనుడై భగవంతున్ని ప్రార్థిస్తాడు కదా! ఆంజనేయుడు అంటాడు.- కహీ హనుమంత విపతి ప్రభు సోయీ జబుతవసు మిరన భజన నహోయీ.

అంటే స్వామీ! నీ భజన జరుగని కాలమె నిజమైన విపత్తు, ప్రపంచములో నొక సత్యము సర్వులకు తెలుసు. దుఃఖములో తోడ్పడేవాడు భగవంతుడు. సుఖములో కలిసివచ్చువాడు జీవుడు.

కావున కష్టములో తోడ్పడే భగవంతుడు మానవునకు ఒక పెద్ద అండ.

ఈ విధముగ ద్వారకకు పోదామనుకున్న కృష్ణుడు ధర్మరాజు మరికొన్ని దినాలుండమని ప్రార్థిస్తే నిలుస్తాడు. ఇట్లు నిలుచుటలో ఒక విశేషమున్నది. భీష్మునికి కృష్ణుడు మరణకాలములో నీ సముఖమున ఉంటానని వరమిచ్చి ఉంటాడు. ఇప్పుడు భీష్ముడు అంపశయ్యపైన ఉన్నాడు. ఆయనకు దర్శనమిచ్చి పోదామనుకున్నాడేమో! ధర్మరాజు ప్రార్థనపై మరల కొన్ని రోజులుండుటకై ఆగుతాడు.

శ్రీకృష్ణ గోవింద హరే మురారే, గోవింద దామోధర మాధవేతి.

నాలుగవ రోజు ఉపన్యాసము సమాప్తము.

ఓం తత్సత్





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## అయిదవ రోజు ఉపన్యాసము

### ప్రార్థన

"నీ పద్యావళులాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరన్ బనిసేయు హస్తయుగమున్ నీ మూర్తిపై చూపులన్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరమున్ నీ సేవపై చిత్తమున్
నీపై బుద్ధులు మాకునిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా!"

"నీ గృహాంగణ భూమినిటలంబు మోవంగ మోదించి నిత్యంబు
మ్రొక్కఁడేని
నీ మంగళ స్తవ నికర వర్ణంబులు పలుమారు నాలుక బలుకఁడేని
నీ యధీనములుగా నిఖిల కృత్యంబులు ప్రియభావముల సమర్పింప డేని
నీ పదాంబుజముల నిర్మల హృదయుఁడై చింతించి మక్కువఁ జిక్కఁడేని
నిన్ను చెవులార వినడేని నీకు సేవ జేయ రాడేని బ్రహ్మంబు
జెందగలడె
యోగియైన తపోవ్రత యోగియైన-వేదియైన మహాతత్త్వ వేదియైన
7-367.

భాగవత కథా శ్రవణాసక్త చిత్తులారా! పుణ్యాత్ములారా! పరమపవిత్రమైన భాగవత కథం శ్రవణము - ప్రాతః కాలముననే యే కార్యమునందును ప్రవేశించకముందే భాగవతమును గురించి శ్రవణము చేసి అన్య కార్యములయందు ప్రవేశిస్తున్నాము. ఇప్పుడు

పొందునట్టి శ్రవణముచే ఉత్తమ సంస్కారము మనకు సంప్రాప్త మవుతుంది. జీవిత కాలమును గడుపుటలో శ్రేష్ఠమైన సంస్కారము పొందుట అనే ప్రయోజనములో నీ భాగవత శ్రవణ మార్గము అత్యుత్తమమైనట్టిది. ప్రధమమున భాగవత శ్రవణమును చేసి పిమ్మట గృహ కార్యములలో ప్రవేశించుట చాలా ఉత్కృష్టమైన మార్గము. ప్రపంచములో మానవునకు సుఖము, ఆనందము కావాలి. ఇది ప్రతి వాని ఇచ్ఛ. కాని యీ సుఖము, ఆనందము ఎక్కడ చిక్కతాయి? ప్రతి మానవుడు చేసే పనుల వెనుక వాని ఉద్దేశ్యమేమి? నాకు ఆనందము కావాలి. గృహస్థుడు భార్యాబిడ్డలతో కాలము గడపుతూ నానా విధములైన వస్తువులను భోగములను సమకూర్చుకుంటు న్నాడు. ఎందుకు? ఆనందము కొరకు. గృహస్థాశ్రమములో చాలా చిక్కలున్నాయి. దీంట్లో శాంతి లేదని ఒక్కొక్కరు ఆనందము కొరకో లేక శాంతి కొరకై సంన్యాసము తీసుకుంటూన్నారు. దొంగలు కూడ దొంగతనము చేస్తున్నారు. దేని నపేక్షించి? ఆనందము కొరకు. వ్యభిచారులు వ్యభిచారము చేస్తున్నారు. వారినడిగితే దానిలో చాలా సుఖమున్నదంటారు. మత్తు పదార్థములను త్రాగేవారు సారాయి, బ్రాంది వగైరాలు త్రాగుచూ సుఖము నపేక్షిస్తు న్నారు. వేయేల ప్రతివాని ప్రతి క్రియ వెనుక ఉండే ఉద్దేశ్యము ఆనందాపేక్షయే.

ఇట్టి ఆనందము ప్రాపంచిక కార్యములలో చిక్కతుందా? అచ్చట అది లేదు. దొంగ ఒకచోట, పోలీసు మరొక చోట, అందు వలన నిశ్చయమైన విషయమిది. మనుష్యునికి భక్తి, జ్ఞాన మార్గా లలో ఆనందము దొరకుతుంది. భక్తిద్వారా ప్రపంచము సర్వేశ్వర మయమని ఆ సర్వేశ్వరుని సేవయే తాను చేయవలసినదని సర్వ కార్య ములను ఆయన కొరకై, ఆయనను పొందేందుకై చేయుటవలన

కార్యములలోను వర్తనములోను పవిత్రత కలుగుతుంది. ఆ పవిత్రత వలన జీవితము పరిష్కృతమవుతుంది. భగవత్ప్రీతికరముగ జీవితము పరివర్తనమవుతుంది. అపుడా క్రియలు, భావములు జీవున కానంద దాన్ని ప్రసాదిస్తాయి. భగవదనుగ్రహ ప్రభావము గోచరిస్తుంది. తద్వారా అతనికి ఆత్మానంద మార్గము యేర్పడుతుంది. భక్తితో కూడుకున్న కర్మ పవిత్రమై పరమేశ్వరానుభూతికి దారి తీస్తుంది.

జ్ఞానమార్గము ఆనందానుభూతికి సాక్షాత్సాధనము. ఈ ప్రపంచములో సారమైన వస్తువులన్నింటికి ఆధారభూతమైనట్టిది ఆత్మ స్వరూపమే మానవుడు నేనున్నానంటాడు. తాను ఎవరు? దేహము కాదు, ఇంద్రియములు కాదు, మనసు కాదు, బుద్ధి కాదు. వీటన్నిటిని మానవుడు 'నావి' అని వ్యవహరిస్తాడు. 'నావి' అన్నపుడు నేను వాటికంటే వేరు కదా? నేను ఎవరు? ఎట్టివాడు? అంటే జడములైన దేహేంద్రియ మనోబుద్ధులకు ప్రకాశమును, జ్ఞానమును కలిగించు వాడు. వీటిని ప్రేరేపించుచూ వీటికంటే విలక్షణుడై తానున్నాడు. ఆ విలక్షణమైన ఆత్మస్వరూపము జీవితాధారము. అది యే విధమైన రాగ ద్వేషాదులకందనిది. అది సర్వసాక్షి. అది 'నేను' అని తెలుసు కోవడము జ్ఞానము. ఇటువంటి భక్తి జ్ఞానములను భాగవతము ప్రసాదిస్తుంది. ప్రకృతమనుసరామః.

ఆ విధముగ కుంతీ, ధర్మరాజుల ప్రార్థనపై భగవానుడు మరల కొన్ని దినాలు హస్తినాపురములో నిలుస్తాడు. భీష్ముడు అంప శయ్యపై ఉన్నాడు. ఆయనను గురించి కొంత తెలుసుకోవాలి.

భీష్ముని జననము, ఆయన జీవన విధానము అంతా త్యాగ మయము. అష్టవసువుల అంశతో భీష్ముని జననమైనది. శంతనుడు ఆయన తండ్రి. దాసరాజు కన్యయైన యోజనగంధినిచూచి శంతనుడు

ప్రేమిస్తాడు. వివాహము చేసుకునే కోరికను వెడలబుచ్చుతాడు. అప్పుడు యోజనగంధి "తన తండ్రిని ఒప్పించి వివాహము చేసుకో వచ్చు"నని తెలుపుతుంది. అదే ప్రకారము శంతనుడు యోజనగంధి తండ్రియైన దాశరాజును అర్థించి తనకోరికను ప్రకటిస్తాడు. దీని కాయన సంతోషమును పొంది ఒక షరత్తు పెడతాడు. అదేమిటంటే "మీ కుమారుడు దేవవ్రతుడు మహా పరాక్రమశాలి. ఆయన రాజ్యమునకు ఉత్తరాధికారి కాకుండా నా కూతురుకు పుట్టిన సంతానమే రాజ్యాని కధికారుడు కావాలి. ఈ నియమమునకు మీరు సమ్మతిస్తే యోజనగంధిని యిచ్చి వివాహము చేస్తానంటాడు. దీనికి శంతనుడు యేమియు సమాధానము చెప్పజాలక, కుమారునితో తన కోరికను ప్రకటింపజాలక కృశీభూత శరీరుడౌతాడు. కుమారుడు దేవవ్రతుడీ విషయమును తెలుసుకొని తానే స్వయముగ వెళ్ళి దాశరాజును, యోజనగంధిని తన తండ్రి కివ్వవలసినదిగ ప్రార్థిస్తాడు.

ఇది విని దాశరాజు తన కూతురుకు పుట్టినవాడు రాజ్యానికి ఉత్తరాధికారి కావలెనని కోరుతాడు. దేవవ్రతుడు సమ్మతిస్తాడు. అప్పుడతడు దేవవ్రతునితో "నీవు వివాహము చేసుకుంటే సంతానము కలుగుతుంది. వారికి రాజ్యము విషయములో వివాదము యేర్పడవచ్చును. కావున ఈ సమస్యకు పరిష్కారమేమని ప్రశ్నిస్తాడు. ఆ మాటకు దేవవ్రతుడు వెంటనే తన తండ్రి సుఖముకొరకై తాను గృహస్థ జీవనమును సర్వదా త్యాగము చేయుచున్నాననియూ ఆజన్మ బ్రహ్మచారిగా ఉంటాననియూ శపథము చేస్తాడు. ఇది సామాన్యమైన ప్రతిజ్ఞకాదు. భీషణమైన ప్రతిజ్ఞ, కావుననే అప్పటి నుండి భీష్ముడనే పేరు వాడుకలోకి వచ్చినది. ఇట్టిది భీష్ముని జీవన విధానము. తాను వివాహము చేసుకోవలెనని తన గురువు పట్టుబట్టి యుద్ధము జేస్తే గురువే ఓడిపోతాడు. శిష్యుడు తన ప్రతిజ్ఞను నిలుపుకుంటాడు. ఇట్టివాడు భీష్ముడు.

కురు పాండవుల ఘోరయుద్ధము జరిగే సమయమిది. భీష్ముడు యుద్ధము చేస్తూంటే దుర్యోధనుడు భీష్ముని సమీపించి పితామహా! నాపైన అనుగ్రహబుద్ధితో యుద్ధము చేయమంటాడు.'' దానికి భీష్ముడు "దుర్యోధనా! నీకు నాపైన, ద్రోణాచార్యులపైన ఇద్దరిపైన అనుమానమే. నీవు నన్ను సమీపించి ప్రార్థించుచున్నావు. కావున నేనొకమాట చెప్తా. ఈ రోజు రాత్రి పదకొండు గంటలకు నీ భార్యను భానుమతిని పంపుము. నేను ధ్యానములో కూర్చొని ఉంటాను, నన్ను పలకరించకుండా కాళ్ళకు నమస్కారము చేయమనుము. "అఖండ సౌభాగ్యవతీ భవ'' అని ఆశీర్వాదము చేస్తాను. ఆ వరము పొందుతే నీవు చిరంజీవివి కాగల'' వంటాడు. దుర్యోధనునికి మహానందము కలుగుతుంది. సంతోషముతో అచ్చటి నుండి వెళ్ళిపోతాడు.

కాని కృష్ణపరమాత్మ ఆ విధముగ జరుగనిస్తాడా? భక్త పరాధీనుడు కాడా! ఆ దినము భానుమతిని బయటకు రాకుండా చేస్తాడు. అదే సమయానికి ద్రౌపదిని పిలుచుకపోతూ విషయమంతా చెప్పి మొదట మాట్లాడకుండా భీష్ముని పాదాలకు మ్రొక్కిస్తాడు. ద్రౌపది భీష్ముని పాదాలను తాకి నమస్కారము చేస్తూనే "అఖండ సౌభాగ్యవతీ భవ'' అని ఆశీర్వదిస్తాడు. ద్రౌపది "పితామహా! మీ మాట సత్యమగు గాక!'' అంటుంది. స్వరభేదమును గమనించి భీష్ముడు "ఎవరు? ఎవరు?'' అంటాడు, ద్రౌపది తన పేరు చెబుతుంది. "ద్రౌపదీ నీవెట్లు వచ్చితివమ్మా? కృష్ణుడేమైనా నిన్ను పిలుచుకొని వచ్చినాడా?'' అని ప్రశ్నిస్తాడు. ద్రౌపది కృష్ణుడే తనను తీసుకొని వచ్చినాడనియు, ద్వారము వద్ద నిలుచున్నాడని చెబుతుంది. భీష్ముడు ఆతురతతో వెళ్ళి నమస్కరించి కృష్ణా! నేనొకరికి వరమిస్తా ననుకుంటే నీ వింకొకరికి వచ్చేటట్లు చేసినావు. దీనికి ప్రతిగా నేనొక వరము నిన్ను కోరుతాను. ఇవ్వవలసిన దంటాడు.

కృష్ణుడంగీకరిస్తే భీష్ముడు ఏమి వరము కోరుతాడో చాలా ముఖ్యముగ గమనింపదగినది. "కృష్ణా! నా మరణకాలములో నీవు శంఖ చక్రగదాధారివై అనుగ్రహమైన చూపుతో నన్నుచూస్తూ నా యెదుట నిలుచుకోవలయు సుమా!" అని కోరుకుంటాడు. దానికి కృష్ణుడు మారు చెప్పగలడా? తథాస్తు అంటాడు. అపుడు భీష్ముడు ద్రౌపదితో "అమ్మా! ద్రౌపదీ! భానుమతికి వరమిస్తానని నిండు మనస్సుతో అనలేదు. నీకు నిండు మనస్సుతో వరమిస్తున్నానమ్మా" అంటాడు. ఆయనకు దీనివలన మరణకాలమున భగవంతుడు ఎదుట నిలుచుకొనుట అనే మహత్తరమైన లాభము కలిగినది.

మరణ కాలములో కేవలము భగవంతుని స్మరణవస్తేనే చాలు, భగవత్ప్రాప్తి కలుగుతుంది. ఇంక భగవంతుడే ప్రత్యక్షమిస్తే దాని ఫలము వర్ణనాతీతము కదా! ఈ రూపముగ భీష్మునికి కృష్ణుడు వరమిచ్చి ఉంటాడు. ఇపుడు భీష్ముడు అంపశయ్యపై ఉన్నాడు. ఆయనతో ధర్మరాజుకు ఎన్నో ధర్మాలు, నీతులు చెప్పించవలసి యున్నది. అంతే కాక ఆయనకు అంత్యకాలములో దర్శనమివ్వవలసి యున్నదని హస్తినాపురములోనే కృష్ణపరమాత్మ కుంతీ, ధర్మరాజుల ప్రార్థనను పురస్కరించుకొని నిలుస్తాడు. ఈ రూపముగ శ్రీకృష్ణుని ప్రయాణము నిలుపబడుతుంది.

భీష్ముని గురించి ఇంకొక విషయము తెలుపవలసియున్నది. ఒకనాడు దుర్యోధనుడు శ్రీకృష్ణుని వద్దకు ద్వారకకు పోతాడు. ఆ సమయములో కృష్ణుడు నిద్రించుచుండినాడు. మేల్కొల్పుట యెందుకని అటు ఇటు చూచినాడు. తాను కూర్చొనుటకు కృష్ణుని తలవైపు ఒక సింహాసనము వంటి ఆసనముండినది. దానిపై పోయి కూర్చుంటాడు. కొంత సేపటికి అర్జునుడు కూడ పోయినాడు. కృష్ణుడింకను పండుకొనియే యున్నాడు. అర్జునుడు భక్తితో కాళ్ళకు నమస్కరించి కాళ్ళవద్ద కూర్చుంటాడు. వినయము ఎవనివద్ద ఉన్నదో వానికి

అందరూ వశులై పోతారు. వినయములో అద్భుతమైన శక్తియున్నది. ఎవడు అహంకారముతో వ్యవహరిస్తాడో వాడు భంగపడ్తాడు.

ఈ సత్యము మానవుల జీవితములో అడుగడుగున గోచరిస్తుంది. అర్జునుడు కాళ్ళకు సమస్కరించి కాళ్ళ వద్దనే కూర్చుంటాడు. వెంటనే కృష్ణుడు లేచి అర్జునా! అందరు సుఖులేకదా? ఇచ్చటికి వచ్చుటకు కారణమేమి? అని ప్రశ్నిస్తాడు. దానికి అర్జునుడు "బావా! కొలది దినాలలోనే కౌరవ పాండవుల యుద్ధము జరుగబోవుచున్నది కదా? మీ సహాయము నపేక్షించి వచ్చితిని స్వామీ"! అన్నాడు. అర్జునుడీమాట అంటూనే దుర్యోధనుడు "కృష్ణా! నేను కూడ అందులకే వచ్చినాను. నేను వచ్చి చాలా సేపైనది." అన్నాడు.

కృష్ణుడు ఇద్దరిని ప్రేమగా కుశల ప్రశ్నలువేసి మీరిద్దరు నా సహాయమర్థించి వచ్చినారు. కావున ఇద్దరికి సహాయమిచ్చుట నా ధర్మము అందువలన నా సహాయవిధానము వినండి. నేను ఒక్కడును ఒక వైపు యుద్ధము చేయను. చక్రము చేత పట్టను. కేవలము ఊరక కూర్చొనుటయో లేక నా చేతనైనంత సలహాలనిస్తుంటాను. మరి వేనకు వేలు నారాయణాఖ్యులు యోధానయోధులు, ఒక వైపు. వీరంతా యుద్ధములో నిపుణులు, అస్త్రశస్త్రధారులై యుద్ధము చేస్తారు. అతిరథ మహారథులు. ఈ విధముగా రెండు పక్షములుగ చేసినాను. "ముందుగ అర్జునా! నీవు కోరుకో" అంటే దుర్యోధనుడు "కృష్ణా! నేను ముందుగ వచ్చినాను. కావున ముందు కోరుకనే హక్కు నాకున్నది." అన్నాడు.

దానికి కృష్ణుడు "దుర్యోధనా! నేను ముందు అర్జునున్ని చూచినాను. అందునను నీకంటె అర్జునుడు చిన్నవాడు. కావున నుడే కోరుకోని! " అన్నాడు.

ఇది విని దుర్యోధనుడు ఈ కృష్ణుడు నాకు మోసము చేసె ననుకొన్నాడు. ఎందుకంటే అస్త్ర, శస్త్రధారులు వేల సంఖ్యలో ఉండే వారంతా ఒకవైపట. ఈ కృష్ణుడు యుద్ధము చేయడట. ఇతడు ఒక్కడు ఒకవైపట. అర్జునుడు వారిని కోరుకుంటాడు కాని కృష్ణుని కోరుకుంటాడా? వారంతా యుద్ధము చేసేవారు. అస్త్ర విద్యాకోవిదులు. ఇతడు తిని ఊరికే కూర్చుండేవాణ్ణి వాడు కోరు కుంటాడా? ఈ కృష్ణునికి తిండి దండుగ. లేచిపోతా ననుకుంటాడు.

కాని అర్జునుని దృష్టి వేరు. ఒకే వస్తువును, వ్యక్తిని పలువురు చూచినపుడు వారి వారి సంస్కారాన్ననుసరించి విలువలు మారు తాయి. అర్జునుడంటాడు 'కృష్ణా! నీవు లేని నారాయణాఖ్యులు యోధాన యోధులు ఒకటిలేని సున్నలు స్వామీ! నీవు యుద్ధము చేయకుండినా పరవాలేదు. మహాత్మా! నీవే నాకు కావాలి. నా రథము నడుపుతే చాలు. ఈ విధముగా అర్జునుడు మాట్లాడుతూంటే దుర్యోధనుడనుకున్నాడు. కుంతీదేవి వీనికి తిక్కపాలు త్రాపినదిరా! లేకపోతే ఇంత మాత్రము కామన్‌సెన్స్ ఉండొద్దూ! అయినా ఇట్టిది భాగ్యమైన విషయము. అదృష్టము నన్ను వరించి వచ్చుచున్నది సుమా! అనుకొని సంతోషపడి కృష్ణునితో తక్కిన సేనలోని యోధు లందరు నా వైపేకదా కృష్ణా! అంతే చాలు అనుకుంటూ వెళ్ళి పోతాడు.

అర్జునుడు కృష్ణుని చేతుల్లో తన జీవన రథాన్నే అప్పగించి నాడు. అందువలననే భగవంతున్ని ముందుపెట్టుకొని అర్జునుడు బాగు పడ్డాడు. దుర్యోధనుడు అహంకారాన్ని ఎదుట పెట్టుకొని హతు డైనాడు. మనము కూడ అర్జునుడప్పగించినట్లు మన జీవిత రథాన్ని భగవంతునికే అప్పగిస్తే, ఈ సంసారములోని యుద్ధాలనన్నిటిని సులు వుగ జయిస్తాము. జీవన రథాన్ని అప్పగించడమంటే ఏమి! జీవితము

లోని ప్రతి సంఘటన ఆయన ప్రసాదమే ననుకోవాలి. ఆ విధముగ నను కోవడమే - అంతే. వస్తువుగాని పదవిగాని ప్రతిష్ఠగాని, కష్టముగాని సుఖముగాని అన్నియు ఏది జరిగినా అది ఆయన ప్రసాదమే. ఇది నీ ప్రసాదమే తండ్రీ. నాపైన నీ కెంత అనుగ్రహమని అడుగడుగునా ఆయనకు ధన్యవాదములు చెప్పుచుండుటయే. ఈ మధురమైన మార్గమును పొందుటయే ఆయనకు జీవన రథాన్ని అప్పగించుట.

ఏకనాథ మహారాజు భార్య భర్తకు నోటిలో నాలుక వంటిది. భర్తమనస్సు ఎట్లైతే ఆనందముగ ఉంటుందో, ప్రసన్నముగ ఉంటుందో అది తెలుసుకొని ఆయనను ఆనందముగా ఉంచుటయే తన జీవిత పరమార్థమని భావించేది. దాని కనుకూలముగ నడచేది. ఈ విధమైన పతిభక్తినే ఆమె పాండురంగని సేవగా భావించేది. ఒక్కొక్కతూరి నీళ్ళు త్రాగవలెనను కుంటాడు. ఇంతలో ఎవరో వస్తే మాట్లాడుతూంటాడు. ఆయన భార్య నీళ్ళు త్రాగుటకు తెచ్చేది. "నేను చెప్పలేదే' అని భర్త అంటే "మీ మనస్సు చెప్పినది స్వామీ!" అని ఆమె నీళ్ళిచ్చేది. ఆమె భర్త మనస్సులో తన మనస్సును కలిపివేసినది. ఇందువలన ఆమెకు అంతటి శక్తి కలిగినది. ఇట్టి ఏకనాథుడు ప్రాతఃకాలమే పాండురంగని వద్దకు పోయి 'పాండు రంగా! నాపైన ఎంతటి దయరా! నోటిలో నాలుక వంటి భార్యను నాకు కట్టి నా జీవితమును స్వర్గముగా చేసితివి స్వామీ! ఇదుగో నీ కివే పదివేల నమస్కారాలు' అని చెప్పి వచ్చేవాడు. ఇది ఏకనాథుని పద్ధతి.

అక్కడనే తుకారాం కూడ ఉండినాడు. ఆయన భార్య అవు నంటే కాదనేది. గయ్యాళి నంబర్ వన్. ఆయన పాండురంగని వద్దకు పోయి ప్రార్థిస్తాడట. 'పాండురంగా! నాపైన నీకెంతటి దయరా! అవునంటే కాదనే భార్యను నాకంటగట్టి వైరాగ్యము నేర్పుకొను

టకు ఒక గురువును వెతుక్కుంటూ పోయే కష్టమును తప్పించి నాకు గురువును ఇంటిలోనే పెట్టినావు కదురా పాండురంగా! నీకివే పదివేల నమస్కారము లంటాడట. అనుకూలమైన భార్య ఉంటే అది ఆయన అనుగ్రహమే. అనుకూలము లేని భార్య వుంటే అదియు ఆయన అనుగ్రహమే. ఒకనికి భార్య పోయినది. వాడు వచ్చి 'పాండురంగా! నాకున్న బంధము తెంచివేసినావు. నాపైన ఎంతటి అనుగ్రహమురా! అని ప్రార్థించినాడట. ఈ మార్గము మానవ జీవితమున మధుర మైనది. అర్జునుడు తన జీవన రథాన్ని కృష్ణున కప్పగించినాడంటే మనమీవిధమైన పాఠమును గ్రహించాలి. మన జీవన రథాన్ని ఆయ నకు అప్పగిస్తే దాని ఫలము ఆనందమయమే.

✓ ఎప్పుడైతే కృష్ణుడు చక్రము చేత బట్టనని అన్నాడో ఆ విష యము భీష్మునకు తెలిసి 'నేను కృష్ణునిచేత చక్రము పట్టిస్తా! అట్లు పట్టించక పోతే నేను భీష్ముడనే కాను సుమా!' అని ప్రతిజ్ఞ చేస్తాడు. కృష్ణుడు చక్రము చేతపట్టనని ప్రతిజ్ఞ చేస్తాడు. భీష్ముడు పట్టిస్తానని ప్రతిజ్ఞ చేస్తాడు. భగవంతుడు భక్త పరాధీనుడు కావున భక్తుని ప్రతిజ్ఞ ముందర తన ప్రతిజ్ఞనే ఉపసంహరించుకొన్నాడు.

భీష్ముడు ఒకనాడు భయంకరమైన యుద్ధము చేస్తున్నాడు. ప్రళయకాల రుద్రునివలె అతనిని శత్రువులు తేరి పారజాలకున్నారు. అర్జునుడు కూడా శక్తి హీనుడైనట్లు కనిపిస్తే కృష్ణుడు రథముపై నుంచి చక్రము చేతబట్టి కుప్పించి ఎగురుతాడు. భీష్ముడంటే ఇట్టివాడు. తుదకు చక్రము పట్టిస్తానన్న ప్రతిజ్ఞను నెరవేర్చుకున్నాడు, ఇంతటి గొప్పవాడు కావుననే ఆయనను గురించి మన మింతవరకు చెప్పుకో వలసి వచ్చినది. ఇతడు మృత్యువునుకూడా ఎప్పుడు మాట్లోవస్తే వాపసు పంపినాడు. 'నాకిష్టము వచ్చినప్పుడు మాత్రమే నీవు రావాలి. నీ యిష్టము వచ్చినట్లు నావద్దకు రావలదు సుమా!' అని మృత్యు దేవతను శాసించిన దిట్ట.

ఇట్లు భీష్మునికి అంత్యకాలములో దర్శనమిస్తానన్నాడు శ్రీకృష్ణుడు. భీష్ముడంటాడు. "సదేవ దేవో భగవాన్ ప్రతీక్షతాం యావదిదం కళేబరం హినోమ్యహమ్." అంతే దేవదేవుడైన శ్రీకృష్ణుడు మరణ కాలములో నేను శరీరము వదలునపుడు వచ్చి నా ఎదుట ప్రత్యక్ష మిచ్చుటకుగాను ప్రతీక్షించుచుండును గాక. ఈ విధముగ కృష్ణున్ని శాసించి మరణకాలాన్ని మంగళమయమైనదిగ చేసుకున్నవాడు భీష్ముడు. కావుననే భీష్ముని మరణకాల స్థితిని ఎవరు చదువుతారో, ఎవరు వింటారో వారు భాగ్యవంతులన్నారు పెద్దలు. అట్టి భీష్మ నిర్యాణమును గురించి శ్రవణము చేసే భాగ్యాన్ని భగవంతుడు ప్రసా దించినాడు. ధన్యావయమ్ అనుకుందాము.

శ్రీకృష్ణుడు కుంతీదేవి, ధర్మరాజుల ప్రార్థనను విని హాస్తినా పురములో నిలుస్తాడు. మరుసటి దినం ఉదయమే ధర్మరాజు కృష్ణుని వద్దకు వచ్చి విషాదముతో అంటాడు. కృష్ణా! నాకు మనస్సులో విపరీతమైన దుఃఖము కలుగుచున్నది.

"తన దేహంబునకై యనేక మృగసంతానంబు జంపించు దు
ర్జనుభంగిన్ గురుబాలకద్విజతనూజభ్రాతృ సంఘుంబు ని
న్నిట్లని జంపించిన పాపకర్మునకు రాజ్యాకాంక్షికిన్ నాకు హా
యన లక్షోవధినైన ఘోరనరక వ్యాసంగముల్ మానునే.

1–202

కృష్ణా! మహానుభావా! నేను నా దేహరక్షణ కొరకై ఎంతో మందిని చంపించితిని. ఇది జంతువులు చేసే పని. గురువులను, బాలకు లను, సోదరాది బంధువర్గమును జంపించిన వానికి ఘోరనరకము తప్పుతుందా ?

అని దుఃఖిస్తూంటే కృష్ణుడు తాను కొంత చెప్పి చూస్తాడు. కాని ధర్మరాజు తృప్తిపడలేదు. అపుడు భీష్మునితో అనేక విధము

మైన ధర్మ, న్యాయ, ఆధ్యాత్మిక విషయాలు చెప్పించే ఉద్దేశముతో ధర్మరాజును పిలుచుకొని భీష్ముని వద్దకు పోతాడు. ధర్మరాజు పోతూంటే తమ్ములు, భార్య అందరు పోతారు. అంతేగాక ధర్మరాజు ప్రశ్నలు వేస్తాడట. దానికి భీష్మపితామహుడు సమాధానము చెబుతాడట. ఈ విషయము తెలిసి ఎందరో తపస్వులు, ఋషులు, పెద్దలు అచ్చటికి వస్తారు. పెద్దవారు మాట్లాడేటివి పెద్ద పెద్ద విషయాలే అయివుంటాయి. శ్రీకృష్ణుడు అర్జునునితో చెప్పిన మాటలు భగవద్గీత అయి ప్రపంచానికే అది జ్ఞాన సిద్ధియైనది. ప్రపంచములోని మానవులు పలురకాలు. ఎవని సంస్కారాన్ని బట్టి వాని విచార ధోరణి ఉంటుంది. ఇద్దరు త్రాగుబోతులు కలుసుకుంటే సారాయికి సంబంధించిన మాటలే ఉంటాయి, భీష్ముడంటే పరిపక్వమైన ధర్మనిధి. జ్ఞాననిధి. ఆయనకు తెలియని విషయమే లేదు. ఆయనతోనున్న జ్ఞాన భాండాగారము ఆయనతో పోకుండా శ్రీకృష్ణుడు ప్రపంచానికి తెలియజేయుటకే ఈ విధానమును కల్పించినాడు. ఈ రూపముగ ధర్మరాజు తన తమ్ములతో సహా భీష్మునివద్దకు వస్తూనే భీష్ముడు మొట్టమొదట విచారమగ్నుడౌతాడు. ఎందుకంటే పాండవులు ధర్మపరులు. అట్టివారికెట్టి కష్టములు సంభవించె! ధర్మరాజుతో అంటాడు.

> "ధరణీ సురులు హరియు ధర్మంబు దిక్కుగా
> బ్రతుక దలచి మీరు బహు విధముల
> నన్నలార పడితి రాపత్పరంపర
> లిట్టి చిత్రకర్మమెందు గలదె? 1-208

నాయనా! ధర్మరాజా! నీ జీవితమెంత ధర్మబద్ధమైనది. దుర్మార్గులైన దుర్యోధనాదులు మిమ్ములను మోసము చేసి జూదములో ఓడిస్తే మాట ప్రకారము అరణ్యవాసము, అజ్ఞాతవాసము

చేసి వచ్చినారు. ఇంతటి ధర్మపరుత్రైన మీకు వచ్చినట్టి కష్టాలు తలచుకుంటే దుఃఖము కలుగుతుంది నాయనా!

మరి మీరు ఎవరెవరిని ఆధారముగ కలిగియున్నారు. బ్రాహ్మణులు, భగవంతుడైన కృష్ణుడు, ధర్మము, యీ ముగ్గురిని ఆధారముగ కలిగి జీవితమును గడిపిన మీరు ఆపత్పరంపరలకు గురియైతిరి! ఇంతకంటె చిత్ర కర్మమున్నదా?

ఒక్కొక్క వ్యక్తి అంటాడు. మేమింత నిజాయితిగా బ్రతుకుతూంటే మాకే కష్టాలు ఎందుకు రావాలి! ఎదిరింటి వాడు ఇన్ని మోసాలు చేస్తూంటే వీడింత సుఖముగ బ్రతుకుట ఏమి? అంటే ధర్మపూర్వకముగ జీవితము గడిపేవారికి ఇపుడు కష్టాలు వచ్చి అవి తీరిపోతాయి. తరువాత సుఖముతప్పకవస్తుంది. అధర్మ మార్గములో జీవితము గడిపేవారు ఇపుడు సుఖముగ బ్రతికినను తరువాత వచ్చే కష్టాలు వారికి భయంకరముగ ఉంటాయి. మానవుడు పాపము చేసేటపుడు నగుతూ నగుతూ చేస్తాడు. దాని ఫలితము అనుభవమునకు వచ్చినపుడు ఏడుస్తూ ఏడుస్తూ అనుభవిస్తాడు.

తాను చేసిన పనియొక్క ఫలమునుండి ఎప్పటికినీ ఎవడునూ తప్పుకో జాలడు. ఎందుకంటే ఈ ప్రపంచము నగదు బజారు. దీనిలో అప్పు సప్పు బేరము లేదు. "దునియా నగద్ బాజార్ హై ఇస్ హాథ్ దే ఉస్ హాథ్ లే!" ఈ చేతితో చేసినది ఆ చేతితో అనుభవించవలసినదే! తప్పించుకొనుటకు ఎవనికిని సాధ్యము కాదు. కర్మ ఫలితాలు ఆశ్చర్యాన్ని గొలిపేటట్లు ఎందుకుంటాయంటే మానవుని మనస్సు మాయమయము. అది ఉన్నదానిని ఉన్నట్లు తెలుసుకోలేదు. కావున పలుమార్లు ప్రపంచములోని మనుష్యుల జీవన విధానము ఆశ్చర్యాన్వితమైనట్లు ఉంటుంది.

భీష్మునంతటివాడు "ఇట్టి చిత్రకర్మమెందుగలదు" అంటే "గహనా కర్మణోగతిః" అనే గీతా వాక్యము తథ్యము.

"వాయువశంబులై ఎగసి వారి ధరంబులు మింటగూడుచున్
బాయుచునుండుకైవడి ప్రపంచము సర్వము కాలతంత్రమై
వాయుచు గూడుచుండు నొకభంగి జరింపదు కాలమన్నియున్
జేయుచునుండు కాలము విచిత్రము దుస్తర మెట్టివారికిన్."
1-210

నాయనా! ధర్మరాజా! గాలికి వశమై మేఘాలు ఆకాశములో ఒక తూరి కలుసుకొని ఉంటాయి. ఒక్కొక్క తూరి గాలితో కొట్టుకొని చెల్లాచెదరై పోతాయి. అటులనే ఈ ప్రపంచమంతయు కాలానికి అధీనమై ఒకతూరి సుఖకరమై ఒకతూరి దుఃఖకరమవుతూ ఉంటుంది. ఈ కాలము దుస్తరమైనది. చాలా విచిత్రమైనది.

ఇంకొక ఆశ్చర్యకరమైన విషయము.

"రాజట ధర్మజుండు సురరాజసుతుండట ధన్వి శాత్రవో
ద్వేజకమైన గాండివము విల్లట సారథి సర్వభద్ర సం
యోజకుడైన చక్రియట ఉగ్ర గదాధరుడైన భీముడ
య్యాజికి తోడు వచ్చునట ఆపద గల్గుటదేమి చోద్యమో!
1-211

రాజు ధర్మజుడు అర్జునుడు ధన్వి. గాండీవము ఆయనకు విల్లు. సారథి సర్వకార్యములను సమకూర్చ గల కృష్ణుడు. భయంకరమైన గదను తీసుకొని సహాయము వచ్చేవాడు భీముడు. అయినప్పటికి ఆపద గల్గుటదేమి చోద్యమో! ఈ విధముగ కర్మల విధానము ఆశ్చర్యకరము.

అంతయు భగవంతుని లీలలు. ఎవనికి అర్థము కావు.
"ఈశ్వరుండు విష్ణుడెవ్వేళ నెవ్వని కేమి సేయు పురుషుడేమి యెరుగు, అతని మాయలకు మహాత్ములు విద్వాంసులుగాగి మెలగుచుండు రంధు లగుచు" 1-212

ఆ భగవంతుని మాయలకు ఎట్టి విద్వాంసులైనను అంధుల మాదిరి అణగి మెలగవలసినదే.

ఈ కృష్ణున్ని మీరు కేవల మానవమాత్రున్నిగా బంధువుగ మాత్రమే చూడవద్దు.

"యంమన్యసేమాతులేయం ప్రియం మిత్రం సుహృత్తమమ్ ।
అకరోః సచివందూతం సౌహృదారథసారథిమ్॥

ఈ కృష్ణున్ని బావగా, ప్రియుడుగ, మిత్రుడుగ, సుహృత్తుగ, సచివున్నిగ, దూతగ చూడవద్దు. ఈయన సర్వేశ్వరుడు. ఈయన మీ పక్షములో నున్నాడు. ఇది మీ భాగ్యము.

రాజసూయాగానంతరము నారదుడుకూడ ఇదేవిధముగా చెబుతాడు. ఆయన చెప్పిన విషయము గమనించదగినది. పోతన పద్యమద్భుతమైనది.

"జలజాత ప్రభవాదులున్ మనములో చర్చించి భాషావలిన్
పలుకన్ లేని జనార్దనాహ్వాయ పరాబ్రహ్మంబు నీ యింటిలో
చెలియై మేనమఱందియై సచివుడై చిత్తప్రియుండై మహా
ఫలసంధాయకుడై చరించుటలు నీ భాగ్యంబు రాజోత్తమా!"

జలజాతుడంటె బ్రహ్మ. బ్రహ్మ మొదలైన వారుకూడ మనస్సులో చర్చించి ఆయన స్వరూపమును గురించి ఇదమిత్థమని పలుక జాలరు. అటువంటి మహానుభావుడు జనార్దనుడను పేరుతో ఆ పరబ్రహ్మము నీ యింటిలో సఖుడై, మేనమరిదియై, మంత్రియై, చిత్తమునకు ప్రియము కలుగజేయువాడై, అంతేగాక మహాఫలమును కలిగించువాడుగ ఉండడము ధర్మరాజా! నిజముగ నీ భాగ్యమని అంటాడు నారదుడు.

ఈ ప్రపంచములో ఎవరైనా సరే ఉత్తమమైన వ్యక్తితోడి పరిచయము కలిగియుండడము పూర్వజన్మలోని సుకృతము.

అట్టి సజ్జనులు ఇంటిలో వచ్చి తిరిగితే అపుడే ఆ యిల్లు నిజమైన భవనము. అందువలననే పెద్దలంటారు. "యన్మనీషి పదాంభోజరజః కణ పవిత్రితమ్। తదేవ భవనం నోచేత్ భకార స్తస్యలుప్యతే॥" అంటే మనీషులు, పెద్దలగు వారి పాదరజము సోకినదే నిజమైన భవనము. ఎవరి యింటిలోకి అట్టి మహానుభావులు వచ్చియుండరో ఆ భవనము అనే శబ్దములో "భ" అనే అక్షరము తీసివేయాలి. అంటే అట్టి యిల్లు భవనము కాదు. వనమే. ఈ సూక్తిలోని సారాంశాన్ని ప్రతివారు బాగా గమనించవలెను.

భీష్ముడు భగవంతుని స్వభావాన్ని గురించి చెబుతాడు. ఆయన అందరికి సమానుడే. కాని ఏకాంత భక్తులయందు ప్రత్యేకమైన కృప కలిగియుంటాడు.

"తథాప్యేకాంత భక్తేషు పశ్యభూపానుకంపితమ్।
యన్మేఽసూన్ స్త్యజత స్సాక్షాత్ కృష్ణో దర్శన మాగతః॥"

ఆయన అందరియందు సముడైనను ఏకాంత భక్తులయందు అనుకంప కలవాడు. ఇదిగో! నేను ప్రాణాలను వదలే సమయానికి సాక్షాత్తు కృష్ణభగవానుడు స్వయముగ వచ్చినాడు.

భగవద్గీత కూడ "సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్" అన్నది. అంటే ఆయనయందు ఎవరిని గురించికాని యే విధమైన పక్షపాతము లేదు. కాని నిజమైనభక్తులలో భగవంతున్ని ఆకర్షించే మహాత్మ్యముంటుంది. అంబరీషోపాఖ్యానములో భక్తులవెంట ఎట్లా ఉంటానసే విషయము దూర్వాసునితో ఆయనే చెప్పినాడు. ఏమని! "గోవు వెంట దగులు క్రోడె భంగి" అని భక్తులవెంట నేను ఆవువెంట దూడ ఉన్నట్లుంటా నని అన్నాడు. భక్తుడు నిజమైన భక్తుడు కావాలి. అట్టివానికి భగవంతునికి ఎడబాటు ఉండదు. కావుననే పాండవుల వద్ద భగవంతుడు ఎట్లు ఉన్నది సర్వులెరిగిన విషయమే. శ్రీకృష్ణుడిపుడు అంత్యకాలమని ఎరిగి భీష్మునికి చివరిదర్శన మిచ్చుటకు వచ్చినాడు.

భీష్ముడా విధముగ దర్శన మిస్తున్న శ్రీకృష్ణుని చూస్తూ ధర్మ రాజుతో యీ విధముగ చెప్తాడు.

"అతిభక్తి నెవ్వనియందు చిత్తము జేర్చి
యెవ్వని నామమూహించి పొగడి
కాయంబు విడుచుచు కామకర్మాది
నిర్మూలనుండై యోగి ముక్తి నొందు
నట్టి సర్వేశ్వరుండఖిల దేవోత్తముడెవ్వాని
ప్రాణంబు లేను విడుతు
నందాక నిదె మందహాసుడై వికసిత
వదనారవిందుడై వచ్చి నేడు. 1-214

"నాల్గు భుజములు కమలాభనయన యుగము
నొప్పగన్నుల ముందట నున్నవాడు
మానవేశ్వర! నా భాగ్య మహిమ జూడు
మేమి జేసితినో పుణ్యమితని గూర్చి.

ధర్మరాజా! మహాత్ములైనవారు, అతి భక్తులైనవారు, ఏ మహానుభావునియందు మరణకాలమున చిత్తముంచితే ముక్తులై పోతారో అట్టి సర్వేశ్వరుడు నేను ప్రాణములను వదలే కాలములో చిరునగవుతో, అనుగ్రహ దృష్టిగలవాడై నా యెదుట నిలుచున్నాడు. నా భాగ్యము అని భీష్ముడనుకుంటాడు. ఏమి పుణ్యము చేసితినో ఇతని గురించి అని తలంచి, ఒక్కతూరిగ గంభీర దృష్టిగలవాడౌతాడు. అప్పటి ఆయన స్థితిని గురించి యీ పద్యము ఎంత బాగా చెబుతుందో చూడండి.

"ఆలాపంబులు మాని చిత్తము మనీషాయత్తముం జేసి దృ
గ్జాలంబున్ హరి మోముపై బరపి తత్కారుణ్య దృష్టిన్ విని
ర్మాలీభూత శరవ్యథా నిచయుడై మోదించి భీష్ముండు సం
శీలంబొప్ప నుతించె కల్మష గజశ్రేణీ హరిన్ శ్రీహరిన్" 1-216

అనగా మాటలు మానుకున్నాడు, మనస్సును బుద్ధిలో లయం చేసినాడు. చూపును కేవలం భగవంతునిపై పెట్టినాడు. ఆ భగవంతుని అనుగ్రహ కటాక్షముతో భీష్ముని బాధలన్నియు నిర్మూలమై పోయినాయి. అపుడు సంతోషముతో భీష్ముడు భగవంతున్ని విధముగ స్తోత్రము చేస్తాడు.

చూడండి ఇచ్చట గమనించవలసిన విషయమొకటి స్పష్టముగ నున్నది. మరణ కాలములో శరీరమునందు బాధ కలుగుతుంది. ఇచ్చట భీష్మునికి మోదము కలిగి స్తోత్రము చేస్తున్నాడు. అందువలన మహాత్ముల మరణ కాలము మంగళమయముగ ఉంటుంది. ఆయన చేసే స్తోత్రము కూడ ఎంత గొప్పదో!

"త్రిజగన్మోహన నీలకాంతి తనువుద్దీపింప ప్రాభాత నీ
రజ బంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల నీలాలక
వ్రజ సంయుక్త ముఖారవింద మతి సేవ్యంబై విజృంభింప మా
విజయున్ జేరెడు వన్నెలాడు మది నావేశించు నెల్లప్పుడున్.

1–218

ఆయన శరీర కాంతి మూడు లోకాలను మోహింప జేసెదట. "ఆయన కనక చేలము ప్రాభాతపు రంగువలె ప్రకాశించుచున్నది. నీలాలకములైన ముఖారవింద శోభతో అర్జునున్ని చేరుచున్న భగవంతుడు నామదిలో నావేశించును గాక.

ఆయన ముగ్ధ మోహనరూపమును గురించి భీష్ముడు స్తోత్రము చేసిన విధాన మతిమనోహరము, మనోజ్ఞము.

"హయ రింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాత శ్రమతోయ బిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయమున్ బార్థున కిచ్చువేడ్క నని నా శస్త్రాహతిం జాల నొ
చ్చియు బోరించు మహానుభావు మదిలో చింతింతు నశ్రాంతమున్"

1–219

యుద్ధములో గుర్రముల కాలిగిట్టల నుండి లేచిన దుమ్ముతో ఆయన ముంగురులు చెల్లాచెదరైనవట. తొందర తొందరగా రథమును నడపుటలో శ్రమ కలిగి ఆయన ముఖము చెమట బిందువులతో నొప్పుచున్నదట. ఆ విధమైన ముఖముతో జయమును పార్థున కిప్పించు వేడ్కతో నా శస్త్రాస్త్రములతో చాలా నొచ్చి కూడ అర్జునునితో యుద్ధము చేయించుచున్న మహానుభావున్ని మదిలో నేనెల్లప్పుడు చింతిస్తాను అని పద్యార్థము.

ఈ పద్యాలన్నియు చిత్రమును కళ్ళయెదుట చూపించునవిగ నున్నవి, ఇంకను చూడడు.

''కుప్పించి యెగసినకుండలంబుల కాంతి గగనభాగం బెల్లగప్పికొనగ
నురికిన నోర్వకనుదరంబులో నున్న జగముల వ్రేగున జగతి గదల
చక్రంబు చేపట్టిచనుదెంచు రయమున పైనున్న పచ్చని పటము జార
నమ్మితి నాలావు నగుబాటు సేయక మన్నింపుమని క్రీడి మరల దిగువ.

''కరికి లంఘించు సింహంబు కరణి మెరసి
నేడు భీష్ముని జంపుదు నిన్ను గాతు
విడువు మర్జున! యనుచు మద్విశిఖవృష్టి
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు. 1–223

ఈపద్యమున కర్థము వ్రాయవలసిన పని లేదు. ఇది Moving Picture వలె చిత్రమును చూపుచున్నది. ఇటువంటి పద్యాలను పోతన వ్రాసి ఆంధ్ర లోకమునకు అద్భుతమైన మేలు చేసినాడు.

అయినను అర్జునుడు ''నమ్మితి నాలావు నగుబాటు చేయకు. ... అన్న పంక్తిలో అర్జునుడు భీష్ముని పైకి పోవద్దు స్వామీ! నాలావు అంటే నా పరాక్రమము.

నా పరాక్రమము నగుబాటు చేయవద్దు స్వామీ! అంటాడట.

"ఇపుడు నీవు భీష్మున్ని చంపితే మా పరాక్రమము నగుబాటౌతుంది. ఎందుకంటే భీష్మున్ని కృష్ణుడు చంపె. అందువలన పాండవులు గెలిచిరి. అనే మాట నిలుస్తుంది. స్వామీ! నా రథాన్ని నీవు తోలుతుంటే నేను తప్పక గెలువగలను. కావున రథముపైకి రమ్మని అర్జునుని" ప్రార్థన.

అయితే కృష్ణుడు ఏనుగు మీదికి లంఘించే సింహమువలె భీష్ముని పైకి యెగిరి నేడు భీష్మున్ని జంపి నిన్ను రక్షిస్తానన్నాడు. అర్జునా! నా పాదములు విడువమని పలుకుచున్నాడు. ఈ పద్యము ద్వారా చిత్రము మన కన్నుల ఎదుట కదలుచున్నట్లు తోచుచున్నది.

ఇక తరువాత ఈ క్రింది పద్యములో భగవత్తత్త్వాన్ని గురించి భీష్ముడు స్తోత్రము చేస్తాడు. మరణ కాలములో నింతటి ఆనందముగ భగవంతున్ని స్తోత్రము చేసే భాగ్యము ఆయనకబ్బుటకు ఆయన చేసుకున్న పుణ్యము కారణము.

'ఒక సూర్యుండు సమస్త జీవులకు తానొక్కొక్కడై తోచు పో
లిక నే దేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుడై యొప్పుచు నుండు నట్టి విభు నే సేవింతు నప్రాంతమున్" 
1—226

సూర్యుడు ఒకడే. కాని ఒక్కొక్కనికి ఒక్కొక్కడై తోచుచున్నట్లు భగవంతుడొక్కడైనప్పటికి అందరి హృదయాలలో ప్రతిబింబించి అనేక రూపములుగ స్ఫురించుచున్నాడు. అటువంటి విభున్ని నేనెల్లప్పుడు సేవింతును గాక.

ఈ విధముగ స్తోత్రము చేసి భీష్ముడు శరీరమును ఎట్లు వదలుతాడో చూడండి. "అని యిట్లు మనోవాగ్దర్శనంబుల పరమాత్మ యగు కృష్ణుని హృదయంబున నిలిపికొని నిశ్వాసంబులు మాని నిరు

పాధికంబైన వాసుదేవ పరబ్రహ్మంబునందుం గలిసిన భీష్మునిం జూచి సర్వజనులు దినావసానంబున విహంగంబులూరక యుండు తెరగున నుండిరి. దేవమానవవాదితంబులై దుందుభి నినదంబులు మొరసె. కుసుమ వర్షంబులు గురిసె. మృతుండైన భీష్మునికి ధర్మజుండు పరలోక క్రియలు సేయించె.

భీష్ముని నిర్యాణ మిట్లు జరుగుతుంది. ధర్మరాజు అనేక విధములైన ధర్మములు, న్యాయములు, ఆధ్యాత్మిక తత్త్వ విశేషము లెన్నియో భీష్ముని వలన తెలుసుకుంటాడు. భారతములోని అనుశాసనిక పర్వము, శాంతిపర్వములలో భీష్ముని బోధ, అద్భుతముగ ఉంటుంది. భారతములో ముఖ్యముగ అరణ్య పర్వము, అనుశాసనిక పర్వము, శాంతి పర్వములు తెలుసుకో వలసినవి. ఈ విధముగ ధర్మ రాజుకు బోధించవలసిన విషయములన్నియు బోధించి భీష్ముడు యశశ్శరీరియై దేహమును వదలి పరమాత్మలో కలుస్తాడు. ఇట్టి భీష్మ నిర్యాణమును శ్రవణము చేసే భాగ్యమును పొందినందులకు ధన్య వాదములు భగవంతునికి తెలుపుకుంటూ యీ దినము భాగవతోప న్యాసమును ముగిస్తాము.

ఓం సర్వేవై సుఖనస్సంతు.

అయిదవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## ఆరవ రోజు ఉపన్యాసము

పవిత్రాత్ములారా! భాగవత శ్రవణ కుతూహల పరిపూత చిత్తులారా! వినండి. గీతాచార్యులైన పార్థసారథి అనుగ్రహముతో మనమీ పవిత్ర గ్రంథమును శ్రవణము చేయుచున్నాము. ప్రథమమున జగద్రక్షకులైన శ్రీకృష్ణపరమాత్మకు సాష్టాంగ దండ ప్రణామములు చెల్లించి కార్యక్రమమును ఉపక్రమించుచున్నాను.

నిన్న భీష్ముని అంత్యకాలమును గురించి శ్రవణము చేసినాము. ఆయన నిర్యాణ కాలమెంత శాంతముగ, ఫలప్రదముగ జరిగినదో తెలుసుకున్నాము. ఆయన అంత్యకాలములో మనోవాగ్దర్శనంబుల యందు శ్రీకృష్ణపరమాత్మను నిలుపుకొన్నాడు. శ్వాసను బంధించినాడు. కేవలము కృష్ణుని హృదయమున నిలుపుకొని తన యిష్ట ప్రకారము వాసుదేవ పరబ్రహ్మమునందు కలిసినాడు. ఈ విధముగ దేహమును వదలుచున్న భీష్ముని చూచి అచ్చటివారు "దినావసానంబున విహంగంబు లూరకయుండు తెరంగున నుండిరి." అంటే పక్షులు తమ గూళ్ళలోనికి పోయేటపుడు కలకలమని విపరీతముగా శబ్దము చేస్తాయి. కాని తమ గూళ్ళల్లో చేరుకున్న తరువాత చీకటిపడితే అవి నిశ్శబ్దమవుతాయి. ఈ విధముగా ప్రజలందరు ఊరక ఉండిరట. అంతటి మౌనము! అంతటి నిశ్శబ్దత! పరమమైన శాంతిగల సమయములో భీష్ముడు శరీరము వదలి పరమాత్మలో కలిసినాడు. దేవతలు దుందుభులు మ్రోగించినారు. పుష్పవర్షమును కురిపించినారు. ధర్మరాజు మహానుభావునికి పరలోకక్రియలు చేయించినాడు.

ఆయన మరణ మింత మంగళకరమైనది. మరణకాలములో భగవంతుని స్మరణవస్తేనే చాలు. భగవత్ప్రాప్తి కలుగుతుంది. భగవద్గీత చెబుతుంది.

"అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి సమద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥"

అంటే అంత్యకాలములో భగవత్స్మరణ ఉంటే అట్టివాడు తప్పకుండా భగవంతుని చేర్తాడు. దీనిలో సంశయము లేదని భగవంతుడే గీతలో చెప్పినాడు.

ఈ ప్రపంచములో ఒక సత్యమున్నది. అది యేమంటే ఏ వస్తువు ఎక్కడినుండి ఉత్పన్నమవుతుందో ఆ వస్తువు అక్కడికే పోయి చేరుకుంటుంది. నది యెచటనుండి ఉత్పన్నమైంది? సముద్రమునుండి. అది మరల అచ్చటికి పోయి లయమవుతుంది? ఎవరు ఎచ్చటి నుండి వచ్చినారో అచ్చటికే పోయి చేరుకుంటారు నేను మా యింటినుండి వచ్చినా, మరల మా యింటికే పోయి చేరుకుంటా.

అట్లు చేరుకున్నప్పుడే తృప్తి. ఈ శరీరము దేనినుండి పుట్టినది? మట్టిలోనుండి పుట్టినది. మరణకాలములో ఈ శరీరము మట్టిలో పోయి చేరుకుంటుంది. మరి దీనిలోపల "నేను నేను" అనే వాడొకడున్నాడు. చైతన్యస్వరూపుడు. వాడెక్కడినుండి వచ్చినాడు? వాడు భగవదంశము. ఆ విషయమే గీత "మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః" అని చెప్పినది. ఈ జీవస్వరూపము భగవదంశము. కాబట్టి వాడు తన స్వామి స్మరణను తాను చేస్తూ ఆ స్వామిని చేరితే జమ ఖర్చు తీరిపోయి పరమపదవిని చేర్తాడు.

అందువలన చిక్కు యెక్కడ వస్తుందంటే మరణకాలములో మట్టిలోనుండి వచ్చిన శరీరము మట్టిలో కలుస్తుంది. లోపల 'నేను, నేను' అనేవాడు ఎక్కడినుండి వచ్చినాడో వానిని గురించి జీవుడు

వాడు చూచినాడు. ఓహ్! నది దాటటమంటే ఇంతేనా! గోచినెగ
జెక్కి మీది పంచ నడుముకు గట్టి నీటిలో దుమికి కాళ్ళు చేతులల్లా
డించుటయే కదా! అని తలంచి అటులనే గోచి చెక్కుకొని నీళ్ళలో
దుమికినాడు. ఈతరాని వాడు లోతైన నదిలో దుముకుతే "నదీనాం
సాగరో గతిః" చచ్చిపోయినాడు. అట్లాంటుంది అభ్యాసము లేని విద్య.

ముఖ్యముగా బ్రతికినంత కాలము భగవంతునిపై భక్తి ప్రధాన
ముగ ఉండాలి. ఆ పిమ్మట రెండు ప్రతిబంధకాలు ఉండరాదు. మరణ
కాలమును సఫలము చేసుకోవలసిందేనని పెద్దలు చెబుతారు. ఆ రెండు
ప్రతిబంధకాలలో కూడ మొదటిది విషయస్మరణ, రెండవది ఆలుబిడ్డల
పెడబొబ్బలు.

విషయస్మరణ అంటే భగవంతునిపై లగ్నముకాని మానవుని
మనస్సు విషయాలతో లంకె వేసుకొని ఉంటుంది. "కొడుకులు
ఈ ధనమును నిలుపుతారో లేదో! తల్లిని సరిగా చూచుకుంటారో
లేదో! ఇల్లు నెంతో కష్టపడి కట్టినాను. దీనిని నిలుపుకుంటారో
లేదో! అని పలువిధములైన విషయములను గురించి జీవులు మరణ
కాలములో స్మరణ చేస్తుంటారు. దీనిని గురించి భాగవతములో
ఏకాదశ స్కంధములో చెప్పిన విధానము సర్వులు గమనించవలసి
యున్నది.

"హిత్వాత్యాయాస రచితా గృహాపత్యసుహృచ్ఛ్రియః।
తమోవిశంత్యనిచ్ఛంతో వాసుదేవ పరాఙ్ముఖః" ॥

అంటే అతి ఆయాసముతో సంపాదించిన వస్తువులను వదలి
పోతూ వాటిపైన మమకారముతో గృహము, సంతానము, బంధు
వులు, మిత్రులను స్మరించుచూ మరణించుచున్న మూఢ మానవుడు
వాసుదేవునికి పరాఙ్ముఖుడై విషయస్మరణతో, అంధకారములోనికి
ప్రవేశిస్తాడని అర్థము.

విషయస్మరణకు ఒక ఉదాహరణ మివ్వబడినది. వాటి విధా నాలనంతములు. వాటిలో చిక్కుకోరాదు. మరియొక ప్రతిబంధము కూడ సామాన్యమైనది కాదు. మరణిస్తుంటే ఆలుబిడ్డలు పెడబొబ్బలు పెడ్తారు ఏడ్వవద్దంటే వారికి కోపము వస్తుంది. మరి యేడ్చి యేమి చేస్తారు? మనస్సు నిలువదే! అని అంటే దానిని నిగ్రహించే యోగ మును ఇంటిలోనివారందరును సాధించవలె.

ఇంటిలో మరణము జరుగుతూంటే ఇంటిలోని వారందరు మౌనము వహించి భగవద్గీతలో రెండవ అధ్యాయము కాని, ఎనిమిదవ అధ్యాయము కాని, పదునేనవ అధ్యాయము కాని చదువాలి. భగవంతుని నామోచ్చరణ లేక భజన కాని ఆ సమయములో చేయాలి. ప్రాణోత్క్రమణ సమయములో దేవుని స్థితి చాలా భయంకరముగా ఉంటుంది. ఆ సమయములో ఇంటిలోని వారందరు గొల్లున యేడిస్తే ఇది పరిస్థితిని మరింత భయంకరముగ మారుస్తూంది. ఆ చనిపోయే ప్రాణికి విపరీతమైన దుఃఖము కలుగుతుంది. అందు వలన ప్రాణము పోయేటపుడు మనస్సును నిగ్రహించుకొని మౌనముగ శాంతిగా తెలిపిన ప్రకారము భగవద్గీత చదివి భగవన్నామమును నెమ్మదిగ చేస్తూండాలి. ప్రాణము పోయిన తరువాత ఇంక యేడ్చి నను పరవాలేదు, కావున భార్యాభర్తలు యీనాడే ఈ విషయ మును గురించి మాట్లాడుకొని ఒక నిశ్చయానికి వచ్చి ఉండండి. ప్రాణోత్క్రమణస్థితిలో అప్పుడు నిగ్రహమును వహించుట చాలా దుస్సాధ్యము. జపము, ధ్యానము, శ్రవణము, మననము, ఇవన్నియు చేస్తూ మరణకాలము వచ్చినపుడు నేనింట్లుండాలి అని ప్రతి మాన వుడు ముందుగనే నిశ్చయము చేసుకొని ఉండాలి. ఆ విధముగా ఇంటిలోని వారు ముందుగానే మాట్లాడుకొని ఉంటే కాలమాసన్నమై నపుడు ఆచరించుటకు సాధ్యము కావచ్చు. ఈ విధమైన విచార ముతో సాధనచేస్తే మరణకాలములో భగవత్స్మరణ జరుగవచ్చు.

అట్టి స్మరణ చేస్తే మట్టిలో నుండి వచ్చిన శరీరము మట్టిలో కలుస్తుంది. లోపలి జీవుడు భగవంతున్ని స్మరిస్తూ భగవంతున్ని లేక తన స్వస్థానాన్ని చేరుకుంటాడు. భాగవతములో "ఎచ్చట బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్" అని చెప్పిన సూక్తి ఈ సత్యమునే ప్రకటించుచున్నది. మనస్వస్థానమును మనము చేరుకోవాలి. ఈ రూపమున మృత్యువును ఫలవంతము చేసుకోవాలి.

సామాన్యమానవుడు, మహాత్ముడు పుట్టేటపుడు సమానులే. కాని పుట్టిన తరువాత జీవన విధానములోను, మరణకాలములోను చాలా వ్యత్యాసముంటుంది. కబీరుదాసు అంటాడు.

"జబుతుమ్ ఆయే జగమే వహ్ హసాతుమ్ రోయే
ఐసీ కర్నీకర్ చలో తుమ్ హసో వమ్ రోయ్"

నీవు ప్రపంచములోనికి వచ్చినపుడు నీవు యేడ్చినావు. ప్రపంచము నవ్వింది. నీవెట్టి కార్యక్రమము చేయవలెనంటే పోయేటపుడు అంటే మరణించేటపుడు నీవు నవ్వు, ప్రపంచమును ఏడిపించు. ఆ విధముగా జీవితమును గడపు.

దీనిలోని స్వారస్యమేమంటే నీవు మంచివాడవై సత్కార్యములను చేస్తూ జీవితమును చాలిస్తే అందరు ఇంతమంచివాడు పోయెనే అని యేడుస్తారు. దుర్మార్గుడవై జీవితమును గడపుతే చచ్చినపుడు జనులు సంతోషపడుతారు. కాబట్టి ప్రపంచమును ఆనందపరచుచుండే జీవితమును గడుపుమని నీతి. ఈ విధముగ భీష్ముని నిర్యాణమును పురస్కరించుకొని మృత్యుసంబంధమైన విషయాలను చర్చించుకున్నాము. ఇంక ముందు భాగములోనికి ప్రవేశిద్దాము.

శ్రీకృష్ణుడు ధర్మరాజుకు వైభవముగ పట్టాభిషేకము చేసి ద్వారకకు పయనమవుతాడు. ధర్మరాజు ఆ కృష్ణుని ఎదుట నిలుచుకొని "మహాత్మా! నీవు పోతానంటే నా మనస్సు చాలా డోలాయ

మానముగ నున్నది. ఏమో! ఏమి పలుకుటకును నోరు రాకున్నది.
అయినను స్వామీ! నా మనోభావమును మనవి చేస్తాను.

"మాగా ఇత్యపమంగళం వ్రజఇతి స్నేహేనహీనం వచః
స్థాతుంవా మనోత్సుకేనమనసా నాతః పరంనోత్సహే।
కిం వక్తవ్య మతఃపరం యదుపతే త్రైలోక్యనాథ ప్రభో
స్మర్తవ్యావయమాదరేణ భవతా యావత్పునర్దర్శనమ్॥"

అంటే "మాగాయిత్యపమంగళం" పోవద్దంటే అపమంగళ మవుతుంది, "వ్రజ ఇతి స్నేహేన హీనం వచః". పోయిరమ్మంటే స్నేహరహితమైన వాక్కవుతుంది. కావున ప్రభో! నిలబడమని కాని, పొమ్మని కాని చెప్పుటకు ఉత్సహింపజాలకున్నాను. ఇంతకంటే ఏమి చెప్పను! త్రైలోక్యనాథ ప్రభూ! పునర్దర్శనమగువరకు అపుడపుడు మమ్ములను జ్ఞాపకము చేస్తూండు స్వామీ!

ఈ శ్లోకములో ధర్మరాజు యొక్క హార్దికమైన ఆర్ద్రభావము ఎంత సున్నితముగ ప్రకటించబడినదో చూడండి! అయితే భగవంతుడు మాత్రము తక్కువ ప్రేమను కలిగి ఉంటాడా? ఆయన ధర్మరాజు యొక్క ప్రేమార్ద్రమైన పలుకులు విని అంటాడు.

"యాస్యామీతి భవద్వియోగ విధురం వక్తుం వచో నోత్సహే
స్థాతుం వా గమనోత్సుకేనమనసా నాతః పరంద్శృశ్యతే।
భూయోప్యాగమనం భవేన్నహి భవేత్ విద్యుచ్చలం జీవితం
స్మర్తవ్యా వయమాదరేణ భవతా యావత్పునర్దర్శనమ్"॥

ధర్మరాజా! నీకు వియోగ విధురమైన వాక్కు 'పోయివస్తానని' (యాస్యామీతి) అని పలుకుటకు నోరు రాకున్నది. నిలుస్తామా? పోదామా? అనే విషయానికి పరిష్కారము కనిపించుటలేదు. మరల నా యాగమనము జరుగుతుందో! లేదో! చెప్పుటకు సాధ్యముకాదు.

ఎందుకంటే జీవితము విద్యుచ్చలము (మెరుపు) వంటిది. మరల పునర్దర్శనమగు వరకు నన్ను స్మరించు చుండవలసినది.

"భూయోప్యాగమనం భవేన్నహి భవేత్" అంటే మరల తిరిగి వచ్చుట జరుగుతుందో జరగదో అన్నాడు కదా! దానిలో గమనించవలసిన విషయమేమంటే! ఆయన తిరిగి వచ్చు విషయములో సందేహమును కనబరచినాడు అంటే మరల తిరిగిరాడు. ఈ సంగతిని ఆయన ద్యోతకము చేసినాడు. కాని ధర్మరాజుకీవిషయము బోధపడియుండక పోవచ్చును. ఈ విధముగ ఒకరినొకరు విడువ జాలక ఆర్ద్రనేత్రములతో కృష్ణుడు పోతూంటే ధర్మరాజు నిశ్చేష్టుడై నిలిచి కృష్ణున్ని సాగనంపి బరువైన కాళ్ళతో తన భవనానికి తిరిగి వస్తాడు.

ధర్మరాజు రాజ్యపాలన చేస్తూంటాడు. భీష్ముడు చెప్పిన ధర్మాల కనుగుణముగా రాజ్యము నేలుతుంటాడు. ఉత్తర ప్రసవిస్తుంది.

"అంతననుకూల శుభగ్రహోదయంబును, సర్వగుణోత్తర ఫలసూచకంబునైన మంచి లగ్నంబునం బాండవ వంశోద్ధారకుండైన కుమారుండు" (ఉత్తరకు) జన్మించినాడు.

మంచి లగ్నములో శుభసూచకములతో పరీక్షిత్తు జన్మిస్తాడు ఆ సందర్భమున ఎక్కడెక్కడినుండియో బ్రాహ్మణులు వస్తారు. ధర్మరాజుతో నిట్లు పలుకుతారు.

"ప్రకటిత దైవయోగమున పాండవ సంతతి యంతరింపగా
వికలతనొందనీక ప్రభవిష్ణుడు కృష్ణుడనుగ్రహించి శా
బకు బ్రతికించె గావున నృపాలక బాలకుడింక శాత్రవాం
తకుడగు విష్ణురాతుడన ధాత్రిఁ బ్రసిద్ధికినెక్కుఁ బూజ్యుడై "1-289.

కృష్ణుడనుగ్రహించి పాండవ సంతతి అంతరించి పోకుండా ఈ పిల్లవానిని బ్రతికించినాడు. ధర్మరాజా! ఈ పిల్లవాడు పరాక్రమ

వంతుడై విష్ణురాతుడనే పేరుతో ప్రసిద్ధికి వస్తాడు. విష్ణురాతుడంటే విష్ణువుచేత రక్షించబడినవాడని అర్థము.

ఈ విధముగ ఆ బ్రాహ్మణులు పిల్లవాని భవిష్యత్తును గురించి చెప్పసాగినారు. ధర్మరాజు వారికందరికి నమస్కారముచేసి అడుగుతాడు, మహాత్ములారా!

"ఓ పుణ్యాత్మకులార నా పలుకు మీరూహింపుడా మ్రొక్కెదన్
మా పెద్దల్ శ్రుతకీర్తులై సదయులై మన్నారు రాజర్షులై
ఈ పిన్నాతడు వారిబోలెడిగదా యెల్లప్పుడున్ మాధవ
శ్రీపాదాంబుజభక్తియుక్తిరతుడై జీవించునే మాడరే" 1-291

మా పెద్దలు సదయులు, రాజర్షులై కీర్తి బొందినారు. ఆ మార్గములో ఈ పిల్లవాడు నిరంతరము భగవంతుని చరణారవింద ములయందు అనురక్తుడై జీవిస్తాడా! చూచిచెప్పండి. అని అందరికి నమస్కారము చేసి అడుగుతాడు,

ధర్మరాజు చక్రవర్తియైయుండి కూడ ఓ శాస్త్రి! చెప్పు, ఓ శర్మా! చెప్పుమని అహంకారముతో అడుగలేదు నమస్కారము చేసి చెప్పుమని వినయముతో వేడుకున్నాడు. మనిషికి కొంత ధనము, కొద్ది పదవి వచ్చేటప్పటికి అహంకారి అవుతాడు. ఆ ధర్మరాజు అంత గొప్ప అధికారములో ఉండినను ఎంతటి వినయవిధేయతలు కలిగి వ్యవహరించుచున్నాడో చూడుడు. ఆ మాటలు విని బ్రాహ్మణు లంటారు,

"పార్థ ప్రజావితా సాక్షాదిక్ష్వాకురివ మానవః।
బ్రహ్మణ్యః సత్యసంధశ్చ రామోదాశరథిర్యథా॥"

ధర్మరాజా! మనుపుత్రుడైన ఇక్ష్వాకునివలె ప్రజల రక్షించును. శ్రీరామచంద్రునివలె బ్రహ్మణ్యుడు, సత్యవ్రతుడవుతాడు.

"ఏష దాతా శరణ్యశ్చ యథా హ్యౌశీనరః శిబిః।
యశోవితన్వితా స్వానాం దౌష్యంతిరివ యజ్వనామ్॥"

ఇంకను శిబి చక్రవర్తివలె శరణ్యుడు, గొప్పదైన ఔదార్యము కలవాడును, దుష్యంతు సూనుడైన భరతునివలె జ్ఞాతులకు, యజ్వలకు గొప్పకీర్తిని విస్తారము చేయువాడౌతాడు.

మరియును సింహామువంటి పరాక్రమము కలవాడును, భూదేవి వంటి ఓర్పుకలవాడును, సూర్యునివలె ప్రకాశవంతుడుగ ఉంటాడని చెప్పుసరికి ధర్మరాజుకు తృప్తి కలుగుతుంది. ఆ బ్రాహ్మణులు భవిష్యత్తు నింకను చెబుతూంటే కుతూహలముతో వింటూంటాడు, బ్రాహ్మణులిట్లు చెప్పసాగిరి.

"ఇట్లు పెక్కేండ్లు జీవించి భూసురకుమారక ప్రేరితంబైన తక్షక సర్పవిషానలంబునం దనకు మరణంబని యెరింగి సంగవర్జితుండై ముకుంద పాదారవింద భజనంబు చేయుచూ శుకయోగీంద్రుని వలన నాత్మవిజ్ఞాన సంపన్నుడై గంగాతటంబున శరీరంబు విడిచి నిర్గతభయ శోకంబైన లోకంబు ప్రవేశించు."

ధర్మరాజు "తప్పక విషానలంబున శాపమని" వినేసరికి అదరిపడ్డాడు. వాస్తవమేకదా మరి! భయము కలిగినట్లవుతుంది. కాని సంగవర్జితుండై ముకుందు చరణారవింద భజనంబుచేయుచు ... ఆ విషయము వింటే శాంతి కలుగుతుంది.

మానవజన్మ యెత్తినందుకు భగవత్ప్రాప్తిచే జన్మ సఫలము పొందాలి. చివరదశ ఇది. ఎప్పుడు ఈ జన్మసఫలము కాదో! అప మార్గమున జీవితము గడువసాగునో అపుడు మనము విచారించవలసినదే. అందువలన శ్రుతికూడ చెబుతుంది.

"ఇహ చేదవేదీ దథ సత్యమస్తి
నచేదిహావే దీన్మహతీ వినష్టిః

శరీరము ఉండగానే తెలుసుకోవలసిన జ్ఞానమును తెలుసుకుంటే వాని జన్మసార్థకమైనది. అట్లు పొందుటకు మానవ జన్మే ఏకమాత్ర సాధనము. ఆ విధముగ మానవ శరీరము పొందికూడ జ్ఞానము పొందలేకపోతే, ఆ జన్మ మహతీ వినష్టిః. గొప్ప నష్టమును పొందినట్లే. భాగవతములో మరొకచోట "యస్త్వాత్మముక్తౌ నయతేతి మూఢధీః నహ్యాత్మనో స్వంవినిహంత్య సద్గ్రహాత్" అని చెప్పబడినది. అంటే ఆత్మముక్తియందు. అట్టి జ్ఞానప్రాప్తియందు ఏ మానవుడు తన జీవితమును గడపడో అట్టివాడు ఆత్మహత్యా సదృశుడని చెప్పబడింది. కాని పరీక్షిత్తు శుకయోగీంద్రుని బోధచేత జీవిత సాఫల్యమును పొందిన మాట విని ధర్మరాజుకు మనస్సు కుదుటబడుతుంది.

అసలు ఆ శాపము పరీక్షిత్తుకు ఆత్మజ్ఞాన ప్రాప్తికి సాధనమవుతుంది. కావున జీవితములో నొక సత్యమున్నది. ఏ విపత్తు వచ్చినను దానిలో జీవిత కళ్యాణమును సూచించే ఒక సందేశముంటుంది. దానిని తెలుసుకోలేక విపత్తనుసరికి మనము తాపత్రముతో తల్లడిల్లి పోతాము. అందువలన దానిలోని శుభమును గమనించలేము.

ఇంటిలో ఒకామె కసువునూకుతుంది. ఆమె సందర్భాన్ననుసరించి ఒకతూరి తూర్పుకు, పడమరకు, దక్షిణానికి, ఉత్తరానికి తిరుగుతుంటుంది. కాని ఆమె లక్ష్యము తలవాకిలి వద్దకు కసవును నూకకుంటూ పోవలె. ఆ విధమున జీవితముకూడ అనేక విధములైన సంఘటనలకు వశమై పోయినట్లుంటుంది. కాని తాను సజ్జన సహవాసమును, పరమాత్మసాన్నిధ్యమును కలిగియుంటే ఎన్ని సంఘటనలు జీవితములో కలిగినను తలవాకిలి వద్దకు ఆమె చేరుకున్నట్లుగా జీవితము తన గమ్యము చేరుతుంది. కాని సంఘటనలతో తాపత్రయ

పడరాదు. అంతటిని భగవత్ప్రసాదముగ భావించాలి కష్టాలతో కూడినపుడు మన మతి సరిగా ఉంటే గతికూడ సరిగానే వుంటుంది. మతిని భ్రష్టము కాకుండా చూచుకోవాలి. పరీక్షిత్తు శాపము విషయమును విని సంతోషపడ్డాడట. మరణము ఫలానాసమయములో వస్తుందని ఎవరికి తెలుస్తుంది? నాకిపుడు అనాయాసముగ మరణ కాలము తెలిస్తె కదా! ఈ హెచ్చరికతోనే యేమిచేసుకోవలెనో దానిని చేసుకొని నా మరణమును సఫలము చేసుకుంటాననుకున్నాడు. కావున ఇంతకు చెప్పవలసిన విషయమేమంటే మానవునికి ఆపదలు వస్తే భయపడరాదు. వాటిని భగవత్ప్రసాదములనుకుంటే అద్భుతమైన శ్రేయస్సు కలుగుతుంది. ఈ సత్యమును ప్రతివారు గమనించవలసి వుంటుంది.

విదురుడు తీర్థయాత్రలకు వెళ్ళి ఉంటాడు. పాండవులు యుద్ధములో జయించినట్లు ధర్మరాజుకు పట్టాభిషేకమయినట్లు ఆయనకు తెలిస్తే ధర్మరాజును చూస్తామని వస్తాడు. ధర్మరాజుకీ విషయము తెలుస్తూనే ఎదురేగి ఆ మహాత్ముని పిలుచుకొని వచ్చి కాళ్ళు గడిగి భక్తి ప్రపత్తులతో ఉన్నతమైన ఆసనమున కూర్చోబెట్టి కుశల ప్రశ్న లేస్తాడు. అంతేగాకుండా కృతజ్ఞతతో చాలా ఆదరిస్తాడు, విదురుడీ మర్యాదను, ఆదరమును కోరలేదు. మహాత్ములు మర్యాదను కోరరు, మర్యాద వారికి దాసివలె సమీపించి నిలుస్తుంది. అపుడు ధర్మరాజు అంటాడు. మహానుభావా!

"పక్షులు తమ రెక్కలలో, పక్షంబులురాని పిల్లపదువుల మమతన్
రక్షించిన క్రియ మీరలు పక్షీకరణంబు సేయ బ్రతికితిమిగదే"

I - 303.

పక్షులు తమ పిల్లలను రెక్కలలో ఉంచుకొని కాపాడిన విధముగా మహాత్మా! మీ అనుగ్రహము చేత, మీ వాత్సల్యభావము చేత మేము బ్రతికినాము.

కృతజ్ఞత అనేది మానవులలో ఒక అద్భుతమైన సుగుణము. పరులతో ఏ మేలు పొందినను దానిని మరువరాదు. ఆ కృతజ్ఞతా భావము మనుష్యుని అభివృద్ధిలో గొప్పగా సహాకరిస్తుంది. పెద్దలు రెండు మరువదగినవని, రెండు జ్ఞాపకముంచుకొనదగినవని అంటారు. మరువదగినవి 1. ఇతరులు తనకు చేసిన అపకారము. 2. ఇతరులకు తాను చేసిన ఉపకారము. ఇంక సదా జ్ఞాపకముంచుకొనదగినవి. 1. ఇతరులు తనకు చేసిన ఉపకారము 2. ఇతరులకు తాను చేసిన అపకారము. రెండవదియైన ఇతరులకు తాను చేసిన అపకారము కూడ మరువరానిదట. దీనిని జ్ఞాపకము చేసుకుంటుంటే పశ్చాత్తాపము చేత పాపము దూరమవుతుంది. మరల ఇంకొకసారి అట్టి పరాపకారము ను చేయజాలము.

ఇందువలన కృతజ్ఞత అనేది మరువరానిదని బాగా తెలుసుకోవాలి.

ధర్మరాజు కృతజ్ఞతతో విదురుని అడుగుతున్నాడు. మహాత్మా! ద్వారకలో మా ఆపద్బాంధవు డెట్లున్నాడు? అందరు కుశలమేనా ?

''మన్నారా ద్వారకలో నున్నారా యదువు లంబుజోదరుకరుణన్
గన్నారా లోకులచే విన్నారా మీరు వారి విధమెట్టిదియో !!
1—304

ఈ విధముగ ధర్మరాజు అడుగుతే విదురుడావిషయమును చెప్పడు. ఎందుకంటే అప్పటికి యాదవులందరు నాశనమై ఉంటారు. శ్రీకృష్ణుడు శరీరాన్ని వదలి ఉంటాడు. అందువలన —

''అని విని ధర్మరాజునకు నా విదురుండు సమస్తలోక వ
ర్తనము క్రమంబుతోడ విశదంబుగ చెప్పి యదుక్షయంబు సె
ప్పిన నతడు గ్రశోకమున బెగ్గిలు నం డెడి నంచు నేమియున్
వినుమని చెప్పడయ్యె యదువీరులనాశము భార్గవోత్తమా !
1—305

ధర్మరాజు కృష్ణుని నిర్యాణవార్తవింటే ఘోరమైన శోకము పొందుతాడని విదురుడు చెప్పలేకపోయినాడు. దీనిలో నొక అద్భుతమైన గమనార్హమైన విషయమున్నది. ఏమంటే! ఈ ప్రపంచములో ఇతరులతో మాట్లాడినను, వ్యవహరించినను, ఎదుటవానికి సుఖము, ఆనందము కలిగించు లక్ష్యము కలిగి ఉండాలి. ఎదుటి వారికి దుఃఖము కలిగించరాదు. సజ్జనులైన వారు ఈ పనిచేయజాలరు. ఇట్టి స్వభావముతో జీవితము గడపేవారు మహానుభావులు. అట్టివారు తమ జీవితమును తీర్థమయము చేసుకుంటారు.

"మేలు చెప్పెనేని మేలంద్రులోకులు చేటుచెప్పెనేని చెట్టయంద్రు
నంతమీద శూద్రుడైన కతంబున శిష్టమరణమతడు సెప్పడయ్యె.
1–306

ఈ పద్యముపై కొంత నిగాయుంచదగినట్లున్నది. మేలుచెప్పితే మేలు చెప్పినాడని, చెడ్డచెప్పితే చెడ్డచెప్పినాడని లోకులనడము సహజమే, కావున చెప్పేవిషయమేదో ఆలోచించి చెప్పాలి. విష్ణుమరణము నతడు మంచిదిగా భావించక చెప్పలేదు.

ఒక్కొక్కతూరి తమ కిష్టము కాని మాట చెప్పకూడదంటూ కొందరంటూంటారు. ఔరంగజేబు కాలములోని మాట అది. ఒక రాజుకు ప్రియమైన ఏనుగు ఉండినది. జబ్బుతో పడినది. బ్రతికే ఆశ లేదు. ఆ రాజు మావటివానితో చెప్పినాడు. ఈ ఏనుగు చచ్చిన వార్త చెప్పితే నిన్ను ఉరి తీయిస్తా. అంతలో ఆ ఏనుగు చచ్చేపోయినది. మావటివాని పరిస్థితి సంకటములో పడినది. రాజువద్దకు పోయి చెప్పసాగినాడట. మహారాజా! ఏనుగు కదలుటలేదు, లేచుటలేదు. ఆహారము తినుటలేదు అన్నాడట. ఏమిరా! చచ్చినదా? అని రాజడిగితే "చచ్చిన"దని నేను చెప్పడంలేదు మహారాజా! మీరే చెబుతున్నారని చెప్పి ప్రమాదమును తప్పించుకున్నాడట.

ఇచ్చట విదురుడు ఆపద్బాంధవుని మరణవార్త వింటే ధర్మరాజు దుఃఖితుడౌతాడని ఆ విషయము మాత్రము చెప్పక తక్కిన వివరాలు చెప్పినాడు. ధర్మరాజు కూడ మరల మరల ఆ విషయము నడుగజాలకపోయినాడు. పెద్దలు ఒక విషయమును చెప్పకుంటే దానిని మరల మరల అడుగడము కూడ అధిక ప్రసంగమవుతుందనే దృష్టితో ధర్మరాజు విరమించుకున్నాడు.

విదురుడు అక్కడనే ధృతరాష్ట్రున్ని, గాంధారీలను చూస్తాడు. అందరికి ఆనందముగ కాలము గడచుచున్నది.

"బాలాజన శాలాధన లీలా వనముఖ్యవిభవ లీన మనీషా
లాలసులగు మానవులను కాలము వంచించు దురవగాహము
సుమతీ." 1—308

సూతుడు శౌనకాది మహర్షులతో అంటున్నాడు. శౌనకా! అంగనాజనాలూ, ఆనందభవనాలూ, అపారధనాలూ, అందాల మహలూ మొదలైన భోగభాగ్యములతో బుద్ధిపూర్వకంగా మునిగి తేలుతూ, సుఖలాలసులైన మానవులను కాలము తెలియకుండానే మోసం చేస్తుంది. వంచనా శీలమైన అట్టి కాలప్రవాహం దురవగాహము సుమా!

విదురుడు కాలజ్ఞుడు, ధృతరాష్ట్రునికి కాలము సమీపించిన విషయము తెలిసి అంటాడు.

"కనకాగార కళత్రమిత్రసుత సంఘాతంబులం ముందటం
గని ప్రాణేచ్ఛలనుండు జంతువుల నే కాలంబు దుర్లంఘ్యమై
యని వార్యస్థితి జంపునట్టి నిరుపాయంబైన కాలంబు వ
చ్చె నుపాంతంబున మాకు దీనికి మదిన్ జింతింపు ధాత్రీశ్వరా!"
1—310

రాజా! ప్రపంచములోని మానవులు బంగారు భవనాలను, పుత్ర, మిత్ర, కళత్ర పరివారాలనూ, ఎల్లప్పుడూ ఎదురుగుండా చూచుకొంటూ, ప్రాణాలమీద తీపిని పెంచుకొంటూ ఉంటారు. అయితే దుర్నివారమైన కాలం వాళ్లను చంపి తీరుతుంది. కాలాన్ని కాదని ఎదిరించే శక్తి ఎవ్వరికిని లేదు. అక్కడ ఏ యుపాయాలూ పని చేయవు. అట్టి కాలం నీ సమీపానికి వచ్చి నీకోసం ఎదురు చూచుచున్నది. దీనికి ప్రతిక్రియ నాలోచింపుము

ధృతరాష్ట్రుని పరిస్థితి చూచినాడు. ఇచ్చట బాగా తిష్ఠ వేసుకొని కూర్చున్నాడు. ఆయన మనస్సులో విరక్తిని కలిగించాలి అనుకున్నాడు. మహారాజా! నీవు ఎవరివద్దకు వచ్చి ఉన్నావో! వాళ్ళను నీవధికారములో నున్నప్పు డెన్ని చిక్కులు పెట్టినావో కొంచము జ్ఞాపకము చేసుకో. ఇప్పటి నీ పరిస్థితిని కూడ గమనించు. ఇంకను ప్రాణాలపై తీపి కలిగియున్నావే!

"పుట్టంధుండవు, పెద్దవాడవు మహాభోగంబులా లేవు నీ
పట్టెల్లం జెడిపోయె దుస్సహ జరా భారంబు పైగప్పె నీ
చుట్టాలెల్లను బోయి రాలుమగలున్ శోకంబునన్ మగ్నులై
కట్టా! దాయల పంచనుండదగునే కౌరవ్య వంశాగ్రణీ. 1-311

మహారాజా! నీవు పుట్టుకతో గ్రుడ్డివి. పైగా నీ విపుడు మూడు కాళ్ల ముసలివైనావు. మహారాజ భోగాలన్నియు పోయినాయి. అధికారం అడుగంటింది భరింపరాని వార్ధక్యం పైన బడింది. నా అన్నవారందరు గతించారు. ఈ విధముగ బ్రతికే చెడ్డ మీ భార్యాభర్తలు బండెడు దుఃఖముతో మునిగి తేలుతూ దాయాదుల పంచనబడి బ్రతకడం ఏమంత బాగుంది.

ఇంతేగాక మీరు పాండవులను ఎన్ని కష్టాలు పెట్టితిరో కొంచెము ఆలోచించినావా?

"పెట్టితిరి చిచ్చు గృహమునఁ బట్టితిరి సతీయు భార్యఁ బాడవులకున్
గొట్టితిరి వారు మనుపగ నెట్టిన భరింపవలెనె ఈ ప్రాణములన్"
1-312

మీచే నీవిధముగా కష్టపెట్టబడిన వారిచేత అవమానము చేయబడిన వారిచేత, వారి పంచను బడి వారు తిండిపెట్టితే బ్రతక డమా! ఈమాటలు విని ధృతరాష్ట్రుడు "విదురా! ధర్మరాజు మొదలగు వారంతా నన్ను ప్రేమాదరములతో విచారించుచున్నా రయ్యా! అంటాడు ఆ మాటలు విని విదురుడిట్లు ఛీ కొడుతాడు. ఏమిటీ! వారు నిన్ను బాగా చూచుచున్నారా? నీకేమైనా తెలియునా?.

"బిడ్డలకు బుద్ధి సెప్పని గ్రుడ్డికి బిండంబు వండికొని పొండిదె పై
బడ్డాడని భీముండాఙగొడ్డెములాడంగ కూడు గుడిచెదవధిపా"
1-313

ఆనాడు బిడ్డలకు బుద్ధి చెప్పజాలని గుడ్డోడు ఈనాడు సిగ్గు లేకుండా మామీదబడ్డాడు, ఈ కళ్లు లేని కబోదికింత పిండం వండి పట్టెడు కళ్ళెము పడేయండి అంటూ భీముడు పరుషవాక్కులు పలుకుచూ నీకింత పంపించుచున్నాడు. ఆ దిక్కుమాలిన తిండి తింటూ ఎన్ని దినాలు గడుపుచున్నావో! నాకు మాత్రం అర్థం కావడం లేదు. ఇంకను నీకు జీవితంపై రోతపుట్టలేదు.

"కనియెదవో బిడ్డల నిక, మనియెదవో తొంటికంటె మనుమలమాటల్
వినియెదవో యిచ్చెద రమ్మని యెదవో దానములకు నవనీసురులన్,"
1-314

ఇక ఈ జన్మలో కొడుకుల ముఖాలు చూడలేవు గదా! వెను కటి దర్పంతో మనలేవు కదా! నీ మనుమల ముద్దు పలుకులు వినలేవు కదా! అగ్రహారాలూ, దానాలూ గ్రహించడానికి ధరణీసురలను రమ్మనలేవు కదా! ఎందుకయ్యా ఈ బ్రతుకు! కావున ధృతరాష్ట్ర మహారాజా! నేనొకమాట నిక్కచ్చిగ చెప్పుచున్నాను విను.

"దేహము నిక్కముగాదని, మోహము తెగగోసి సిద్ధముని వర్తనుడై
గేహము వెలువడు నరుడుత్సాహముతో జెందుముక్తి సంపద
ననఘా" 1-315

ఈ దేహం నిత్యము కాదనే సంగతిని తెలుసుకొని, గేహము మీాద విరక్తిగలిగి యోగ్యమైన వైరాగ్యమార్గములో ఉత్సాహముగ ముందడుగు వేసేవాడే మోక్షలక్ష్మిని పొందుతాడు.

ఈ విధముగ వైరాగ్యమును కలిగించి ధృతరాష్ట్రున్ని ఆనాటి రాత్రి పిలుచుకొని విదురుడు హిమాలయపర్వతముపైకి తీసుకపోతాడు. గాంధారి కూడ వెంటనే పోతుంది. ఆ రాత్రి వారు పోయిన విషయము ఎవరికిని తెలియదు. మామూలుగ ధర్మరాజు తెల్లవారుతూనే ధృతరాష్ట్రుని పాదాలకు నమస్కారము చేయుటకు వస్తాడు. ఇంటిలో ముసలి వాళ్లిద్దరు లేరు. విదురుడు తన భవనములో లేడు. సంజయుడు ప్రక్క భవనములో ఉంటే పిలుస్తాడు. సంజయా! మా తల్లిదండ్రులు లేరు. ఎందుబోయిరి?

"మా తల్లి దండ్రులుమందిరంబున లేరు సంజయ! వారెందు జనిరో
నేడు ముందరగానడు ముసలి మా పెదతండ్రి పుత్రశోకంబునబొగులు
తల్లి సౌజన్యనిధి ప్రాణ సఖుడు మా పెదతండ్రి మందబుద్ధులమైన
మమ్ము విడిచి
ఎందుబోయిరొ మువ్వురెరిగింపు గంగలో దన యపరాధంబు
దడవికొనుచు
భార్యతోడ తండ్రి పరితాపమున బడు కపటమింత లేదు కరుణగలదు
పాండు భూవిభుండు పరలోకగతుడైన మమ్ముబిన్నవాండ్ర మనిచె
నతడు." 1-320

ధర్మరాజు ఎంతటి ధర్మమూర్తియో చూడండి! మా తల్లి దండ్రులు అని భక్తిగ వ్యవహరిస్తాడు. సౌజన్యనిధి, ప్రాణసఖుడని ధృతరాష్ట్రున్ని అంటాడు. అంతేకాదు, కపటమింత లేదు. "కరుణగలదు"

అని అంటాడు. దీనిద్వారా మనకొక సత్యము బోధపడుతుంది. ఏ మంటారా! బయటవారు మనలను గురించి యేమైనా అనుకోనీ. వారి సంగతి మన కవసరము లేదు. మన మనసులో మాత్రం ఎవరిని గురించి కాని శత్రుత్వము పెట్టుకోనవసరము లేదు. అట్టి అంతః కరణము నందనవనమువంటిది.

మన మనస్సును యే విధమైన రాగద్వేషాదులతో కలుషితము చేసుకోరాదు. ధృతరాష్ట్రుడు మరి కపటము లేకుండా నడుచుకున్నాడా? కాని ధర్మరాజేమని తలంచుచున్నాడో చూడండి. మరి ఆఖరుకు ఫలమేమి కలుగుతుందంటే నీవు మనస్సు నెట్లు పెట్టుకున్నావో ఆ విధముగానే ఫలము కలుగుతుంది.

> "ఉపకారికి నుపకారము
> విపరీతముగాదు సేయ వివరింపంగా
> నపకారికి నుపకారము
> నెపమెన్నక సేయువాడు నేర్పరి సుమతీ"

అన్న సూక్తి మన కిచ్చట ధర్మరాజు జీవన విధానములో స్పష్టముగ కనిపిస్తుంది. లోకములో నీ విధానము చాలా ప్రశస్తమైనది. అయితే దీని ననుసరించుటకు సామాన్య మానవులకు యోగ్యత చాలదు. గొప్ప సంస్కారులకు మాత్రమే సాధ్యమవుతుంది.

బయట శత్రువులను లేకుండా చేయడం సాధ్యముకాదు. ప్రపంచములో రాముని ముందర రావణుడున్నాడు. శ్రీకృష్ణుని ముందర శిశుపాలాదులున్నారు. కాని అంతఃకరణమును మాత్రం శత్రురహితముగా చేసుకొని ప్రసన్నదృష్టిని సర్వులయెడల కలిగి ఉండవచ్చును. అయితే దీనికి బాగా సాధన చేయవలసివస్తుంది.

ధర్మరాజు దుఃఖపడుతూ సంజయున్ని అడుగుతే సంజయుడు చెప్తాడు. ప్రతిదినం రాత్రి నన్ను పిలిచి ఏవో విశేషాలు అడుగుతుండే

వారు. నిన్న రాత్రి నన్ను పిలువలేదు. నేను రాలేదు. విదురుడు నూ త్రము చాలాసేపు మాట్లాడుతుండినట్లు తెలిసినది. ధర్మరాజు ఈ విధముగ దుఃఖపడుతున్నప్పుడే నారదుడు అక్కడికి వస్తాడు. నారదున్ని ధర్మరాజు తండ్రి పోయిన తెరపడుగుతాడు.

"అక్కట తల్లిదండ్రులు గృహంబున లేరు మహాత్మ వారు నే
డెక్కడ వోయిరో యెరుగ నిప్పుడు బిడ్డలపేరు గ్రుచ్చి తాఁ
బొక్కుచునుండు తల్లి యెటు బోయెనొ కోవిపదంబు రాశికిన్
నిక్కము కర్ణధారుడవు నీవు జగజ్జన పారదర్శనా. 1-324

ఈ విధముగ చెప్పుతూ ధర్మరాజు దుఃఖిస్తాడు. అపుడు నారదుడు చెప్తాడు. నాయనా ధర్మరాజా !

"మా కంచనశుచో రాజన్ యదీశ్వరవశం జగత్ ।
లోకా స్సపాలా యస్యేమే వహంతి బలిమీశితుః॥ "

నారదుడిట్లంటున్నాడు. ధర్మరాజా! దుఃఖించవద్దు. ఈ విశ్వమంతా ఈశ్వరాధీనం. లోకములు లోకపాలురు ఆ ప్రభువు ఆజ్ఞను శిరసా వహింతురు. ఆ పరమేశ్వరుడే ప్రాణులను ఒకరితో నొకరిని కలుపుతూ విడదీస్తుంటాడు. ముక్కు త్రాళ్ళు పొడిగి, మెడకు పలుపులు తగిలించి, పగ్గాలు చేతబట్టుకొని కర్షకుడు యెద్దులను త్రిప్పినట్లు ఆ ప్రభువే సమస్త విశ్వమును నడిపించుచున్నాడు.

ఆ సర్వేశ్వరునికిది ఒక క్రీడ. బంతులు మొదలైన వస్తువులు కలుస్తూ విడిపోతూన్నట్లు భగవంతుని ఇచ్ఛానుసారముగ ప్రాణులకు సంయోగ వియోగాలు ప్రాప్తిస్తాయి కొండచిలువ పట్టుకొన్న మనుష్యుడు ఇంకోమనుష్యునికి సహాయం చేయలేనట్లే పాంచ భౌతికమై, కాలకర్మాధీనమై, సంసారపంక నిర్మగ్నమైన దేహం పరులను కాపాడ లేదు. ఈ ప్రపంచమునంత ఈశ్వరస్వరూపముగ భావించు ఆయన

కంటే అన్యంలేదు. తన మాయా విశేషంచేత మహామాయావి అయిన పరాత్పరుడు బహురూపాలు ధరించి తానే భోక్తయై భోజ్యమై లోపలా, వెలుపలా అంతటా తానై విరాజిల్లుచున్నాడు. అందు వలన మహారాజా! నా తల్లిదండ్రులు దీనులే! దిక్కులేని వారే. నన్ను వదలి ఏమై పోతారో ఎలా జీవిస్తారో నన్న విచారం మాను. అజ్ఞాన మూలకమైన మమకారం పెంచుకొని అనవసరంగా మనస్సులో బాధపడవద్దు.

ఒకమాట చెబుతాను, దీని ప్రకారం నడచుకో.

"ఎంతకాలము కృష్ణుడీశ్వరుడి ద్ధరిత్రి జరించు మీ
రంత కాలము నుండు డందరు నవ్వలం బనిలేదు వి
భ్రాంతిమానుము, కాలముం గడువంగ నెవ్వరు నోప రీ
చింతయేల నరేంద్ర సత్తమ చెప్పెదన్ వినుమంతయున్"

1-327

శ్రీకృష్ణ భగవానుడు ఈ భూమిమీద ఉన్నంతకాలము మీరుండండి. ఆయన అవతారం చాలించిన అనంతరం మీరుకూడ ఉండవలసిన పనిలేదు. వ్యాకుల పడకు. ఎంతవాడయినా కాలప్రభావానికి లొంగక తప్పదు.

కాల ప్రభావము మరియు విధి బలీయము. ప్రతి వ్యక్తి విధ ననుసరించియే తన జీవితము గడుపవలె. ఒకచోట ఒక సంఘటన జరిగింది. ఏమంటే ఒక వ్యక్తి రేపు యేమి జరుగుతుందో ఎవరు చెప్పినను నేను తప్పించుకుంటానని ఛాలెంజ చేసినాడు. అచ్చటి కొక దైవజ్ఞుడు వచ్చినాడు. అతడీతని జాతకము చూచి చేయి చూచి గణితమువేసి చెప్పినాడు. నాయనా! రేపు మధ్యాహ్నం 12 గంటలకు పాయసము త్రాగుతావు. తప్పించుకోమరి నీకు చేతనైతే నన్నాడు. అందరిముందర వాడు శపథం చేసినాడు. రేపు మధ్యాహ్నం నేనే రూపములో నైనను పాయసం త్రాగను. అని

వాడేమి చేసినాడంటే మరుదినము తెల్లవారి పాయసం త్రాగకుండా తప్పించుకునేందుకు అడవికి పోయినాడు. క్రింద ఉంటే ఏమైనా ఎవరికైనా కనిపిస్తానని వాడు పెద్ద చెట్టునెక్కి కూర్చున్నాడు. వాని కాలకర్మము కొద్ది ఉదయం 8 గంటల ప్రాంతములో ఆ చెట్టు క్రిందికి ఒక పెండ్లి గుంపు వచ్చింది. వంటలన్ని చేసుకున్నారు. ఇంతలో దొంగలగుంపు ఒకటి వస్తున్నదని తెలిసి చేసుకున్న వంటలన్ని వదలి అందరు పరుగెత్తిపోయినారు. దొంగలు వచ్చినారు. వారికి ముందుకు పోవడానికి వీలు కాకుండా అక్కడి పిండివంటలు కమ్మగ ఘుభాళించినాయి. పాయసము, పకోడీలు, ఆలూభాత్ మొదలైనవి వాళ్ళను ముందుకు పోనీయలేదు. ఆ గుంపులో నాయకుడన్నాడు. "ఒరే ముందు భోంచేసుకొని ముందుకు పోదామురా" వాని మాట ప్రకారము అందరు భోజనానికి ఉపక్రమించే సమయములో నొకడన్నాడు.

ఏమంట్రా! వాళ్లు పోతూ పోతూ విషం కలిపి పోయినారో ఏమో! పరీక్ష చేసిగాని తినుటకు వీలు లేదన్నాడు. అపుడీమాట వారికందరికి సబబుగా అనిపించినది. వెంటనే అక్కడ కుక్కో, నక్కో, గాడిదో యేదేని జంతువు కొరకు చూచినారు. కాని ఏ ప్రాణి కనిపించలేదు. విసిగి చెట్టుక్రింద పండుకున్నారు. వారికి వెంటనే చెట్టుపైన ఉండేవాడు కనిపించినాడు. వాళ్ళకు సంతోషము కలిగింది. కేక వేసి ఒరే! క్రిందికి దిగిరమ్మన్నారు. దిగడానికి సందేహిస్తే రాళ్ళతో కొట్టి చంపేస్తామన్నారు. ఏమి చేస్తాడు పాపము దిగినాడు. వాళ్ళలో ఒకడు ముందు పాయసము పెట్టండ్రా?! పాయసము భలే రుచిగా ఉంది అన్నాడు. పాయసము వానికి పెట్టితే తినేటప్పుడు టైంచూస్తే 12 గంటలు. వాడు ఊరిలో ఉంటే పాయసము తినవలసివస్తుందని అరణ్యానికి పోతే అక్కడ కూడ తప్పించుకొనుటకు సాధ్యము కాకపోయినది. చూచితిరా విధి బలీయమంటే ఇట్టిది. ఈ రూపమైన

విధిని తప్పించుకొనుట కెవరికిని సాధ్యము కాదు. అని నారదుడు చెప్పి ధృతరాష్ట్ర, గాంధారీల స్థితిని తెలియజేస్తాడు.

విదురుడు ధృతరాష్ట్రుని, గాంధారిని వెంట బెట్టుకొని హిమవత్పర్వతానికి పోతాడు. ఆ పుణ్యతీర్థంలో మీ తండ్రి నిరాహారుడై కేవలము జలము మాత్రమే స్వీకరించుచు ఈషణత్రయమును విసర్జించి జితేంద్రియుడై ఏకాగ్ర ధ్యానముతో శ్రీహరిని చింతిస్తున్నాడు. తన ఆత్మను పరమాత్మలో లీనంచేసినాడు. ఇపుడు అంతరింద్రియ, బాహ్యేంద్రియ సంక్షోభము లేకుండా మాయను నిరోధించి, వాంఛలను నిర్మూలించి స్థాణువువలె పర్ణశాల లోపల ఉన్న వేదికపై నిశ్చలంగా ఆసీనుడై ఉన్నాడు.

నేటికైదవరోజు ఆయన యోగాగ్నిలో దేహత్యాగం చేస్తాడు. గాంధారి వెంటనే తన ప్రాణేశ్వరునితోపాటు ఆ అగ్నిజ్వాలలోపడి భస్మమవుతుంది. ఆ రాజదంపతుల ఆత్మత్యాగానికి ఆశ్చర్యచకితుడై విదురుడు సంతోష, సంతాపములతో పుణ్యతీర్థాలకు వెళ్ళిపోతాడు. ఈ విధముగ గాంధారీ ధృతరాష్ట్రుల కథను తెలిపి నారదుడు స్వర్గలోకానికి వెళ్ళిపోతాడు.

ఓం సర్వేజనా సుఖినస్సంతు.

ఆరవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## ఏడవ రోజు ఉపన్యాసము

"ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందు డిందు పరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వడనాదిమధ్యలయు డెవ్వడు సర్వము తానయైన వా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేడెదన్"

"యోఽంతః ప్రవిశ్యమమ వాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిల శక్తి ధర స్వధామ్నా।
అన్యాంశ్చహస్త చరణ శ్రవణ త్వగాదీన్
ప్రాణాన్ నమో భగవతే పురుషాయ తుభ్యమ్॥"

భాగవతాత్ములారా! భాగవత శ్రవణానంద చిత్తులారా!
సోదర సోదరీమణులారా!

మనము ఒక పవిత్రమైన కార్యక్రమము చేసుకుంటున్నాము. మానవులలో దైవీకార్యక్రమములయందు ఆసక్తి కలిగియుండు చిత్తము మనుష్యుల్ని ప్రాపంచిక బంధములు, ఆసక్తులనుండి కాపాడుతుంది. సాధారణముగ అసంఖ్యాకులైన ప్రజలు ప్రాపంచిక చింతనలయందే రేయింబవళ్ళు గడపుతారు. భగవత్సంబంధమైన ఆసక్తి కలిగి యుండువారు అరుదు. ఇపుడీ కార్యక్రమమునే చూడండి. వరంగల్‌లో ఎంతమంది ఉన్నారు? ఈ కార్యక్రమమున కెంతమంది వచ్చినారు?

ఈ కార్యక్రమమెట్టిది? మనుష్యుడు తన ప్రారబ్ధము కొద్ది కష్టాలలో ఉండనీ, సుఖాలలో ఉండనీ, స్వర్గములో నుండనీ, విచారములో నుండనీ, మనుష్యునిలో ఒక విధమైన వివేకమును కలిగించి మనస్సును సమాధానములో పెట్టుకునే మార్గమును చూపిస్తుందీ భాగవతశ్రవణము. ధనవంతుడవుగా, దరిద్రుడవుగా, భోగాల్లో ఉండు, రోగాల్లో ఉండు, ఐశ్వర్యవంతుడవై ఉండు. ఎట్టి పరిస్థితిలో నీవున్నా నీకు మానసిక శాంతిని ప్రసాదించి కాపాడుతుందీ శ్రవణము.

మామూలు ప్రాపంచిక మానవులు కొంచెము తమకు సంతోషము కలుగుతే ఉబ్బుతారు. కొంచెము దుఃఖము కలుగుతే దుఃఖిస్తారు. సుఖదుఃఖములలో గడియారంలోని పెండులము లాగా చలించి పోతారు. కాని యీ మార్గములోనికి ప్రవేశించినవారు. ఆ విధముగా తాపత్రయ పడరు.

జీవితములో జరుగు ప్రతి సంఘటన తాను చేసుకున్న కర్మ ఫలమే. ప్రపంచములోని ప్రతి మానవుడు తన కర్మఫలమునుండి తా నేరూపమునను తప్పించుకోలేడు. వస్తువులు, వ్యక్తులు, పదవులు ఇవన్నియు ప్రారబ్ధమునమసరించి వస్తూంటాయి పోతుంటాయి. అందు వలన కర్మ సత్కర్మముగ మారాలి. గత కాలములో ఎటువంటి కర్మ చేసుకున్నామో! దానిననుసరించి యీ జన్మవచ్చినది. అది భూత కాలపు కర్మయైనది. గడచిపోయినది. ఇపుడింక మనము చేసుకునే కర్మ మన చేతిలోనిది. కావున ఉత్తమ కర్మ చేసుకోవాలి. జీవితమును ధన్యము చేసుకోవాలి. దానికి మనలో బుద్ధి వికాసము, వివేకము కావాలి. ఆ పరిణతికి యీ భాగవతశ్రవణము ముఖ్యమైన సాధనము.

మానవుడు తన జీవితాన్ని దిద్దుకొనుటకు కర్మాధికారాన్ని ప్రసాదించినాడు భగవంతుడు. "కర్మణ్యేవాధికారస్తే" అని స్పష్ట

ముగ చెప్పినాడు. భగవంతుడు నీకు పుణ్యపాపములనివ్వడు. ఆయన నీకు బుద్ధి నిచ్చినాడు. వివేకాన్నిచ్చినాడు. తప్పొప్పులను తెలుసుకునే జ్ఞానాన్ని యిచ్చినాడు. వాటిని సదుపయోగము చేసుకొని సత్కర్మ చేసుకుంటే జీవితమమోఘమైన ఉచ్చదశనందుకుంటుంది. 'నాతో నెవరికిని కీడు జరుగరాదు. నాతో నితరులకు మేలే కలుగవలెను' అని నిశ్చయము చేసుకోవాలి. జీవితములో నిట్టిదానిని లక్ష్యముగా పెట్టుకొని కాలము గడుపుతే తన జీవితమొక నందనవనముగ తయారవుతుంది.

ఈ విధముగా గాక తాను ప్రపంచాన్ని భోగదృష్టితో చూచి ఇతరుల కథ యేమైనా కాని నాకు యీ సుఖము కావాలి. ఈ భోగము కావాలి, అని పరుల శాంతి సౌఖ్యములకు భంగకరముగ జీవితము గడుపబూనుకొంటే అట్టి జీవితము విపత్తుల కాలవాలమై బెడిసికొడుతుంది. ఆ విధమైన దెబ్బలు తిని తరువాత కుప్పై కూలబడి అయ్యో! నాకింత కష్టము వచ్చె. దేవుడనువాడొకడున్నాడా? ఉంటే నాకింత కష్టమెందుకు రావాలి? నని దేవునిపైన అవిశ్వాసతీర్మానానికి పూనుకుంటాడీ పతిత మానవుడు. దేవుడు

"నాదత్తేకస్యచిత్పాపం, నచైవ సుకృతం విభుః"

అన్నట్లుగా ఆయన పాపము నిచ్చేవాడు కాదు. పుణ్యము నిచ్చేవాడు కాదు. అంతా కర్మఫలమే. నేను చేసుకున్న కర్మ నాకు నీడవలె వెన్నంటి వుంటుంది. దేశము, కాలము పక్వమవుతూ అది సుఖరూపమున కాని, దుఃఖరూపమున కాని మనుష్యుల్ని పొందుతూంది.

భగవంతుని అమోఘమైన అనుగ్రహమునకు గురియైతే ఆయనను గురించిన జ్ఞానము సంపాదించుకుంటే, భగవదనుభూతిని పొందితే భక్తిజ్ఞానములు సంప్రాప్తమవుతాయి. వాటి ద్వారా మనుష్యుడు

తన జీవితాన్ని ధన్యము చేసుకుంటాడు. భాగవతశ్రవణమట్టి ఫలిత మును కలిగిస్తుంది. కథలోనికి ప్రవేశిస్తాము.

నిన్న నారదుడు ధర్మరాజుకు కృష్ణుడెంత కాలము బ్రతికి ఉంటాడో అంత కాలము మీరు రాజ్యము చేస్తుండండి. ఆయన దేహమును చాలించినాడని తెలుస్తూనే మీరుకూడ దేహములను త్యాగము చేయమని చెప్పి వెళ్ళిపోతాడు. ధర్మరాజు వెంటనే కృష్ణుని యోగక్షేమాలు తెలుసుకోరమ్మని అర్జునున్ని ద్వారకకు పంపుతాడు. అర్జునుడు వెళ్ళినపిదప కొన్ని దినాలు గడుస్తాయి.

ఆ సందర్భములో ధర్మరాజు భీమునితో కలిసే వేళ విషయములు ఆయనకు వింతగ కనిపిస్తే అప్పుడప్పుడు వింతగ చెబుతూంటాడు. ఒక నాటి సాయంత్రం ధర్మరాజు వాహ్యాళి వెళ్ళియుంటాడు. తిరిగి వచ్చే టప్పుడు ఒకని చేతిలో లావుటి తాళమును చూస్తాడు. దాని ప్రయో జనమేమని అడుగుతాడు. దీన్ని తలుపుకు వేస్తే దొంగలురారు మహారాజా అంటాడావ్యక్తి.

ధర్మరాజు కాశ్చర్యమవుతుంది. దొంగలు పడుతారా! ఏమి కాలము వచ్చెనని భీమునితో అంటాడు. భీమా! నేటిసంగతి ఇది అని తాళము విషయము చెప్పి కొంత కాలము క్రితము తనవద్ద కొక పంచాయితి వచ్చినదానిని గురించి తెలుపుతాడు,

ఒక రైతు ఇంకొక రైతుయొక్క పొలమును కొన్నాడు. కొన్న రైతు పొలమును దున్నుతూంటే బంగారు కుండ చిక్కినది. దాని నిండా బంగారు నాణెములుండినాయి. ఆ కుండను బంగారు నాణెము లతో వాడు రహస్యముగ దాచిపెట్టలేదు. వాడు దానిని తీసుకొని భూమిని అమ్మినవాని వద్దకు పోయి "ఇదిగో! ఈ బంగారు కుండను తీసుకొమ్మన్నాడు. నేను నీ యొక్క భూమిని మాత్రమే కొన్నాను. ఆ భూమిలో ఈ బంగారమున్నది. దీనిని కొనలేదు, కావున దీనిని

వాపసు తీసుకోండి'' అన్నాడు. దీనిని చూచి ఎదుటివాడన్నాడట. నేను ''ఎపుడు భూమినమ్మినానో అపుడు భూమిలో పంటే పండనీ, బంగారే చిక్కనీ అంతా నీదే సుమా! నాకు సంబంధంలే''దన్నాడు. ఈ పంచాయితి ధర్మరాజు నద్దకు పోయినది.

ధర్మరాజు భీమునితో అంటున్నాడు. అపుడు ''భీమా! వారిద్దరిలోను ఒకనికి పిల్లవాడు, మరొకనికి పిల్లవుంటే వారిద్దరికి వివాహము చేసి ఆ పాత్రను కన్యకు పేరుతో యిచ్చేటట్లు సమాధానము చెప్పి పంపితిని. ఆ పంచాయితీ చేసిన వాడనూ నేనే. ఇపుడీ రూపమున తాళము చూచినవాడనూ నేనే. అయినా భీమా! నారదుడు చెప్పిన కలియుగ విశేషాలు చాలా విపరీతముగా కనిపిస్తూన్నవి. కొంచెము చెబుతాను విను.

''ఒక కాలమున బండు నోషధీచయము వేరొక కాలమున
బండకుండునంద్రు
క్రోధంబు లోభంబు క్రూరతబొంకును దీపింప నరులు వర్తింతురంద్రు
వ్యవహారములు మహావ్యాజయుక్తములంద్రు సఖ్యంబు
వంచనాసహితమంద్రు
మగలతో నిల్లాండ్రు మచ్చరించెదరంద్రు సుతులు దండ్రుల తెగజూతు
రంద్రు.
గురుల శిష్యులు దూషించి కూడరంద్రు శాస్త్రమార్గము లెవ్వియు
జరుగ వంద్రు
న్యాయపద్ధతి బుధులైన నడువరంద్రు కాలగతి
వింతయై వచ్చె కంటె నేడు'' 1 - 332.

ఈ పద్యములో చెప్పబడిన విషయాలు మనకిపుడు నిత్యసత్యములు. ఓషధీచయమంటె పంట. ఇది ఒక కాలములో పండుతుందట మరొక కాలములో పండదట అని వారు ఆశ్చర్యముతో చెప్పుతున్నారు.

మనుష్యులు చాలా మంది క్రోధాది దుర్గుణములతోనే వ్యవహరించు చున్నారు. వ్యవహారములు వ్యాజయుక్తములు. అంటే మోసముతో గూడుకొని ఉంటాయని అర్థము. కాబట్టి కలికాలములో నిట్లు జరుగు తుందట భీమా! అని ధర్మరాజు విస్మయముతో చెప్పుచూ నరుని రాకకు నిరీక్షించుచున్నాడు.

ఇంతలోనే అర్జునుడు మ్లానముఖుడై తలను క్రిందికి వంచుకొని విషాదముతో అక్కడికి వస్తాడు. అర్జునుని ముఖమావిధముగా నుండ డము ధర్మరాజెప్పుడును చూడలేదు. అర్జునుడు అశ్రుపూరిత నేత్రా లతో భరింపరాని దుఃఖముతో అగ్రజుని పాదాలపై వ్రాల్తాడు.

ధర్మరాజు ఆశ్చర్యము, విస్మయముతో అర్జునా! మన ఆప ద్బాంధవుడు, యాదవులందరు కుశలమేనా? బలరాముడు క్షేమ మేనా? అని ఇదేమిటయ్యా! ఇట్లు దుఃఖించుచున్నావని గుచ్చి గుచ్చి అడుగుతాడు మారుపలుకవేమయ్యా!

"ఓడితివో శత్రువులకు,
నాడితివో సాధుదూషణాలాపంబుల్
గూడితివో పరసతులను
వీడితివో మానధనము వీరులనడుమన్." 1-354

'తప్పితివో యిచ్చెదనని
చెప్పితివో కపటసాక్షి చేసిన మేలుం
దప్పితివో శరణార్థుల
రొప్పితివో ద్విజులఁబసుల రోగులసతులన్." 1-355

అని ఈ విధమున ధర్మరాజు అడిగితే కన్నీరు తుడుచుకొనుచూ అర్జునుడు పలుకుతాడు.

"మన సారధి మన సచివుడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుడున్

మనవిభుడు గురువు దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా" 1-358

అన్నయ్యా! మన ఆపద్బాంధవు డింక లేడు. ఆయన సహాయముతో మనమెన్నెన్నో అద్భుత కార్యములు సాధించి యుంటిమి.

"దిక్కుల రాజులనెల్లను
మక్కించి ధనంబు గొనుట మయకృత సభము
న్నెక్కుట జన్నము సేయుట
నిక్కము హరి మనకు దండ నిలిచినఁగాదే". 1-361

నానా దిక్కులలోని రాజులను యుద్ధములో జయించి అశేష ధనరాసులను వైవసం చేసుకొనుట, మయసభను అందుకొన్నదీ, రాజసూయయాగము నిర్వహించినదీ నిజానికి మనకు ఆయన బాసటగా నిలుచున్నందు వలననే.

"ఇభజిద్వీర్య! మఖాభిషిక్తమగు నీ యిల్లాలి ధమ్మిల్లమున్
సభలో శాత్రవులీడ్చినన్ ముడువ కా చంద్రాస్య దుఃఖింపగా
నభయం బిచ్చి ప్రతిజ్ఞ చేసి భవదీయారాతి కాంతా శిరో
జభరశ్రీలు హరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్". 1-362

రాజసూయ యాగమున అభిషేకములో పవిత్రమైన ఈ యిల్లాలి కొప్పును సభలో శత్రువు లాగినపుడు ఆ సతి యేడ్వగా ఆమెకు అభయమిచ్చి శత్రుకాంతల సౌభాగ్యాన్ని హరించి మనకు జయం చేకూర్చిన ఆప్తబాంధవుడు ఆయనే కదా!!

ఈ విధముగ ఆయన చేసిన మేలు అనంతముగ అనుకుంటూ దూర్వాసుని కథను జ్ఞప్తికి తెచ్చుకొని దుఃఖపడుతారు. అర్జునుడు దారిలో దొంగలతో లూటీ చేయబడుతాడు. కాని ఆ దొంగలను ఏమియుః చేయఃజాలడు. దీనిని చెప్పి దుఃఖిస్తాడు. కొన్ని పాత స్మృతులను జ్ఞాపకము చేసుకుంటారు. ఒకనాడు దుర్వాసు డెక్కడికో పోతూ పోతూ దుర్యోధనుని అంతఃపురానికి వెళ్ళుతాడు. ఆయనను ఆసాధ

శుద్ధ ఏకాదశి నాడు తన వద్ద ఉంచుకొని "స్వామీ! చాతుర్మాస్యము ఇక్కడనే పూర్తి చేయండి" అని ప్రార్థిస్తాడు దుర్యోధనుడు, దూర్వాసుడది విని వానికోరిక తీర్చే ఉద్దేశ్యముతో చాతుర్మాస్య మక్కడనే నడుపుతాడు. వారు రేయింబవళ్లు ఆయన కెట్టి లోటు లేకుండా కంటికి రెప్పగా చూచుకుంటారు. చాతుర్మాస్యము సమాప్తమవుతుంది. మహాత్ములు సేవలు పొంది ఊరక పోరుకదా! "దుర్యోధనా! నీ సేవలకు మెచ్చినాను. ఏమైనా కోరుకో ఇస్తా" నంటాడు. వచ్చినవాడు మునీశ్వరుడు. ఎంతమంచి వరమడిగిన యిస్తాడు. కాని దుర్యోధనుడేమి కోరినాడంటే మహాత్మా! రేపు వచ్చే ఏకాదశినాడు నీరుకూడ త్రాగకుండా ఉపవాసముండండి. ద్వాదశి నాడు కూడ అటులనే మధ్యాహ్నం మూడు గంటలవరకుండి భోజనానికి పదివేల మందిని తీసుకొని ద్వైతవనములోని పాండవులవద్దకు పోండి స్వామీ! ఇంతే చాలు అంటాడు. దుర్వాసునికి ఆశ్చర్యమౌతుంది ఈ వరము వాడు కోరితే. కాని మాట యిచ్చినాడు. కావున సరేనని వెళ్ళిపోయినాడు.

ఏకాదశినాడు నిర్జలోపవాసముంటే ద్వాదశినాడు సూర్యోదయమగు సరికి భోజనాలు చేయవలె. కాని మరుసటి రోజు కూడ మధ్యాహ్నం మూడు వరకు ఉంటే కడుపులో మంటలు బయలు దేర్తాయి.

మధ్యాహ్నం మూడు గంటలైన తరువాత వాడు భోజనానికి పొమ్మనుటలో నొక అంతరార్థమున్నది. పాండవులవద్ద సూర్య భగవానుడిచ్చిన అక్షయ కలశమున్నది. అది మధ్యాహ్నం 12 గంటల వరకు ఎందరు వస్తారో అందరికిని భోజనాన్ని ప్రసాదిస్తుంది. ద్రౌపది యెపుడు తిని కడిగి పెడుతుందో ఇంక దానిలో నేమియు పుట్టదు. ఇందువలన దుర్యోధనుడు దుర్వాసున్ని మధ్యాహ్నం మూడు గంటలకు పొమ్మంటాడు.

పాండవులు ఆ వేళపు డంత మందికి భోజనము పెట్టలేరు. కడుపులో కాలిన ముని పాండవులకు శాపము పెట్టి వారిని నాశనము చేస్తాడని దుర్యోధనుని భావన. అయితే యేమి జరిగింది? దుర్వాసుడు పదివేల మంది శిష్యులతో మధ్యాహ్నం భోజనానికి వచ్చినాడు. అప్పటికి పాండవులందరు పండుకొని ఉంటారు. ధర్మరాజు పదివేల మంది పాదధ్వనికి మేల్కొని చూస్తాడు. ఇంకేముంది. దుర్వాస మహర్షి ఆకలిగొని వచ్చుచున్నాడు. ఆయనకు సాష్టాంగనమస్కారము చేసినాడు ధర్మరాజు. అపుడా దుర్వాసుడు "ధర్మరాజా! ఇపుడు నమస్కారాలకు పురస్కారాలకు సమయము లేదు. మేమంతా ఆకలితో అలమటిస్తూన్నాము. ఇంతమందికి భోజనము నేర్పాటు చేయు" మన్నాడు. ధర్మరాజు లేదనగలుగుతాడా! "మంచిది మహాత్మా! స్నానము చేసిరాండి" అన్నాడు. ద్రౌపది చూస్తూంది. మగవారు రమ్మంటారు. వడ్డించే వంతు ఆడవారిది కదా! భయసంభ్రమాలతో లోపలికి వెళ్ళి కృష్ణా! ఆపద్బాంధవా! ఈ గండమును తీర్చుటకు నీవే సమర్థుడవని ఆర్తనాదము చేసింది. ఆ సమయానికి ద్వారకలో కృష్ణుడు నిద్రలేస్తే రుక్మిణి ఆయనకు ఉపాహారము తెస్తూండినది. "రుక్మిణీ! నాకు టిఫిన్ ద్వైతవనములో నున్న"దని పాండవులవద్దకు వస్తాడు. ద్రౌపదితో "చెల్లీ! దుఃఖపడవద్దమ్మా! నాకుకూడ ఇపుడు టిఫిన్ టైమ్. ఆ అక్షయకలశ మిట్లా తీసుకరమ్మం"టాడు. ఏమీ లేదన్నయ్యా కడిగిపెట్టినా నంటుంది ద్రౌపది. అయినను తెప్పించుకొని ఏదో మూలన అర్ధము మెతుకు కర్చుకొని ఉంటే దానిని నోటిలో వేసుకొని నాలుగు గ్లాసులు నీళ్లు త్రాగుతాడు. కృష్ణుడెట్లాగు నీళ్ళు త్రాగుచున్నాడో దూర్వాసుడు, ఆయన శిష్యుల కడుపు లట్లట్ల నిండినాయి. దుర్వాసుడు, ఆయన శిష్యులకు కడుపులు పూర్తిగ నిండి భుక్తాయాసము కలిగినది. వారచ్చటనే పచ్చిక బయలులో ఆయాస మధికమై దొర్లుతూ నిలిచిపోయినారు. ఎంతసేపటికి రాకపోతే

కృష్ణుడు భీమున్ని పంపిస్తాడు. భీమా! నీవు పోయి వారిని త్వరగా రమ్మను. "నీ శిష్యుడు కూడ వచ్చినాడు. మీతో కలిసి భోంచేస్తాడట రమ్మను" అని చెప్పి పంపినాడు. భీముడు అచ్చటి దృశ్యము చూస్తే ఇంకేమున్నది. అందరు కడుపులు తీడుకుంటూ వచ్చిక బయలులో దొర్లాడుతున్నారు. భీముడు స్వామీ! త్వరగా రాండి మహానుభావా అన్నాడు. అపుడు దుర్వాసుడు ధర్మరాజు వద్దకు వచ్చి "ధర్మరాజా మీ వైపు కృష్ణపరమాత్ముడున్నాడు. సర్వకార్యములయందు నీకు విజయమే కలుగుతుంది. సుఖమగుగాక" అని ఆశీర్వదించి వెళ్లినాడు.

రేయింబవళ్ళనకుండా సేవచేసి వరములను పొందినది దుర్యోధనుడు. శుభమును పొందుండేది ధర్మరాజు. దుష్టులయొక్క కర్మఫల విధానా లిట్లుంటాయి. అర్జునుడీవిధమున శ్రీకృష్ణభగవానుని గురించి అనేక విధముల అనుకుంటూ దుఃఖపడ్డాడు.

"అటమటమయ్యె నా భజన మంతయు భూవర! నేడు సూడుమా
యిటువలె గారవించు జగదీశుడు కృష్ణుడు లేని పిమ్మటన్
బటుతర దేహాలోభమున ప్రాణములున్నవి వెంటబోక నే
గటకట పూర్వజన్మమున కర్మము లెట్టివి చేసినాడనో!" 1-373

కృష్ణుడు లేనప్పుడు నా శరీరమింకను ఉన్నది. నేను పూర్వ జన్మమున నెట్టి ఖర్మ చేసినానోయని అర్జునుడు పలువిధముల శ్రీకృష్ణుని గురించి తలంచుచూ హరి పరాయత్తమైన చిత్తముతో మౌనం వహించాడు. సంతత గోవింద చరణారవింద స్మరణముతో స్వచ్ఛమైన బుద్ధి కలవాడై శోకాన్ని వదలుకున్నాడు. నిరంతర ధ్యానరూపమైన భక్తి విశేషముతో కామక్రోధాదులను జయించినాడు. పూర్వము కురుక్షేత్రంలో కౌరవ పాండవ సేనా మధ్యంలో వాసుదేవుడు తనకు బోధించిన గీతా వాక్యాలు మననం చేసుకున్నాడు. కాలానుగుణముగ

కర్మల ననుభవించుట చేత మరుగుపడిన గీతాజ్ఞానాన్ని మరల అందు కున్నాడు.

అర్జునుడు కార్యకారణ భావాన్ననుసరించి శోకానికి అహంకార మమకారాలతో కూడిన ద్వైతభ్రాంతియే కారణమని ఆ ద్వైత భ్రాంతికి శరీరము కారణమనీ, ఆ శరీరానికి లింగం కారణమనీ, ఆ లింగశరీరానికి గుణాలు కారణమని, ఆ గుణాలకు ప్రకృతి కారణమని గ్రహించాడు. 'అహం బ్రహ్మాస్మి' అనే జ్ఞానంతో ప్రకృతి విలీనమై పోతుందనీ, ప్రకృతి నశించడమే గుణరాహిత్యమనీ, గుణరాహిత్యమే లింగ శరీరనాశమని, లింగ శరీరరాహిత్యమే జన్మరాహిత్యమని తెలుసుకున్నాడు. ప్రకృతిని పరిత్యజించిన పురుషుడు తిరిగి స్థూల శరీరాన్ని పొందక బ్రహ్మైక్యాన్ని పొందుతాడని నిశ్చయించుకొని అర్జునుడు విరక్తుడైనాడు. కుంతీదేవి ఆ క్షణములోనే ప్రాణాలను వదలుతుంది.

ధర్మరాజు శ్రీకృష్ణుని అవతార సమాప్తిని, యాదవుల వినాశనాన్ని తెలుసుకొని, నారదుడు చెప్పిన మాటలు తలంచుకొని మహాప్రస్థానమునకు సిద్ధమౌతాడు. తమ్ములందరు, ద్రౌపది హిమాలయములో ప్రవేశిస్తారు.

మహాప్రస్థానమంటే హిమాలయములో వెనక్కు చూడకుండ ప్రాణం పోయి పడిపోవువరకు పోతూనే ఉండాలి. ఆకలి దప్పుల సమస్య లేదు. ఆ విధముగ పోతూంటే ద్రౌపది ముందు పడిపోతుంది. భీముడు ధర్మరాజు నడుగుతాడు. "అన్నయ్యా! ద్రౌపది ముందు ఎందుకు పడిపోయింది?" ధర్మరాజు చెప్తాడు. "భీమా ద్రౌపదికి భర్తలందరు సమానమైనా అర్జునునిపైన ఆమెకు అధికప్రేమ. అందు వలన పడిపోయినది." ముందుకు పోతూండగ సహదేవుడు పడిపోతాడు. దానికి కారణమడిగితే వానికి జ్ఞానిననే అభిమానముండుటయే కారణమంటాడు ధర్మరాజు. తరువాత నకులుడు పడిపోతాడు. అతనికి

రూపాధిక్యత కలవాడననే అహంకారము కారణమంటాడు. పిమ్మట
అర్జునుడు పడిపోతాడు. అతనికి తన అస్త్ర విద్యాభిమానముండినదని
చెప్తాడు. భీముడు కూడ పడిపోతాడు. "భీమా! నీకు తిండిపైన
ఎక్కువ అపేక్ష. నీవు తినేటపుడు ఎవ్వరైనా వస్తే భోజనానికి మాట
వరుసకైనా రమ్మనకుండా తింటూంటివి. అదియే దీనికి కారణము"
అని ధర్మరాజు ఒంటరిగ ముందుకు సాగిపోతాడు.

ధర్మరాజు ధర్మమును పరీక్ష చేయడానికి ధర్మదేవతయే ఒక
కుక్క రూపములో వచ్చి ఆయన వెంట ఉంటుంది. అపుడు దేవేం
ద్రుడు ధర్మరాజును సశరీరముతో స్వర్గలోకానికి తీసుక రావలసినదని
మాతలిని పంపుతాడు. అపుడు మాతలివచ్చి విమానములోనికి
రావలసినదని ధర్మజున్ని ప్రార్థిస్తాడు. ధర్మరాజంటాడు. "మహాత్మా!
నా వెంట ఈ కుక్క ఉన్నది. దీనిని వదలి వచ్చుటకు వీలు పడదు.
సత్పురుషుల స్నేహం సాప్తపదీనమని ఆర్యోక్తి. కావున కుక్కను
కూడ విమానములోనికి ఎక్కించుకునేటట్లైతే నేను విమాన
మెక్కగల" నంటాడు.

దానికి మాతలి ఇది యేమి వింత ధర్మరాజా! స్వర్గలోకానికి
ఎవ్వరైనా కుక్కలను తీసుకొని పోతారా? సాధ్యము కాదు అంటాడు.
అట్టి పక్షములో నేను కూడ రానని ధర్మరాజు నిష్కర్షగ చెబుతాడు.
అట్టితరి ధర్మదేవత ప్రత్యక్షమై "ధర్మరాజా! నీ యాదర్శమైన
చరిత్ర భూలోకములో చంద్రసూర్యులున్నంతవరకు కీర్తించబడును
గాక" అని ఆశీర్వదిస్తాడు.

ధర్మరాజును గురించి ఇంకొక్క విషయము కూడ పెద్దలు
చెప్తారు. ఏమంటే! ఆయన యుద్ధములో "అశ్వత్థామ హతః కుంజరః"
అని అబద్దము చెప్పినదానికి నరకలోకాన్ని దర్శించిరావలసిన శిక్ష యేర్ప
డినదట. అందుకుగాను ఆయన ముందు నరకలోకమునకు పోతాడట.

ధర్మరాజు పోతూనే నరకలోకవాసులైన పాపులకు చల్లనిగాలి సోకి మనస్సు చాలా ఆహ్లాదమవుతుందట. వారు ధర్మరాజును ప్రశంస చేస్తారు. ధర్మరాజు వారికి కలిగిన శరీరతాప శాంతికి కారణము తెలుసుకొని "నేను భూలోకములో చేసిన పుణ్యమంతా వీరికు ధార పోస్తున్నాన"నన్నాడట. దానికి దేవతలు సంతోషించి "ధర్మరాజా! నీవు కేవలము పరుల క్షేమము కోరి నీ ధర్మశక్తి నంతయు ధార పోసినావు. కావున నీకు ఇంతకంటె పదింతలు ధర్మశక్తిని ప్రసాదించుచున్నా"మని శక్తిని ప్రదానం చేసినారట. దీని ద్వారా తెలిసే సత్యమేమంటే ఇతరుల మేలు కోరి మనమొక త్యాగము చేస్తే అది తిరిగి అనంతమైన కళ్యాణానికే హేతుభూతమవుతుంది. ఇదే ధర్మము లోని అమోఘశక్తి. ఇట్టి ధర్మశీలున్ని దేవుడు తన కృపకు పాత్రు నిగా చేసుకుంటాడు.

"నాముత్ర హి సహాయార్థా పితా మాతా చ తిష్ఠతః।
న పుత్రదారా నజ్ఞాతిః ధర్మ స్తమనుగచ్ఛతి॥

పరలోకములో మాతా, పితా, పుత్ర, భార్యాదులు మనుష్యుని వెంటబోరు. కేవలము తాను చేసుకున్న ధర్మము మాత్రం తన వెంట పోయి కాపాడుతుంది.

"ధర్మప్రధానం పురుషం తపసాహతకిల్బిషమ్।
పరలోకం నయత్యాశు భాస్వంతం సశరీరగమ్॥"

అంటే ధర్మ ప్రధానుడైన పురుషుడు, తన తపస్సు చేత పాపమును దూరము చేసుకొని పరలోకములోనికి ప్రకాశిస్తూన్న సూర్యుని మాదిరి పోతాడట,

ఈ విధముగ పాండవుల నిర్యాణము జరుగుతుంది. ఇట్టి పాండవ కృష్ణుల నిర్యాణాన్ని గురించి ఎవరు వింటారో, చదువుతారో వారు కైవల్యపదమును పొందుతారు. ఇది శ్రుతి ప్రమాణము.

''పాండవకృష్ణుల యానము పాండురమతి నెవ్వడైన పలికిన విన్నన్
ఖండిత భవుడై హరిదాసుండై కైవల్యపదము సొచ్చు నరేంద్రా
1-389.

మనము పూర్వజన్మములో నెంతో పుణ్యము చేసుకున్నాము. కావున ఈ కథను శ్రద్ధగా శ్రవణము చేసుకునే భాగ్యాన్ని పొందినాము. ఇంతకు ఇక్కడ నొక సత్యమును గమనించాలి. ధర్మాచరణకు జీవితములో అధికమైన ప్రాధాన్యము నివ్వాలి. అదియే మన వెంట వచ్చి మనలను మరణానంతరమార్గాన్ని సుగమము చేసేది.

ఒకనికి కోర్టులోనికి వచ్చి సాక్ష్యము చెప్పవలసిన అవసరము కలిగినదట. ఒక సాక్షి లేచి''అయ్యా! నేను సాక్ష్యము చెప్పగోరినాను. కాని నేనున్న చోటు నుండి కదలలేను''అన్నాడట. రెండవవాడు వచ్చి నేను కోర్టుదగ్గరకు వస్తాను కాని లోపలికి రాజాలనన్నా''డట. ఇంకొకడు లేచి నేను లోపలికి వచ్చి సాక్ష్యము చెప్తానన్నాడు. వీళ్లెవరంటే మొదటివాడు ఉన్నచోటనే ఉండేవాళ్ళు ధనము, పశువులు, భూములు మొదలగునవి. నేను కోర్టువరకు వస్తానన్న వారెవరు? వారే బంధువులు, బాంధవులు, భార్య బిడ్డలు మొదలగువారు. వీరు స్మశానము వరకు వస్తారు. కాని వాని వెంటపోయి రక్షించలేరు. అయితే నేను కోర్టులోనికి వచ్చి సాక్ష్యము చెప్పి రక్షిస్తాననే వాడు ధర్మము. వీడు నీడవలె వచ్చి అన్నిచోట్ల కాపాడుతాడు. కావున ధర్మప్రధానియైన పురుషుడు ''భాస్వంతం సశరీరగమ్'' అన్నట్లుగా ప్రకాశిస్తూ శరీరముతో (సూక్ష్మ) శరీరముతో ఊర్ధ్వలోకాలకు పోతాడట. ఈ విషయమిచట ముఖ్యముగ గమనించవలయును.

ధర్మరాజు మహాప్రస్థానానికి పోయేటపుడు పరీక్షిత్తుకు పట్టాభిషేకము చేసిపోయి యుంటాడు. పరీక్షిన్మహారాజు ధర్మానకూలముగ రాజ్యము చేస్తూంటాడు.

ఒక పర్యాయము దిగ్విజయయాత్ర జేసి తిరిగి వస్తుంటాడు. అపుడొక విచిత్రమైన దృశ్యాన్ని చూస్తాడు. ధర్మదేవత వృషభ రూపములో నున్నది. భూదేవి గోవురూపములో వున్నది. ఇట్టి ఆ వృషభ గోవులను నల్లటిశరీరము గల కలిపురుషుడు తంతూన్నాడు. ఆ దృశ్యము చూచి పరీక్షిన్మహారాజుకు కోపము వచ్చి "మేఘగంభీరయా వాచాసమారోపిత కార్ముకః" మేఘగంభీర గర్జనతో వానిని సంహరించుటకు ధనుస్సు నెక్కుపెట్టాడు. ఏమిరా దుర్మార్గా!

"నిన్నుం గొమ్ముల జిమ్మెనో? కదిసెనో నిర్భీతివై గోవులం
దన్నం గారణమేమి మద్భుజ సనాథ క్షోణి నే వేళలం
దుష్కరంబులు సేయరాదెరుగవా? ధూర్తత్వమున్ భూమి భృ
త్సన్నాహంబు నొనర్చి తెవ్వడవు నిన్ శాసించెదన్ దుర్మతీ॥
1-415

దుర్మార్గా! నిన్ను కొమ్ములతో పొడిచినాయా? నిర్భీతుడవై యీ గోవుల నెందుకు కొట్టుచున్నావు? నా రాజ్యములో నేరము చేయరాదు కదా! రాజువలె నటన చేయుచున్నావు. నిన్ను సంహరిస్తానన్నాడు.

అంటూనే కలి పరీక్షిన్మహారాజు కాళ్ళపై బడి ప్రాణభిక్ష వేడుకున్నాడు. కలి కాళ్ళను ముట్టుకోవడము కూడ మంచిదిగాదు. వీని అణువులు ఆయనలో ప్రవేశిస్తాయి. కలిని నా రాజ్యమును వదలి పొమ్మన్నాడు. అపుడు కలి మహాత్మా! నేనెక్కడికి పోవుదు? సప్త సముద్రముల వరకు ఎల్లలుగ నీరాజ్యమున్నది. నన్ను ఫలానా చోట ఉండమంటే అక్కడ ఉంటా"నన్నాడు. అపుడు పరీక్షిన్మహారాజు ఆలోచించినాడు. తన రాజ్యములో తనకు తెలియకుండు పాతక స్థానములను కొంచెమాలోచించి ప్రాతివధ, వ్యభిచారము, జూదము, పానము ఎచ్చట ఉంటాయో అచ్చట ఉండుమని ఆదేశిస్తాడు. ఈ

మాటలు విని కలి వినయముతో "స్వామీ! ఈ నాలుగు స్థలాలు నీ రాజ్యములో వెతికితే చిక్కవు. కావున నా జీవితమునకు ఇంకను కొన్ని స్థలములను చూపితే విహరించుటకు నాకు వీలుకలుగుతుంది. దయయుంచి ఇంకను కొన్ని స్థానాలు నేనుండుటకు అనుజ్ఞను ఇవ్వండి ప్రభూ!" అంటాడు.

దానికి పరీక్షిత్తు మరల బాగా ఆలోచించి ఇంకను అయిదు స్థలాలు మంజూరు చేస్తాడు. అవి అసత్యము, మదము, కామము, హింస, వైరములు. ఈ విధముగ తొమ్మిది స్థానాలు పొంది కలి తృప్తిపడ్డాడు.

దీనిద్వారా మనము తెలుసుకోవలసినదేమంటే, పై తొమ్మిదింటిలో దేనినైనను మనము పొందినామంటే కలి మనయందు ప్రవేశించినాడన్నమాటే. ప్రాణిహింస ఏ రూపములో జరుగరాదు. వ్యభిచారము మహాపాపము. దానిద్వారా జీవితాలే పాడైపోతాయి. జూదము, పానము, అసత్యము, మదము, కామము, హింస, వైరముల నుండి మనము మనను కాపాడుకొని జీవితమును గడపవలెను.

ఇంతకుముందు ధర్మదేవతకు కలికాలములో ఒకటే కాలున్నదని తెలుపబడినది. ధర్మమునకు నాలుగు పాదములు. అవి సత్యము, తపస్సు, పవిత్రత, దానము. ఈ నాలుగు పాదములు ధర్మమునకు కృతయుగములో ఉండినవి. త్రేతములో మూడు, ద్వాపరములో రెండు, కలియుగములో ఒకటే పాదము మిగిలినది.

ధర్మముయొక్క పాదాలను గురించి కొంత మననము చేసుకుందాము. సత్యమంటే పరమాత్మ స్వరూపమే. అందువలన సత్యవ్రతునికి ప్రపంచములోని పుణ్యఫలాలు సులభముగ లభ్యమవుతాయి. భారతములో దీనిని గురించి చెప్పినది చూడుడు.—

"వెలయంగ నశ్వమేధములు వేయును నొక్క సత్యమును నిరుగడలం
దులనిడి తూపగ సత్యమువలననములు సూపు గౌరవంబున పేర్మిన్"

అంటే వేయి అశ్వమేధముల ఫలమును, ఒక సత్యముతో తూకము వేస్తే ఆ ఫలమే తేలికయైనదట.

"సర్వతీర్థాభి గమనంబు సర్వవేదసమధిగమము సత్యంబుతో
సరియుగావు
నెరుగుమెల్ల ధర్మంబులకెల్ల పెద్దయండ్రు సత్యంబు ధర్మజ్ఞులైనవారు"

సర్వతీర్థములు సేవించిన ఫలముకంటే సత్యము గొప్పది. అందువలన దీనిని గురించి యింకను యేమని చెప్పబడినదో చూడుడు.

"ఆత్మహేతోః పరార్థేవా నర్మహాస్యాశ్రయా త్తథా ।
యే మృషానవదంతీ హ తే నరాః స్వర్గగామినః ॥"

అంటే తనను గురించికాని, ఇతరులను గురించి కాని, నవ్వులాటలకు కాని అసత్యము పలుకని మనుజులు తప్పక స్వర్గానికి పోతారు.

చూడండి సత్యము యొక్క ఆచరణ సాధ్యము కాదని చాలా మంది వ్యాపారస్తుల భావన కాని యీ సత్యమే సులువైనదని మహాత్ముల భావన. అసత్యము పలికే వానికి మనశ్శాంతి ఉండదు. ఒక అబద్ధము నాడితే దానిని ఋజువు పరచుకునేందుకు మరెన్నియో అబద్ధముల నాడవలసి వస్తుంది. మన జీవితములో దీనిపైన నిగా ఉంచుతే అది మనకు సాధ్యము కానిది కాదు.

ఒక ఉదాహరణ. ఇంటినుండి బయటికి పోవుచున్నాము. పిల్లవాడు నాన్నా! నాకు చాక్లేట్లు తీసుకరమ్మన్నాడనుకోండి తెస్తానంటావా? ముందు కొనుక్కొని వాటిని జేబులో పెట్టుకో, లేకుంటే ఇంటినుండి పోయేటపుడే ఇపుడు నాకు వీలుపడదని స్పష్టముగ చెప్పు. ఇట్టి చిన్న చిన్న విషయాలపై కూడ మనము నిగా ఉంచి నడుచుకుంటే అసత్యవర్తనమునుండి మనలను కాపాడుకోగలుగుతాము.

మన మొక్కొక్కచోట లూజుగా మాట్లాడుతాము. దానిని బొత్తిగా మానుకోవాలి. మనము చేసేటట్లైతే ఇతరులతో నీకు ఫలానా పని చేస్తా లేక వస్తువు నిస్తానని చెప్పాలి. చెప్పిన తరువాత నూరుకు ఆరైనను, ఆరుకు నూరైనను అది చేసి తీరాలి. అట్లు చేయ జాలకపోతే నోట ఆ మాటను పలుకరాదు.

నేనొకపుడు అదిలాబాదులో కాలేజీలో లెక్చరరుగా ఉంటిని. మా యింటి పక్కలో నొక గెజెటెడ్ హెడ్మాష్టరుగారుండిరి. నాతో ఒకనాడు "తులసీరామాయణములోని సుందరకాండ నేను వినాలని ఉందండీ. నాకు వినిపించుతారా?" అని నన్ను ప్రశ్నిస్తే తప్పకుండా వినిపిస్తానని ప్రతిదినము కాలేజినుండి వచ్చి ఒక గంట విని పిస్తూంటిని. ఒకనాడు ఆ హెడ్మాష్టరు మా యింటిలోనికి వచ్చి చూచినాడు. ఇల్లు చాలా చిన్నది. పెట్టుకొనేందుకు స్థలంలేక పుస్తకా లన్నియు చెల్లాచెదరుగా పడియున్నది. మా యిల్లు రెండే రూములు కలది. అది లో ఇన్‌కమ్ గ్రూప్ హౌస్, ఆ పుస్తకాలను చూచి ఆయన పాపము ఔదార్యముతో సార్! వెంకటసుబ్బయ్యగారూ! మీకు పుస్తకాలు పెట్టకొనుటకు ఒకటి మంచి రాక్ చేయిస్తానండీ చెక్కతో" అన్నాడు. ఆయన హెడ్మాష్టరు, అందులో గెజెటెడ్ కూడ, ఆ స్కూలులో కార్పెంటరీ డిపార్ట్‌మెంట్ కూడ ఉన్నది. కావున చేసి యివ్వవచ్చునని నేను తలంచినాను. కాని యీ దినానికి కూడ ఆయన రాక్ చేసియివ్వలేదు. ఆయనను ఆ దినంకూడ నేను అడు గనే లేదు. తాను స్వయముగా చెప్పడమెందుకు? చేయించకుండా ఉండడమెందుకు? ఆయన చేయించదలచుకుంటే చేయించవచ్చు. ఈ విధమైన అసత్యదోషానికి ఎవరును గురికారాదు. మనచేత నయ్యేట ట్లుంటే మాట్లాడాలి. మాట్లాడినతరువాత ప్రాణాలొడ్డి మాటనుకాపా డుకోవాలి. ఇట్టి సత్యమువలన మానవునకు దైవీశక్తి వశమవుతుంది.

ఇంతవరకు సత్యమును గురించి సామాన్య చర్చ చేయడం జరిగింది. ఈ సత్యముయొక్క ధర్మసూక్ష్మతను పరిశీలిస్తే ఇది పరోప కారమునకు సంబంధించిందిగా ఉండాలి. అట్లు లేకుండా ఇతరులకు కష్టము కలిగించేటట్లుంటే అది అసత్యఫలాన్నిస్తుందని ధర్మశాస్త్రము చెబుతుంది. చూడండి:-

"ఉన్నది విన్నది కన్నది యున్నట్లుగ బలుకుటయును నొరునకున త్యా
పన్నతగలుగగ కల్యాణోన్నతిగల కల్లమాటయును సత్యమగున్."

ఉన్నదున్నట్లుగా చెప్పితే ఇతరులకు ఆపద గలుగుతే అది అసత్యముతో సమానమే. ఇతరులకు కల్యాణము కలిగేది కల్లమాట యైనను సత్యఫలాన్ని ఇస్తుంది. ఆధ్యాత్మరామాయణములోని శ్రీరాముని మాట చూడండి.

"సత్యస్యవచనం శ్రేయః సత్యాదపిహితం వదేత్ ।
యద్భూతహితమత్యంతం ఏతత్సత్యం మతం మమ॥"

సత్యవచనము సాధారణంగ శ్రేయస్కరము. దానికంటె ఇతరుల హితము శ్రేష్ఠమైనది. నిష్కర్ష యేమంటే! ఏది భూతహిత మైన వాక్కో అదియే సత్యమని నా యభిప్రాయము. ఇది శ్రీరామ చంద్రుని పలుకు. ఇంకను భారతములోని విషయము వినండి.

"భూతహితంబుగా పలుకు బొంకును సత్యఫలంబునిచ్చు త
ద్భూత భయాస్పదంబగు ప్రభూతపు సత్యము బొంకునట్ల ప్రా
ణాతురుడైనచో పరిణయంబునయందును పల్కు బొంకు స
త్యాతిశయంబయంద్రు మహితాత్మక యిట్టివి ధర్మసూక్ష్మముల్"

భూతహితముగా మాట్లాడేమాటలు అసత్యమైనప్పటికి సత్య ఫలాన్ని యిస్తాయి. భూతములకు భయాన్ని కలిగించే నగ్నసత్యము బొంకువంటిఫలమే యిస్తుంది. ప్రాణానికి వచ్చినపుడు, వివాహకాలము

నందును పరుల మేలు నుద్దేశించి మాట్లాడునది అసత్యమైనను సత్య ఫలాన్ని యిస్తుంది. ధర్మరాజా! ఇటువంటివి ధర్మసూక్ష్మములు సుమా! అని భీష్ముడు శాంతిపర్వములో చెబుతాడు.

ప్రపంచము సత్యము వెంటనే అసత్యము చలామణి అవుతుంది. ఒక దుకాణాదారుడు "అవునండీ! ఇది సత్యమండీ" అంటే నమ్ముతాము కదా!

ఒకచోట ఒక అమ్మ దుకాణములో చీర కొంటూంది. "ఈ చీర రంగు యిట్లనే ఉంటుందేమయ్యా!" అని అడిగితే ఆ దుకాణపు యజమాని సత్యమునే చెప్పవలెనను ఉద్దేశముతో తన జందెమును పట్టుకొని "యీచీరరంగు ఇట్లే ఉంటుందమ్మా! ఇట్లేఉంటుందమ్మా" అంటున్నాడు. అంటే జందెము వంటి తెల్లరంగు అవుతుందని వీని భావన. అయినను అసత్యమాడకూడదని పాపము యథార్థము చెబుతున్నాడు. ఎంతటి మోసమో చూడండి. అంటే అసత్యము కూడ సత్యాన్ని ఆధారము చేసుకొనియే నడచుచున్నదని చెప్పుటకిది ఉదాహరణ.

ధర్మదేవత యొక్క రెండవ పాదము తపస్సు. దుఃఖమును సంతోషముతో సహించి ధర్మమార్గములో, ఇంద్రియనిగ్రహము, మనోనిగ్రహము కలిగి నడచుకొనుట తపస్సు. రాత్రి పదకొండు గంటలైనది. అపుడు బంధువులు వచ్చినారు. వారు ఇపుడు పండుకుంటాము, ఇపుడన్నమవసరములేదంటున్నారు. అయినను వారు భోంచేయవలెనను సద్బుద్ధితో వారికి వంటచేసి పెట్టడము గృహస్థాశ్రమము యొక్క తపస్సు. భగవద్గీతలో శారీరక తపస్సు వాఙ్మయ రూపకమైన తపస్సు, మానసికమైన తపస్సు అనునవి యథార్థమైన తపస్సులు.

"దేవద్విజ గురుప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥"

దేవతలను, ద్విజులను, గురువులను, జ్ఞానులను పూజించుట, శౌచముగ ఉండుట, ఋజుత్వము కలిగి వ్యవహరించుట, బ్రహ్మచర్యము, అహింసాభావముతో జీవించుట శారీరక తపస్సు.

"అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయంతప ఉచ్యతే॥"

ఉద్వేగము కలిగించని రీతిలో మాట్లాడుట, సత్యము, హితము, ప్రియముగ మాట్లాడుట, స్వాధ్యాయము యొక్క అభ్యాసము అంటే సద్గ్రంథములను శ్రద్ధతో పట్టుదల గలిగి అధ్యయనము చేయడము వాగ్రూపకమైన తపస్సు అవుతుంది.

"మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనం ఆత్మ వినిగ్రహః।
భావ సంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥"

మనస్సును నిరంతరం ప్రసన్నముగ ఉంచుకొనుట, సౌమ్యముగ ఉండుట, మౌనము, ఇంద్రియనిగ్రహము, భావ సంశుద్ధి ఇవి కలిగియుండడం మానసిక తపస్సు.

ధర్మముయొక్క మూడవ పాదము పవిత్రత. మనుష్యుడు పవిత్రుడుగ పాపరహిత జీవనుడై యుండాలి. ఈ పవిత్రత బాహ్యాంతరములయందు ప్రయత్నపూర్వకముగ కాపాడుకోవాలి. ఆవిధముగ కాపాడుకొనుటకు ప్రధాన సాధనమేమి ? భాగవతము చెప్పే మార్గము చూడండి.

"అరవిందాక్షు పదారవింద మకరందాసక్తులై యున్న సత్
పురుషశ్రేష్ఠుల వృత్తముల్ వినక దుర్బుద్ధిన్ విలంఘించి దు
ర్నరవార్తా కథన ప్రపంచములు కర్ణప్రాప్తముల్ చేసి వా
సరముల్ వ్యర్థత ద్రోచుచుండ జనదీ సంసార మోహంబునన్."

—/ నిరంతరము భగవంతుని పదారవిందముల యందు ఆసక్తిగల సత్పురుషుల వృత్తములు వినుచుండవలె. దుష్టులైన మానవుల కథలను

వినరాదు. ఈ విధముగ ఉంటే సంసార మోహములో పడము. ఇంకా వినండి.

> "మనుట నిత్యముగాదు మరణంబు నిజమని యెరిగి
> మోక్షస్థితి నిచ్చగించు బంగారు వంటి యీ బ్రతికైదు
> కాలంబు బోనాడగా నేల పుణ్య చరిత మాధవ పద
> పద్మమకరంద పానంబు సేయించవే మాకు పుణ్యచరిత."

ఈ విధముగ జీవితము పవిత్రముగ చేసుకొనవచ్చును. అంటే పవిత్రత అనేదానిని పెంచుకొనుటకు ఈ భక్తి జ్ఞానమార్గములే శ్రేష్ఠమైనవి. ప్రపంచములో పవిత్రున్నిగ చేసే వస్తువులు కొన్ని ఉన్నవి. గంగానది ఉన్నది. దానిలో స్నానము చేసినవాణ్ణది పాప రహితున్నిగ చేస్తుందని వినికిడి. అది పాపమును పోగొట్టవచ్చునేమో కాని పాపమును చేసే బుద్ధిని పోగొట్ట లేదు. పాపము చేసే బుద్ధి ఉంటే మరల పాపములు పెరుగుతూనే ఉంటాయి. బావిలో ఒక కుక్క చనిపోయింది. దానిని తీసివేయకుండా బావిలో నీరు ఎన్ని మార్లు ఎత్తిపోసినా ప్రయోజనము లేదు. దానిని బయటకు తీసి నీరు ఎత్తిపోస్తే ఆ నీరు శుద్ధమవుతుంది. భగవద్భక్తితో పాపము చేసే బుద్ధి పోతుంది. జీవితము నిత్యపవిత్రమవుతుంది.

ఇంక నాలుగవ పాదము దానము. అందువలననే "దానమేకం కలౌయుగే" అన్నారు. ఒక్క త్యాగపూర్వకమైన దానమే ఈ కలియుగములో మానవునికి అక్షయకలశంవలె ఉపయోగపడుతుంది.

లోభులైన మానవులు దానమిస్తే పోతుందంటారు. కాని ఇది సత్యమైన మాటకాదు. దానమిస్తే ప్రపంచమనే బ్యాంకులో పెట్టుకొన్నట్లు. దాని ప్రభావము వలన మనము ఇంతకంటే నికృష్టమైన జన్మలో పడకుండా ఉత్తమమైన పుణ్యమనే బాలెన్స్ పెట్టుకొని ఇంకొక గర్భములో శిశువుగా పుట్టినపుడు అచ్చటికి ఆటోమేటిక్‌గా

ఈ బ్రాట్ - ఓవర్ ఈ జమ లెక్కువ సుంది. అందువలన దానము చేస్తే ఊరికే పోవుటలేదు. ఈ విధముగ ధర్మదేవతకున్న నాలుగు కాళ్ళను గురించి ముచ్చటించుకున్నాము.

పరీక్షిన్మహారాజు కలిపురుషున్ని శాసించిన ఘట్టమును ప్రతి దినము చదివితే పాపాలు కలుగవు. పరీక్షిత్తు కలి కీ విధముగ తొమ్మిది స్థానాలను కేటాయించినాడు. మన ప్రయత్నమేమై ఉండాలి? అంటే ఈ తొమ్మిది దుర్గుణములను మన వద్దకు రాకుండా మనలను మనము కాపాడుకోవాలి.

స్థూలముగ చెప్పాలి అంటే ఎవరింటిలో దైవభక్తి, దైవ ధ్యానము, పెద్దల యందు భక్తి ఉంటుందో వారి యింటిలోనికి కలి ప్రవేశింపజాలడు. కలి ప్రవేశానికి యేమాత్రము అనుకూలము కలిగించని విధానములో జీవిత ముండాలి.

కొందరు పరీక్షిన్మహారాజు కలిని చంపగూడదా? అంటారు. అట్టివారికి పరీక్షిన్మహారాజు అభిప్రాయమే సమాధానము. వినండి.

"చేసినగాని పాపములు చెందవు చేయదలంచినంతనే
చేసెదనన్న మాత్రమున జెందుగదా కలివేళ పుణ్యముల్
మోసము లేదటంచు నృపముఖ్యుడు గాచె కలింమరంద ము
ల్లాసముతోడ గ్రోలి విరులం తెగజూడని తేటికైవడిన్."

1—442

ఈ కలియుగములోని విశేషమే దానికి కారణము. ఏమంటే! చేస్తేనే కాని పాపములు మనుష్యున్ని పొందలేవు. కాని పుణ్యకార్యాలను చేస్తాను, చేయవలెనని తలంచినంత మాత్రములోనే వాటి ఫలాలు మానవున్ని పొందుతాయి. ఇంతమంచి అవకాశముంది. దీనిని యే దౌర్భాగ్యుడు వదలుకొని కలిబాధలకు గురియౌతాడని ఆయన కలిని వదలిపెట్టినాడు. తుమ్మెద లోపలి మకరందాన్ని మాత్రం ఆనందముతో త్రాగి పూలను వదలినట్లు పరీక్షిత్తు కలిని వదలినాడు.

అందుచేతను కలి ప్రాణభిక్ష పెట్టమని కాళ్ళు పట్టుకున్నాడు కదా! కావున నింక వానిని చంపే సమస్యే లేదు.

ఈ భాగవతములో కథ సత్యమా! దీని ద్వారా నీతిని గ్రహించడము సత్యమా? అంటే జీవిత సంస్కారణోద్దేశ్యము గ్రంథ నిర్మాణములోని ప్రధానోద్దేశ్యము. కావున మానవులు కూడ ఈ ప్రధానోద్దేశ్యమే ముఖ్యముగ గమనించాలి. ఈ విధముగ పరీక్షిన్మహా రాజు కలిని నిగ్రహించి రాజ్యమేలుచున్నాడు.

ఒకనాడు పరీక్షిన్మహారాజు వేటకు పోతాడు. వేటకు పోతూ పోతూ ఆయన తాత భీమసేనుడు జరాసంధున్ని చంపి వాని వద్దనుండి బంగారు కిరీటము మణులతో చెక్కిన దానిని తన వద్దకు తీసుకొని పోయి పెట్టియుంటాడు. ఆ కిరీటాన్ని పెట్టుకొని పరీక్షిత్తు వేటకు పోతాడు. ఆ కిరీటాన్ని పెట్టుకునే సరికి ఆయన యందు రజోగుణము ప్రవేశిస్తుంది. వస్తుసంయోగముతో మనుష్యుని మనస్సులో వికారాలు ప్రవేశిస్తాయి. అందువలననే మనము తినే భోజనము వికారాన్ని కలిగించేదిగ ఉండకూడదు. ప్రేమతో పెట్టిన అన్నము, శుద్ధమైన సంపాదనతో పెట్టిన అన్నం అమృతమయము.

ఒక సన్న్యాసిని ఒక గృహస్థు భోజనానికి పిలిచినాడు. నూత్నమైన వెండికంచములో భోజనము వడ్డించినాడు గృహస్థు. ఆ సన్న్యాసి భోంచేసి కంచమును కడుక్కొని తన జోలెలో వేసుకొని పోయినాడట. గృహస్థు ఇది చూస్తూ ఊరకున్నాడు. ఆ మహాత్ముడు దానిని తీసుకొని పోతే తన పాపము పోతుందని వాని భావన. ఆ సన్న్యాసి సాయంత్రము వరకు నడచుకుంటూ ఎక్కడికో పోతున్నాడు. అక్కడ నది వచ్చినది. సాయంత్రము అనుష్ఠానము చేసుకొనుటకు కూర్చొని విభూతి పెట్టుకుందామని జోలెలో చేయి పెట్టితే వెండి కంచమున్నది. అరే! ఈ వెండి కంచము ఎందుకు వచ్చినదని దివ్యదృష్టితో చూచితే

అపుడాయనకు బోధపడింది. ఆ వెండి కంచములో అన్నము పెట్టిన వాడు దొంగతనము చేసి ఆయనకు అన్నము పెట్టినాడు. ఆ దోష సంస్కారము ఈయనలో ప్రవేశించి వెండి కంచము జోలెలో వేసు కొనునట్లు చేసింది. చూచితిరా? వస్తు సంయోగ ప్రభావము!

పరీక్షిన్మహారాజుకు కూడ రజోగుణము ప్రవేశించింది. ఆయన వేటకు పోయినాడు. జంతువులను వేటాడి అలసి సొలసి పోయినాడు. విపరీతమైన దప్పియైనది. దగ్గరనే శమీక మహాముని ఆశ్రమముంటె స్వామీ! "నాకు చాల దప్పి యగుచున్నది, కొంచెము మంచి నీళ్ళు పోయరా?" అని అభ్యర్థించినాడు. ఆ శమీక మహర్షి జాగ్రద వస్థలో లేడు. ఆయన జాగ్రత్తు, స్వప్న, సుషుప్తులను దాటి తురీయా వస్థలో ఆత్మభావములో నిమగ్నమై బ్రహ్మానందాన్ని పొందుచున్నాడు. ఆయన స్థితి యెట్లున్నదో చూడుడు —

"మెలగుట చాలించి మీలితనేత్రుడై శాంతుడై కూర్చుండి జడత లేక
ప్రాణ మనోబుద్ధి పంచేంద్రియంబుల బహిరంగ వీధుల బారనీక
జాగరణాదిక స్థానత్రయము దాటి పరమమైయుండెడి పదము దెలిసి
బ్రహ్మభూతత్వసంప్రాప్త్యవిక్రియుడయి అతి దీర్ఘ జడలు తన్నావరింప
నలఘు రురుచర్మధారియై యలరుచున్న తపసిఁ బొడగని శోషితతాలు డగుచు
నెండి తడిలేని కుత్తుక నెలుగుడిందమంద భాషల డగ్గరి మనుజ విభుడు." 1—458

శమీక ముని స్థితి ఇట్లున్నది. ఆయన కన్నులు మూసుకొని జడత్వము లేకుండా ప్రాణమనోబుద్ధీంద్రియములను బహిరంగముగా పోనీయక నిగ్రహించి జాగ్రత్తు, స్వప్న సుషుప్త్యవస్థలను దాటి పరమమైయున్న తురీయములోనికి వెళ్ళి సమాధిస్థుడైనాడు. బ్రహ్మాను భవమున నిశ్చలుడై దీర్ఘమైన జడలతో జింక చర్మధారియై యున్నట్టి తపసిని చూచి రాజు అడుగుతాడు.

"స్వామీ! కొన్ని మంచి నీళ్ళిప్పించండి." ఎన్నిమార్లు పిలిచినా ఆయన పలుకడు. ఈయన జాగ్రదవస్థలో నున్నాడు. ఆయన తురీయావస్థలో ఉన్నాడు. మరి రాజు మాటలు ఆయన కెట్లు వినపడ్తాయి? రాజు రెండు మూడు మార్లు పిలిచి కోపగించుకున్నాడు. ఆ చుట్టు ప్రక్కల చూచినాడు. ఒక సర్పశవము పడియుండినది. దానిని తెచ్చి ముని మెడలో వేసి పోయినాడు.

రాజటు పోయినాడో లేదో శమీక మహర్షి కుమారుడు శృంగివచ్చి తండ్రి మెడలోని సర్పము చూచి భయభ్రాంతుడైనాడు. అక్కడున్న ముని బాలురు సంగతి అంతా చెప్పగా విన్నాడు. ఆగ్రహోదగ్రుడై ప్రక్కననే కౌశికీ నదిలోనికి వెళ్లి నీళ్ళు బట్టుకొని శపించినాడు:—

"ఓడక వింటికోపున మృతోరగముంగొనివచ్చి మారు మా
టాడకయున్న మజ్జనకు నంసతలంబున బెట్టి దుర్మద
క్రీడ జరించు రాజు హరకేశవులడ్డిననైన జచ్చు బో
యేడవనాడు తక్షక ఫణీంద్ర విషానల హేతిసంహతిన్." 1-470

సంకోచం లేకుండా చచ్చిన సర్పాన్ని తెచ్చి మౌన ముద్రలో నున్న మా తండ్రి భుజంపై వేసి దురహంకారముతో కన్ను మిన్ను కానని ఆ రాజును హరిహరులు అడ్డుపడినను నేటికి ఏడవనాడు తక్షకుని విషాగ్నిజ్వాల దగ్ధము చేయును గాక.

ఈ విధముగ శపించి శృంగి అరచుచుండగా కొంత ధ్వని యెక్కువై శమీక మహర్షికి జాగ్రత్త కలిగినది. కంఠమునందు సర్పమెట్లు వచ్చెనని కుమారున్ని అడిగితే ఆయన జరిగిన కథయంతయు తాను శాపము పెట్టిన సంగతిని చెప్తాడు. ఆ మాట విని దయార్ద్ర హృదయుడై శమీకముని అంటాడు.

"తల్లి కడుపులోన దగ్ధుడై క్రమ్మర కమలనాభు కరుణ గలిగినాడు
బలిమి గలిగి ప్రజల బాలించుచున్నాడు దిట్టవడుగ రాజు దిట్టదగునె!
1_478

నాయనా! ఏమి పని చేసినావురా? ఆ పరీక్షిత్తు ఒక తూరి తల్లి కడుపులోనే దగ్ధమై భగవంతుని కరుణతో పుట్టినాడు. పరాక్రమవంతుడై ప్రజలను పాలిస్తూన్నాడు. అట్టి రాజుకు శాపమీయవచ్చునా నాయనా!

రాజ్యములో రాజు లేకపోతే ప్రజలు కాపరి లేని గొర్రెలవలె విపత్తులకు గురియై పోతారు. దుండగులు హెచ్చుపెరుగుతున్న యీ సంధి సమయములో యీ కొద్దిపాటి అపరాధానికి అంతటి శాపమివ్వవచ్చునా కుమారా!

నీ మూలముగా మనకు పాపము ప్రాప్తించినది. రాజు మరణిస్తే రాజ్యములో అరాజకము ప్రబలుతుంది. బలం కలవాడు బలం లేని వాని మీదపడి దోచుకుంటాడు. జార చోరులు నిరాటంకముగ తిరుగుతారు. చాలా అనర్థాలు కలుగుతాయి.

"భారతవంశజున్ పరమభాగవతున్ హయమేధయాజి నా
చారపరున్ మహానయవిశారదు రాజకులైక భూషణున్
నీరముగోరి నేడు మన నేలకు వచ్చిన భక్తి నర్థి స
త్కారము జేసి పంప జనుగాక శపింపగ నీకు ధర్మమే. 1_481

పవిత్రమైన భారతదేశములో పుట్టినాడు. పరమ భాగవతుడు. అశ్వమేధయాగం చేసినాడు. సదాచార సంపన్నుడు, రాజనీతిజ్ఞుడు. రాజకులానికి భూషణము వంటివాడునైన మహారాజు మన వద్దకు వస్తే అతిథి సత్కారము చేసి పంపవలెకాని శపించవచ్చునా?

కుమారా! శాపము మరల్చుము. మన స్థితి, మన వ్యవహార మెట్లుండాలి? పొడిచినను, తిట్టినను, కొట్టినను మనము శాంత

ముతో భరించవలెనే కాని ప్రతీకారము చేయరాదు. నీ శాపానికి మహారాజు ప్రతిశాపం యివ్వగల సమర్థుడు. కాని ఆయన ఇవ్వలేదు.

రాజు సజ్జనుడు తండ్రీ! సజ్జనులు ఇతరులు తనకు చేసిన ఉపకారాలకు పొంగిపోరు. అపకారానికి క్రుంగిపోరు. "మహాత్ముల ఆత్మలను సుఖదుఃఖాలు ఆవరించవు. కావున శాపము ఉపసంహరించుకో" అంటాడు శమీక మహర్షి. అపుడు శృంగి "తండ్రీ! నేను శాపమిచ్చుట మాత్రమే తెలుసుకున్నాను. ఉపసంహరించుట తెలియ"దంటాడు. దానికి మహర్షి తనవద్దనున్న శిష్యులను "మీరు తక్షణం వెళ్ళి పరీక్షిన్మహారాజుకు శాపవృత్తాంతం తెలిపి ఆయనను ప్రయత్నంచేసి మృత్యువునుండి తప్పించుకొనుమని చెప్పండి" అని చెప్పి పంపుతాడు. ఇది ఇక్కడి కథ.

అక్కడ పరీక్షిన్మహారాజు యింటికి వెళ్ళి కిరీటం తీసి ప్రక్కకు పెడుతాడో లేదో! తాను ఏమి పని చేసి వచ్చినాననే పశ్చాత్తాపము కలుగుతుంది. అయ్యయ్యో! ఎంతటి అకార్యము జరిగినది!

"ఏటికి వేటబోయితి మునీంద్రుడు గాఢసమాధి నుండగా
నేటికి దర్భజాగ్రమున నేసితి సర్పశవంబు దెచ్చి నే
డేటికి బాప సాహసములీక్రియ జేసితి దైవయోగమున్
దాటగరాదు వేగిరమ తథ్యము గీడు జనించు ఘోరమై"

1-486

ఎందుకు వేటకు పోయితిని, మునీంద్రుని మెడలో సర్పశవము నెందుకేసితిని. చేసిన కార్యమునకు ప్రతిఫలము తప్పదు. భయంకరమైన కీడు జరుగక మానదు.

ఈ ప్రపంచము భగవన్మహిమతో కూడుకొనియున్నది. మానవుడేమేమి చేస్తాడో దానికి ప్రతిఫలము తప్పక అనుభవించవలసివస్తుంది. ఈ సత్యాన్ని ఊహించుకుంటూ కూర్చున్నాడు. ఇంతలోనే శమీకమహర్షి శిష్యులువచ్చి శాపవృత్తాంతము నెరిగించిరి.

అపుడు పరీక్షిత్తునకు కోపము రాలేదు. కోపము తెచ్చు కొనుట అజ్ఞాని స్వభావము. తన తప్పును తెలుసుకొనుట విజ్ఞుని లక్షణము. మనుష్యులు చాలామంది తమ తప్పు తాము తెలుసు కోరు. కొందరు తమ తప్పును కూడ ఒప్పని ఎదిరిస్తారు. తమ తప్పును తెలుసుకొనువారు దైవీగుణ సంపన్నులు. పరీక్షిత్తు అట్టి ఉత్తమ సంస్కారము కలవాడు గావున ఈ విధముగ అనుకుంటున్నాడు.

"పాము విషాగ్ని కీలలను ప్రాణము లేగిన నేఁగుగాక యీ
భూమియు రాజ్యమున్ సతులు భోగము బోయిన పోవుగాక సౌ
దామిని బోలు జీవనము తధ్యముగా దలపోసి యింక నే
నేమని మారుదిట్టుదు మునీంద్ర కుమారకు దుర్నివారకున్."
1–487

అర్థము. భీకరమైన తక్షకుని విషాగ్ని జ్వాలలకు ప్రాణాలు పోతే పోనీ. ఈ సామ్రాజ్యమూ, భోగభాగ్యాలూ పోతే పోనీ, విద్యుల్లత వంటి బ్రతుకు శాశ్వతమని భావించి దుర్నివారుడైన ఆ మునికుమారున్ని ఏమని శపింతు ?

"రాజననుచుపోయి రాజ్యగర్వంబున వనము కొఱకు వారి వనము జొచ్చి
దందశూక శవము తండ్రిపై వైచిన బాలియ దిట్టకేల పోవుసుతుడు.
1–488

నేను మునీశ్వరుల వద్దకు రాజుననుచు గర్వముతో పోయి నీళ్ళకొరకు వారి స్థలము జేరి పాము శవమును తండ్రి మెడలో వేస్తే కుమారుడు శపించకేల ఉంటాడు ?

గోవులకు, దేవతలకు, బ్రాహ్మణులకు నిష్కారణముగ ఆపదను కలిగించే దుర్బుద్ధి కలవారికి ఇటువంటి విపత్తులు కలుగుట సహజమే కదా! అని భావిస్తూ ఆయన ఉద్వేగానికిగాని భయానికిగాని గురి కాలేదు. ఏదేని విపత్తు కలిగినపుడు మామూలు మానవుడు తాప

త్రయము పొందుతాడు. కాని పరీక్షిన్మహారాజు ఈ శాపము వలన నాకు మేలే కలిగినదనుకున్నాడు. ఎందుకంటే సామాన్యముగ మరణము ఎపుడు వచ్చేది అందరికి తెలియదు. నాకు ఫలానా సమయములో మరణము వస్తుందని తెలిసెకదా ? ఇది నాకు గొప్ప మేలేనని భావించినాడు.

ఈ విధమైన భావనలో నొక మనోవైజ్ఞానికమైన సత్య మున్నది. ప్రతికార్య మీ ప్రపంచములో ద్వంద్వ భూయిష్టము' అంటే ఎటువంటి కీడులోనైనను మేలుకూడ ఉంటుంది. మనుష్యుడు తనకు కీడు కలిగిందని తెలుస్తూనే వివేకాన్ని కోల్పోయే తాపత్రి యానికి గురి యూతాడు. అందువలన దానిలోని మేలు గమనించ జాలడు. ఒకొక్కరు ఏది జరిగినా మన మేలుకేననే మంత్రాన్ని జపిస్తూంటారు. దానియందు మనకు నమ్మకము కలుగుతే దాన్నే చూస్తాము. మేలునే చూచే అభ్యాసము చేసుకున్నవాడంతా తన మేలుకే ననుకుంటాడు.

ఒక రాజువద్ద నొక మంత్రి ఉంటాడు. ఆయన ఏది జరిగినను మన మేలు కొరకే ననుచుండెడివాడు. ఒకనాడు రాజుకు ఎట్లనో వ్రేలు తెగినది, "మంత్రీ వ్రేలు తెగె" అన్నాడు రాజు. "అంతయు మన మేలుకొరకే మహారాజా!" అన్నాడు మంత్రి. రాజుకు వేలు తెగి నొప్పి వేస్తుంటే మనమేలుకే ననే మాట రాజుకు కోపమును కలిగించి నది. వెంటనే మంత్రిని జైలులో వేయించినాడు. ఒకనాడు రాజు వేటకుపోయి ఒక జింక వెంటబడి ఆతమకములో సేననువదలి ఒంటరిగా ఎంతో ముందుకు సాగిపోయినాడు. ఆఖరుకు ఆ జింకను చంపి వెనుకకు మరలినాడు, తన సేన జాడ లేదు. అలసి, సొలసి పోయినాడు. కాబట్టి ఒక చెట్టుక్రింద పండుకున్నాడు. ఇంతలో అచ్చటికి కాళికాదేవికి నరబలి నివ్వవలెనని తగిన నరుడు కావలెనని కాళికాదేవి భటులు వచ్చి రాజును చూచినారు. ఒరే! మంచి బలిపశువు చిక్కిందిరా! ఎత్తండ్రా

వీనిని అని ఎత్తుకొని పోయినారు. మరుదినము రాజును పసుపు కుంకు మలు, వేపమండలతో అలంకారము చేసి కాళికామ్మ వారివద్దకు బలి యిచ్చుటకు తీసుకు వెళ్లినారు. ఇంక నరుకుటకు ఉపక్రమణ జరుగు చున్నది. అప్పుడు పెద్దపూజారి వచ్చి బలిపశువు యోగ్యమైనవా కాదా? చూడవలెనట. అతడు రాజు శరీరమునంతయు చూడసాగి నాడు. వ్రేలు తెగియుండడము చూచి "ఓరీ! వీడు అంగహీనుడురా! అమ్మవారి బలికి యోగ్యుడు కాదని చెప్పినాడు. అపుడు రాజుకు మంత్రి యింతటి దూరదృష్టిగలిగి 'ఇది మన మేలుకే మహారాజా! అని అన్నాడో అపుడర్థమైంది. తక్షణం రాజ్యానికి వచ్చి మంత్రిని మొదట విడిపించుకొని క్షమాపణ చెప్పుకున్నాడు.' "మంత్రీ! నీది చాలా దూరదృష్టి. ఇంతటి బుద్ధిమంతుడవైన నిన్ను నేను జైలులో వేయించి నాను. చాలా తప్పైనద"ని వ్యాకులపడినాడు. ఆ మంత్రి "ఇది కూడ నా మేలుకే మహారాజా"! అన్నాడు. అయ్యో మంత్రీ! నిన్ను జైలులో వేయడం వలన మేలేమి జరిగినది ? అని ఆశ్చర్యముతో ప్రశ్నించినాడు. దానికి మంత్రి అన్నాడు "మహారాజా! విషయము తెలిసినట్లే యున్నది కదా ? మీ వెంట నేను తప్పక వచ్చియుందు. మనల నిద్దరినీ తీసుకపోయి వారు మిమ్ములను విడిచి నన్ను బలి యిచ్చి యుందురన్నాడు". ఇది జీవితములో ఆనందానికి తిరుగులేని మంత్రము.

ఇపుడిచ్చట కూడ పరీక్షిన్మహారాజుకు చివరికి ఏమి ప్రయోజనము కలిగినది. జగద్విదితమే. శ్రీశుకులవారు పిలువకనే ఆయన వద్దకు వచ్చినారు. ఆత్మజ్ఞానోపదేశం చేసి జీవన్ముక్తిని ప్రసాదించిరి కదా? కావున ప్రతికార్యములో ద్వంద్వము లుంటాయి. మనము కేవలము ఒకవైపే చూస్తాము. ఒక నాణెముకు రెండు వైపులున్నట్లు కీడున్నచోట మేలు కూడ ఉంటుంది. అయితే మేలును చూచుటకు ఉత్తమ సంస్కారము కావాలి. పరీక్షిత్తు ఆ విధమైన ఉత్తమసంస్కారాన్ని కలిగియున్నాడు. కావున ఆయన స్థితి యిట్లు వర్ణింపబడినది.

"దామోదర పదభక్తిన్ కామాదుల గెల్చినాడు గావున కరుణన్
భూమీశుడలుగడయ్యెను సామర్థ్యము గలిగి కోపసంగిన్
శృంగిన్" 1-491

భగవంతునిపై భక్తిచేత కామాదులను గెలిచినాడు. కామము క్రోధములను గెలిచినాడు. అందువలన ఆయనకు కోపము రావలసిన చోట కరుణ గలిగింది. తనకు తిరుగు శాపము పెట్టుటకు శక్తి ఉండి నను దోషియైన శృంగిని వదలిపెట్టినాడు. దీనికి కారణ మేమి? తనకు కలిగే అపారమైన మేలును తెలుసుకొను వివేకము ఆయనకు లభ్య మైంది. ఇట్టి వివేక వ్యవహారము అద్భుతమైన ప్రయోజనము గలది. ఇట్టి సంస్కారము పొందిన మానవుడు పూర్ణమానవుడు.

కనుకనే వెంటనే జనమేజయుడైన తన కుమారునకు పట్టాభి షేకము చేసి పరీక్షిన్మహారాజు దివ్యమైన గంగానదీ తీరములో సర్వ సంగ పరిత్యాగియై ప్రాయోపవేశంచేసి ప్రాణాలను విడచుటకు సిద్ధ మైనాడు.

"చిత్తము గోవింద పదాయత్తము గావించి మౌనియై తనలో నే
తత్తరములేక భూవరసత్తముడు వసించె ముక్తసంగత్వమునన్"
1-494

తన చిత్తాన్ని గోవిందుని పదముల కర్పించి సర్వసంగ పరి త్యాగియై ఏ విధమైన మనోవైకల్యంలేకుండా మౌనంగా కూర్చు న్నాడు.

పరీక్షిన్మహారాజు సర్వవిధములైన భోగభాగ్యాలల్లో జీవితమును గడపేవాడు. అతనికి శాప విషయము తెలుస్తూనే పలు విధము లైన ధన ధాన్య వస్తు వాహన కనకాదులనన్నింటిని త్యాగము చేసి ఎప్పుడైతే గంగాతీరంలో మనోవైకల్యం లేకుండా ప్రాయోపవేశం చేసినాడో ఆయనను దర్శించుటకు సిద్ధులు, మహర్షులు, తపస్వులు, మహాత్ములు మొదలగువారు ఎక్కడెక్కడినుండో వచ్చినారు.

ఆహా! ఏమి త్యాగిమండి! అని దేవతలు కూడ ప్రశంసించారు. ఇట్టి భయంకర పరిస్థితులలో కూడ మనోవైకల్యం లేకుండా మౌనంగా కూర్చున్నాడంటే ఆయన మానసిక వైభవమేమని కొనియాడాలి?

వచ్చినట్టి మహాత్ములందరికి పూజలుచేసి దండప్రణామాలు చేసినాడు. ఇంతమంది మహాత్ములు అత్రి, విశ్వామిత్ర, మైత్రేయ, భృగు, వసిష్ఠ, పరాశర, చ్యవన, భరద్వాజాదులు ఆయన వద్దకు వస్తే ఆ పరీక్షిత్తుకు మహానందమైనది,

"క్రమ్మర మునివల్లభులకు
నమ్మనుజేంద్రుండు మ్రొక్కి పూర్వాశ్రుతతుల్
గ్రమ్మగ ముకుళిత కరుడై
సమ్మతముగ జెప్పె నాత్మ సంచారంబున్" 1-496

ఆనంద బాష్పాలు పొంగి పొరలగా ఆ మహాత్ముల ముందు చేతుల జోడించి యిట్లా విన్నవించుకొన్నాడు. మహాత్ములారా!

"ఓపిక లేక చచ్చిన మృతోరగమున్ గొని వచ్చి కోపినై
తాపసు మూపుపై నిడిన దారుణచిత్తుడ మత్తుడన్ మహా
పాపుడ మీరు పావన్యైణ పావకులుత్తములయ్యలార నా
పాపము పాయు మార్గము కృపాపరులార విధించి చెప్పరే!"
1-497

నేను ఓపిక లేక చచ్చిన సర్పాన్ని తెచ్చి మునీంద్రుని మెడలో వేసిన పాపాత్ముణ్ణి. క్రూరచిత్తుడను మీరో! పాపము అనే గడ్డికి అగ్నివంటివారు. సంయమశ్రేష్ఠులు. నా పాపం పరిహారమయ్యే మార్గాన్ని చూపండి అని ప్రార్థించినాడు. సర్వేవై సుఖినస్సంతు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

ఏడవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## ఎనిమిదవ రోజు ఉపన్యాసము

"జన్మాద్యస్యయతోఽన్వయాది తరతశ్చార్థేష్వభిజ్ఞ స్వరాట్
తేనే బ్రహ్మహృదాయ ఆదికవయే ముహ్యంతి మాత్సూరమః
తేజోవారిమృదాం యథావినిమయః యత్ర త్రిసర్గోమృషా
ధామ్నాస్వేన సదానిరస్తకుహకం సత్యం పరం ధీమహి"

"అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాల పె
ద్దమ్మ సురారులమ్మ కడుపారడి బుచ్చిన యమ్మ తన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనంబుల నుండెడియమ్మ దుర్గ మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్వ కవిత్వ పటుత్వ సంపదల్"

"హరికిన్ పట్టపుదేవి పున్నెముల ప్రోవర్థంబు పెన్నిక్క చం
దురు తోబుట్టువు భారతీగిరి సుతల్ దోనాడుపూబోడి దా
మరలందుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములు వాపు తల్లి సిరియిచ్చున్ నిత్య కల్యాణముల్"

పరమ భాగవతులారా! భక్త మహాశయులారా! పుణ్యాత్ము లారా! భాగవతము, భగవంతుడు, భక్తుడు ఒకటే. అందువలన భక్తి పరుసవేది మార్గం. ఈ మార్గములోనికి ప్రవేశించనంతవరకు జీవితములో యథార్థసుఖశాంతులు లభించవు. భౌతికమైన జీవితములో

నెంత ఐశ్వర్యముండినప్పటికి, ఎన్ని భోగభాగ్యాలుండినప్పటికి మానవునికి యథార్థ సుఖశాంతులు లభ్యము కావు. ప్రహ్లాదుడు నరసింహస్వామితో ప్రార్థిస్తాడు. స్వామీ!

"జనులు దిక్పాలుర సంపదాయుర్విభవములకోరుదురు భవ్యంబులనుచు
  నవియెంతయును రోషహాసజృంభితమైన మా తండ్రి బొమముడి
                                                                  మహిమ జేసి
  విహితంబులగు నట్టి వీరుండు నీచేత నిమిషమాత్రంబున నేడు మడిసె
  గావున ధృవములు గావు బ్రహ్మాదుల శ్రీవిభవంబులు జీవితములు
  కాలరూపకుడగునురుక్రముని చేత విదళితములగు నిలువవు వేయునేల
  యితర మేనొల్ల నీమీది యెరుక కొంత కలిగి యున్నది కొలుతుకింకరు
                                                                  డనగుచు" 7-357

సర్వసాధారణముగ ప్రజలు ఐశ్వర్యాలను, భోగభాగ్యాలను కోరుతుంటారు. వాటితో తమకు ఆనందము కలుగుతుందని వారి అపేక్ష. మరి వారికి ఆనందము కలుగుచున్నదా? ధనము, భోగములు ఇతరుల కంటే అధికముగ కలిగినవారే యింకను ధనము కొరకై తాపత్రయ పడుచున్నారు.

కాశీలో ఒక పర్యాయము గంగానది వరదలతో పారుచున్నది. ఊర్లకు ఊర్లే కొట్టుకొని వచ్చుచున్నవి. ఒక ధనికుడు కోట్ల రూపాయలు ఆస్తి గలవాడు. వానికి సంతానము కూడ లేదు. తెల్లవారుఝామున మూడు, నాలుగు గంటల ప్రాంతములో గంగానది ఒడ్డుకు వచ్చి చడ్డీ వేసుకొని గంగానదిలో కొట్టుకొని పోయే వస్తువులను ఒక్కొక్క దానినే గడ్డకు వేసుకుంటున్నాడు. స్వచ్ఛమైన వెన్నెల. దూరముగ కంబడివలె కనిపించినది. అది ఎలుగుబంటు. కొట్టుకొని పోతూ కనిపించినది. దానిని కంబడి అనుకొని నాలుగంగలు తొందర తొందరగా వేసి దానిని పట్టుకున్నాడు. ఇంకేముంది, ఆ ఎలుగుబంటు

వీన్ని పట్టుకుంది. లబో శంకర అని మొత్తుకున్నాడు. వీనిని వదలనే లేదు, నదీనాం సాగరోగతిః చచ్చి కూర్చున్నాడు.

ధనము మానవున్ని తృప్తి పరచలేదు. భోగములు రోగాలను తెస్తాయి. కావున మానవుడేమి చేయాలి. భగవంతునాశ్రయించాలి. భగవంతుని స్వరూప స్వభావాలను గురించి, ఆయన మహిమలను గురించి శ్రవణము చేస్తూండాలి. అపుడు మాత్రమే జీవితము సార్థకమయ్యేది. భగవదనుగ్రహముతో మనకిట్టి భాగ్యము లభించినది. ఆయనకనంతానంత ధన్యవాదములు సమర్పించి కార్యక్రమాన్ని ఉపక్రమించుకుందాము.

పరీక్షిన్మహారాజు తన్ను జేరిన మహాత్ములనందరిని ప్రార్థించుచున్నాడు. ఆయన మనస్సులో నొక విశ్వాస మేర్పడింది. వినండి.

"భూసుర పాదరేణువులు పుణ్యుల జేయు నరేంద్రులన్ ధరి
త్రీ సురులార మీచరణ రేణుకణంబులు మేనుసోక నా
చేసిన పాపమంతయు నశించె కృతార్థుడనైతి నెద్ది నే
చేసిన ముక్తి సద్గతికి చెచ్చెర పోవగ నన్ను చెప్పరే" 1-498

మీ పాదధూళి సోకినందువలన నా పాపమంతయు నశించిపోయింది. ఇంక ఏమిచేస్తే ముక్తి మార్గము నాకు లభ్యమవుతుందో సెలవివ్వండి.

భయంకరమైన సంసార పంకములో చిక్కుకొని విసిగిపోయిన నాకు తక్షక విషం మోక్ష హేతువైందంటాడు.

"భీకరతర సంసార వ్యాకులతన్ విసిగి దేహవర్జనగతి నా
లోకించు నాకు తక్షక కాకోదర విషము ముక్తి కారణమయ్యెన్"
1-499

ఎంత అద్భుతమైన కల్యాణకరమైన భావన! పరీక్షిన్మహారాజు ఇంకను ఏమంటాడో చూడండి.

"ఉరగాధీశ విషానలంబునకు మే నొప్పింతు శంకింప నీ
శ్వర సంకల్పము నేడుమానదు భవిష్యజ్జన్మ జన్మంబులన్
హరిచింతారతియున్ హరిప్రణుతి భాషాకర్ణనాసక్తియున్
హరిపాదాంబుజ సేవయున్ గలుగ మీరర్థింప్రసాదింపరే!"
1-501

పాపముచేత ప్రాణాలు పోవడం నాకేమీ విచారము లేదు. ఇది ఈశ్వర సంకల్పము. నరవేరుగాక. నేను మిమ్ముల నందరిని దేనికొరకై ప్రార్థిస్తానంటే! భవిష్యత్తులో వచ్చే జన్మలలో హరిపైనసే భక్తి, ఆయన కథలు వినుటలో ఆసక్తి ఉండే జన్మలను ప్రసాదించండి

ఇంతేగాక మహాత్ములారా!

"చూడుడు నా కల్యాణము, పాడుడు గోవిందుమీది పాటలుదయతో
నాడుడు హరిభక్తుల కథలేడహములలోన ముక్తి కేగగ నిచటన్"
1-502

"ఏడుదినంబులముక్తిన్ గూడగ నేరీతి వచ్చు గురు సంసార
క్రీడన మే క్రియ నెడతెగు చూడుడు మా తండ్రులార శ్రుతి
వచనములన్" 1-510

ఏడుదినాలలో ముక్తి కలిగే మార్గమేదో చూపండి అని అందరిని చూస్తూ దీనంగా ప్రశ్నిస్తాడు.

"ఏవం చ తస్మిన్నర దేవదేవే ప్రాయోపవిష్టే దివి దేవసంఘాః।
ప్రశస్యభూమౌ ప్రకిరన్ ప్రసూనైః ముదాముహుః దుందుభయశ్చ
నేదుః॥"

అర్థము ఈ విధముగ రాజు ప్రాయోపవేశం పొందుతూనే దేవసంఘములన్నియు సంతోషముతో దుందుభులను వాయించుచూ భూమిపైన పుష్ప వర్షము గురిపించిరి.

"మహర్షి యోగ్యై సముపాగతాయే
ప్రశస్యసాధ్వీత్యను మోదమానాః
ఊచుః ప్రజానుగ్రహశీలసారా
యదుత్తమ శ్లోక గుణాభిరామమ్"

అక్కడికి వచ్చి మహర్షులందరు పరీక్షిత్తు త్యాగాన్ని, భక్తి భావాన్ని ప్రశంసించినారు. ఆ మహానుభావుడైన రాజుతో వాళ్లంటారు.

"క్షితినాథోత్తమ నీ చరిత్రము మహాచిత్రంబు మీ తాత లు
గ్రతపోధన్యులు విష్ణుపార్శ్వపదవిం గామించి రాజన్య శో
భిత కోటీర మణిప్రభాన్విత మహాపీఠంబు వర్జించి రు
న్నతులై నీవు మహోన్నతుండవుగదా నారాయణధ్యాయివై"
1-507

"వసుధాధీశ్వర నీవు మర్త్యతమవున్ వర్జించి నిశ్శోకమై
వ్యసనచ్ఛేదకమై రజోరహితమై వర్తించు లోకంబు స
ర్వసమత్వంబున జేసనంతకు భవద్వాక్యంబులన్ వింటు నే
దెసకుంబోవక చూచుచుండెదము నీ దివ్యప్రభావంబులన్"
1-508

మహాత్మా! నీ చరిత్రము చాలా ప్రశంసనీయమైనది. మీ తండ్రి తాతలు ధన్యాత్ములు. అందరు భగవత్ప్రాప్తినిపొందినవారే. నీవుకూడ సమస్త రాజ్యపీఠమును వర్జించినావు. అట్టి నీవు ఈ మర్త్య తనువును, విడిచి వ్యసనరహితమైన సమత్వ స్థితిని ఎట్లు చెందుతావో అంతవరకు నీ మాటలనే వింటూ ఏ వైపుకుపోకుండా నిన్ను చూస్తూ నీ దివ్యప్రభావము తిలకిస్తూంటాము మేము నీకు కైవల్యాన్ని ప్రసాదించుటకు రాలేదు. కాని నీ నిర్యాణమును దర్శించి ధన్యులౌదామని వచ్చినాము. ఆ విధముగ చెప్పి ఊరకున్నవారిని చూస్తూ మీరంతా జ్ఞానమూర్తులు కదా! దయతో గుహ్యార్థములు, రహస్య విషయము లను చెప్పి నేనీ ఏడహములలో ముక్తికిపోయే తెరవుచూపరా! అని

ప్రశ్నిస్తూంటే మహాత్ములందరు తమలో తాము వితర్కించుకొను చుండిన సమయములో అచ్చటికి శ్రీ శుకులవారు వస్తారు. ఆయన ఎటువంటి వాడో చూడండి.

> "ప్రతినిమేషము పరబ్రహ్మంబు వీక్షించి
> మది జొక్కి వెలుపల మరచువాడు
> కమలంబు మీది భృంగములకై వడి
> మోముపైన నెరపిన కేశపటలివాడు
> గిరవాసి మాయ నంగీకరించని
> భంగివసనంబు కట్టకవచ్చువాడు.
> సంగిగాడని వెంట జాటుభూతములు నా
> బాలుర హాసశబ్దముల వాడు
> మహితపపజాను జంఘోరు మధ్యహస్త
> బాహువక్షోగళానన ఫాలకర్ణ
> నాసికాగండమస్తకనయన యుగళుడైన
> యవధూతమూర్తి వాడరుగుదెంచె. 1-513

అర్థము॥ ప్రతిక్షణమూ పరబ్రహ్మస్వరూపాన్ని దర్శిస్తూ పరవశించిన హృదయంతో బయటి ప్రపంచమును మరచినవాడూ, కమలంమీద గండుతుమ్మెదలలాగ ముద్దులు మూటకట్టే ముఖము పైన ముంగురులు ముసురుతున్నవాడూ, సర్వసంగపరిత్యాగియైన మహాయోగి యితడని చాటుతూన్నట్లు, బాలకులు అల్లరిచేస్తూ, ఆయనను చుట్టి వచ్చుచున్నారు. సహజసుందరములైన చరణాలూ, మోకాళ్లు, ఊరువులు, నడుమూ, చేతులూ, భుజాలూ, వక్షస్థలము, కంఠము, ముఖము, లలాటము, చెవులు మొదలగు అవయవములూ కలిగి అనుకోకుండ అక్కడికి వచ్చినాడు.

ఇంకా ఎటువంటివాడంటే —

"ఈరనిలోకులంగిసి యెగ్గులు పల్కనివాడు గోరికల్
గోరనివాడు, గూటువలగూడనివాడు వృథాప్రపంచమున్
జేరనివాడుదై వగతి జేరిన లాభము చూచి తుష్టుడై
నేరనివాని చందమున నేర్పులు జూపెడువాడు వెండియున్, 1-514

అర్థము॥ ఈయ లేదని ఎవరినీ కోపంతో ఎగ్గులు పల్కడు. కావాలని ఏ కోరికలు కోరడు. ఎవరితోనూ సంబంధాలు పెట్టుకోడు. వ్యర్థమైన సంసారవిషయములపైకి మనస్సును పోనీడు. దైవవశంవల్ల తమకు ప్రాప్తించినదానితో సంతృప్తిజెంది ఏమియు నెరుగని అమాయకునివలె కనబడువాడు.

"అమ్మహాత్ము షోడశాబ్దవయో రూప గమనగుణ విలాసకౌశలములు
ముక్తికాంత సూచి మోహితయగునన నితరకాంత లెల్లనేమి
చెప్ప" 1-515

అర్థము సులభము.

ఆయన చూచు వెర్రివానివలె ఉన్నను బ్రహ్మజ్ఞానియైయున్నాడు. ఈ విధముగ ఆయన చక్కగ పరీక్షిన్మహారాజు వద్దకు వస్తే —

"ఇట్లు వ్యాసనందనుండైన శుకుండరుగుదెంచిన నందలి ము
నీంద్రులమ్మహానుభావుని ప్రభావంబు తెరంగెరుంగుదురు గావున
నిజాసనంబులు డిగ్గి ప్రత్యుత్థానంబులు సేసిరి. పాండవ
పౌత్రుండు నా యోగిజన శిఖామణికి నతిథిసత్కారంబులు
గావించి దండప్రణామంబుజేసి పూజించె. మరియు
గ్రహనక్షత్ర తారకామధ్యంబునన్ తేజరిల్లు రాకాసుధాకరుండు
నుంబోలె బ్రహ్మర్షి, దేవర్షి, రాజర్షి మధ్యంబునం గూర్చుండి
విరాజమానుండైన శుక యోగీంద్రుంగనుంగొని" 1-517

శ్రీశుకులవారు పదారేండ్ల వయస్సువాడు. అక్కడ కూర్చున్నవారిలో చాలామంది గడ్డాలు, మీసాలు నెరసినవారు. అయినను శ్రీశుకులవారికందరు ఆసనంబుల నుండి లేచి నమస్కరించిరి. అంటే వయస్సు ప్రధానముకాదు. జ్ఞానము ప్రధానము. దీనినే శాస్త్రమునందిట్లు చెప్పినారు.

"న తేనవృద్ధోభవతి యేనాస్యపలితం శిరః।
యోవై యువాప్యధీయానో తం దేవాః స్థవిరంవిదుః॥

అర్థము తలనరచినంతనే మనుష్యుడు వృద్ధుడనిపించుకోడు. యువకుడు అయినప్పటికి ఎవడు విద్య నార్జించియుంటాడో వానినే వృద్ధుడనవలెనని దేవతలు చెప్పిరి.

ఈ విధముగ చూచుట యౌవనారంభకాలములో ఉండి విజ్ఞాన మూర్తియైన శ్రీశుకులవారిని పరీక్షిన్మహారాజు చూచి

"ఫాలము నేలమోపి భయభక్తుల తోడ నమస్కరించి భూ
పాలకులోత్తముండు కరపద్మములన్ ముకుళించి నేడు నా
పాలిటి భాగ్యమెట్టిదియొ పావన మూర్తివి పుణ్యకీర్తివీ
వేళకు నీవు వచ్చితి వివేక విభూషణ దివ్యభాషణా" 1-518

సాష్టాంగపడి నమస్కరిస్తూ భయభక్తులతో విన్నవించుకుంటున్నాడు. "మహానుభావా! శుకదేవ! నా అదృష్టము కొద్ది పావనమూర్తివీ పుణ్యకీర్తివీ విజ్ఞానమూర్తివీ నీవు సమయానికి విచ్చేసినావు. ప్రభూ!"

పరీక్షిన్మహారాజుకు అద్భుతమైన ఆనందమైంది. ఈ సమయములో ఆయన వచ్చుట పేదకు పెన్నిధి లభ్యమైనట్లూ గ్రుడ్డివానికి కన్నులు వచ్చినట్లు అయ్యింది. ఇంకా యీ విధముగ పలుకుచున్నాడు.

"అవధూతోత్తము మంటి నేడు నినుడాయంగంటి నీ వంటివి
ప్రవరుంబేర్కొనునంతలో భసితమౌ పాపంబు నా బోటికిన్
భవదాలోకన భాషణార్చన పదప్రక్షాళన స్పర్శనా
ది విధానంబుల ముక్తి చేపడుట చింతింపంగ నాశ్చర్యమే?
1-519

స్వామీ! నీ ఆగమనము వలన నేను ధన్యుడనైనాను. నీ సందర్శనం వలన నాజన్మ తరించింది. నీవంటి బ్రహ్మజ్ఞాని పవిత్ర నామం ఉచ్చరించినంతమాత్రంచేతనే పాపాలన్నీ భస్మీభూతము లౌతాయి. ఇక నిన్ను దర్శించి, నీమాటలు విని, నిన్నుఅర్చించి నీ కాళ్ళు గడిగి నాపై చల్లుకుంటే నాకు మోక్షం ప్రాప్తిస్తుందంటే ఆశ్చర్యమేముంది?

స్వామీ! అవధూతలలో అగ్రగణ్యుడవు. అవ్యక్తమైన గమనం కలవాడవు. నీదర్శనం వ్యర్థముకాదు. నా వాంఛితార్థం ముమ్మాటికి సిద్ధిస్తుంది.

"అవ్యక్త మార్గుండవైన నీ దర్శనమూరడి పోనేర దభిమతార్థ
సిద్ధిగావించుట సిద్ధంబు నేడల్లి దేహంబువర్జించు దేహధారి
కేమి చింతించిన నేమి జపించిన నేమి గావించిన నేమి వినిన
నేమి సేవించిననెన్నడు సంసార పద్ధతి బాసిన పదవి కలుగు
నుండుమనరాదు గురుడవు యోగి విభుడవావు బిడికిన తడవెంత
యంత సేపు
గాని యొకచోసనుండవు కరుణతోడ జెప్పవే తండ్రి ముక్తికి
జేరు తెరవు"

ఈ పద్యములో ఎంత ఆర్తి భావము గోచరమవుతుందో చూడండి. దీనితో ప్రథమ స్కంధం పూర్తవుతుంది. ఇపుడు ద్వితీయ స్కంధములో ప్రవేశిస్తున్నాము. పరీక్షిత్తు ప్రశ్న విని శ్రీ శుకుల వారి చాలా ఆనందమైనది. ఆయన అంటాడు —

## ద్వితీయ స్కంధము.

"వరీయానేష తే ప్రశ్నః కృతో లోకహితంనృప।
ఆత్మవిత్సమ్మతాం పుంసాం శ్రోతవ్యాదిషు యఃపరః॥"

పరీక్షిన్మహారాజా! నీ ప్రశ్న చాలా శ్రేష్ఠమైనది. దీనితో నీవు లోకహితం చేసినట్లైనది. జ్ఞానులైన పురుషులకందరికి యిది ఎంతో సమ్మతమైనది. వినదగిన వాటిలో ఉత్తమమైనది.

ఈ ప్రపంచములో చెవితో వినదగిన మాటలెన్నో ఉన్నవి. కాని ఇట్టి మాటలు, ప్రశ్నలు అందరు చర్చించరు. మామూలు ప్రజల స్థితి వినుము.

"గృహముల లోపల గృహమేధులగు
నరులాత్మతత్త్వము లేశమైన నెరుగ
రంగనారతులనిద్రాసక్తి జనురాత్రి
పోవు కుటుంబార్థ బుద్ధి! నహము
పశుకళత్ర పుత్ర బాంధవ దేహాది
సంఘమెల్ల తమకు సత్యమనుచు
గాపురములు చేసి కడపట జత్తురు
కనియు గాన రంత్యకాల సరణి" 2-3

గృహములలో నిరంతరము గృహస్థులు కామకర్మలలో నిమగ్నులై ఆత్మతత్త్వము తెలుసుకొనరు. ఎందుకంటే వారికి స్త్రీలయందు ఆసక్తిచేత కామోపభోగములో రాత్రి గడుస్తుంది. పగలు కుటుంబపోషణకొరకై తాపత్రయముతో పనులు చేసుకొనుటలో గడచిపోతుంది. ఈ విధముగ జీవితానికి ఉండిన రాత్రింబవళ్లు గడచిపోతాయి. కబీరుదాసంటాడు.

"రాత్ గంవాయే సోయికర్ దివసగం వాయే ఖాయేకర్
హీరాజన్మ అమోలుథా కోడీబదలే జాయ్.

రాత్రి నిద్రించుటలో, దినము తిండితినుటలో తినుటకు కావల సిన వాటిని సంపాదించుకొనుటలోను గడచిపోతుంది. జీవితము అమూల్యమైన రత్నముతో సమానమైనది. ఎవడీ విధముగ గడుపు తాడో వాడు రత్నాన్ని ఒక చిల్లిగవ్వకు బదులు ఇచ్చిపుచ్చుకున్న పిచ్చివానితో సమానము.

ఈ విధముగ జరుగుటకు మరొక్క కారణమున్నది. వారి కున్న భార్య బిడ్డలు, ఇల్లు మొదలగువాటిని సత్యమని తలుస్తారు. ఆ విధమైన భావములో తత్పరులై జీవితమును గడపుటలో వారు అంత్యకాలాన్ని చూచియూ చూడరు. అంటే ఇరుగు పొరుగువారు చస్తూంటే చూస్తారు. కాని తమ విషయములో మాత్రము ప్రమ త్తులై మరణాన్ని భావించరు. మరణకాలము వచ్చినప్పుడు యేడుస్తూ చస్తారు. ఈ విధముగ జీవితాన్ని వ్యర్థము చేసుకుంటారు. ఇట్టి జీవితాన్ని సార్థకము చేసుకోవలసియుంటే –

"తస్మాద్భారత సర్వాత్మా భగవానీశ్వరోహరిః।
శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యశ్చేచ్ఛతా భయమ్॥"

అభయమైన స్థితిని పొందవలసియుంటే పరీక్షిన్మహారాజా! భగవంతుడు, ప్రభువు, హరియైన సర్వేశ్వరున్ని గురించి శ్రవణము చేయాలి. కీర్తనము చేయాలి, స్మరించాలి. ఇదొక్కటే మార్గము.

ఇపుడిక్కడ పరీక్షిన్మహారాజు శిష్యుడు. ఆయన ఆత్మజ్ఞానానికి సంపూర్ణాధికారియై రాజ్యము, భోగములు త్యాగముచేసి కూర్చు న్నాడు. ఆయన రాజ్యముచేసే కాలములో శ్రీశుకులవారు వచ్చి యుంటే "స్వామీ! ఈ దినం తీరుబడిలేదు, రేపు రమ్మని" చెప్పి యుండు. ఇపుడట్లకాదు. శ్రీశుకుని వంటి గురువుకొరకై పరీక్షిత్తు అత్యంత ఏకాగ్రతతో నిరీక్షించుచున్నాడు. సజ్జనులు, సద్గురువులు తమవద్దకు రావలెనంటే ముందు తాను సంస్కరింపబడాలి. తాను

సంస్కరింపబడుట అనగా మనస్సును సంస్కరించుకోవాలి. మనము సంస్కరింపబడితే మహనీయుడైన గురువు లభిస్తాడు.

భోజనమేవిధముగ శరీరానికి అవసరమో భగవద్భజన, చింతన, శ్రవణము అంత అవసరము. ముసలితనము దీనికి సరియైన సమయమంటారు. ముసలితనము వచ్చేవరకు బ్రతికి ఉంటామని ఎవరికైనా గారంటీయున్నదా? ఈ శరీరము తామరాకుపై నీటి బిందువువలె చపలమైనదన్నాడు శంకరాచార్యులు.

"నలినీదళగతజలమతి తరళం తద్వజ్జీవితమతిశయచపలమ్"

కావున భగవద్భజనకు చిన్నతనమే శ్రేష్ఠమైన కాలము. ఆ చిన్నతనములోనే దీనియందాసక్తి కలుగుతే ఆ సంస్కారముచేత సహజమైన భక్తిభావన పాదుకుంటుంది. ఈ భాగవత మార్గానికి జీవితములో ప్రతి సమయము అదనే, కావున సమయము చిక్కినప్పుడంతయు భక్తి సాధన చేయవచ్చు.

ఒక మనుష్యుడు సముద్రస్నానము చేస్తామని పోయినాడు. అలలు విపరీతముగ లేస్తున్నాయి. కొంచెము అలలు తగ్గిన తరువాత స్నానము చేస్తాములెమ్మని కూర్చున్నాడట. అలలు తగ్గుతాయా? సంసారమొక సముద్రము దీనిలో అసౌకర్యములే అలలు. సంసారమున్నంతకాలము తగిన అనుకూలము కోరుతున్నట్లు భగవద్భజనకు కుదరక పోవచ్చు. అనుకూలము కలిగి భగవంతున్ని భజిస్తామంటే ఆ పప్పులుడకదు. అలలు లేస్తూనే ఉంటాయి. నీవు స్నానము చేస్తూనే పోవలె.

"శతం విహాయ భుంజీత, సహస్రం స్నానమాచరేత్।
లక్షం విహాయదాతవ్యం కోటింత్యక్త్వాహరింభజేత్॥"

అన్నారు పెద్దలు.

నూరు కార్యాలు ఉండినా భోజన సమయములో వాటిని వదలి భోంచేయాలి. వేలు కార్యాలను వదలి స్నానము చేయాలి. లక్ష కార్యాలు వదలి పాత్రవస్త్ర దానము చేయాలి. కోటి కార్యాలను వదలి భగవంతున్ని భజించాలి.

ఈ విధముగ శాస్త్రము చెప్పింది కాబట్టి భగవంతున్ని భజించుటకు ఎన్ని ఆటంకములు కలిగినను సరే వాటిని త్యాగము చేసి శ్రవణాదులను సాధించాలి. జీవితములో ఏలాటి కష్టములు వచ్చినను సరే భగవంతున్ని పొందవలెనను లక్ష్యము మరువ రాదు.

మనుష్యుని ఆయుస్సు, శక్తి, ఈ రెండును నిద్ర, భోగములలో చాలా ఖర్చయి పోవుచున్నవి. నిద్ర భోగాదులలో ఖర్చయ్యే కాలాన్ని గమనించలేరు చాలమంది. పోయిన కాలాన్ని గురించి దుఃఖించవద్దు. ఉన్నకాలము అంటే వర్తమాన కాలాన్ని సార్థక పరచుకో. స్త్రీ, ధనము, శరీరం, వీటిచేత కలిగే అనేకములైన సంఘటనలు అన్నియు అసత్యం. ప్రజలు వివేకంలేక వాటి వ్యామోహ ములో పడి పిచ్చివారై పోతారు. ఈ విధమైన అజ్ఞానముతో ప్రజలు సమయమెట్లు ఖర్చు పెట్టాలి? జీవితముయొక్క లక్ష్యమేమి? అనే వాటిని తెలుసుకోలేని వారైనారు.

> "ఘనమగు తనయ వధూపశుధన
> గృహరక్షణమునందు దత్తక్రియలన్
> మనమున దలపోయుచు దినదినమున్
> దందహ్యమాన దేహుండగుచున్"

నిరంతరము సంసారసంబంధమైన చింతలోనే ఆలోచిస్తూ తత్సంబంధములైన పనులు చేస్తూ చింతాగ్నిచేత దహింపబడు చున్నారు.

ఈ విధముగ జీవితము గడుపువారికి సంసార మొక సముద్రం. వారు దీని సారం ముట్టవగిన జీవితమును విఫలము చేసుకుంటారు. ఆ విధముగా గాక పరమేశ్వరున్ని జీవితాధారుడుగ తెలుసుకొని భక్తిపూర్వకమైన జీవితము గడుపువారు, భగవంతునివైపు మరలిన వారు, జీవితపు సముద్రాలన్ని అవలీలగా దాటగలుగుతారు.

శంకరాచార్యులు ఒక పర్యాయము పండరీపురం పోయి పాండురంగన్ని దర్శించారట. ఆ భగవంతుడు ఒంటి కాలిపై నిలుచుకొని నడుము పట్టుకొని యుండిన ముద్ర చూస్తే శంకరాచార్యుల వారికి యీ భావము తట్టినది.

"భవాబ్ధేః ప్రమాణం ఇదం మామకానాం
నితంబంకరాభ్యాం ధృతోయేన తస్మాత్।
సమాగత్య తిష్ఠంతమానంద కందం
పరం బ్రహ్మ లింగం భజే పాండురంగమ్॥"

అంటే భగవంతుడీ విధముగా చెప్పుచున్నట్లు, ఆయనకు తోచినదట. నా భక్తులైన వారి యీ సంసార సముద్రం ఇంతలోతే. అంటే నడుము లోతేనని ఆయన నడుము పట్టుకొని చూపుచున్నాడు. ఈ విధముగ చూపుచున్న ఆనందకందులైన పాండురంగనికి నమస్కారము.

నిజముగ భగవంతుని యెడల వాస్తవమైన భక్తియున్న వారికి సంసార సముద్రము నడుము లోతే. అందువలననే శ్రీశుకులవారు నిష్కర్షగ చెప్పినారు -

"సవై పుంసాం పరోధర్మః యతోభక్తి రధోక్షజే।
అహైతుక్యా ప్రతిహతాయ మాత్మాసం ప్రసీదతి॥"

భగవంతునియందు భక్తిగలిగి యుండడమే పురుషులకు పరమ ధర్మము. నిర్హేతుకమైన భక్తివలన ఆత్మ ప్రసాదము కలుగుతుంది.

జీవునిలో జ్ఞానానందములున్నవి. కాని అవి ఖండితములై యున్నవి. పురాణవైరాగ్యము, స్మశాన వైరాగ్యము, ప్రసూతి వైరాగ్యము మొదలగువాటితో జ్ఞానము కలుగుతుంది. ఎపుడు జ్ఞానము కలుగుతుందో అపుడు తక్షణమే ఆనందమనుభవములోనికి వస్తుంది. కాని అవి నిలువవు. కొద్ది సమయములోనే మాయా ప్రపంచము వాని జ్ఞానాన్ని కప్పివేస్తుంది.

ఒకచోట రామాయణము పురాణము జరుగుచున్నది. ఒక ఇంటిలోని భార్యా భర్తలు పోయి కథ విన్నారు. ఇంటికి పోయే దారిలో భార్య భర్తతో అన్నది. నాధా! మనము రామాయణము వింటిమి కదా! అందులో రాముడు - సీత వీరి దాంపత్యమెంత బాగున్నది. వింటూంటేనే ఇంత ఆనందముగ నున్నది. ఆ విధముగ నడచుకుంటే ఎంత బాగుంటుందో! కావున ఈ దినంనుండి నేను సీత వలె నుంటాను. మీరు రాముని వలె ఉండండి. ఆనందముతో జీవితం గడుపుదాం అన్నది. ఈ మాటలు వినేసరికి పురుషునికి ఎంతో ఆనందమైనది. ఎందుకు? ఆమె గయ్యాళి నంబరు ఒన్.

ఆమె ఆ విధముగ మాట్లాడడం నా భాగ్యమనుకున్నాడు. సరే, ఇంటికి వెళ్ళినారు. భోంచేసేటపుడు పప్పులో ఉప్పు ఎక్కువైనది. భర్త భార్యతో "ఏమే! నీకు కాకికి వచ్చినట్లు యేండ్లు వచ్చినాయి. పప్పులో ఎంత ఉప్పు వేయవలెనో తెలియదా?" అన్నాడు. ఆ మాట వినేసరికి ఆమెకు తీవ్రమైన కోపము వచ్చింది. తీవ్రస్వరముతో అన్నది. "ఏమిరా! భద్రమయ్యా! నా చేతులో తెడ్డుకట్టె ఉన్నది సుమా! కొంచెము ఒళ్ళు జాగ్రత్తగా పెట్టుకొని మాట్లాడు." ఏమైంది సీతారాముల ఆదర్శజీవితము? ఈ విధముగ మాయా ప్రపంచము మానవులలో అపుడపుడు కనిపించుచుండిన జ్ఞానాన్ని కప్పివేస్తుంటూంది. ఇట్టిది పురాణవైరాగ్యము. దీనితో

కొంత వైరాగ్యము తద్వారా జ్ఞానము కూడ కలుగుతుంది. కాని అది నిలువదు. ప్రసూతి వైరాగ్యము స్మశానవైరాగ్యములు కూడ ఇట్టివే. తత్కాలములో కలుగుతాయి. స్థిరముగ నిలువవు. దానికి మాయయే కారణము.

జ్ఞానము, తద్వారా ఆనందము కలుగవలెనంటే అధోక్షజుడైన దేవదేవుని ఆశ్రయించాలి. ఆయన అనుగ్రహము చేతనే జీవుడు ప్రసన్నతను పొంది ఆనందమును అనుభవిస్తాడు. ఈ విధమైన ధన్యత్వమును సంతరించుకోవలెనంటే భాగవతము భక్తి ప్రధానమంటుంది. ప్రపంచమువైపు చూస్తే భగవంతుని అమోఘమైన రచనా వైభవము భావుకమైన మనుష్యుని పరవశము చేస్తుంది. కావున ఆయన శక్తిని గురించి ఆ పరమాత్మపై భక్తి గలిగియుండాలి. భగవద్గీతలో 8-వ అధ్యాయములో ధ్యానశ్లోక మొకటున్నది:—

"కవిం పురాణమనుశాసితారమణో
రణీయాంస మనుస్మరేద్యః।
సర్వస్యధాతారమచింత్య రూప
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్॥ "

భగవంతుడు కవిః అంటే సర్వజ్ఞుడని అర్థము. సృష్టి స్థితి లయాదులెట్లు చేయవలెనో పూర్ణముగ తెలిసినవాడు. ఇదుగో! ఈ గడియారము తయారు చేసినవానికి దీనిలోని వస్తువు లెంతెంత పరిమితిలో ఉండవలెనో! వాటి పూర్ణజ్ఞానముంటుంది. చక్కగా తెలుసుకొని ఆ వస్తువును చేస్తాడు. అటులనే యీ విశ్వరచనను భగవంతుడు పూర్ణజ్ఞానముతో చేసినాడు. దానిని చక్కగ గమనించాలి. ఆ విధముగ గమనించకపోతే ఈ సృష్టి అస్తవ్యస్తముగ కనిపిస్తుంది.

ఒకడు భగవంతున కెంత జ్ఞానమున్నదో తెలుసుకుందామని బయలుదేరినాడు. పోతూ పోతూ ఎండ ప్రొద్దయింది. కావున ఒక

పెద్ద మామిడిచెట్టు క్రింద పడుకొన్నాడు. ఆ చెట్టుకు పైన చిన్న చిన్న మామిడికాయలు కనిపించినవి. కాళ్ళ ముందరనే ఒక తోట ఉన్నది. దానిలో పెద్ద పెద్ద సొరకాయలు కనిపించినవి. ఆ రెండింటిని వాడు బాగా పరీక్షించి చూచినాడు. చటుక్కున అన్నాడు. భగవంతునికీ మాత్రము తెలియక పోయినదా ? ఏమంటే మామిడిచెట్టు ఇంత పెద్దది, రెండు బారలున్నది దాని మొదలు. ఇంతటి పెద్దచెట్టుకింత చిన్న కాయలు! ఇంతటి చిన్న తీగెకు ఇంతటి లావుసొరకాయలా ? ఛీ ఛీ. నేనే భగవంతుని స్థానములో నుంటే దోసకాయల స్థానములో మామిడి పండ్లను, మామిడి పండ్ల స్థానములో దోసకాయలను మార్చేవాడిని – ఈ విధముగ అనుకుంటున్నాడో లేదో ఇంతలో ఒక చిలుక పైనున్న ఒక మామిడికాయను కొరికింది. అది తెగి చక్కగ వాని తలపైన పడింది. వానికి తల దిమ్మెక్కింది. గట్టిగా అరచినాడు, "భగవంతునికి గొప్ప తెలివి యున్న"దని, కాకపోతే ఇంతటి పెద్ద సొరకాయ అంత మెత్తునుండి తలపైన పడితే తల చింతకాయ తొక్కు కాదా మరి! భగవంతునికి అమోఘమైన తెలివుందన్నాడు. భగవంతుడు సర్వజ్ఞుడు, కావున నిండు భక్తితో ఒక మారు ఆయనను స్మరించిన చాలును,

ఇచ్చట పరీక్షిన్మహారాజు వినయముతో ప్రశ్నిస్తున్నాడు. భగవద్గీతలో గురువుతో ఎట్లు ప్రశ్నించవలెనో తెలుపబడింది.

"ఏతద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః॥"

సాష్టాంగ నమస్కరించి వినయముతో ప్రశ్నించాలి. ఎందుకంటే ఆ విధముగ వినయముగ ప్రశ్నించకపోతే ఆ గురువు జ్ఞానాన్ని ఉపదేశించడు. అటులనే పరీక్షిన్మహారాజు కూడ "ఫాలము నేల మోపి భయభక్తులతోడ నమస్కరించి..." అడుగుతాడు. ఈ

మార్గములో గురువు స్థానము చాలా గొప్పది. ఈ సందర్భమున కబీర్దాసు పలుకు జ్ఞాపక మొస్తుంది —

"గురు గోవిందదోవూఖడై కాకేలానూపాయ్
బలిహారీ గురు ఆపనే జిన గోవింద బతాయ్"

ఒక పర్యాయము కబీర్దాసుకు గురువు, గోవిందుడూ ఇద్దరూ ఒకే పర్యాయము ప్రత్యక్షమైనారట. మొదట ఎవరి పాదములకు నమస్కారము చేయవలెనని సందేహము కలిగింది. భగవంతునికి మొదట చేయవలెనా? అట్లు చేస్తే గురువనుకోవచ్చు. ఏమిరా? వీడు నన్ను వదలి భగవంతునికి నమస్కారము చేస్తాడు? ఒకవేళ గురువు పాదములకు నమస్కారము చేస్తే భగవంతుడనుకోవచ్చు. ఏమిరా! నేను సాక్షాత్తుగ ప్రత్యక్షమైన పిమ్మట గురువుకు నమస్కారము చేస్తాడే! మరి యిపుడీ చిక్కు తొలగే దెట్లు? ఎవరి పాదములకు మొదట నమస్కారము చేస్తు, అని అంతర్ముఖుడై తే లోపల నుండి అంతర్వాణి పలికింది. "బలి హారీ గురు ఆపనే జిన గోవింద బతాయ్" గురువు పాదములపైననే పడునాయనా! ఆయన అనుగ్రహము వలన కదా! ఈ భగవంతుని దర్శన మబ్బింది. ఈ విధముగ గురువు స్థానము చాలా గొప్పది.

శ్రీశుకులవారు అవధూత. పరీక్షిత్తు భాగ్యము కొద్ది ఆయన వచ్చినాడు పరీక్షిత్తుకు చెబుతూన్నాడు. నాయనా! పరీక్షిన్మహారాజా! మృత్యువు వచ్చిందని నీవు భయభీతుడవు కావద్దు. ప్రతి సంఘటనలోనూ మనము గమనించ వలసిన విషయముంటుంది. మృత్యువు వచ్చేందుకు కొన్ని గుర్తులున్నవి. అరుంధతి కనిపించక పోతే ఒక సంవత్సరములో మరణము మనవారు పెండ్లి చేసేటపుడు పట్టపగలు అరుంధతి కనిపించిందా? అని అడుగుతారు. కనిపించ లేదంటే కనిపించిందను మని ఆదేశిస్తారు. అరుంధతిని చూపుటలో

ఉండిన తాత్పర్యమేమి? అరుంధతి భర్తపై గొప్ప భక్తి కలది. వారి ద్దరి దాంపత్య మన్యోన్యమైనది. ఆ విధముగ మీ దాంపత్యముండ వలెనను సూచన దానిలో నున్నది. ఆ విధమైన అరుంధతి రాత్రి పూట కనిపించకపోతే ఒక సంవత్సరములో మరణము. స్వప్నములో బురదలో చిక్కుకొన్నట్లు కనిపిస్తే ఆరు మాసాలలో మరణము. శరీరమంత నూనె పట్టించుకొని గాడిదపై కూర్చున్నట్లు స్వప్నము వస్తే 9 మాసాలలో మరణము. చెవులలో వ్రేళ్ళు పెట్టుకుంటే శబ్దము వినపడకపోతే ఏడు రోజులలో మరణము. ఈ విధముగ మనము మరణము గుర్తుల నెందుకు చెప్పుకొనుచున్నాము? మనము విషయము తెలుసుకునేందుకు, భయపడేందుకు గాదు. ఒక చోట ఇదే విధముగ మృత్యువుయొక్క ఆగమన సూచనలు చెప్పితే ఒక వ్యక్తి తెల్లవారి భయపడుకుంటూ వచ్చి "స్వామీ! నాకు రాత్రి స్వప్న ములో మీరు చెప్పినవన్నియు కలలో వచ్చినాయి. నాగతి యేమి" అంటాడట. భయపడితే అన్నీ వస్తాయి. కావున భయపడవలసిన పని లేదు. నాయనా! నీవు భయపడ్డావు కాబట్టి ఆ విధముగ స్వప్నము వచ్చింది. భయపడవద్దు. ఈ ప్రపంచములో మానవుడు నిర్భయుడై యుండాలి ఆ నిర్భయత ఎప్పుడు వస్తుంది?

భగవద్గీతలో దైవీగుణాలను గురించి చెప్పేటపుడు మొదట యీ నిర్భయత చెప్పబడుతుంది. దైవీసంపద్విభాగయోగములో "అభయం సత్వసంశుద్ధిః" అని మొదట అభయం అని చెప్పబడింది. ఒక పర్యాయము వివేకానందులవారు ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో ప్రయాణము చేయుచున్నాడు. దారిలో నొక స్టేషనులో రైలు ఆగినపుడొక ఇంగ్లీషువాడు వచ్చి యెక్కినాడు. వివేకానందున్ని చూచినాడు. ఆ దినాలలో ఫస్టుక్లాసు కంపార్టుమెంటులో ఇంగ్లీషు వారే యెక్కాలి. అందువలన వానికి ఎట్లో అనిపించింది. An

Indian is travelling in the first class compartment and that too how he is carelessly sleeping అనుకొని ఆయన బూట్లను చూచి సహింపజాలక కిటికీలో నుండి వాటిని బయటకు పారవేసినాడు. కొంతసేపటికి వివేకానందుడు లేచి వాని వాలకం చూచినాడు. వాడు పండుకున్నాడు. తన బూట్లు లేవు. ఆలోచించి వాడే ఓర్వలేక కిటికీలో నుండి పారవేసినాడని తెలుసుకొని వాని కోటు కొక్కెకి తగిలించి పండుకొనియుంటే దానిని బయటికి పారవేసినాడు. కొంతసేపటికి వాడు లేచి అటూ యిటూ చూస్తూ where is my coat, where is my coat అనుకుంటున్నాడట. అపుడు వివేకానందులవారు your coat has gone to search my boots అన్నాడు. ఇట్టిది అభయమంటే ఏమి ధైర్యమది. కాబట్టి భగవంతు నాశ్రయించుకున్నట్టివారి కంతటి ధైర్యం సంప్రాప్తమవుతుంది.

మనుష్యునికి భయమంటే మృత్యుభయ మన్నింటికంటే గొప్పది. దానికి కూడ భయపడనవసరంలేదు. ఒక వ్యక్తి వద్దకు తెల్లవారు ఝామున నే మృత్యుదేవత వచ్చి తలపు దట్టించదట. "ఎవరూ" అని ప్రశ్నిస్తే "నేను మృత్యువును. నిన్ను తీసుకొని పోవుటకు వచ్చినా" నన్నదట. దాని కతడు Come my darling take a cup of coffee and both of us go together ప్రియురాలా! లోపలికి రమ్మూ ఒక కప్పు కాఫీ తీసుకో. ఇద్దరము కలిసి పోదాము అన్నాడట. ఆ విధముగ నిర్భయముగ ఉండాలి. భయమెందుకు? ఈ దినము కాకపోతే రేపో ఎల్లుండో మృత్యువు తప్పక వచ్చేదే. ఈ శరీరము శాశ్వతం కాదు. ఎందుకంటే "శీర్యతే ఇతి శరీరమ్" ఇది జీర్ణము, శీర్ణమై పోయేదే. శాశ్వతమైనది కాదు. ఎవరైతే భగవంతు నాశ్రయించకుండా ఉంటారో వారు భయపడవలసినదే. వారి కేలాటి ఆధారము లేదు.

మనము భగవంతునాశ్రయించుకొని ఉండాలి. భయము నుండి దూరులమై ఉంటాము. భగవంతునిపై భక్తి కలిగి ఉండడమంటే భగవంతుడే ఆధారమనే బంగారువంటి జీవితము మనకు సంప్రాప్తమవుతుంది. ఈ విధముగ భక్తియొక్క శ్రేష్ఠత్వమును తెలియజేయుచూ శ్రీ శుకులవారంటారు. పరీక్షిన్మహారాజా! యోగానికిగాని, జ్ఞానానికిగాని భక్తియే ప్రధానమైనది.

మనోమాలిన్యం రెండు విధాలు. స్థూలము, సూక్ష్మము. స్థూల మలము తపము, జపము, ఉపాసనాదులతో పోతుంది. సూక్ష్మ మలము తీవ్రమైన భక్తితో మాత్రమే వదలిపోతుంది. ఈ విధముగ భక్తియొక్క సిద్ధాంతాన్ని బోధిస్తూ శ్రీ శుకులవారంటారు.

"ద్వైపాయనుండు మాతండ్రి ద్వాపర వేళ
బ్రహ్మసమ్మితమైన భాగవతము
పఠనంబు సేయించె బ్రహ్మతత్పరుడనై
యుత్తమశ్లోక లీలోత్సవమున
నాకృష్టచిత్తుండనై పఠియించితి
నీవు హరి పాదభక్తుండవగుట జేసి
యెరిగింతు వినవయ్య యీ భాగవతమున
విష్ణు సేవాబుద్ధి విస్తరిల్లు
మోక్షకాముననకును మోక్షంబు సిద్ధించు
భవభయంబులెల్ల బాసిపోవు
యోగి సంఘమునకు నుత్తమవ్రతములు
వాసుదేవ నామ వర్ణనములు." భా. 2-7

మా తండ్రి నాకు బోధించినదీ భాగవతము. నేను బ్రహ్మ తత్పరుడనై దీనిని ఆకర్షిత చిత్తుడనై చదివినాను. నీవు కూడ హరి పాదభక్తుడవు కావున యీ భాగవతము నీకు చెప్తాను. దీనితో నీకు

విష్ణుసేవాబుద్ధి వికసిస్తుంది. దీనిని శ్రవణము చేస్తే మోక్షము గోరే వానికి మోక్షము సిద్ధిస్తుంది. భవభయములు తీరిపోతాయి యోగి సంఘాలకు హరి నామ వర్ణనములు ఉత్తమమైన వ్రతములు.

పరీక్షిన్మహారాజా! సముద్రములో ఒక ఓడ పోతూంది. మధ్య సముద్రములో నొక కాకి ఓడపై నున్నది ఎగిరింది ఎక్కడికైనా పోదామని. కాని ఎక్కడికి పోయినా సముద్రమే. మరల ఓడపైకే వచ్చి వ్రాలింది. అటులనే జీవుడు తన అంశమైన పరమాత్మను వదలి సంసార సముద్రములో ఎక్కడికో పోదామనుకొని పోతాడు. తన కెప్పటికైననూ పరమాత్మయే ఆధారము. ఆ ఆధారమును పోగొట్టు కుంటే వానికి శాంతి ఉండదు. విను.

"హరి నెఱుంగక యింటిలో బహుహాయనంబులు మత్తుడై
పొరలుచుండెడి వెఱ్ఱి ముక్తికి బోవనేర్చునె వాడు సం
సరణముం బెడబాయ డెప్పుడు సత్యమూ హరి నామ సం
స్మరణ మొక్క ముహూర్త మాత్రము చాలు ముక్తి దమహాన్నృపా."

భా. 2 - 8

భగవంతున్ని తెలుసుకోనక ఎన్ని సంవత్సరాలు జీవిస్తే నేమి ప్రయోజనము! ఆ విధమైన వెఱ్ఱివాడు ముక్తికి పోలేడు. నిరంతరము సంసార సముద్రమునందే మునుగుతూ తేలుతూంటాడు. భగవంతుని నామము కేవలమొక ముహూర్త మాత్రము చేస్తే ముక్తి నిస్తాడు ఆ తండ్రి.

అందువలననే పెద్దలంటారు. "ముహూర్తం జ్వలితం శ్రేయః నతు ధూమాయితం చిరమ్" అంటే పొగరాచుకున్నట్లు బహు కాలము బ్రతికేదానికంటే ప్రకాశమానమై ఒక ముహూర్తం జీవిస్తే చాలు. భగవన్నిర్భర చిత్తముతో కొద్దికాలము జీవించిననూ చాలు. కావున మహారాజా! నీవు భగవంతు నాశ్రయించినావు. కావున

నీ జీవితము ధన్యమవుతుంది. దీనికొక విషయము చెప్తాను విను. పూర్వకాలములో దేవతలకు రాక్షసులతో విపరీతమైన బాధ కలిగింది. భూలోకములో నుండి ఖట్వాంగుడనే రాజును పిలుచుకపోయి రాక్షసుల బారినుండి విడువబడ్డారు. అపుడు దేవతలు ఖట్వాంగున్ని ఏమి కావలెనో కోరుకొమ్మన్నారు. అపుడాతడు నాకు వయస్సెంత ఉన్నదో చెప్పమన్నాడు. అతని కప్పటికి రెండు ముహూర్తముల కాలము మాత్రం వయస్సున్నదని చెప్పినారు. అతడు తక్షణమే గగన యానమున వచ్చి సర్వస్వము త్యాగముజేసి-

"గోవిందనామ కీర్తన గావించి భయంబు దక్కి ఖట్వాంగ ధరి-
శ్రీవిభుడు సూరగొనియెను కైవల్యము తొల్లి రెండు ఘడియలలోనన్."

ఈ విధముగ ఖట్వాంగుడు రెండు ఘడియలలో మోక్షము పొందినాడు. కావున "వినుము నీకు నేడు దివసంబులకుంగాని జీవితాంతంబుగాదు. తావత్కాలంబునకుం బారలౌకిక సాధనభూతంబగు పరమకల్యాణంబు సాధింపవచ్చు." ఖట్వాంగుడు మనస్సుతో సంసారమును త్యాగము చేసినాడు. మరణకాలమున భగవంతున్ని స్మరిస్తూ దేహాన్ని వదలినాడు. మరణకాలములో భావమెట్లుంటుందో తదుపరి అతని గతికూడ అట్లే ఉంటుంది అని మనము విన్నాము. కావున నీవు చింతించవలసిన పనియేలేదు. నీకు సమయము చాలా ఉన్నది. అంత లోపల పరమకల్యాణము సాధింపవచ్చు. అని పరీక్షిన్మహా రాజుకు భగవంతుని స్థూలమైన విరాట్స్వరూపాన్ని గురించి చెబుతాడు.

పరీక్షిన్మహారాజా! ఈ సమస్త ప్రపంచము భగవంతుని స్థూలరూపము. ఈ సమస్తము కంటికి కనిపించేదంతయు ఆయన వ్యక్తస్వరూపముగ భావించు అందువలననే శ్రుతి చెబుతుంది.

'యస్యాగ్ని రాస్యంద్యౌర్మూర్ధాఖం నాభిః చరణౌ క్షితిః॥
సూర్యశ్చక్షుః దిశః శ్రోత్రా తస్మై కాలాత్మనే నమః॥"

ఆస్యం అంటే నోరు, భగవంతునికి అగ్నియే నోరు, ఆయన మూర్ధం ద్యులోకం, ఆకాశం ఆయన నాభి, భూమి ఆయన చరణములు, సూర్యచంద్రులు కన్నులు, దిక్కులు ఆయన చెవులు, ఈ విధమైన కాలస్వరూపునికి నమస్కారమని అర్థం.

ఈ విషయములో శ్రుతి ఇంకను చెప్పేవిషయము. "యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా, అంతిర్బహిశ్చతత్సర్వం వ్యాప్యనారాయణస్థితః" అంటే ఏది కంటికి కనిపిస్తుందో, చెవికి వినిపిస్తుందో దానికి లోపల వెలుపల నారాయణ స్వరూపమే వ్యాపించి యున్నదని అర్థం.

ఈ విధముగ విశ్వరూపోపాసన చేయాలి. అంటే ప్రపంచమును భగవత్స్వరూపముగ చూడాలి. ఎవరిని ద్వేషించవద్దు. తిరస్కరించవద్దు. ఈ బోధనే దృఢము చేస్తూ శ్రీ శుకులవారంటారు.

"హరిమయము విశ్వమంతయు
హరి విశ్వమయుండు సంశయము పనిలేదా
హరిమయము గాని ద్రవ్యము
పరమాణువు లేదు వంశపావన వింటే" భా. 2-17

ప్రపంచమంతటిని భగవత్స్వరూపముగనే చూడు. అంతా హరిమయమే. ఈ ప్రపంచానికి ఆధారరూపములో పరమాత్మే కదా ఉండేది. పాముగా కనిపించినదాని కాధారమేమి? త్రాడు కదా? అటులనే వివిధములైన నామరూపములతో కనిపించే యీ ప్రపంచానికి పరమాత్మే ఆధారభూతుడు. కావున ఎవరిని తృణీకరించవద్దు.

ఒక ఉదాహరణ, ఒకచోట వికసించిన ఒక గులాబిపుష్పము. దాని క్రిందనే ఒక రాయి ఉన్నది. గులాబి పుష్పము రాతితో అంటుంది. "ఓ రాయీ! నీదీ ఒక జన్మేనా? ఎవరితోనూ, ఎప్పుడు

మా సన్మానము పొందవు. ప్రేమించబడవు. ఇదుగో! నా రూపము చూడు. నన్ను చూడు. కొద్ది కాలముండినా అందరి ప్రేమకు ఆదరమునకు పాత్రురాలనౌతాను. అంటూ ఇంకా ఏమేమో పలుకుచున్నది. కాని ఆ రాయి ఏమియు అనలేదు. ఇంతలో నొక శిల్పి ఒక రాయికొరకు వెతక్కుంటూ వచ్చినాడు. అతనికి రేపు ఉదయం పది గంటలకు రాముని విగ్రహము తయారుచేయాలి రాతితో. దాని కనువగు రాతిని వెతక్కుంటూ ఇక్కడ వచ్చినాడు. అతని దృష్టి కీరాయి సరిపోయినది. దాన్ని తీసుకున్నాడు. మరుదినం తెల్లవారు సరికి రాముని విగ్రహం తయారు చేసినాడు. ఆ విగ్రహానికి ప్రతిష్ఠపూజ జరుగుచున్నది. పూలన్నియు తెచ్చినాడు. నిన్న రాతిని తిరస్కార ముగ మాట్లాడిన పూవుకూడ తేబడి ఆ విగ్రహపు పాదముల పైన పెట్టబడింది. ఆ పూవు పైకి చూచింది. నిన్న తాను నిందించిన రాయియే యిది. ఈ దినానికిట్లు తయారైంది. తాను పాదములపై పెట్టబడి యున్నది. సిగ్గుతో తలవంచుకుంది. అపుడా విగ్రహమం టుందట. "ఓ గులాబిపుష్పమా! నిన్న సాయంత్రం నన్నెట్లో తిరస్కారముగ మాట్లాడితివి. అపుడు నేనేమియు ప్రత్యుత్తరమివ్వలేదు. ఇపుడు కూడ నేను ఏమియు మాట్లాడవలసిన అవసరము లేదు. ఎందుకంటే నీవు ప్రత్యక్షముగ అనుభవించుచున్నావు. అయితే ఒకమాట మాత్రం చెబుతాను. ఏమని! ఎట్టి పరిస్థితిలో కూడ గర్వించవద్దు. ఇతరులను తిరస్కారముగ మాట్లాడవద్దు.

శ్రీశుకులవారు చెప్పుచున్నారు. నాయనా! భక్తి ప్రేమ ప్రధానము. జ్ఞానము త్యాగప్రధానము. జ్ఞానము నాచరణలో నుంచుట కష్టము. శరీరముకంటె ఆత్మభిన్నమైనదని అందరికి తెలుసు. కాని అనుభవములో దానిని దించుకొనుట కష్టము. కాని భక్తి అత్యంత సులభము. తీవ్రమైనట్టి పరవశమైనట్టి భక్తి కలుగుతే

జీవితము తరించిపోతుంది. దీనిని గురించి శ్రీకృష్ణుడు ఏకాదశ స్కంధములో ఉద్ధవునితో చెప్తాడు. ఇది గమనించదగిన విషయం.

"దయయు సత్యంబు గూడిన ధర్మమైన
విశ్రుతతపంబు గూడిన విద్యయైన,
పావనుడనగు నాయందు భక్తి లేనివాని
నిష్పాపునిగ జేయ వశముగాదు.

దయ, సత్యము, తపము, విద్య మొదలగునవి ఎన్ని యుండినను పావనుడైన నా యందు భక్తి లేకపోతే మనుష్యుడు నిష్పాపుడు కాజాలడు. ఈ భక్తిని గురించి ఆయన యింకను తెలిపిన నిశ్చితాభిప్రాయము గమనార్హము.

"నిశ్చయంబుగ నెవనికి నిలిచియుండు
భక్తి నాయందు నెపుడు నిర్వ్యాజముగను
వాడు దుష్కర్మఫలిత స్వభావుడైన
శ్వపచుడైనను శుద్ధుడై భవము గెలుచు.

నిశ్చయముగ నెవనికి నాపై నిండు భక్తి ఉంటుందో వాడు చండాలుడుగాని శుద్ధుడై యీ సంసారమును దాటి ఆవలిఒడ్డు చేర్తాడు. కావున భక్తి మహిమ ఇట్టిది.

ఈ విధముగ భగవంతుడు సర్వవ్యాపకుడని గాఢముగ తెలుసుకోవాలి. ఆయనపై నిండుభక్తి కలిగివుండాలి. భగవంతుడు లేని చోటు లేదు. ఈ విషయమే నారాయణీయోపనిషత్తు చెబుతుంది. "అధశ్చ నారాయణః, అంతర్బహిశ్చ నారాయణః, నారాయణ ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యం ......... ఇట్టి సర్వవ్యాపకుడు భగవంతుడని గాఢముగ తెలుసుకోవాలి. ఒక గురువు తనశిష్యుల నందరికి ఒక్కొక్క అరటిపండిచ్చి దాని "నెవరు లేనిచోట తిని రాండి" అని చెప్పి పంపినాడు. అందరు చెట్టుదాపున, గుట్టదాపున,

గోడదాపున తినివచ్చినారు. కాని ఒక్కడు మాత్రం తినకుండా చేతబట్టుకొని వచ్చినాడు. గురువు "ఏమిరా! వాళ్ళందరు తినివచ్చినారు నీ వెందుకు తినలేదంటే ఆ శిష్యుడు "స్వామీ! మీరే చెబుతిరే భగవంతుడు సర్వవ్యాపకుడని ఆయన లేనిచోటు చూపించండి అక్కడికిపోయి తినివస్తా" నన్నాడు. ఆ గురువట్టిచోటు చూపించేదీ లేదు. ఇతను తినివచ్చేది లేదు. ఒక చోట ఒక వ్యక్తి తమాషాయైన ఒక విషయం చెప్పినాడు. ఏమంటే! ఒకతూరి ఒకనక్క భూదేవితో ముప్పై పైసలు అప్పు తీసుకున్నదట, నక్క ఎక్కడనైనా తీసుకుంటుందా? అని అడుగవద్దు. దీనిలోని స్వారస్యం మనము గమనించాలి. ఆ నక్కను భూదేవి మాటిమాటికి "నా ముప్పై పైసలు యీ" అని అడిగేదట. అపుడానక్క అంటుందట. నీవు లేనిచోటికి నేను పోతా. అపుడు నీ వడిగేది లేదు, నేనిచ్చేది లేదని పరుగెత్తబట్టిందట. ఎంతదూరము పోయినను నక్క భూమిపైననే ఉండాలి కాని, భూమిలేనిచోటికి అది పోగలుగుతుందా? అటులనే భగవంతుడు లేనిచోటికి మనము పోవుట అసాధ్యము. కావున భగవంతుడు సర్వవ్యాపకుడని భావించు. ఆయన ఆధారము లేక మనము బ్రతకలేము. మన సర్వేంద్రియములుకూడ ఆయనచేతనే ప్రేరేపింపబడుచున్నవి. కన్ను చూస్తూంది. ఎవరి శక్తిని ఆధారము చేసుకొని చూస్తూంది?

"యచ్చక్షుషా నపశ్యతి యేన చక్షూంషి పశ్యతి।
తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిద ముపాసతే॥" (కేన)

అంటే కన్ను స్వయముగ చూడజాలదు. ఏశక్తి ద్వారా దానికి చూచే శక్తి లభ్యమగుచున్నదో ఆ శక్తియే పరబ్రహ్మస్వరూపము. అంతటికి ఆయన ప్రేరణయే ప్రధానము. నీవు ఉపాసించేది బ్రహ్మకాదు.

అయితే ఇచ్చట నొక ప్రమాదమున్నది. అంతా భగవంతుడే చేయిస్తున్నాడంటే చెడ్డ కార్యాలు చేసేవారుకూడ భగవంతుని

పైకి తమ పాపమును నెట్టివేయ బోతారేమో! అట్లుకాదు. భగవంతుడు సకల కల్యాణ గుణాభిరాముడు. ఆయనవద్దకు పాపము చేరలేదు. కావున మంచికార్యాలుచేసి భగవంతుడు చేయించినాడని నిరహంకారమును పూనవచ్చును. చెడ్డకార్యాలు రాగ ద్వేషాలు లేక చేయుటకు వీలులేదు. రాగ ద్వేషాలే పాపాలు. ఒక దొంగ దొంగతనము చేసి "ఏమో భగవంతుడట్లు బుద్ధి పుట్టించెనన" రాదు. సత్కార్యాలు, పుణ్య కార్యాలు చేసి భగవంతుడు చేయించెననవచ్చు. దానిచేత భక్తుడు భగవంతునకి మరింత సన్నిహితుడౌతాడు. ఇంతకు ఎవడెట్టి కార్యము చేస్తాడో వాని కట్టిఫలము తప్పదు. భగవంతుడు సర్వాధారుడు కదా! ఆయన శక్తిచేతనే కదా సర్వకార్యములు నడచుచున్నదని చెప్పి తమ తప్పును సరిదిద్దుకొనే ప్రయత్నము సాగదు.

దీనికొక ఉదాహరణ. ఒక లైటున్నది. దాని వెలుగులో ఒకడు భాగవతము చదువుచున్నాడు. మరొకడు దొంగప్రాంసరి నోట్లు వ్రాయుచున్నాడు. ఒక బల్లి అక్కడ ఉండి పురుగులను పట్టి చంపుకొని తింటూన్నది. కాని ఇన్ని కార్యాలు జరుగుటకు ఆధార మేది? లైటే కదా? కాని భాగవతము వలన వచ్చే పుణ్యముగాని దొంగప్రాంసరి నోట్లు వ్రాయుటవలన వచ్చే పాపముగాని లైటు కేమైనా సంబంధమున్నదా? లేదు. దొంగప్రాంసరినోట్లు వ్రాయు వాని పాపము వానివద్దనే పోతుంది. భాగవతం చదివేవాని పుణ్యం వానికే పోతుంది. ఈ విధముగ భగవంతుడు సర్వాధారుడైననూ జీవులు చేసుకునే పుణ్యపాపములతో ఆయన కేవిధమైన సంబంధం లేదు. జీవులేవిధమైన కర్మ చేసుకుంటారో వారే దాని ఫలము ననుభవిస్తారు.

శ్రీ శుకులవారు మొదట సగుణస్వరూపమును చెప్పి పిదప నిర్గుణ ధ్యానమును గురించి చెబుతారు. అంతా హరిమయము అంటే

ఆయనే సర్వప్రపంచానికి, సర్వసంఘటనలకు ఆధారమని తెలుసుకొన వలె. సత్కార్యములుచేసి భగవదర్పణమను పనివా లేదు. దుష్కార్యములు చేసి భగవదర్పణమనుటకు వీలు లేదు. అట్లంటె దానికి వచ్చే పాపము రెట్టింపుగా నీ వద్దకు వస్తుంది. ఈ విధముగ విరాడ్రూపమును గురించి వర్ణించి తరువాత ధ్యానాన్ని గురించి చెబుతాడు. ఆయన సర్వరక్షకుడని భావించు. ఆయననే నమ్ముకొనుట చాలా మంచిది.

"రక్షకులు లేనివారిల రక్షించెదననుచు చక్రి రాజై యుండన్
రక్షింపుమనుచు నొక నరునక్షము ప్రార్థింపనేల నాత్మజ్ఞునకున్"
2 – 22

ఇంకొకరిని రక్షింపమనుట ఆత్మజ్ఞునకు తగనిపని. ఆత్మజ్ఞుడంటే యెవరు? ఆ సర్వేశ్వరుడే సర్వరక్షకుడనియు ఆయననే తాను నమ్ముకొని ఉండే మహానుభావుడు.

ఒక పర్యాయము ఒక రాజాస్థానములోని కొక పండితుడు వచ్చి "మహారాజా! భాగవతమును నేను బాగా చదివినాను. మీరు ఎక్కడ అడిగినా అర్థము చెప్పగలను. నా పాండిత్యము చూచి నాకు తగిన దక్షిణ యిమ్మ"ని అడిగినాడట. ఆ రాజు ఆ పండితుడు చెప్పే దంతయు విని అన్నాడట. "నాయనా! నీవు భాగవతమును చక్కగా చదువుకొని రా. ఇంకను నీవు బాగా చదువుకోలేద"న్నాడు. రాజు మాట కావున ఆ పండితుడు పోయి మరల మొదటినుండి చివరి వరకు అక్షరక్షరము చదువుకొని వచ్చి మహారాజుతో 'మహారాజా! నేను చక్కగ చదువుకొని వచ్చినాను. నా పాండిత్యమును చూచి తగిన దక్షిణ యివ్వవలసినద"ని మరల అడిగినాడు. దానికా రాజు ఆ పండితుడు చెప్పిన దంతయూ విని "నాయనా! నీవు చక్కగా చదువుకొని రమ్మన్నాడు. ఆ పండితుడు వెనుకకు వచ్చి భాగవతమును ముందర పెట్టుకొని ఈ తూరి భావముపైన నిగా పెట్టుకొని అధ్య

యనము చేస్తానని ప్రారంభించినాడు. పై పద్యము వచ్చింది. రక్షకులు లేనివారల... బాగా చదువుకున్నాడు. అపుడతని మనస్సులో నొక కొత్త భావముత్పన్నమైంది. అందరిని రక్షించేవాడు భగవంతుడు నేను రక్షిస్తానని కంకణము కట్టుకొని యుంటే నేను ఇంకొక నరున్ని యాచించడము తగనిపని. ఆ సర్వేశ్వరున్నే యాచిస్తానని భక్తితో భాగవతాన్ని చదువుట ప్రారంభము చేసేసరికి ఎక్కడెక్కడి భక్తులు వచ్చి ఆయనకు సర్వసౌఖ్యములను కల్పించనాగినారు. ప్రతిదినము వంటలు, వార్పులు, భక్తుల సంఖ్య అధికమై అతనికి ఇల్లుకూడ కట్టించినారు. అతని భాగవత ప్రవచన కార్యక్రమము వైభవముగ జరుగసాగినది. చూచితిరా! ఆయన నిజముగ భగవంతునిపై భక్తి గలిగి చదువుట ప్రారంభిస్తే ఎట్టి ప్రయోజనం కలిగిందో! ఆనందముగ కార్యక్రమము నడువసాగింది.

కొంతకాలము గడచినది. రాజు ఒకనాడు మంత్రి నడిగినాడు, "మంత్రీ! అప్పుడొక పండితుడు భాగవతము చదివినానని దక్షిణకు వస్తాంటానే ఆ పండితుడిపుడెక్కడున్నాడో కనుక్కో" మంత్రి అటూ యిటూ తిరిగి ఆ పండితుడున్న చోటికి వెళ్ళి ఆయనకు జరుగుచున్న వైభవము లన్నియు తెలుసుకొని రాజువద్దకు వచ్చి వివరాలు చెప్పినాడు. అపుడు రాజు "వెళ్ళి ఆ పండితున్ని రాజు దక్షిణ యిస్తాడు, రమ్మని పిలుచుకొని రావలసినద"ని ఆజ్ఞాపించినాడు. మంత్రి వెళ్ళి ఆ పండితునితో "భాగవతోత్తమా! మహారాజు మిమ్ములను రమ్మనుచున్నాడు. మీ పాండిత్యమును తెలుసుకొని దక్షిణ యిస్తారట రాండి"అని పలికినాడు. మంత్రి మాటలు విని అతడన్నాడు. "మంత్రిగారూ! నాకు భాగవతము సరిగా అర్థము కానపుడు నేను రాజువద్దకు దక్షిణకొరకు వచ్చియుంటిని. కాని ఇపుడు భాగవతమర్థమైనది. ఇంక రాజువద్దకు రా నవసరము లేదు." మంత్రి ఆ విషయమును రాజు

వద్దకు వెళ్ళి సంగతి తెలిపినాడు. రాజపుడు ఆ భాగవతుని వద్దకు స్వయముగ వెళ్ళి సాష్టాంగపడి నమస్కారము చేసినాడు. ఏమైనా కోరుకొమ్మన్నాడు. ఆ భాగవతుడన్నాడు, "మహారాజా! భాగవతమిప్పుడు నాకర్థమైనది. ఇంకేమియు నాకవసరములేదు." ఇట్టిది భగవన్నిర్భరత్వము. భగవంతున్ని సంపూర్ణముగ నమ్ముకొంటే కలిగే ఫలితమిది. ఈ భక్తిమార్గము కల్పవృక్షముతో సమానమైనది. మరణకాలములో నీ భక్తి మార్గమే ఆచరణలో ఉండేది. జ్ఞానమార్గము మరణకాలములో నిలువక పోవచ్చును.

ఇంక భగవంతుని రచనాపాటవాన్ని కూడ కొంత తరచి చూస్తాము. ఆయన సృష్టి శిల్పి నైపుణ్యాన్ని చూడండి. సూర్యుడు భూమికి కోట్ల మైళ్ళ దూరములో ఉన్నాడట. ఆయన ఉండే చోటు నుండి కొన్ని అడుగులు క్రిందికి దిగితే భూమి భస్మమై పోతుందట. చంద్రుడు కూడ నాలుగు లక్షల మైళ్ళ దూరమున నున్నాడని సైంటిస్టులు చెబుతారు. ఆయన నాలుగడుగులు క్రిందికి దిగితే సముద్రము పొంగి నగరములను ముంచేస్తుందట. ఆ సర్వేశ్వరుని Mathamatical calculation చూడండి, అంత యెత్తులో ఉంటేనే ఈ మానవులు, నా బిడ్డలు బ్రతుక గలిగేదని వాటినక్కడ శాసించి ప్రపంచానికి చీకటి తొలగించుచున్నాడే! ఎంత అద్భుతమైన గణితసిద్ధాంతమిది! అరటి పండును చూస్తే దానిలో హల్వా తయారుచేసి పెట్టినాడనిపించదా? అంతే గాకుండ లోపలిహల్వా మురికి కాకుండ ఏ ప్రాణిచేతనైనను అపవిత్రం కాకుండ దానిపైన తోలును కప్పినాడే! తాను సూర్యమండలము చంద్రమండలము అంతటిని వ్యాపించి వున్నాడు. మనము నీళ్ళకు, ఫాన్లగాలికి టాక్సు యిస్తాముకదా! వర్షపునీటికిగాని, బయటవీచే గాలికి గాని టాక్సు యిస్తున్నామా? పరమాత్మ మనకు ఆహారము కావలెనని ఎన్నివస్తువులు సృష్టించి యిచ్చినాడు! ఈ విశాల విశ్వ

మును చూస్తే ఎంతటి ఆశ్చర్యము కలుగుతుంది! ఈ విధముగ ఆలోచిస్తే ఆ సర్వేశ్వరుని భక్తి భావములో హృదయము పరవశము కాదా! ఈ విధమైన భక్తి భావము పొంది పరమాత్మలో లయమైతే మాయ యేమియు చేయజాలదు. మీదు మిక్కిలి మన కనుకూలమవుతుంది. మాయ అనేది నర్తకి. నర్తకి శబ్దాన్ని ఉల్టా చేస్తే కీర్తన అవుతుంది. భగవంతున్ని విధముగ కీర్తన చేస్తే నర్తకి తన ఆటలు మాని తాను కూడ పరవశమై ఊరకుంటుంది. కావున ఆ హరిని భజిస్తూంటే ఇంతటి యున్నతిని కలిగియుంటాడు మానవుడు. ఆ భగవంతున్ని చింతించని వాని జీవిత మెట్లుంటుందో చూడుడు.

''హరి జింతింపక మత్తుడై విషయ చింతాసక్తుడై చిక్కి వా
సరముల్ ద్రోసెడివాడు కింకరగదా సరితాదితోరస్కుడై
ధరణీశోత్తమ దండ భృన్నివసన ద్వారోపకంఠోగ్రవై
తరణీవహ్నిశిఖా పరంపరలచే దగ్ధుండు గాకుండునే'' 2-24

జీవితములో హరిసేమాత్రము చింతించక విషయముల యందు ఆసక్తుడై దినాలు వ్యర్థముగ గడిపే మానవున్ని యమభటులు నానా హింసలు పెడుతారు. అట్టివాడు వైతరిణీ వహ్నిజ్వాలలలో దగ్ధుడౌతాడు.

యోగియైనవాడిట్టి బాధలను పొందడు. తనువువదలే కాల మాసన్నమైతే ప్రపంచమునందుండే రాగమును, మమకారమును వదలుకుంటాడు. తానాచరించుచూ సాధన చేయుచున్న యోగ మార్గము ద్వారా శరీరమును వదలి భగవంతునిలో లయమౌతాడు.

ప్రాపంచిక మానవుడేమేమో క్షుద్రవిషయాల నపేక్షించుకొని నిరంతరము తాపత్రయాలకు గురియౌతూంటాడు. శ్రీ శుకుల వారంటున్నారు.

''అమరేంద్రాదుల గొల్చుభంగి జనుడా యజ్ఞాత్ము సేవింపగా
విమలజ్ఞాన విరక్తి ముక్తు లొదవుల్ వేయేల భూనాధ త

త్కమలాధీశు కథా సుధారస నదీకల్లోలమాలా పరి
భ్రమమెవ్వారికి నైన కర్ణయుగళీ పర్వంబుగాకుండునే.'' 2-40

దేవతలను సేవించిన విధముగ ఆ భగవంతున్ని సేవించుచుండిన విమలమైన జ్ఞానము – ముక్తులు తప్పక కలుగుతాయి. ఆ కమలాధీశుని కథ అనే అమృతాన్ని విని తన్మయుము పొందునట్లైన ఆ కథ చెవులకు పండుగ కాదామరి!

ఈ విధముగ తెలుపుతూ శ్రీ శుకుల వారొక సిద్ధాంతాన్ని ప్రకటించుచున్నారు. ఈ ప్రపంచములో సర్వులు పుట్టుచు గిట్టుచున్నారు. అయితే ఎవని జీవితము సార్థకమో దానిని గ్రిరెగీసి చెప్పుచున్నాడు.

''వాసుదేవ శ్లోకవార్త లాలింపుచు కాల మే పుణ్యుండు గడపుచుండు
వాని యాయువు దక్క నన్యుల యాయువు నుదయాస్తమయముల
నుగ్రకరుడు
వంచించికొని పోవువాడది యెరుగక జీవింతు మెక్కేండ్లు సిద్ధమనుచు
నంగనాపుత్ర గేహారామవిత్తాది సంసార హేతుక సంఘ సుఖము
దగిలి వర్తింప కాలంబు తెరి యెరింగి దండధరకింకరులు వచ్చి
తాడనములు
సేసికొనిపోవ బుణ్యంబు సేయనైతి బాపరతి నైతినని
బిట్టుపలవరించు'' 2-47

నిరంతరము అంటే ప్రతిదిన మొక గంటకాలమైనా భగవంతుని కథలను శ్రవణము చేస్తూ ఎవడు కాలము గడపుతాడో వాడే సార్థక జీవనుడు. వాని ఆయువే ధన్యమైనది. ఇతరుల ఆయువు ఉదయము అస్తమయముల చేత వంచింపబడుతుంది. అయితే ఈ విషయమును భక్తులు కానివారు తెలుసుకోలేరు. వారు స్త్రీ పుత్ర గృహాదులయందు రక్తులై జీవితము గడపుతూంటారు. కాలమువు

తూనే దండధర కింకరులు అంటే యమభటులు వచ్చి తాడనములు చేసి వాని ప్రాణాలు తీసుకొని పోతూంటే పుణ్యము చేయకపోతిమే అని యేడుస్తారట.

కాబట్టి నిరంతరము వాసుదేవ గాధలను వినాలి. చెవులను సార్థకము చేసుకోవాలి. భగవంతుడు ''చెవులనెందు కిచ్చినాడని ఒక పామరున్నడిగినాడట మహాత్ముడు. వాడు ''చెవులను బీడీతుంటలు పెట్టుకునేందు కిచ్చినాడ''న్నాడట. వాని భావమంత నికృష్టముగ ఉన్నది.

ఈ విధముగ భగవంతుని శ్రవణముచేత కలిగినట్టి ఉత్తమ సంస్కారముచేత శరీరమును వదలి జీవితమును ధన్యము చేసుకోవడం శ్రేష్ఠమని శ్రీశుకులవారు నిష్కర్షగా చెప్పినారు.

ఓం సర్వేవై సుఖనస్సంతు.

ఎనిమిదవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## తొమ్మిదవ రోజు ఉపన్యాసము

"యోఽంతః ప్రవిశ్య మమవాచ మిమాం ప్రసుప్తాం
సంజీవయ త్యఖిల శక్తిధరః స్వధామ్నా।
అన్యాంశ్చ హస్త చరణ శ్రవణ త్వగాదీన్
ప్రాణాన్ నమో భగవతే పురుషాయ తుభ్యమ్॥"

'నీ గృహాంగణ భూమి నిటలంబు మోవంగ
మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీ మంగళ స్తవని కరవర్ణంబుల
పలుమారు నాలుక బలుకదేని
నీ యధీనములుగా నిఖిల కృత్యంబులు
ప్రియ భావమున సమర్పింపదేని
నీ పదాంబుజలముల నిర్మల హృదయుడై
చింతించి మక్కువ జిక్కఁడేని
నిన్ను చెవులార వినడేని నీకు సేవ
జేయరాడేని బ్రహ్మంబు జెందగలడె
యోగియైన మహాతత్త్వ యోగియైన
వేదియైన మహాతత్త్వ వేదియైన'.

భక్తమహాశయులారా! భాగవతోత్తములారా!

పరమపవిత్రమైన భాగవత కథాశ్రవణము. భగవదనుగ్రహములోనే యీ విధమైన పవిత్ర శ్రవణ భాగ్యము లభ్యమవుతుంది,

కావున మనము భగవంతునికి నిరంతరము ధన్యవాదము లర్పించు కుంటూండాలె. ఈ సమస్తమైన ప్రపంచమున కాయన కర్త, భర్త, హర్త. ఈ సమస్తమైన ప్రపంచ మెక్కడినుండి కలిగింది? శ్రుతి చెబుతుంది:—

"యతో వా ఇమాని భూతాని జాయంతే
యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసం విశంతీతి,
తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి." (బృహదారణ్యకం)

అంటే ఈ సమస్త భూతాలు ఎక్కడినుండి పుట్టుచున్నవో, ఎవరినుండి పోషింపబడుచున్నవో, ఎవరియందు లయమగుచున్నవో అది బ్రహ్మ అని దీని అర్థము. పరమాత్మస్వరూపాన్ని యీ విధముగ చెప్పుటను దీనిని తటస్థలక్షణం అంటారు. స్వరూపలక్షణం వేరు. ఈ తటస్థలక్షణం ద్వారా ప్రపంచాన్ని చూచి మనము పరమాత్మను ఊహించవలె. సూర్యుడు 9 కోట్ల 34 లక్షల మైళ్ళ దూరములో ఉన్నాడట. సూర్యోపాసన ద్వారా మానవునకు బుద్ధివికాసము, ఆరోగ్యము, ఐశ్వర్యములు ప్రాప్తమవుతాయట. ఈ డిపార్టుమెంట్ల కాయన హెడ్. ఎవరెవరి కీ మూడు అనగా బుద్ధివికాసము, ధనము, ఆరోగ్యము కావలెనో వారు సూర్యోపాసన చేసి వాటిని సంపాదించు కొనవచ్చు. సంధ్యావందనముచేసి ఆ నీరు సూర్యున కర్ఘ్యముగ వదలి సూర్యహృదయమనే మంత్రమును చెప్పుకోవాలి ఈ మంత్రములు 'సంధ్యావందనము' 30—వ పేజీలో వ్రాయబడినవి. శ్రద్ధగలవారా విధముగ నాచరించి లాభము పొందవచ్చును.

ఇంతకు ముందు మన మొక విషయమును చర్చించుకున్నాము. ప్రపంచముయొక్క లక్షణములు అసజ్జడ దుఃఖములనియు, పరమాత్మ లక్షణములు సచ్చిదానందములనియు వివరించుకున్నాము. ఇది సత్యమే. అయితే ఇచ్చట నొక సందేహము కలుగవచ్చును. ప్రకృతి లక్షణ

ములు అసహ్యకర దుఃఖములైతే ప్రపంచములోని మనుష్యులు, వస్తువులు ఇంతటి మనోహరముగ, మనోజ్ఞముగ, మాధుర్యముగ కనిపించుచున్నవే? దుఃఖరూపములుగ కనిపించడము లేదే? అని శంక కలుగవచ్చును. దీనికి కారణమున్నది. మాధుర్యము, సౌందర్యము, ఆకర్షణ అనునవి ప్రపంచపు లక్షణాలు కావు. దీనికి శ్రీ శంకరాచార్యులవారు చెప్పిన విషయము సమాధాన మవుతుంది. చూడండి:—

"పిష్టాదిర్గుడసంపర్కాత్ గుడవత్ప్రీతిమాన్ భవేత్ ।
ఆత్మయోగాత్ప్రమేయాదిర్ ఆత్మవత్ప్రీతిమాన్ భవేత్ ॥"

పిష్టము అనగా పిండి. శనగపిండి ఉన్నది. అది లడ్డు కావలెనంటే చక్కెర కావాలి. చక్కెర కలుస్తానే చప్పని శనిగపిండి తీయగ మధురముగ మారింది. అటులనే ఆత్మసంయోగముతో యీ ప్రపంచము మధురముగ మారినది. కావున ఆత్మయొక్క ఆధారముతోనే యీ ప్రపంచము మనుచున్నది. ఈ సత్యాన్ని తెలుసుకుంటే మనోజ్ఞతకు మాధుర్యానికి సరియైన సమాధానము లభ్యమవుతుంది.

మన దృష్టి సర్వసాధారణముగ ఆధారమును చూచేది కాదు. ఆధేయమును చూచేదిగానే ఉంటుంది. పరమాత్మ ఆధారమైతే మనము ప్రకృతినే చూస్తాము. దీనికింకొక ఉదాహరణ ఒక పూలమాలను చూచి యిది ఎంతటి శోభాయమానముగ నున్నదని భావిస్తాము. మాలకు ఆధారము లోపలి త్రాడు. దారము అఖండముగ ఉంటే మాల చక్కగ కనిపిస్తుంది. మనము ఆధారమైన దారమును చూడలేము. అటులనే మనము నామరూపములనే చూస్తాము. వాటి కాధారమైన ఆత్మ స్వరూపాన్ని చూచుట లేదు. ఒకవేళ ఆత్మ దర్శనము కావలెనంటే ఎంతో సాధన చేయవలసి ఉంటుంది. బుద్ధిలో వివేకమును సంపాదించుకోవాలి. సద్గురువు అనుగ్రహమును

సంపాదించాలి. అమృతమైనట్టి శ్రవణ యోగం కావాలి. పూల మాలలో ఆధారముగా నున్న దారమును చూడదలచిన ఏమి చేయాలి? ఒక పూవును ఒక వైపు ఇంకొక పూవును మరొకవైపు జరిపిన లోపలి దారము కనిపిస్తుంది. అదే విధముగ నామరూపములు పూలతో సమానము. కావున నామరూపములను తొలగించి చూడాలి. నామరూపములను తొలగించుట అంటే చేతితో సాధ్యమయ్యే పనికాదు. గురువు చెప్పిన బోధ ననుసరించి వివేకముతో నామరూపముల అశాశ్వతత్వమును ఊహించాలి. నామరూపములపై నున్న మోహమును తొలగించుకోవాలి. నామరూపములపై నున్న మోహము జ్ఞానము ద్వారా తొలగించుకుంటే ఆత్మరూప దర్శనము మనకు కల్గుతుంది. ఎంతవరకు నామరూపములపైన మోహము, మమకారము ఉంటుందో అంతవరకు లోపలి ఆత్మరూపదర్శనము కాదు. నామరూపములపై మోహము తొలగవలెనంటే ప్రపంచము లోని భోగాలపై ఆసక్తి వదలాలె. ఆ తరుణములో మాయ తొలగుతుంది. మాయ తొలగుతే ఆత్మ అడుగడుగున దర్శనమవుతుంది. ఆ తరుణంలో ఆధారమును ప్రత్యక్షము చేసుకుంటాము. ఆత్మను దర్శించే చూపు లోపలి చూపు. నామరూపములను చూచే చూపు వెలుపలి చూపు. లోపలి చూపు తారకం. వెలుపలి చూపు మారకం. చర్మముపై చూపు చండాలునిది. ఆత్మపై చూపు ఆర్యునిది. వస్తువు యొక్క ఉనికికి ఆధారము లోపలి ఆత్మశక్తియే. ఆ శక్తి ఏకము. వెలుపలి రూపనామములు అనేకములు. శ్రీ శుకులవారు ఆ విధమైన ఆధారమును ఏకమైనదిగా దాని ఆధారముతో ప్రపంచమున్నది కావున ప్రపంచమును పరమాత్మగా దర్శించమంటున్నాడు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అని శ్రుతి. కావున సర్వము పరమాత్మ స్వరూపమే.

ఒకతూరి ఏకనాథమహారాజు రొట్టె బైట పెట్టి బెల్లం తెచ్చుకుందామని లోపలికి పోయి బెల్లం తెచ్చుకున్నాడు. ఇంతలో ఒక

కుక్క వచ్చి రొట్టెను ఎత్తుక పోతూంది. అపుడు ఏకనాథుడు ఆ కుక్కతో "అరే పాండురంగ్! ఖాలీ రోటీ కైసా ఖాతా రే ఫుస్కా సాన్ మేగుడ్ ఖీలేలో" అరే పాండురంగా ఖాళీ రొట్టె ఎట్ల తింటావు? దానితో ఈ బెల్లం కలుపుకొని తిను అని దానివెంట బడ్డాడు ఆయనకు కుక్క కూడ పాండురంగని మాదిరి కనిపించింది. ఆ కుక్క నా రొట్టె గుంజుకునేందుకు వచ్చుచున్నాడని పరుగెత్త సాగింది. ఇది భవ్యమైనట్టి చూపు. ప్రపంచానికి స్వతంత్రమైన ఉనికి లేదు. పరమాత్మకే ఉనికి ఉన్నది. అది సర్వాధారము. ఈ రహస్యము తెలుసుకోవలె. దీనిని తెలుసుకున్నప్పుడు మనలో నొక వివేకము ఉత్పన్నమవుతుంది. ఆ వివేకము ద్వారా నామము, రూపమును తొలగించి భగవత్స్వరూపమును మనము చూడగలుగుతాము. ప్రపంచమునే బ్రహ్మస్వరూపముగ చూచినపుడు మనలో రాగ ద్వేషాలు నశిస్తాయి. అదియే ముక్తి. ఇట్టి యనుభవమును పొందు వాడు జీవన్ముక్తుడు. అతని దృష్టి సమము.

"అయం మమ పరోవేతి భావనాలఘు చేతసామ్ ।
ఉదార చరితానాం తు వసుధైవ కుటుంబకమ్ ॥"

అల్ప మనస్కులైనవారికి నావారు పరాయివారు అనే భేద భావన ఉంటుంది. ఉదార చరిత్ర గలవారికి సర్వము ఒకటియే.

ఈ విధముగ పర్వాలలోను సమముగ నుండిన భగవద్దర్శనము పొందినవారిలో విజ్ఞానము, వికాసము అద్భుతముగ వృద్ధిపొందుతాయి. ఉపనిషత్తులన్నియు యీ సత్యమునే ప్రబోధిస్తున్నాయి.

"ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్ ।
తేన త్యక్తేన భుంజీథాః మాకృధః కస్యస్విద్ధనమ్ ॥"
(ఈశావాస్యము)

జగత్తులో ఏదైనా, ఏ కించిత్తైనా వస్తువు వున్నదంటే అది ఈశ్వరునిదిగా భావించాలి. మనుష్యుడు నాది అంటే బద్ధుడౌతాడు.

నీది అంటే ముక్తుడౌతాడు. "మమేతి బధ్యతే జంతుః నిర్మమేతి విముచ్యతే, శుకస్యవిగమే దుఃఖం న దుఃఖం గృహమూషకే" అంటే ఒకని ఇంటిలో చిలుక చచ్చింది. ఎలుక చచ్చింది, అతడు చిలుక చచ్చిన దానికి యేడుస్తున్నాడు. ఎలుక చచ్చిన దానికి సంతోషపడుచున్నాడు. రెండు ఒకేతూరి చచ్చినాయి. చావు రెంటికి ఒకటే. కాని చిలుక పైన మమకారం ఉంది. ఎలుకపైన ద్వేషముంది. కావున మమకారముచేత వాడు ఏడుస్తున్నాడు. వాని ఏడ్పు కిప్పుడేది కారణము? మమకారము కారణం. ఈ ప్రపంచములో మానవునికి మమకారమే బంధము.

"దేహాభిమానపాశేన చిరం బద్ధోఽసిపుత్రక ।
బోధోఽహం జ్ఞానఖడ్గేన తన్నికృత్యసుఖీభవ॥" (కఠోపనిషత్తు)

అంటే దేహము నేననే అభిమానము ఒక పాశము. ఈ పాశముచేత బహుకాలమునుండి పుత్రక! నీవు బద్ధుడవై ఉన్నావు. నీవు ఆత్మస్వరూపమనే జ్ఞానఖడ్గముచేత దానిని ఛేదించి సుఖివికమ్ము. ఇది కఠోపనిషత్తులోని బోధ.

యమధర్మరాజు చచ్చిన జీవున్ని తీసుకొని పోవుటకు పాశము (త్రాడు) తెస్తాడని పురాణాలల్లో చెప్పబడుతూంటుంది. ఒక్కొక్క జీవికి ఒక్కొక్క పాశము తేవాలి అంటే యమధర్మరాజు ఎంత పెద్ద తాళ్ళఫ్యాక్టరి పెట్టవలెనో. అట్లు కాదు. పాశమనేది దేహము నేననే మమకారమే. యమధర్మరాజు ఈ పాశమెంతకాలము జీవునకుంటుందో అంతకాలము వీనివద్దకు వచ్చి ఆ త్రాడు చేతనే వాన్ని లాగి తీసుకొని పోతూంటాడు. ఎప్పుడైతే జీవుడు జ్ఞానాన్ని తెలుసుకొని దాని నాచరణలో పెట్టి మమకారమనే త్రాడును తెంపుకుంటాడో ఆ పిమ్మట యమధర్మరాజు వానివద్దకు రాడు. ఎందుకు? వాడు పాశమును ఛేదించి వైచినాడు. ఇంతకు మమకారమనేది మానవునకు నిజమైన బంధము. ఆ బంధములో నున్నంతకాలము మానవుడు

ఆత్మశాంతిని పొందలేడు. నానా విధములైన దుఃఖాలకు గురియగు తూంటాడు. దీనిని గురించి ఒక జరిగిన కథ జ్ఞాపకము వస్తూంది.

హైద్రాబాదు వాస్తవ్యుడొక పర్యాయము కర్నూలు జిల్లాలో నుండు అహోబళ క్షేత్రమునకు పోయినాడు. అచ్చట దైవదర్శనము చేసుకొని మేలా చూచుకొని వాపసు పోతూన్నాడు. బస్సులో ఎక్కి వస్తూంటే దారిలో నంద్యాల బస్సు స్టేషనులో చెరుకులు చాలా మంచివిగ కనిపించినాయి. అక్కడి చెరుకులు ప్రసిద్ధిమైనవి. మంచి రసముంటుంది. పండ్లు బిగువుగా లేనివాడు కూడ దానిని కొరికి రసము రుచి చూడవచ్చును. అందువలన చెరుకులను ధర అడిగితే చవుకగ కనిపించినాయి. ఇరవై రూపాయలు చెరుకులు కొన్నాడు. బస్సుపై వేసుకొని కర్నూలుచేరి అక్కడ రైలెక్కి పోతూన్నాడు. చెక్కింగు మాస్టరు వచ్చి అందరిని టిక్కెట్లడుగుతూన్నాడు. అందరు టికెట్లు చూపుచున్నారు కాని చెరుకుల కట్టకు లగ్గేజు టిక్కెట్టు చూపడము లేదు. "ఈ చెరుకుల కట్ట ఎవరిది? దీనికి టిక్కెట్టు తీసు కోకపోతే ఇరవై రూపాయలు ఫైను. తరువాత దాని లగ్గేజుటికెట్టు తీసుకోవాలి" అన్నాడు చక్కింగుమాష్టరు. ఈ మాట చెరుకులవాడు విన్నాడు. నేను ఇరవై రూపాయల చెరుకులే కొన్నాను. ఇరవై రూపా యలు ఫైన్ వేస్తే మనకు లాభము లేదనుకొని వాడు చెరుకులకట్ట నాదికాదన్నాడు. అందరు నాదికాదు, నాదికాదు, అంటున్నారు. ఆ కారేజి కొంచము పెద్దది, ఆ మూలన ఒకడు కూర్చున్నాడు. ప్రక్కనున్నవాన్ని ఏమిటది అని అడిగినాడు, దానికి ప్రక్కవాడు "చెరుకులకట్ట అదిగో! దానిని ఎవరును నాదికాదనుచున్నా"రన్నాడు. దానిని వాడు విని ఎవరిది కాకుంటే నాది. అంటే నాకు దక్కుతుంది కదా? అనుకొని "నాది" అన్నాడు. వెంటనే జడ్చర్ల స్టేషను వచ్చింది. దించి ఇరవై రూపాయలు ఫైను, లగ్గేజు 8-50 రూపా

యలు వేసినాడు. వాడు "పైనా" అని ఆశ్చర్యముగ అడిగినాడు. వాడా పైనుమాట వినలేదు. అయినను ఒకతూరి నాదన్నాడు. మరల నాది కాదనుటకు మనస్కరించక ఎట్లో పైకమిచ్చినాడు. కాచిగూడ రైల్వేస్టేషను వచ్చింది. అక్కడ చెరుకుల కట్టవాడు వచ్చి దానినెత్తుకొని పోతూన్నాడు. డబ్బుకట్టినవాడు అస్పష్టముగ ఆతుం తతో హాం హాం హాం అన్నాడు. చెరుకుల కట్టవాడు వెనుదిరిగి నిలిచి నాడు. "చెరుకుల కట్ట నీదా?" అడిగినాడు ఆశ్చర్యముగా. వాడ న్నాడు - "మరి నాదిగాకపోతే నీదా?" "చెక్కింగు మాష్టరు వచ్చినపుడు నీవు నాది కాదన్నావు కదా?" "అవును. చెక్కింగు మాష్టరు వచ్చి అడిగినపుడు నాదంటానో నాది కాదంటానో అది నా యిష్టము. నీవెవ్వడవు నాకు చెప్పుటకు?" "మరి నేను డబ్బు కట్టితినే?" "ఎందుకు కట్టవు? ఎవ్వరి సొమ్ము ఎత్తుకొని పోదామను కున్నావు. కట్టూ! కట్టూ! ఇంకను కట్టు" అనుకుంటూ వాడు చెరుకుల కట్టను తీసుకపోయినాడు. చూచితిరా! "మమ" అంటే మానవుడు బంధితుడౌతాడు. నాది అని ఎంతటి వ్యాకులానికి గురి యైనాడో ఆ మానవుడు! ఇది దృష్టాంతము. ఇక దార్ష్టాంతములోనికి వెళ్ళితే ఈ శరీరము నాది నేను అని మనము వ్యవహరించుచున్నాము. ఇది నాదికాదు. నేను కాదు. దీనికి యజమాని పరమాత్మ. స్మశాన మనే స్టేషనులో దిగుతూనే శరీరముయొక్క యజమాని శరీరాన్ని తీసుకపోతాడు. మనము నాది నాది అనుకున్నంత మాత్రంచేత మనకు దక్కదు. ఈ సత్యాన్ని గ్రహించకపోతే దీనిని వదలిపోయేటపుడు విపరీతమైన బాధపడవలసివస్తుంది. ఆ విధముగ గాక ఏదేది ఉన్నదో అది యంతయు పరమాత్మ ప్రసాదమని భావిస్తూండాలి. అన్నిటిని వదలిపోయేటపుడు త్వదీయం వస్తు గోవింద తుభ్యమేవ సమర్పయే" అని భగవంతున్ని భావిస్తూ శరీరము వదలాలి. ఆ విధమైన నిర్మమకా రముతో జీవితము గడపే కళ నేర్చుకోవాలి. అందువలననే శ్రీశుకుల వారు చెప్పుచున్నారు:—

"హరిమయము విశ్వమంతయు
హరివిశ్వమయుండు సంశయము పనిలేదు వా
హరిమయముగ్రాని ద్రవ్యము
పరమాణువు లేదు వంశపావన వింటే" 2-17

ప్రపంచమంతయు హరిమయమే. పరమాణువు కూడ మానవుడు నాదనుటకు అధికారము లేదు. అన్ని రూపనామములను భగవత్స్వరూపముగ భావించుకొని నడచుకో.

"కామింపకయును సర్వము కామించియునైన ముక్తిగామించి తగన్, లో మించి పరమపురుషుని నేమించి భజించు తత్త్వనిపుణుం డధిపా" 2-39

తత్త్వనిపుణుడు అంటే తత్త్వము నెరిగినవాడు. వాడు దేనిని కోరడు. వానికి కామించుట అనేదే లేదు. కోరికలు మానవుని బంధిస్తాయి. ఏదేది తనవద్దకు తన ప్రయత్నము వల్లగాని అదృష్టరూపమున గాని వచ్చిన దానిని భగవత్ప్రసాదమని స్వీకరించాలె. ఈ విధముగ భావిస్తూ తన ప్రయత్నము తాను చేస్తూండాలి, భార్య, బిడ్డలు, వారి పోషణ మనకర్తవ్యమై యున్నది. దాని కొరకై కర్తవ్య దృష్టితో కృషిచేస్తూండవలసినదే. ఇది యంతయు కర్తవ్యము. ఉన్నదానిని ద్వేషించుట, లేనిదానిని వాంఛించుట యీ రెండు విధాల మానవునకు దుఃఖమే కలుగుతుంది. అంతా భగవత్ప్రసాదమని భావించాలె.

కోరికలు మానవునకు తన స్వరూపమైన ఆనందమును భంగపరుస్తాయి. వాటిచేత తన ఆనందము కుంఠితమగుచున్నది. మనుష్యుని మనస్సు నిరంతరము భూతకాలములో జరిగిన విషయాలనైనా తలంచుకుంటూ రాగద్వేషాలను పొందుతూంటుంది. లేక భవిష్యత్తులో తాను చేయబోయే విషయాలను, తనకు జరిగేడూహా రూపమైన సంఘటనల నమకుంటూ నైనా వ్యాకులపడుతూంటుంది. కాని వర్త

మానములో ఉండదు. భూతకాలములో అనేకములైన సంఘటనలు జరిగినాయి. వాటిని గురించి గత కథను అనుకుంటూంటే శాంతి భంగమే జరుగుతుంది. భవిష్యత్తులో కూడ ఆ విధమైన అశాంతియే కలుగుతుంది. భూతకాలములో యేమి జరిగిందో అది భగవంతుని అనుగ్రహముతో జరిగింది. మంచిదే. దానిని వదలు భవిష్యత్తును గురించి ఎందుకు తాపత్రయపడుతావు? భగవంతుడే ఉన్నాడు. వాటిని గురించి విచారము వదలు. వర్తమాన కాలములో నిలువడ మంటే నిశ్చింతగ ఉండడమే. వర్తమాన కాలములో కేవలము భగవంతునిపై భారము వేసి తాను ధర్మపూర్వకముగ నడచు కుంటూంటే అన్ని కార్యాలు చక్కబడుతాయి. దేనిని గురించి కూడ తాపత్రయమవసరము లేదు. ఇదిగో ఇట్టి జీవితము యోగులది. ఈవిధముగ దేనిని కోరకుండాలి. కోరికలను గురించి వాటివలన వచ్చే అనర్థాలను గురించి మన జీవితాలలో అనేక ఉదాహరణలు అనుభవ ములో నున్నవి. కోరికలను తీర్చుకొని సుఖపడుదామను కోవడం వట్టి భ్రమ.

ఒక పర్యాయము అక్బరు తన సభికులకొక సవాల్ చేసినాడు. నాకు విసుగు వచ్చే అంత పెద్ద కథ ఎవరైనా చెప్పితే ఫలానా అగ్రహారము దానముగ ఇస్తానన్నాడు. ఎవరెవరో వచ్చి షరతు ప్రకారము కథ చెప్పుటకు పూనుకుంటూరు. కాని ఎంత పెద్ద కథ యైనను సమాప్తి అవుతుంది. అందరీవిధముగ విఫల ప్రయత్నులగు చున్నారు. బీరబల్ వచ్చి మహారాజా! నేనొక కథ చెప్తానన్నాడు. ప్రారంభించినాడు. అనగనగా ఒక అరణ్యము. దానిలో నొక పెద్ద మఱ్ఱి చెట్టు. ఆ మఱ్ఱి చెట్టుకనేక శాఖలు. అనంతమైన ఆకులు. ఒక్కొక్క ఆకుపైన ఒక్కొక్క పక్షి కూర్చుంది ఆ దినం ప్రాతః కాలమైంది. ఒక పక్షి తుర్ర్... అని ఎగిరిపోయింది. ఇంకొక పక్షి తుర్... అని ఎగిరింది. ఎంతసేపైనను తుర్ అంటూన్నాడు. కాని

కథ ముందుకు సాగలేదు, అక్బరన్నాడు. కథ ముందుకు సాగనీ బీరబల్. "లేదు మహారాజా! ఈ పక్షులన్ని ఎగిరిన తరువాత కథ ముందుకు నడుస్తుంది." ఒక పక్షి తుర్ అని ఎగిరింది. ఎంతసేపైనను తుర్ అంటున్నాడే కాని కథ సాగించడము లేదు. అక్బరుకు విసుగు వచ్చి "బీర్‌బల్! అగ్రహారము ఇచ్చేసినాను పో" అన్నాడు. ఇది దృష్టాంతము. దీనిని దార్ష్టాంతములోనికి మారుస్తే మనస్సనేదే మర్రి చెట్టు. దాని కనంతమైన శాఖలు. ఆకులు పక్షులనేవే కోరికలు. చెట్టుకు గబ్బిలాలెట్లు కరచుకొని ఉంటాయో అటులనే యీ కోరికలు మానవుని హృదయములో కరచుకొనియుంటాయి. వీటిని సంపూర్ణముగ తీర్చుకొనుట అనేది సంభవమేకాదు.

సజ్జనులైనవారు కోరికల నాశ్రయించరు. అందువలన కామింపక యుంటారు. శ్రీ శుకులవారింకొక మాట అంటారు "సర్వము కామించియున్నైన" లేక సర్వము నాదేననియైనా అనుకో. అందరిని నా వారని ప్రేమతో వ్యవహరించు ఈ యూరిలో ఉండిన యిండ్లన్నియు నావే ననుకో! ఏమి పోయింది? ఎట్లాగూ చచ్చిపోయేటపుడు ఏదియు వెంట రాదు. కావున ఏదానిని కోరక అన్నింటియందు వైరాగ్య బుద్ధినైనా కలిగియుండు. అట్లు గాకుంటే అంతా నాదే ననుకొని ఎవరియందు కూడ భేద దృష్టిని పెట్టుకోవద్దు. ఇట్లుంటే ముక్తిని కామించి నట్లౌతుంది. ఈ మార్గములో నీవు లోపల నున్న పురుషున్ని భజించి నట్లౌతుంది. తత్త్వ నిపుణుడు చేసేతీరిది అని శ్రీ శుకులవారు చెప్పుచున్నారు.

భగవద్భక్తిలేక జీవితము గడపే వారిని గురించి శ్రీ శుకుల వారేమనుచున్నారో చూడండి.

"విష్ణు కీర్తనములు వినని కర్ణంబులు
కొండల బిలములు కువలయేశ!

చక్రి పద్యంబులు చదువని జిహ్వలు
కప్పల జిహ్వలు కౌరవేంద్ర!
శ్రీమనోనాథు వీక్షింపని కన్నులు
కేకిపింఛాక్షులు కీర్తిదయిత!
కమలాక్షు పూజకు గాని హస్తంబులు
శవము హస్తంబులు సత్యవచన!
హరి పదతులసీదళామోదరతి లేని ముక్కు
పంది ముక్కు ముని చరిత్ర!
గరుడగమను భజనగతి లేని పదములు
పాదపముల పాదపటల మనఘు''     2-50

ఈ విధముగ శ్రీ శుకులవారు అమృతోపమానమైన భక్తి బోధ చేస్తూంటే పరీక్షిత్తు మనస్సు ప్రఫుల్లమైంది. ప్రశాంతి కలిగింది.

''సుతుల హితుల విడిచి చుట్టాలవిడిచి యి
ల్లాలి విడిచి పశుగృహాళి విడిచి
రాజు హృదయ మిడియె రాజీవనయనుపై
ధనము విడిచి జడ్డుదనము విడిచి''     2-53

శ్రీ శుకులవారు భగవంతుని గురించి మాట్లాడుతూంటే పరీక్షిన్మహారాజుకు పరవశము కల్గింది. కేవలము భగవంతునిపై ఆయన హృదయము లగ్నమైనది. భగవంతుని యపౌరుషేయములైన విషయము లింకను తెలుపవలసినదని ప్రార్థించినాడు. శ్రీ శుకులవారు చెప్పుచున్నాడు.

''ఏ పరమేశు పాదయుగ మెప్పుడుగోరి భజించి నేర్పరుల్
లోపలి బుద్ధిలో నుభయలోకములందులసక్తి బాసి యే
తాపములేక బ్రహ్మగతి దారుగతశ్రములై జరింతు రే
నా పరమేశు మ్రొక్కెద నఘౌఘనివర్తను భద్రకీర్తనున్'' 2-61

నేర్పకులంటే వివేకం గలవారు. అట్టివారు పరమేశ్వరుని భజిస్తారు. పామరులైనవారు ప్రపంచాన్ని భజిస్తారు. వివేకంగల మహనీయులు ఇహలోక పరలోకములందు ఆసక్తిని వదలి ఏ విధమైన తాపము లేకుండా బ్రహ్మమును పొందుతారు. నేనుకూడ ఆ పరమేశ్వరునికి మ్రొక్కుతానంటున్నారు శ్రీ శుకులు.

బ్రహ్మదేవుడు నారదునికి చతుశ్లోకీ అని భాగవత స్వరూపాన్ని చెప్పుతాడు. దానిలోని ఒక శ్లోకము చూడండి.

"అహమేవాసమేవాగ్రే నాన్యద్యత్సదసత్పరమ్।

పశ్చాదహం యదేతచ్చ యోవశిష్యేత సోఽస్మ్యహమ్॥"

అర్థము॥ మొదట నేనే ఉంటిని. ఆ నేను సత్ కు అసత్ కు పరమమై ఏకమాత్రముగ ఉంటిని. ఆ నేనుకు సృష్టిసంకల్పం కల్గింది. సృష్టియైంది. ఈ సృష్టి అంతయు లయమై పోయిన పిదప నేనే మిగిలితిని. అట్టిది నా స్వరూపము.

ఇది అద్భుతమైన సిద్ధాంతము. మొదట ఎవరున్నారు? పరమేశ్వరుడే. "సదేవసౌమ్య ఇదమగ్ర ఆసీత్. నేహనానాస్తి కించన" మొదట సత్స్వరూపమే ఉండెను. మరేమియు లేకుండెను అని శ్రుతి. ఆ నేనుకు "ఏకోఽహం బహుస్యాం ప్రజాయేయేతి" ఏకమైన నేను బహురూపములతో వెలయుదును గాక! అని సంకల్పం కలిగింది, సృష్టియైనది. ఈ సృష్టి కంతటికి తన శక్తియే ఆధారము. ఈ సృష్టి లయమైన చివరన ఆయన స్వరూపమే మిగిలింది. ఈ సిద్ధాంతం ప్రకారం మొదట యేది ఉన్నదో మధ్యలో కూడ అదే ఉన్నది. చివరలో కూడ అదే ఉన్నది. దీని నర్థము చేసుకునేందు కొక ఉదాహరణ. ఒకామె 5 తులాలు బంగారు తీసుకొని మొదట నెక్ లెస్ చేయించుకుంది. మరల కొన్నాళ్ళకు దానిని చెడగొట్టి చేతికడియం చేయించుకున్నది. చివరకు దానిని కరగబెట్టి అమ్మినది. ఇపుడు

మొదట బంగారు, మధ్యలో నెక్ లెస్ మొదలగు ఆభరణములు చేయించుకున్నప్పుడేది యున్నది? బంగారే. చివరకు బంగారే. ఇటులనే పరమాత్మ మొదట ఉన్నాడు. ఆయన నుండి సృష్టి తయారైంది. ఈ సృష్టికి ప్రత్యేకమైన ఉనికిలేదు. ఏ విధముగ నెక్ లెస్‌లో బంగారమే ఉన్నదో అదే విధముగ ప్రపంచరూపమున పరమాత్మే ఉన్నాడు. ఈ సృష్టి ఉపసంహారమైనపుడు కూడ పరమాత్మే ఉన్నాడు. కావున నెక్ లెస్‌లో లోపల, వెలుపల, అంతట బంగారు మాత్రమే ఉన్నదో ఈ ప్రపంచములో కూడ పరమాత్మ మాత్రమే అంతట వ్యాపించి ఉన్నాడు. ఈ సత్యమును మొదట బ్రహ్మకు శ్రీమన్నారాయణుడు నాలుగు శ్లోకముల ద్వారా బోధిస్తాడు.

ఆ పరమాత్మపై తీవ్రమైన భక్తి గలిగియుండవలెనని శ్రీశుకుల వారు బోధించుచున్నారు. "తీవ్రేణ భక్తి యోగేన యజేత పురుషం పరమ్" తీవ్రమైన భక్తియోగముచేత భగవంతున్ని భజించాలి. ఈ మాటలు విని పరీక్షిన్మహారాజు అంటాడు. మహాత్మా!

"సర్వాత్ము వాసుదేవుని సర్వజ్ఞుడవైన నీవు సంస్తుతి సేయన్"
సర్వభ్రాంతులు వదలె మహోర్వీసురవర్య మానసోత్సవమగుచున్.

2–55

ఈ పలుకులు విని శ్రీశుకులవారు ప్రార్థన చేస్తారు. ఈ క్రింది పద్యములు అద్భుతమైనవి.

"పరుడై యీశ్వరుడై మహామహిముడై ప్రాదుర్భవస్థాన సం
హారణక్రీడనుడై త్రిశక్తియుతుడై యంతర్గత జ్యోతియై
పరమేష్ఠి ప్రముఖా మరాధిపులకున్ బ్రాపింపరాకుండు దు
స్తరమార్గంబున దేజరిల్లు హరికిన్ దత్త్వార్థినై మ్రొక్కెదన్.

2–58

"ఏ విభువందనార్చనము లే విభుచింతయు నామకీర్తనం
బే విభులీల లద్భుతము లెవ్వని సంశ్రవణంబుసేయ దో
షావళి బాసి లోకము శుభాయతవృత్తి జెలంగునంద్రు నే
నా విభు నాశ్రయించెద నఘౌఘ నివర్తను భద్రకీర్తనున్." 2-60

పిమ్మట పరీక్షిన్మహారాజు సృష్టిక్రమము నడుగుతాడు. శ్రీ శుకులవారు చెప్పుతారు. ఇచ్చట మన మొక విషయమును గమనించాలి. సృష్టి మాయామయము. కావున దానికొక స్వరూపము లేదు ఇదమిత్థమని చెప్పుట సాధ్యము కాదు. మాయ గావున పలువిధములుగా కూడ చెప్పవచ్చును. మాయకు రెండు శక్తులున్నవి. అవి విక్షేపము, ఆవరణములు. విక్షేపమంటే లేనిది ఉన్నట్లుగా తోచేది. ఆవరణమంటే ఉన్నదానిని కనిపించకుండా చేసేది. ఇట్టి మాయా స్వరూపము ప్రపంచ సృష్టి కాబట్టి ఒకే భాగవతములో రెండు మూడు విధములుగా ప్రపంచోత్పత్తి క్రమము చెప్పబడింది. అయితే శ్రీ శుకులవారు ముఖ్యమైన సిద్ధాంతము చెప్పినారు. మనము దానిపై దృష్టి నుంచుదాము.

"విష్ణుమయము పుత్ర వేయేల బ్రహ్మాండ
మతని జేనలోన యణగియుండు
బుద్ధి నెరుగరాదు భూతభవద్భవ్య
లోకమెల్ల విష్ణులోన నుండు" 2—91

ఈ సమస్త ప్రపంచము అండము, పిండము, బ్రహ్మాండాలన్నియు అతనియొక్క ఒక్క జేనలో అణగి ఉంటాయి. ఆయన స్వరూపమంత గొప్పది.

పరమాత్మ నిర్గుణుడు. కాని జగత్సృష్టిలో సగుణుడైనాడు. అందువలననే అతడు భగవంతుడనిపించుకున్నాడు. పిమ్మట ఆయన అవతారములను గురించి తెలిపి ఆయనే సర్వేశ్వరుడనే విషయమును స్పష్టము చేస్తాడు. అంతేగాక ఆయనను పొందే మార్గమును గురించి చెప్తాడు.

"ఉపవాసవ్రత శౌచశీల మఖసంధ్యోపాస నాగ్ని క్రియా
జపదానాధ్యయనాది కర్మముల మోక్షప్రాప్తి సేకూర ద
చ్చపుభక్తిన్ హరి పుండరీక నయనున్ సర్వాతి శాయిన్ రమా
ధిపు పాపఘ్నుఁ బరేశు నచ్యుతుని నర్థిం గొల్వ లేకుండినన్" 2-214

ఉపవాసము, వ్రతములు, యజ్ఞములు, సంధ్యోపాసనాదుల చేత మోక్షప్రాప్తి కాదు. అచ్చపు భక్తిచేత మాత్రమే అది సాధ్యం. అచ్చపుభక్తితో భగవంతు నాశ్రయిస్తే కలిగే ఫలిత మెట్లుంటుంది? వినండి.

"భరితోదగ్ర నిదాఘతప్తుఁడగు నప్పాంధుండరణ్యాది సం
చరణక్లేశ సముద్భవంబగు పిపాసంజెంది సూత్మీయ మం
దిరముంజేరి గతశ్రముండగుచు నెందేనిన్ జనన్ బోని భం
గిరమాధీశు పదారవిందయుగ సంగీభూతుడై మానునే. 2-219

నిదాఘమంటే ఎండ. భయంకరమైన ఎండచేత తప్తుడైన బాటసారి నడచుటకు సాధ్యము కానప్పుడు తన యిల్లు - అనుకూల మైన భార్య, సర్వసౌఖ్యములతో కూడుకున్న దానిని చేరుకున్నాడు. భార్యాబిడ్డల సేవలవలన ఆయాసమంత బోయినట్లుగాను, మరల నెచ్చటికేని పోక సుఖముగ నుండినట్లు రమాధీశు పాదపద్మముల యందు తృప్తిని పొందినవాడు మరల ఆ స్థానము వదలుతాడా? వదలడు.

ఇదే విషయమును శ్రీ శంకరాచార్యులవారు కూడ చెప్పిన విధానము గమనింపదగినది.

"రోధస్తోయ హృతశ్రమేణ పధికశ్ఛాయాం తరోర్వృష్టితో
భీతఃస్వస్థగృహం గృహస్థమతిథిః దీనః ప్రభుం ధార్మికమ్।
దీపం సంతమసాకులశ్చ శిఖినం శీతావృతస్త్వం తథా
చేత స్సర్వభయాపహం వ్రజసుఖం శంభోః పదాంభోరుహమ్॥"

తోయ హృతుడంటే నీటిచేత కొట్టుకొని పోయేవాడు. వానికి ప్రాణము పోయిందని భయపడ్డవానికి రోధమంటే ఒడ్డు దొరికితే ఎట్లుంటుందో, పథికునికి ఎండతో తప్తమైనవానికి మంచి చల్లని నీడ గల చెట్టు లభించినట్లు, భయంకరమైన వర్షములో చిక్కుకున్న వానికి మంచి యిల్లు చిక్కినట్లు, అతిథికి మంచి ఉదారుడైన గృహస్థుడు చిక్కినట్లు, దీనునికి ధార్మికుడైన ప్రభువు చిక్కినట్లు, గాఢాంధకారములో చిక్కుకున్నవానికి దీపము వెలుగు లభించినట్లు, విపరీతమైన చలిలో నున్నవానికి మంట లభ్యమైన యట్లు, ఓ చిత్తమా! సర్వ భయహారుడైన శంకరుని పదాంభోజములను పొందుమా! అన్నాడు.

ఈ యుదాహరణల ద్వారా భగవద్భక్తి చేత కలిగే ఫలితములు స్పష్టముగా తెలుస్తాయి. ఈ విధముగ చెప్పి శ్రీ శుకుల వారు భాగవతము చెప్ప బూనుకుంటారు.

## తృతీయ స్కంధము

విదురుడు తీర్థయాత్రకు వెళ్లి ఉంటాడు. ఆ సందర్భములో మైత్రేయ మహర్షిని దర్శించుకొని ఆయన కాళ్ళకు నమస్కరించి ఒక ప్రశ్న వేస్తాడు. మహాత్మా!

"మండిత తేజోనిధియై పాండవహితమతిని దూత భావంబున వే
దండ పురికేగి కురుకుల మండనుడగు ధార్తరాష్ట్ర మందిరమునకున్ 3-6

"చనగ నొల్లక మద్గృహంబునకు భక్త
వత్సలుండగు కృష్ణుండు వచ్చుటేమి
కతము? నాకదియెరిగింపు కరుణతోడ
ననుచు విదురుండు మైత్రేయు నడిగె ప్రీతి" 3-7

ఈ మాటలు వింటూనే పరీక్షిన్మహారాజు కుతూహలముతో మహాత్మా! విదురుని విషయమిది. ఆయన మహానుభావుడు. అంతే

కాదు, మా తాతలను పలు సమయములలో రక్షించినవాడు. ఆ మహాత్ముని విషయము కొంత విశదముగ చెప్పండి అని ప్రార్థిస్తాడు. ఆ విధముగ పరీక్షిన్మహారాజు ప్రార్థిస్తే శ్రీశుకులవారు ప్రసన్న హృదయులై చెప్పుచున్నారు.

పరీక్షిన్మహారాజా! ధృతరాష్ట్రుడు దుర్యోధనాదుల నతి గారాబముతో పెంచుతాడు. పాండవులు, కౌరవులు పెద్దవారౌతారు. దుర్యోధనుడు పుట్టటూనే మేఘాలు రక్తమును వర్షించినాయట. దిక్కులలో నక్కలు కూసినాయట. అన్నియు అపశకునములే. అపుడు విదురుడు ధృతరాష్ట్రుని వద్దకువచ్చి "మహారాజా! వీడు అనేకములైన దుశ్శకునములచేత పుట్టినాడు వీని లక్షణములను చూస్తే వీనిచేత వంశమంతా నాశనమవుతుంది. కావున వీని నొక్కనిని గంగలో పారవేస్తే వంశము నిలుస్తుంది" అంటాడు. ఈ మాటలు ధృతరాష్ట్రుడు విని "నాయనా! విదురా! లేక లేక నా ముసలితనములో పుట్టినవాడు వీడు. ఎట్టివాడైనను తల్లి, తండ్రీ అంటూంటే సంతోషము కలుగుతుంది కదా! అట్టి వీనిని గంగలో వేయమంటావు. ఎంత దయలేదు నాయనా నీకు!" అంటాడు. ఆ మాట విని విదురు ఊరక ఉంటాడు. పెరిగిన తరువాత దుర్యోధనాదుల దౌష్ట్యము, పాండవుల ధర్మాచరణము ప్రసిద్ధి కెక్కుతాయి. వీరి మోసముచేత పాండవులకు అరణ్యవాసము, అజ్ఞాతవాసము కూడ పూర్తౌతుంది. ఆ పిమ్మట కౌరవులు పాండవుల అర్ధరాజ్యము పిల్చి యివ్వవలసియుండె. కాని వారట్లు యివ్వక పోవడంవల్ల శ్రీకృష్ణుడే స్వయముగ రాయబారము పోతాడు.

"సకల నియంతయైన హరి సర్వేశ్వరుణ్యుడు మాధవుండు సే
వకనవకల్పకంబు భగవంతుడనంతు డనంతశక్తినం
దకధరు డబ్జలోచనుడు ధర్మతనూభవుచే నియుక్తుడై
యకుటిలభక్తి సొంగ మహింతాత్మకుడై ధృతరాష్ట్రుపాలికిన్" 3-19

ఆ భగవంతునికి భక్తులపైన ఎంతటి వాత్సల్యమో? సర్వము నకు ప్రభువైనవాడు, సర్వశరణ్యుడునైన మాధవుడు, సేవకులకు కల్పవృక్షము వంటివాడు, అనంతశక్తి సంపన్నుడునైన శ్రీకృష్ణుడు ధర్మరాజు కోరికపై తానే స్వయముగ ధృతరాష్ట్రుని దర్బారుకు వచ్చుచున్నాడు.

ఎపుడైతే ఆయన వచ్చుచున్నాడని విన్నాడో అపుడు భూదేవు లందరు ఆయనకు స్వాగతము చెప్పుటకు పోయినారు. ఆయన రాక ఎట్లున్నదంటే —

"రథారూఢోగచ్ఛన్ పథిమిలిత భూదేవ పటలైః
స్తుతి ప్రాదుర్భావం ప్రతిపదముపాకర్ణ్య సదయః।
దయాసింధుర్బంధుః సకలజగతాం సింధుసదయః
జగన్నాథ స్వామీ! నయనపథగామీ భవతు మే॥"

ఆ సందర్భములో విదురుడు కూడ పోయి ఈ విధముగ సంక ల్పిస్తాడట. రథారూఢుడై వచ్చుచున్న శ్రీకృష్ణునకు దారిలో బ్రాహ్మణులు కలుసుకొని స్తోత్రము చేయుచున్నారట. వారి స్తోత్ర ములో ప్రతిపదమును విని దయతో కూడుకున్నవాడైనట్టి సకల జగ త్తుకు దయాసముద్రుడైన శ్రీకృష్ణుడు నాకు కనిపించును గాక అని అర్థము.

ఈ విధముగ విదురుడు పోయి దర్శనము చేసుకొని పరవశు డైనాడట. పిమ్మట శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని దర్బారులోనికి వచ్చి నాడు. అచ్చట భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ, దుష్ట చతుష్టయాదు లందరు నిండి ఉన్నారు. అందరి ఎదుట శ్రీకృష్ణుడు తన వాగ్వైభవ ముతో మేఘ గంభీరస్వరముతో పలుకుతాడు. ఓ ధృతరాష్ట్రమహా రాజా!

"ఈ వంశంబున కెల్లనీవ కుదురిందెవ్వారి చందంబు లె
స్సై వర్తిల్లిన గీడుమేలు తుదినీయందొందెడున్ గాన స
ద్భావంబారసిలోని పొత్తు వెలివృత్తంబున్ జన స్తుత్యముల్
గావింపందగు నీకు నెవ్విధమునం గౌరవ్య వంశాగ్రణీ"

ఈ వంశానికెల్ల నీవే కుదురు. ఈ ప్రయత్నములో కీడు జరిగినా మేలు జరిగినా అది నీకే చెందుతుంది. కావున మహారాజా! జనులు నిన్ను స్తుతించునట్టి కార్యము చేయవయ్యా! ధృతరాష్ట్ర మహారాజా! నీకు కౌరవులు పాండవులు ఒకటే. వారిద్దరు శాంతిని పొంది జీవించిన దేశానికే శాంతి సమకూరుతుంది. అట్లు లేకున్న మొత్తము వంశానికే విపత్తు కలుగుతుంది. యుద్ధము మంచిది కాదు. పెద్దవాడవు, వివేకివి. చక్కగా ఆలోచించి పాండవులకు అర్ధ రాజ్యము పంచియిమ్ము.

ఒక వేళ మీరు యుద్ధానికే పూనుకొన బూనితే ఆ అర్జునున్ని, భీమున్ని గెలిచేవాడీ సభలో ఒక్కరైనా ఉన్నారా? అంతటి బలవంతులు వారు. వారితో తగవు వలదు. అంతేగాక పాండవులు తండ్రి లేనివారు. అనాథలు. కావున వారి పాలు వారికి పంచియిమ్ము. ధర్మరాజు ఎల్లపుడు నిన్ను తండ్రీ! అని మాట్లాడుతూంటాడే! నీవు మాత్రము వారియెడల భేద బుద్ధి పెట్టుకోవడం తగదు సుమా! అంటూ శ్రీకృష్ణుడు తన అద్భుతమైన వాగ్వైఖరితో ఇటు అటు తిరుగుతూ, చేతితో మురళి పట్టుకొని అభినయముతో మాట్లాడు తూంటే సభ అంతయు దిగ్భ్రాంతి చెందింది. అందరును ఆ భగవానుని వాణీ ప్రభావముచే ఆకర్షితులై కేవలము స్తోత్రము చేయ బూనినారు.

ఈ సందర్భములో దుర్యోధనుడు లేచి "కృష్ణా! చాలు నీ ప్రేలుడు. పాండవులకు మేము సూది మొన మోపిన భూమి కూడ యివ్వము. మాతో రాజ్యము తీసుకోవలసియుంటే యుద్ధమొకటే

దారి. యుద్ధములో మమ్ము పరాజితులను చేసి రాజ్యమును పొంద వచ్చు. అంతేగాని నీవు అధికముగ మాట్లాడనవసరము లేదన్నాడు.

తండ్రియైన ధృతరాష్ట్రుడు కుమారునితో అంటాడు. నాయనా! ఏ పరమేశ్వరునిచే యీ ప్రపంచములోని చరాచర కోటి యంతయు పుట్టి పెరుగుచున్నదో, దేవతలచేత స్తోత్రము చేయదగినవాడో అట్టి కృష్ణుడు నీవద్దకు కార్యార్థియై వస్తే ఇటుల మాట్లాడుట తగదు నాయనా!

అని చెప్పినను వినక వాడు తిరస్కారముగా మాట్లాడి రాయబారాన్ని విఘ్నము చేస్తాడు. మధ్యాహ్నమైనది. అపుడు దుర్యోధనుడు భోజనానికి పిలుస్తాడు. కృష్ణా! రాయబారం విషయం పోనీ! నీకు ఆతిథ్యము ఇచ్చుటకై మే మెన్నియో యేర్పాట్లు చేసినాము. ఆ మాట విని శ్రీకృష్ణుడు అంటాడు. దుర్యోధనా! భోజనానికి వచ్చుటకు కావలసిన నియమములను ఎరుగవా? విను.

" సంప్రీతి భోజ్యాన్యన్నాని ఆపద్భోజ్యాని వాపునః।
న చ సంప్రీయసే రాజన్ న చాపద్గతావయమ్॥ "

సంప్రీతితో ఆహ్వానిస్తే ఆకలి కొంచెము తక్కువైనను తినడం జరుగుతుంది. లేక ఆపద కలిగి అన్నము నడిగి పెట్టించుకొని తినడమైనా జరుగుతుంది. కాబట్టి దుర్యోధనా! నీవు నన్ను సంప్రీతితో పిలుచుటలేదు. నేను ఆపదగల్గి తినుటకు దైన్యమును పొందుట లేదు. అంతేగాదు నీవు పాపివి. నీ కూడు తినను. అని తిరస్కారముగ మాట్లాడితే దుర్యోధనుడు వెనుదిరిగి వెళ్ళిపోతాడు. మధ్యాహ్నమైంది. ద్రోణాచార్యుడు వచ్చి కృష్ణా! చాల ప్రొద్దుపోయింది. భోజనమునకు మా యింటికిరా అని పిలుస్తాడు. కృష్ణుడు నిరాకరించి విదురునింటికి పోతాడు.

విదురుడు కృష్ణున్ని తన యింటికి భోజనానికి పిలువజాలడు. ఎందుకంటే దుర్యోధనుడు అనేకములైన పిండివంటలు ప్రత్యేకముగ చేయించినాడు. మా యింటిలో కేవలము పప్పు అన్నమే. కాబట్టి ఆ పరమాత్మ అక్కడనే భోంచేయనీ! అనుకొని యింటికి పోయి ఉంటాడు. ఇంతలోనే కృష్ణుడు వచ్చి తలుపు తట్టుతాడు. విదురుడు వచ్చి తలుపు తెరుస్తే ఇంకేముంది? శ్రీకృష్ణ పరమాత్మ వచ్చినాడు. విదురా! భోజనానికి వచ్చినాను అంటాడు. పిలువకుండినను స్వామి స్వయముగ భోజనానికి వచ్చినాడు. అడిగి పెట్టించుకున్నాడు. భక్తుడు వాస్తవమైన వాడుగా కావలెను. భగవంతుడు స్వయముగ వస్తాడు.

ఆ విధముగ శ్రీకృష్ణుడు భోంచేసి విదురునితో చెప్తాడు. విదురా! నీవు ప్రత్యేకముగ వెళ్ళి ధృతరాష్ట్రునితో చెప్పి ఒప్పించే ప్రయత్నం చెయ్యి. ఈ మాటలు విని విదురుడు ధృతరాష్ట్రునివద్దకు పోయి "మహారాజా! నీకు దుర్యోధనుడు కుమారుడు కాదు. నీకు మారుడు. అంటే నిన్ను చంపేవాడు. వాన్ని సమాధానపరచి పాండు సుతులకు అర్ధము రాజ్యమిస్తే నీకు క్షేమమున్నది. లేకున్న లేదు. దొంగతనము, వ్యభిచారము మహాపాపము. అవి ఎప్పటికి దాగవు కూడ. దొంగతనమంటే ఏమి? తనదికాని దానిని తనవశము చేసుకొనుట. ఎవరి వస్తువునే కాని ఉద్దరగ తీసుకోవద్దు. తినవద్దు కూడ. "యోభుంక్తే స్తేన ఏవ సః" అని నుడివింది భగవద్గీత. అంటే ఆ విధముగ తిన్నవాడు దొంగేనని అర్థము. దుర్యోధనుడు, నీవు దొంగలు. ధర్మరాజు మీ అపరాధములను క్షమిస్తాడు ఆలస్యం చేయవద్దు. త్వరగా ఒక నిర్ణయానికిరా. అదను వదలితే అనర్థమే సుమా! అని విదురుడు చెప్పితే ధృతరాష్ట్రుడంటాడు. "విదురా! నీ వాడు మాటలు సత్యము. ఐనను దుర్యోధనుడు నా వద్దకు వస్తే నా జ్ఞానము కుంఠితమవుతుంది. ఈ మాటలు దుర్యోధనునికి తెలు

స్తాయి. వానికి విపరీతమైన కోపము వస్తుంది. విదురున్ని నిండుసభలో "నీవు దాసీ పుత్రుడవు. పట్టెడన్నము పెట్టితూన్నాము. నా తిండి తిని నాకే ఎసురు పెడతావా? దాసీ పుత్రుడైన నీకు ఈ సభలో నింతటి ఉన్నత స్థానమా! ఎవడురా అక్కడ! వీన్ని అర్ధ చంద్రాకారముతో గెంటివేయి" అంటాడు. అపుడు విదురుడు దుర్యోధనుని పలుకులు విని కోపానికి రాడు. విదురుడు తలంచుకుంటే కోపగించుకొని దుర్యోధనున్ని అట్లా బ్రుగ చూస్తే వాడు భస్మమై పోతాడు. తాను అంతర్ముఖుడై ప్రభువుయొక్క యీ లీల ఏమిటని బుద్ధిలోనికి చూచుకుంటే అక్కడినుండి సమాధానము వస్తుంది, ఈ దుర్మార్గుని భోజనము చాలా రోజులనుండి తిన్నావు. ఇంక చాలు. ఇక్కడినుండి వీడిపో అన్నట్లు తోస్తుంది. అది భగవదాజ్ఞగా భావించుకొని ఆయన –

"స ఇత్థమత్యుల్బణకర్ణబాణైః భ్రాతుః పురోమర్మసుతాడితోఽపి
స్వయం ధనుర్ద్వారి నిధాయమాయాం గతవ్యథోఽయాదురు
మానయానః"

కర్ణ కఠోరమైన దుర్యోధనుని అవమానపు వాక్కులనెడి బాణములతో తన అన్నయైన ధృతరాష్ట్రుని ముందర మర్మస్థానములయందు కొట్టబడినవాడై తానే రాజలాంఛనములైన ధనురాదులను వదలి, మాయను త్యజించి అక్కడినుండి వెళ్ళి పోయినాడు.

సజ్జనుని పద్ధతి ఇది. మహాత్ముడు నిందలోకూడ సారమైన తత్త్వమును గమనిస్తాడు. ఈ విధముగ అవమాన పడినపుడు సహజముగ క్రోధము వచ్చుట సామాన్యుని స్థితి. కాని విదురుడు మహాత్ముడు. దీనిని ఆయన ప్రభుప్రేరణగా భావించి దానిలో తన మేలును తలంచి శాంతముగ అక్కడి నుండి నిష్క్రమిస్తాడు. ఇచ్చట భావుకమైన గమనించదగిన సత్యము గంభీరముగనున్నది. మంచిలో మంచిని చూడడం సర్వసామాన్యము. చెడ్డలో కూడ మంచిని చూడడం

వివేకుల లక్షణం. ప్రపంచములో ప్రతి కార్యములోనూ మంచి చెడ్డలు రెండు ఉంటాయి. మనుష్యులు వారి వారి సంస్కారముల ననుసరించి స్పందితులౌతూంటారు.

మహాత్ములైనట్టివారు ఇతరుల నిందను సహిస్తారంటే అక్కడ గుర్తింప దగిన సైన్సు ఉన్నది. ఏమంటే నిందించేవాడు తన పుణ్యాన్ని ఎదుటివానికిచ్చి అతని పాపాన్ని తీసుకుంటాడు. ప్రపంచములోనున్న ఈ సత్యమును అందరు తెలుసుకొన జాలక కోపానికి కోపాన్నే ప్రదర్శిస్తారు. దీనిద్వారా ఆత్మశక్తి క్షీణిస్తుంది. శాస్త్రము చెప్పే సత్యాన్ని గమనించండి.

"సాధనేష్వపి సర్వేషు తితిక్షోత్తమ సాధనమ్ ।
యత్రవిఘ్నాః ఫలాయంతే దైవికా అపి భౌతికాః॥"

జీవితాన్ని సఫలం చేసుకొనేందుకు చాలా సాధనలున్నాయి. వాటన్నింటిలోనికి తితీక్ష అంటే ఓర్పు గొప్ప సాధనము. ఈ ఓర్పు ద్వారా దైవసంబంధమైన, భౌతికసంబంధమైన విఘ్నాలు నిలువక పలాయనము చిత్తగిస్తాయి అని అర్థము. ఇట్టిదే మరియొకటి —

"క్షమావతామేవహి కార్యసిద్ధిః స్వారాజ్యలక్ష్మీ సుఖభోగ సిద్ధిః ।
క్షమావిహీనా నిపతంతి విఘ్నైః వాతైర్హతా పర్ణచయా
ఇవద్రుమాత్ ॥"

అంటే క్షమగల వారికే కార్యసిద్ధి కలుగుతుంది. స్వారాజ్యము, లక్ష్మీసుఖభోగ సిద్ధులు కలుగుతాయి. క్షమ లేనివాడు విఘ్నములతో కొట్టబడి చెట్టునుండి రాలే ఆకులమాదిరి పడిపోతాడు.

భారతములో ధర్మరాజు కూడ ఇదే విషయము ద్రౌపదితో చెప్తాడు.

"క్షమగలవానికి పృథ్వీసమునకు నిత్యంబు విజయ సంసిద్ధియగున్
క్షమయైనవాని భుజవిక్రమము కడుఁ వెలయు సర్వకార్యక్షమమై"

క్షమ కలవాడు భూదేవితో సమానమైనవాడు అట్టివానికి నిరంతరము విజయమే సిద్ధిస్తూంటుంది. అట్టివాని భుజపరాక్రమము కూడ సర్వకార్యములను సాధించేదిగా ఉంటుందని పద్యార్థము.

దుర్యోధనుడు బయటికి నెట్టండ్రా వీన్ని అంటే "నాయనా! అంతకష్టమవసరము లేదు నేనే పోతానని విదురుడు క్షమతో బయలు దేరినాడు. ధృతరాష్ట్రుడు రహస్యముగా నొక విశ్వసనీయుడైన వ్యక్తితో కొంత ధనమును మూటగట్టి త్రోవఖర్చులకని పంపుతాడట. ఈ ధనము నాయన ముట్టుతాడా? తిరస్కరించి వాపసుపంపినాడు. ఆ విదురుడు తనవెంట యేమి తీసుకొని పోయినాడు? వినండి.

"సనిర్గతః కౌరవ పుణ్యలబ్ధో గజాహ్వాయాత్ తీర్థపదఃపదాని" అంటే ఆ విదురుడు కౌరవుల పుణ్య ఫలమంతా పొంది హస్తినా పురమునుండి తీర్థయాత్రలకు వెళ్ళినాడని అర్థం. కౌరవుల పుణ్య ఫలమంతా ఆయన క్షమ గలిగి యుండినందుకు అనాయాసముగ ఆయన వద్ద చేరింది. ఆనాడే హస్తినాపురం కౌరవులనుండి పోయింది. వారి ఐశ్వర్యము వారిని వదలిపోయింది.

ఇటువంటి ఘట్టమే రామాయణములో కూడ ఉంది. విభీషణుడు రావణాసురునికి సన్మార్గమును బోధిస్తాడు. సీతను రామచంద్రుని కర్పించి ఆయనను క్షమాపణ వేడుకొమ్మని మాటిమాటికి చెప్తాడు. రావణుడా బోధను వినక విభీషణున్ని తిరస్కరించి తరుముతాడు. ఆ విభీషణుడు అవమానపడి కోపగించుకోక శ్రీరామునివద్దకు పోయి నపుడే ఆ లంకను రావణాసురుడు పోగొట్టుకున్నాడు. ఎందుకంటే విభీషణుడు ఊరికే పోలేదు. రావణాసురుని శక్తినంతా తీసుకొని పోయినాడు. ప్రపంచములోని మానవులు ఈ సత్యమును గమనించి క్షమను వహిస్తే నిత్యజీవనములోని ఎన్నో అకార్యములు తొలగి

పోతాయి. ఈ క్షమ స్త్రీలకుగాని పురుషులకుగాని నిజమైనఆభరణము. సౌందర్యముగ తనరూపముండవలెనని కోరుకునేవాడు, ఈ భూషణ మును ధరించి శోభాయమానమైన సుందర జీవితమును పొందెదరు గాక !

విదురుడు ముప్పైఆరు సంవత్సరములు తీర్థయాత్రలు చేస్తాడు. కాశీ జ్ఞానభూమి, అయోధ్య వైరాగ్యభూమి, వ్రజ ప్రేమభూమి. తీర్థయాత్రలో ఎప్పుడూ కూడ కోపము తెచ్చుకోరాదని నియమము. తీర్థమంటే పవిత్రమైన నీరుగల ప్రాంతమని అర్థము. ఆ తీర్థమును సేవించిన పిదప అక్కడ పురోహితుడుండి ఇంతదూరము వచ్చినావు నాయనా ! ఇక్కడికి వచ్చినందుకు గుర్తుగాను ఏదైనా ఒక వస్తువు నీకిష్టమైనది వదలు మంటాడు. అది త్యాగానికి చిహ్నముగ ఉండాలి. ముఖ్యమైన వస్తువునే వదలితే అతనిలోని త్యాగగుణము వృద్ధికి వస్తుంది. ఎవడో "నేను వేపకాయలను వదలుతా నండీ," అన్నాడట. ఇట్టిది పనికి రాదు. విదురుడు తీర్థములను సేవిస్తూ పర్యటించుచుండగా ఆయనకు ఉద్ధవుడు తటస్థపడ్తాడు. యమునానది ఒడ్డున ఉద్ధవున్ని చూచి అమాంతముగ కౌగిలించు కుంటారు ఒకరినొకరు. ఒకరినొకరు కుశలప్రశ్న లేసుకుంటారు. ఉద్ధవుని ద్వారా శ్రీకృష్ణ నిర్యాణము, పాండవుల విజయము, ధర్మ రాజు రాజ్యమేలుచుండడము తెలుస్తుంది. శ్రీకృష్ణున్ని గురించి యిద్ద రును చాలాసేపు చెప్పుకుంటారు. ఆయన దివ్యలీలలను అనంతముగ చెప్పుకొని విదురుడు ఆఖరులో ఆ భగవానుడేమి సందేశమిచ్చి పోయి నాడని ప్రశ్నిస్తాడు. అప్పుడుద్ధవుడు "విదురా ! నీ భాగ్యమేమని కొనియాడుదును ! ఆ కృష్ణభగవానుడు నాకును మైత్రేయ మహర్షికి

ఆత్మజ్ఞానోపదేశము చేసి మైత్రేయునితో నీకు తన జ్ఞానాన్ని బోధించ వలసినదిగ నిన్ను మూడు మార్లు స్మరించినాడు" అని చెప్పినాడు. ఇది వింటూనే విదురునికి అశ్రుధారలు ఉబికి ప్రవహిస్తాయి.

"ఆత్మానం చ కురుశ్రేష్ఠ కృష్ణేన మనసేక్షితమ్।
ధ్యాయన్ గతే భగవతే రురోద ప్రేమ విహ్వలః॥" 3-4-35

కృష్ణునికి నీవింత ప్రీతిపాత్రుడవు, నిన్ను అనుకుంటూ ఆయన శరీరాన్ని వదలినాడని విని విదురుడు ప్రేమ విహ్వలుడై ఏడ్చినాడట.

ఈ విధముగ ఉద్ధవుడు చెప్పి బదరికాశ్రమానికి పోతాడు. విదురుడు మైత్రేయమహర్షి గంగానది ఒడ్డున ఉన్నాడని తెలిసి ఆయన వద్దకు బయలుదేరినాడు.

ఓం సర్వేవై సుఖినస్సంతు.

తొమ్మిదవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదియవ రోజు ఉపన్యాసము

"జన్మాద్యస్య యతోఽన్వయాదితరతశ్చార్థేష్వభిజ్ఞః స్వరాట్ ।
తేనే బ్రహ్మహృదా య ఆదికవయే ముహ్యంతి యత్సూరయః ॥
తేజోవారిమృదాం యథా వినిమయో యత్ర త్రిసర్గోఽమృషా ।
ధామ్నా స్వేన సదా నిరస్తకుహకం సత్యం పరం ధీమహి ॥"

"శ్రీకరమైన యెవ్వని నిరీక్షణ మాత్రమునన్ మహాద్భుతా
నేక విలాసమై ఖరుల నీ భువనంబులు నిక్కమైన య
ట్లే కనిపించు నెవ్వని లసత్కృపనివ్వి యెండియున్
చీకటి యెండ నెట్లణగు చిన్మయు నావిభునాశ్రయించెదన్."

భాగవతకథా శ్రవణాసక్త చిత్తులారా! భక్తమహాశయులారా!

పరమపవిత్రమైన భాగవతము. మన భాగ్యము నేమని చెప్పుకోవలె! దిన కార్యక్రమములకు పోకముందే ప్రప్రథమమున భాగవతము శ్రవణముచేసి దైనిక కార్యక్రమము లోనికి ప్రవేశిస్తున్నాము. ఈ భాగ్యాన్ని ప్రసాదించిన భగవంతునికి మనము ధన్యవాదాలు తెలుపుకుందాము. ఈ ప్రపంచములో మానవుడే వస్తువును వాంఛిస్తాడో దానిని పొందుతాడు. ప్రాపంచిక విషయాలయందే ఆసక్తి కలిగి వ్యవహరించే మానవుడు ఆయా వస్తువులను పొందుతాడు. ఆ విధముగ మనుష్యులు అనేకములైన వస్తువుల వెంట, విషయముల

వెంటబడి జీవితాన్ని వెచ్చిస్తూంటారు. ఈ విధముగ విలువ గల వస్తువు లనంతములుగ నున్నవి. వాటన్నిటికో కల్ల పరమాత్మ ప్రాప్తి యనునది సర్వవిషయములలో కెల్ల శ్రేష్ఠతమమైనదని విజ్ఞులు తెలుసుకుంటారు. ఆ విధముగ తెలుసుకొని వారు ఆ పరమాత్మ ప్రాప్తిలో జీవితము గడుపుతారు. ఈ విధముగ వారు ఉత్కృష్టమైన యీ మానవ జీవితాన్ని సఫలం చేసుకుంటారు. ఇపుడు మనము చేసే యీ పవిత్ర కార్యక్రమములో అందరు వచ్చి శ్రవణము చేసి ధన్యత్వ మును వహిస్తారా? చాలామంది 'మాకెన్ని పనులు తెల్లవారి లేస్తూనే వున్నవి. వాటిని వదలి మేమెట్లు పోతాము?' అనుకుంటారు. కాని ఎవరి మనస్సులో నేవిషయము ప్రధానమని తలంపబడుతుందో వారు దానికై ప్రయత్నము చేస్తారు. మనము భాగవతము చెప్పు కుంటున్నాము. మనకిది ప్రధానము.

వేదములో మూడు విషయాలు ప్రధానముగ చెప్పబడినవి. మొదటిది కర్మకాండ. రెండవది ఉపాసనాకాండ. మూడవది జ్ఞాన కాండ. కర్మకాండలో మనము ముఖ్యముగా తెలుసుకోవలసినది యేమంటే ఈ ప్రపంచము నగదు బజారు. దీనిలో మానవుడెట్టి కర్మ చేసుకుంటే అట్టి ఫలం పొందుతాడు. వెనుకటి కర్మ ననుసరించి యిప్పటి జన్మం వచ్చింది. ఇపుడు చేసుకునే కర్మ ననుసరించి మరల వచ్చే జన్మ లభ్యమవుతుంది. ఎట్టి కర్మ చేయాలి? అనే ప్రశ్నకు సమాధానము సర్వులు సులభముగ తెలుసుకోవచ్చును. ఎట్టి కర్మ చేస్తే మనకు వచ్చే జన్మ మంచిది వస్తుందో, జీవితము భగవంతుని సేవలో గడుస్తుందో అట్టి కర్మను ప్రయత్నపూర్వకంగా చేసుకోవాలి.

మనుష్యుడు పొరపాటుగ చేస్తినంటాడు. పొరబాటుగ చేసిన కర్మయైనను రికార్డయింది. దానిఫలం తప్పదు. అందుకనే శంకరా చార్యులవారు చిత్తశుద్ధికొరకు కర్మ చేయాలి అంటారు.

"చిత్తస్య శుద్ధయే కర్మ న తు వస్తూపలబ్ధయే"

కర్మ ఎల్లెల్లు చేస్తూంటే అల్లల్ల చిత్తశుద్ధి కలగాలి. అయితే మన పరిస్థితి ఎట్లున్నదంటే కర్మ చేసి చేసి దానిచేత బద్ధులమై చిత్త మాలిన్యమును పొంది కర్మను పెంచుకుంటున్నాము. కర్మను చేయక ఉండుటకు వీలు లేదు. కర్మ ననుసరించి జన్మ వస్తుంది. వచ్చే జన్మ ఎట్లుండాలి? అంటే రూపం మంచిది కావాలి. ఐశ్వర్యం బాగుండాలి. ఆరోగ్యమైన శరీరం కావాలి. అని అన్నిటిని అందరు సూపర్లేటివ్ డిగ్రీలో కోరుతారు. అయితే ఇట్టి జన్మ కావాలి అని నీవు వూహించు కుంటే చాలదు. జీవితములో నట్టి పుణ్యకర్మ చేసుకుంటేనే అటువంటి జన్మ సాధ్యము.

"దునియా నగద్ బాజార్ హై ఇస్ హాథ్ దే వుస్ హాత్ లే"

అంటుంది కర్మశాస్త్రము. నీవు చేసుకున్న కర్మ ననుసరించి ఫల ముంటుంది. గీతలో నొక విషయముంది.

> "పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్యవిద్యతే।
> న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాతగచ్ఛతి॥"

అర్థమేమంటే! కల్యాణకరమైన కార్యములను చేసుకున్న వానికి ఇహలోకములో కాని, పరలోకంలో కాని వినాశము లేదు.

ఆ విధముగా గాక భౌతిక సుఖము లే జీవితములో ప్రధానముగ భావించుకొని కర్మ చేయువారు, స్వార్థసుఖసంబంధమైన జీవితం గడపువారు నరకమునకు పోతారు.

భౌతికమైన జీవితానికి క్షయ, పతన, సాతిశయ దోషా లుంటాయి. జీవితములో నెంతటి ఉన్నతస్థితి పొందిన వానికైనను ఈ క్షయదోషము తప్పదు. మంత్రిపదవి కెక్కినవాడు దినాలెల్లెట్ల గడుస్తూంటాయో అట్లట్ల వాని గడువు క్షీణిస్తూంటూంది. అందువలన ఎట్టివాడైననూ పతనము నొందితీరవలసినదే. సాతిశయమంటే

అసూయ. ఈ లోకము హెచ్చు తగ్గులు కలది. స్వర్గలోకము కూడ అంతే. తనకంటే హెచ్చు స్థితిలో నున్నవాన్ని చూచి క్రిందివాడు అసూయ పడుతూంటాడు. ఇవి ప్రాపంచికజీవుల వ్యవహారాలు. కాని సుకృతము చేసుకున్నవాడు, భగవత్ప్రాప్తికొరకై సాధన చేస్తూండి తుదముట్టక శరీరం వదలినవాడు "శుచీనాం శ్రీమతాం గేహేయోగభ్రష్టోభిజాయతే" శుచిమంతులు శ్రీమంతులునైన వారింట జన్మనెత్తి ప్రశాంతిగ తన సాధనను ముందుకు సాగించుకుంటాడు.

పాపులైనవారు మరణిస్తే వారికి వెంటనే యోని సిద్ధమై యుంటుంది. వారు శరీరము వదలుతూనే వారికి ఉండిన వ్యసనాలు - అంటే కోపము కలవారు కాని, త్రాగుడు వ్యసనం కలవారు, వ్యభిచార వ్యసనం కలవారు, జూదం వ్యసనం కలవారు శరీరం వదలి కొంతకాలం తమకే వ్యసనాలుండినవో ఆ వ్యసనాలు అనుభవించే వారి సమూహం వద్దకు పోయి అనుభవించుటకు అవయవములు లేక, వ్యసనమునుండి శాంతి పొందక పిశాచాలవలె తిరిగి నరకమును కొంతకాల మనుభవిస్తారు. తరువాత వారి వారి కర్మ కొద్దీ యే మురికి యోనులలోనో కర్మదేవతలచే విసరివేయబడుతారు.

ఉత్తమమైన వ్యక్తులు మరణిస్తే వారికి త్వరగా యోని చిక్కదు. కర్మయోగమార్గములో, పుణ్యమార్గములో, దైవభక్తి మార్గములో, జ్ఞాన సాధనామార్గములో జీవితము గడపి పవిత్రమైన ఫలము పొందగల వ్యక్తులకు త్వరగా యోని లభ్యము కాదు. వారికి తగిన యోని లభించువరకు వారు పుణ్యలోకాలలో శాంతిగా ఉంటారు. దీనికి కారణము పాపయోనులు అధికముగ ఉండుటయు, పుణ్యయోనులు సకృత్తుగా ఉండుటయే. పుణ్యాత్ముడొకడు మరణిస్తే వానికి తల్లిదండ్రులు కావలసినవారు పెరిగి పెద్దవారైతే వీని జన్మకవకాశమేర్పడుతుంది. ముందు పురుషుని యందు జీవబీజముపడి

మూడు మాసములుండి పిదప మాతృయోనిని చేరుకుంటుంది. అక్కడ తొమ్మిది మాసములుండి పన్నెండు నెలలు గడచిన పిమ్మట జనన మవుతుంది.

ఈ విధముగ వేదములోని కర్మకాండవలన మనమనేక విషయాలు గమనించవలసియున్నది. పిమ్మట వేదములోని విషయం ఉపాసనాకాండ. మానవునివద్ద అతి విచిత్రమైన వస్తువొకటున్నది. అదియే మనస్సు. ఈ మనస్సు ఒక్కొక్కరిది ఒక్కొక్క విధమైన సంస్కారము కలిగి ఉంటుంది. ఒక్కొక్కనికి ధనము సంపాదించడమే ప్రధానం. ''ఏనకేన ప్రకారేణ ధనవాన్ పురుషోభవేత్'' అని ఏ ప్రకారముగ నైనను ధనమును సంపాదించాలి. మరికొందరు ప్రపంచభోగములను పొందుటలో నెంతటి సాహస కృత్యములకైనా పూనుకుంటూ తత్సంబంధమైన కామనలతో శేయింబవళ్ళు కాలము గడపుతారు. కొందరు దీనికి వ్యతిరేకముగ యీ మానవజన్మ ఎందుకు వచ్చినది? దీనిని సార్థకము చేసుకునే మార్గమేది? ఇది రహస్య విషయము. దీనిని బోధించే మహాత్ములెక్కడ చిక్కుతారు? అని ఈ విధముగ ఆలోచించి ధనాన్ని తమ యీ లక్ష్యములో చులకనగ చూస్తారు. ఇది అంతయు వాని వాని మనస్సంస్కారముపైన ఆధారపడియుంటుంది. జీవితముయొక్క ఉన్నతికాని, అవనతికాని యీ విధమైన మనస్సంస్కారము పైన ఆధారపడి యుంటుంది. ప్రపంచములో ఉండే మనుష్యులను మూడు విధాలుగ విభాగిస్తుంది శ్రుతి. ఏవిధంగా నంటే:—

''ధనలుబ్ధాధనమయం కాముకాః కామినీమయమ్।
నారీమణమయం ధీరాః పశ్యంతి జ్ఞాన చక్షుషః ॥''

అంటే ధనలుబ్ధులు ప్రపంచాన్ని ధనమయంగా చూస్తారు. అక్కడికి పోతే యేమి వస్తుంది? ఇక్కడికి వస్తే యేమి వస్తుంది? ఈ విధముగ

ధనముపై వారి దృష్టి కేంద్రీకృతమై ఉంటుంది. కాముకులు ప్రపంచములోని స్త్రీలను చూచే సరికి పాపపు భావముతోనే చూస్తారు. మనస్సు చేసే చేష్టలు యివి. కావున పెద్దలిక్కడ ఒక అద్భుతమైన సలహాల నిస్తారు. నీవు పోతూంటావు. దారిలో నొక సుందరమైన స్త్రీ కనిపించింది. నీ మనస్సు ఆమె సౌందర్యము చేత ఆకర్షింపబడింది. ఏమేమో ఊహాపోహాలు చేసింది. మనస్సిప్పుడు పాపము చేసింది. నీవు నీ మనస్సును చూస్తూన్నావు. అది చేసిన పాపము నీకు వస్తుంది. కావున నీవేమి చేయాలి. ఆ పాపము నక్కడనే వదలాలి. ఎట్లు? దీనికొక మహాత్ముడు చెప్పినాడు. మనస్సుతో చేసిన పాపాన్ని మనస్సు ద్వారానే శుద్ధము చేసుకోవాలి. ఆమె పాదములకు నీ మనస్సుతో ప్రదక్షిణము చేయించి నమస్కరింపజేయి. ఈ విధముగ చేస్తూంటే మనస్సు పాపసంబంధమైన ఆలోచనలనుండి విడివడుతుంది. నీవు పాపమునుండి దూరుడవౌతావు. ఇది ఒక అద్భుతమైన చిట్కా. ఈ మనస్సు పరస్త్రీలను చూచి దుష్టముగ ఆలోచన చేయటం మనం సహించరాదు.

తరువాత "నారాయణ మయం ధీరాః పశ్యంతి జ్ఞాన చక్షుషః" జ్ఞానచక్షువుకలవారు ప్రపంచములోని సమస్త రూపనామములను నారాయణమయంగా భావిస్తారు. ఈ విధముగ భావించుటకూడ జీవితమును పవిత్రము చేసుకొను మార్గములో చాలా ఫలప్రదమైనది. ఈ రూపములో ప్రపంచములోని మానవులు వారి వారి సంస్కారమును గురించి పుణ్యపాపములతో లిప్తులగుతూంటారు. నారాయణమయముగ ప్రపంచమును చూచుట చాలా యోగ్యమైన మార్గము.

మనుష్యులు తమ ఎదుట ఉండిన వస్తువులను, వ్యక్తులను చూస్తూ తమ తమ యోగ్యత ననుసరించి వస్తువులకు విలువల నిస్తూంటారు. ఇది కూడ వారి వారి మనస్సంస్కార యోగ్యతల

ననుసరించి ఉంటుంది. మానవుడు మనస్సుకంటే వేరు. మనస్సు మానవుని కొరకై యున్నదా? మానవుడు మనస్సు కొరకై ఉన్నాడా? ఇది గమనింప దగిన ప్రశ్న. మనస్సు కొరకే మనిషి ఉండేటట్లైతే మనస్సు కోరిన కోరికలవెంట వీడు పరుగెత్తుతూండవలసినదే. మనస్సు కొరకే వీడులేడు. వీనికొరకు మనస్సున్నది. వీని కంట్రోలులో మనస్సుండవలసినదే కాని మనస్సు కంట్రోలులో వీడుండనవసరము లేదు.

ఒక వ్యక్తి అనేక కార్యములను చేయదలంచి భగవంతుని గురించి తపస్సు చేసినాడు. భగవంతుడు ప్రత్యక్షమై "ఏమి కావాలి నాయనా! కోరుకో" అన్నాడు. వాడు "స్వామీ! నేను గొప్ప గొప్ప కార్యాలు అనేకముగ చేయాలి. నాశక్తి చాలదు. నీవొక అద్భుత మైన శక్తిని నాకు ప్రసాదించుమన్నాడు. అపుడు వానికొక భూతము నిచ్చి దీనితో నీ యిష్టము వచ్చిన పనులన్ని చేయించుకోపో! అన్నాడు. ఆ భూతమన్నది. "ఇదుగో! చూడు. నాకు పని చెప్పక పోతే నిన్ను తినేస్తా" నన్నది. ఓహో పనులకేమి కొదవ. రారా అని పిలుచుకొని వచ్చినాడు. అయితే ఆ భూతము మహాశక్తి సంపన్న మైనది. వీడు పని చెప్పుచున్నాడో లేదో పని పూర్తైంది. నా యిల్లును బంగారు యిల్లుగా చేయ్. అనే వేళకే బంగారు యిల్లు అయింది. నా యింటి ముందర నందనవనాన్ని సృష్టించు. నందనవనమైంది. తుదకు పరిస్థితి యెక్కడికి వచ్చిందంటే వాని ప్రాణానికే ముప్పు వచ్చింది. అపుడు వాడు పశ్చాత్తాపపడ్డాడు. ఎక్కడి నుండి తెచ్చు కుంటిరా దేవుడా యీ దయ్యాన్ని. అనుకొని గురువు వద్దకు పరు గెత్తుకొంటూ పోయి కథ అంతా చెప్పినాడు. ఆ గురువు "నేను చెప్పి నట్లు వినమని దీనికో చెప్పు" అన్నాడు. వీడా భూతముతో నామాట చెప్పినాడు. అపుడా గురువు వీని యింటిముందు ఒక పెద్ద ఇనుప స్తంభము పాతు, అనే వేళకు పాతడమైంది. గురువన్నాడు. దాని

మీదికి క్రిందికి ఎక్కుతూ దిగుతూ వుండు. వాడు పిలిచినపుడు వాని పని చేయి. లేకుంటే దీని నెక్కుతూ దిగుతూండమని ఆపదను బాపినాడు. ఇది దృష్టాంతము దీనికి దార్ష్టాంతము ఏమంటే మనస్సే భూతము. ముక్కు పొడవుగా ఉండడమే ఇనుప స్తంభము. వచ్చే పోయే శ్వాసతో మనస్సు ఏకము కావడమే ఎక్కుతూ దిగుతూండడము. దీనిలో ఏమి జరుగుతుంది? జనన మరణ ప్రవాహ రూపమైన దుఃఖము తొలగిపోతుంది. అంటే మనస్సు, శ్వాస ఏకమైతే మనస్సు నిలుస్తుంది. మనస్సు నిలుస్తే ఆత్మానందానుభూతి కలుగుతుంది. ఆత్మానందానుభూతితో జనన మరణ ప్రవాహము తెగిపోతుంది. మనస్సును స్వాధీనములో పెట్టకోవడముతో జీవితం తరిస్తుంది.

మనస్సును గురించి ఇంక కొంత వివరం తెలుసుకుందామంటే దానికున్న మూడవస్థలను గురించి విచారించుకోవలె. దానికున్న అవస్థలు అనేకాగ్రత. శూన్యాగ్రత, ఏకాగ్రతలు. వీటి వివర మిట్లుంటుంది. ఇది భాగవతోపన్యాసము. అవశ్యము శ్రవణం చేయదగినదని వచ్చి కూర్చొని వినబోతే నిద్రవస్తుంది. ఇంతే కాదు. ఏదైనా ఒక మంచి పుస్తకము తీసుకొని చదువుదామని పుస్తకం పట్టుకుంటే ఆవలింపు మొదలై నిద్ర బలవంతముగ వస్తుంది. ఏమో నిద్ర వస్తూంది కొంచెము సేపు పండుకొని లేచి పుస్తకము చదువుదామని పరుపు వేసుకొని పండుకుంటే నిద్రరాదు. మనస్సు హైద్రాబాదు సికింద్రాబాదులలో తిరుగుతూ సినిమాకు పోతుంది. పుస్తకము చదివేటపుడు, ఉపన్యాసము వినేటపుడు నిద్రవచ్చె. ఇది శూన్యాగ్రత. నిద్ర వస్తూంది పండుకుందామని పరుపు వేసుకుంటే నిద్ర రాదు. మనస్సు అగ్గిరాముడనే సినిమాకు పోతుంది. ఇది అనేకాగ్రత. ఈ రెంటి మధ్యలో నార్మల్ కండిషన్ ఒకటుంది. అది ఏకాగ్రత. ఏ విషయముపై మనస్సు నుంచుకోదలచుకుంటామో దానిపైన

మనస్సుండాలి. ఇది ఉపాసనా, భక్తి జ్ఞానముల ద్వారా సాధ్యమవుతుంది. ఈ విధముగ వేదములో కర్మ, ఉపాసనా, జ్ఞానకాండలు అద్భుతముగ చెప్పబడ్డాయి. జ్ఞానమేమి తెలియజేస్తుంది? ఈ ప్రపంచములో విషయ సుఖాలతో మానవుడు తృప్తిపడడు. వానికి ఆత్మానందము కావాలె. ఆ ఆత్మానందము వివేక విజ్ఞానాదుల ద్వారా విషయసుఖముల తుచ్ఛత్వమును గుర్తెరింగి, జీవితపరమార్థ మది కాదని వాటిని తృణీకరించి మనోనిగ్రహము ద్వారా ఆత్మజ్ఞానము పొందమంటుంది. ఈ విధముగ వేదమునందు తెలుపబడినది. భాగవతము కూడ వేదముతో సమానమే. దీని నధ్యయనము చేసిన వారికి భక్తి జ్ఞాన వైరాగ్యములు సిద్ధిస్తాయి. ఈ విషయం భాగవత మాహాత్మ్యమునందు మనము తెలుసుకున్నాము. ప్రకృతమును సరామః.

గడచిన కథా భాగములో విదురుడు మైత్రేయ మహర్షి వద్దకు వెళ్ళినాడు. గంగానదీతీరములో నున్న మైత్రేయ మహర్షి వద్దకు పోయి విదురుడు సాష్టాంగ నమస్కారము చేసినాడు. మైత్రేయ మహర్షి ఆశీర్వదించినాడు. కుశలప్రశ్నలైన పిమ్మట విదురుడు మైత్రేయ మహర్షి నొక ప్రశ్న వేస్తాడు. స్వామీ!

"సుఖాయ కర్మాణి కరోతి లోకో న తైః సుఖం వాన్యదుపారమం వా।
విందేత భూయ స్తత ఏవ దుఃఖం యదత్ర యుక్తం భగవాన్ వదేన్నః॥" 3-5-2

ప్రపంచములోని ప్రజలు సుఖముకొరకు కర్మలు చేస్తారు. కాని వారు సుఖానికి బదులు కష్టాలనే పొందుతారు. ఇట్టి వైషమ్యమైన స్థితిని గురించి మీ యభిప్రాయమును తెలుపవలె నన్నాడు.

విదురుడే మరల అంటూన్నాడు. స్వామీ! మీబోటివారు జంగమతీర్థులు. భగవద్విముఖమైన జీవితములో అధర్మశీలురై విష

రీతమైన దుఃఖమునకు గురియగుచున్న ప్రజలను అనుగ్రహించి వారిని రక్షించే నిమిత్తమై భగవత్ప్రచార నిమిత్తమే మీరు వ్యవహరించుచున్నారని నా నమ్మకమని విదురుడంటూన్నాడు. ఈ యర్థమే క్రింది శ్లోకములో చెప్పబడినది.

"జనస్య కృష్ణా ద్విముఖస్య దైవా దధర్మశీలస్య సుదుఃఖితస్య।
అనుగ్రహాయేహ చరంతి నూనం భూతాని భవ్యాని జనార్దనస్య॥"
3-5-3.

స్వామీ! మైత్రేయ మహర్షీ! "కర్మంబులు బంధకరంబులు. దుఃఖహేతువులుం గాని సౌఖ్యదాయకంబులై పాపనిష్కృతిం జేయనోపవు. అది యట్లుండె, భూరి దుఃఖానుసారంబైన సంసార చక్రంబునం పరిభ్రమింపుచు కామవిమోహితులై పూర్వకర్మానుగతంబులైన శరీరంబులు దాల్చుచు, చచ్చుచు మరల పుట్టుచు, ఎంతకాలంబునకుం పాపనిష్కృతి గానక, మాతృయోనివనవనచారులై జనియించి వర్తించు మూఢాత్ములం బహుప్రాయుల రక్షించుకొరకు గాదె నారాయణ పరాయణులైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట." 3-181.

పైన విదురుడేసిన ప్రశ్నకు ఆయన మాటలలోనే సమాధానము వచ్చింది. భగవద్విముఖత్వమే సకల దుఃఖములకు కారణము. తమ, భోటి వారిపుట్టుక కేవలము లోకోద్ధారకమైనదియే కదా! సుఖము దుఃఖము అనే శబ్దాలను కొంత వివరించుకుందాము. ఖం అంటే ఇంద్రియము. సుఖం అంటే ఇంద్రియములకు సౌకర్యంగా ఉండునది. దుఃఖం అంటే ఇంద్రియాలకు కష్టమును కలిగించునది. సుఖం అంటే ఇంద్రియాలు ఉపరామము పొందినప్పటిస్థితి. ఇంద్రియాలు ఉపరామము పొందవలెనంటే ధ్యానములోను, జ్ఞానములోను మాత్రమే అవి ప్రశాంతముగ ఉండగలుగుతాయి. ఈ రహస్యం సామాన్య మానవులకు తెలియదు. వారు ఇంద్రియోద్రేకములైన భోగముల

యందే సుఖమున్నదని ఇటూ అటూ పరుగెత్తుతూ సంసార జాల ములో చిక్కుకొని పోతారు. ఇట్లు దారితప్పిపోయే పామర జనానికి శాంతికి హేతుభూతమైన భగవన్మార్గము చూపి లోకులను ఉద్ధరించు టకు మీబోటి మహాత్ముల జన్మ కలిగినది స్వామీ! అని విదురు డింకను సంసార సుఖాన్వేషకులను గురించి చెప్తాడు.

"అవివేకానుగతస్వకార్య జలపూరా కీర్ణమై మిత్ర బం
ధు వధూపుత్ర జలగ్రహోగ్ర యుతమై దుర్దాంతమై నట్టి దు
ర్భవ పాథోధి దరించువారె హరిసంబంధ క్రియాలోల భా
గవతానుగ్రహనావ లేని యధముల్ కల్యాణసంధాయకా!" 3-182

అవివేకానుగతమైన సంసారసముద్రములో చిక్కుకున్న మను ష్యులు దుర్భరమైన భవసాగరమును భాగవతానుగ్రహమనే నావ లేకుంటే ఏ విధముగ దాటగలుగుతారు స్వామీ! ఈ యజ్ఞానులు.

"సతతముఁ సరసీరుహోదరు సత్కథామృతపూరముఁ
శ్రుతి పుటాంజలిచేత నిమ్ముల జుర్రియుఁ దని వోదు భా
రత కథా మిషమూని విష్ణు బరాశర ప్రియ సూతి స
న్నుతి నుతించిన చోట సన్మునినాథ నామది నుబ్బుదుఁ." 3-185

స్వామీ! నిరంతరము ఆ పరమేశుని సత్కథామృతమును నా చెవులనే దోసిలితో ఎంత త్రాగినను తనివిదీరదు. వేదవ్యాసుడు భారత భాగవతముల యందు ఆ పరమేశ్వరున్ని స్తోత్రము చేసిన చోట నా మనస్సు పరవశము చెందుతుంది.

మైత్రేయ మహర్షీ! ఇతర కథలు నాకు హేయములుగ కని పిస్తాయి. అనఘాత్ముడైన రమాపతి చరితామృతము పానము చేయుట చేత నాకు వేదనలెల్లను తొలగి పోతాయి స్వామీ!

భగవంతుని యీ గుణగానమువలన రాగ ద్వేషములు పూర్తిగా తొలగిపోతాయి. పాలు పితికిన ఆవు పొదుగు ఖాళీయైనట్లు రాగ

ద్వేషములు ఖాళీయైన హృదయమే పరమ శాంతికి నిలయము కదా!

మానవునకు దుఃఖము కలుగుతే దానివలన కలిగిన భయము భక్తి చేత తొలగిపోతుంది. ఆయన అనుగ్రహానికి పాత్రుడైతే వానిలో ప్రతివిషయమును గురించి వాస్తవికతను చూచే వివేకపు కన్ను కలుగుతుంది. వివేకమంటే ఒక ఉదాహరణ చూడండి. దుఃఖము వచ్చింది పోయింది. సుఖము వచ్చింది పోయింది. కష్టము పోతూ పోతూ దేనిని తీసుకొని పోయింది? పాపమును. సుఖము వచ్చింది పోయింది. దేనిని తీసుకొని పోయింది? పుణ్యమును. పాపమును తీసుకొని పోయేవాడు నీకు మేలు చేసేవాడా? పుణ్యమును తీసుకొని పోయేవాడు నీకు మేలు చేసేవాడా? ఒకడు వచ్చి నిందించినాడు, మరియొకడు వచ్చి ప్రశంస చేస్తాడు. నిందించేవాడు నీ పాపాన్ని తీసుకొని పోయేవాడు. ప్రశంస చేసేవాడు నీ పుణ్యాన్ని ఎత్తుకొని పోయేవాడు, కాబట్టి నీకు నిజముగ మేలు చేసేవాడు ఎవడు? ఈ వివేకమువలన తేలే విషయ మేమి? కష్టము నీకు మేలు చేసేదని తెలుసుకుంటివి.

అసలు ప్రపంచములో కష్టమును గురించి భయపడేవాడు ఉన్నతికి రాలేడు. కష్టము కాని దుఃఖము కాని ఎందుకు వస్తాయి? అది మనము చేసుకున్న అప్పు. కాబట్టి అప్పు తీర్చుకో నాయనా అని మనవద్దకు వస్తాయి. ఎవని ప్రారబ్ధము వానిది. ప్రారబ్ధము తీర్చుకొనుటకు వాటిని భగవత్ప్రసాదముగ భావించాలి. వాటిని శాంతిగా అనుభవించి ప్రారబ్ధము నుండి విముక్తిని పొందాలి. ప్రారబ్ధరూపమున దుఃఖాలు గాని కష్టాలుగాని వస్తే భయపడి తాపత్రయముతో వివేకమును గోల్పోయి ఎవరెవరినో దానికి కారకులని ఇతరులను నిందించి తిరస్కారముగ మాట్లాడితే [illegible] కాక

తీరక పోయె. మరల బాకి పెరిగె. ఇపుడు సామాన్యముగ మానవులు ప్రారబ్ధపు బాకీని తీర్చుకోవడము లేదు. తీర్చుకునే బదులు పెంచుకుంటూన్నారు. ప్రారబ్ధము తీరిపోయే మార్గము ఏది? ఏ విషయమును గాని, సంఘటనను కాని శాంతచిత్తముతో అనుభవించినపుడది తీరిపోతుంది. ఇట్టి వివేకము దేనివలన కలుగుతుంది. భగవద్భక్తివలన కలుగుతుంది. సర్వము తన దేవుని అనుగ్రహమే నని భావించే వివేకమును మానవుడు భక్తిభావము ద్వారా, భగవదనుగ్రహము ద్వారా పొందవలసి ఉంటుంది.

దుఃఖము కలుగుటలో మరొక ముఖ్య కారణమున్నది. ఏమంటే మానవునకు ఉన్న దానితో తృప్తిలేదు. వీడు కోరుకున్నది రాదు. ఒక మానవుడంటున్నాడు. నా భార్య నాకు దయ్యమువలె కనబడుతుంది. పొరుగింటి వాని భార్య నాకు ఎంతో అందముగ కనిపిస్తుంది. మరి వీని స్థితి యెట్లున్నదో చూడుడు! వాని భార్య వానికి బాగా కనిపించడము లేదు. అందువలన ఆమె పైన ద్వేషమున్నది పొరుగింటి వానిభార్య వీనికి అందదు. ద్వేషముతోనూ దుఃఖమే. రాగముతోనూ దుఃఖమే ఇది ఎవని సృష్టి? ఈ వెర్రి మానవుని సృష్టియే గదా! ఇది కేవల మజ్ఞాన జనితము. భగవద్భక్తి లేనివారిట్లు అజ్ఞాన సాగరమున కొట్టుకొని పోతూంటారు. దీనికి సరియైన మందు భగవత్కథామృత పానమే స్వామీ! దానిని బోధించి పామరులైన జనులను తరింప జేయుటకే తమబోటివారు జన్మనెత్తి యీ ప్రపంచములో సంచరిస్తారు.

సామాన్యముగ మానవులు వస్తువుయొక్క విలువలను సరిగా తెలుసుకొనక ప్రపంచానికి ప్రపంచవస్తుప్రాప్తికే జీవితాన్ని అంకితం చేసినారు. ఏది ప్రధానము? ఏది గౌణము? అనే విషయాన్ని తెలుసుకోజాలకున్నాను. దేనికి ప్రాధాన్యమివ్వవలెనంటే భగవ

త్ప్రాప్తికొరకై చేసే ప్రయత్నాని కధిక ప్రాధాన్యమివ్వవలె. దాని కివ్వడం లేదు. జీవితంలో అన్నింటికంటే శ్రేష్ఠతమమైన భగవత్ప్రాప్తి అనే విషయానికి వారు ప్రాధాన్యమివ్వరు. ఇంటికి అల్లుడు వచ్చినాడు. బిచ్చగాడు వచ్చినాడు. అల్లునిస్థాన మల్లునికే యివ్వాలి. ఇంటిలోనికి పిలుచుకొనిపోయి ఆప్యాయంగా అన్ని విషయాలు మాట్లాడాలి. బిచ్చగాని స్థానమేమి? అందరికి తెలుసు. కాని అవివేకులైన మానవుల జీవితమెట్లున్నదంటే బిచ్చగాని స్థానములో అల్లున్ని నిలబెట్టినట్లు, అల్లుని స్థానము బిచ్చగానికిచ్చినట్లుంది.

ప్రపంచాన్ని, ప్రపంచవస్తువుల విషయం చూడండి. మరణించిన తరువాత ఒక వస్తువైనా నీ వెంట వస్తుందా? నీ వెంట రాని వస్తువులను గురించి రేయింబవళ్లు కష్టపడి సంపాదించిన దాని నల్లా ఇక్కడ వదలి వట్టిచేతులతో పోతావు కదా! వట్టి చేతులతో పోవడమే కాదు. ఆయా వస్తువులను ధనమును సంపాదించుటలో కలిగే పాపాన్ని వెంటతీసుకొని పోవలసివస్తుంది. బ్రతికినంత కాలము సుఖము కావలె నని కర్మచేస్తే పాపము వెంటవస్తుంది. ఏ వస్తువూ వెంట రాదు. ఈ విషయము తెలిసి కూడ దృశ్యవస్తు ప్రాప్తినే జీవిత లక్ష్యముగ భావించు వారెంత వెర్రివారు! అందువలననే అవివేకాను గతులని అనుకోవలసి వస్తుంది.

కాశీలో అన్నపూర్ణాసత్రమున్నది. ఒకానొక సందర్భములో ఆ సత్రము నిలిచిపోయే పరిస్థితి వచ్చింది. ఎంతో కాలము నుండి నిర్వహింపబడుతూ వచ్చిన అన్నసత్రము నిలిచిపోవుట మంచిది కాదని కార్యవర్గసభ్యులు, ప్రెసిడెంటు కలిసి అక్కడ నవకోటి నారాయణ అనే ధనికుడుంటే అతని వద్దకు పోయి తమ స్థితిని చెప్పుకున్నారు. వాడప్పుడు పరమలోభి. కాబట్టి వాళ్ళను విసిగికొని పోండి పోండి అని తరిమివేసినాడు. ఆ కార్యవర్గ సభ్యులు, ప్రెసిడెంటు తలలు క్రిందికి వేసుకొని చేయునది లేక వాపసు వస్తున్నారు. దారిలో నొక

సన్యాసి తటస్థపడ్డాడు. వీరందరు ఖిన్నవదనులై యుంటే కారణ
మడిగినాడు. వారు జరిగిన సంగతంతయు చెప్పినారు. ఆ సన్యాసి
కేమనిపించిందో ఏమో! రేపీవేళకు పోయి మరల అడగండి. అతడు
తన ఆస్తినంతటిని ఈ అన్నసత్రానికే ధారపోస్తాడని చెప్పి వెళ్ళి
పోయినాడు. ఈ సభ్యుల కేమాత్రము అర్థము కావడము లేదు.
ఇంతగా ఛీకొట్టి పంపినవాడు రేపుపోతే కొంత యివ్వడంకాదు.
తన ఆస్తినంతటిని ధారపోస్తాడా? వాని స్థితి చూస్తే అసంభవమని
పిస్తుంది. కాని మహాత్ముడు చెప్పిపోయినాడు కదా! ఎట్లైతేనేమి
రేపు పోయి వస్తాములే అనుకొని వారాదినము తాము తమ ఇళ్ళకు
వెళ్ళిపోయినారు.

ఆ సన్యాసి చక్కగా ధనికుని వద్దకు పోయినాడు. ఆ ధనికుడు
ముఖమంతా మాడ్చుకొని ఏమి సన్యాసీ ఎందుకు వచ్చితివి? అని
ప్రశ్నించాడు. దానికా సన్యాసి "నాయనా! నిన్నేమియు అడుగు
టకు రాలేదన్నాడు. ఆ మాట విని ధనికుడు "అట్లైతే కూర్చో",
అన్నాడు. ఆ సన్యాసి కూర్చొని "నాయనా! నాదొక కోరిక"
అన్నాడు: "ఏమిటయ్యా! ఏమికోరిక అని" అడిగినాడు శేటు. ఆ సన్యాసి
చెప్పినాడు. నాయనా! నావద్ద కేవల మీ రాగిచెంబు మిగిలింది.
ఇదికూడ నాకు బరువైంది. నీవద్ద ఉంచుతాను. నీవు మరణించిన
పిమ్మట నీ సామానును వాగన్ల కొద్దియున్నది. దానితో సహా నా రాగి
చెంబును కూడ తీసుకురా! పరలోకంలో నేను రాగిచెంబును తీసు
కుంటాను". ఈ మాటలు ఆ ధనికుని కేమి అర్థము కాలేదు. వానిలో
ఆలోచన ప్రారంభమైంది. చనిపోయిన వారెవరును ఏమియు తీసుక
పోవడం లేదే! మరి నన్ను తన రాగిచెంబు తెమ్మంటున్నాడీ
సన్యాసి అని మనస్సులో అనుకొని "చనిపోయిన వారెవరును ఏమియు
తీసుకొనిపోవుట లేదే" అన్నాడు. దానికా సన్యాసి "నాయనా!

నీ వెంట యేమియు రాని దానికొరకై యింత శ్రమపడుచున్నావా? ధనికుడంతర్ముఖుడైనాడు. అతని ఆలోచనా ప్రపంచము ప్రారంభ మైంది. ఇది నిజమేగదా? వెంట ఏదియును రాదే? ఇట్టిదాని కొరకై రేయింబవళ్ళు జీవితమును వెచ్చించుచున్నాము కదా? ఈ విధముగ నతడాలోచింపసాగినాడు. సన్న్యాసి ఇంతలో మరల నిట్లు చెప్ప సాగినాడు. "నాయనా! ఏమియు రాదను కొనకు. ఈ ధనము సంపాదించు టలో నీ వెంత పాపము చేసినావో అది నీ వెంట వస్తుంది. అది నిన్ను మరణించిన పిదప విపరీతమైన దుఃఖమునకు గురి చేస్తుంది. అనుగుడు గున నీకు ఆపత్తిని కలిగిస్తూంటుంది. "అట్లైతే స్వామీ! అని గౌర వంగా సంబోధించి "యీ పాప మెట్లు పోతుందో తెలవివ్వండి. అట్లనే చేస్తాను." "చెప్పినట్లు చేస్తావా?" "తప్పక చేస్తాను."

నీవద్ద కింతకు ముందు వచ్చిన వాళ్ళు అన్నపూర్ణా సత్రము యొక్క కమిటీ మెంబర్లు. ఆ సత్రము నిలిచిపోయే పరిస్థితికి వచ్చింది. రేపిదే వేళకు వారు మరల వస్తారు. వారికి నీ ఆస్తినంతయు ధారపోసి ఆ అన్నపూర్ణా సత్రములోనే మీరిద్దరు దంపతులు అక్కడికి వచ్చే మహాత్ముల సేవలో జీవితం గడిపితే నీకు పుణ్యలోకాలు, ఊర్ధ్వగతి కలుగుతుందన్నాడు. అపుడా ధనికుడు స్వామీ! మీకు నా ధనమంతా యిస్తాను. తీసుకో స్వామీ! అంటే ఆ సన్న్యాసి "నాకున్న రాగి చెంబే నాకు బరువై యుంటే నీ సామానును నేనెక్కడ మోస్తా నాయనా? వద్దు వారికే యిచ్చివేయమన్నారు. మరుదినం వేళకు సరిగా అన్నపూర్ణా సత్రము కమిటీ మెంబర్లు ధనికుని వద్దకు వచ్చినారు. వెంటనే ధనికుడు లేచి నీళ్ళు తీసుకొని తన ఆస్తినంతయు వారికి ధారపోసినాడు. అంతేకాదు తాను తన భార్య యిద్దరును ఆ సత్రము లోనే ఉండి మహాత్ములకు సేవచేసుకొంటూ తరించినారు.

ఈ కథ వలన జీవితంలో ఎంతైనా పుణ్యము సంపాదించుకోవచ్చు. దానికి బదులు పాపము చేసుకొని నిష్కారణముగ నరక భాజను కారాదను హెచ్చరిక కలుగుతుంది. సంసార సముద్రములో చిక్కుకున్నవారికి వివేకము కలుగదు. మహాత్ములు, సజ్జనులునైనవారిని ఆశ్రయించినపుడు మాత్రమే వారికి సంసార తరుణోపాయము తెలుస్తుంది. సంసార శబ్దానికి రెండు వ్యతిరేకార్థాలున్నవి. "సంసారం సాగరం దుఃఖమ్" అనే మాట అందరికి తెలుసు. కాని దాని అర్థాన్ని వివేకులింకొక విధముగ మార్చుకుంటారు. సం=లెస్సనైన, సారము = సారము గలది. లెస్సనైన సారము కలది. ఎట్లు? భగవదభిముఖమైన జీవితమును గైకొని సమస్త కర్మలను భగవత్సేవగా మార్చుకొని కర్మ చేయువారికి అది లెస్సనైన సారము గలది. దృష్టిని వివేకవంతమైనదిగా మార్చుకో. సంసారమును వదలి మన మెక్కడికి పోవలె? సంసారములో ఉండుట తప్పుకాదు. సంసారమును దుఃఖకరమైనదిగా భావించుచూ దానిని హృదయములో పెట్టుకుంటే దుఃఖానుభవము తప్పదు. నావ నీళ్ళలోనే ఉండాలి. కాని నావలోనికి నీళ్ళు రారాదు. దోమలలోనే దోమ తెర ఉండాలి. కాని దోమ తెరలోనికి దోమలు రారాదు. ఆ విధమైన వివేకముతో సంసారమును గడపువారు చాలా అరుదు. బీగము చెవిని ఇట్లా తిప్పితే పడుతుంది. ఇట్లా త్రిప్పితే తెరుచుకుంటుంది. కావున భగవతానుగ్రహ నావలేని అధములు ఈ సంసార సముద్రాన్ని తరించలేరు.

నిరంతరం భగవంతుని చింతన ఉండాలి. అదియే నిజమైనట్టి కల్పవృక్షం. నిరంతరం భగవంతుని చింతన అంటే ఇంటిలో చాప వేసుకొని భజన చేసుకుంటూ కూర్చోవడం కాదు. నీవు చేసే సర్వ కార్యములు భగవదర్పిత బుద్ధితో చేయడమే. ఏ పని చేస్తూండినను భగవంతునిపైన చిత్తముండాలి. ఎట్లంటే ఒక యింటిలో తల్లి

పిల్లవాన్ని ఊయెలలో పండబెట్టింది. మంచినీళ్ళు తెచ్చుకోవాలి. ఒక బిందె తెస్తే చాలదు. రెండు బిందెలు తేవాలి గాని ఊరి వెలుపల ఉన్నది. శీఘ్రముగ తాడు తీసుకుంది. రెండు బిందెలు చంకలో ఒకటి, తలపైన ఒకటి పెట్టుకొని పోయింది. పని ఇబ్బడిగా చేస్తూంది. కాని ఆమె మనస్సు ఎక్కడ ఉంది? ఇంటిలోని పిల్లవాని పైన, లేచెనో! ఏడ్చెనో! ఎవరు పలకరించేవారు లేకపోతే భయపడునో ఏమో! అనుకుంటూ వస్తూంది. ఈ యుదాహరణ ద్వారా పనిచేస్తూ భగవంతుని పైన చిత్తముంచుట సాధ్యమేనని తెలుస్తుంది. అంతే కాదు. ఆ పనికూడ ఆయన సేవగా చేయడం శ్రేష్ఠమైన మార్గం.

విదురుడంటూన్నాడు. స్వామీ! భాగవతామృతము జీవిత తరణోపాయానికి చక్కని మందు. ఈ యమృతము చెవులతో ఎంత త్రాగినను తనివి తీరదు. ఈ శరీరానికి బలము రావాలి అంటే ఆహారము తీసుకోవాలి. ఆహారము కడుపులోనికి చేర్చేది నోరు. స్థూల శరీరానికి నోరు ఎట్లో సూక్ష్మశరీరానికి చెవులు అట్లే. సూక్ష్మశరీరమునకు ఆహారము కథామృతము. భగవత్కథలు, గాథలు వినుట చేత లోపల ఉత్తమ సంస్కార మేర్పడుతుంది. ఆ సంస్కారముతో పెరిగేదే సూక్ష్మశరీరము లేక లింగశరీరము. ఈ లింగశరీరము యొక్క స్వరూపమే పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, పంచ ప్రాణములు, అంతఃకరణము లేక మనస్సు మొత్తం పదహారు. సూక్ష్మశరీరము స్థూలశరీరానికి ఆజ్ఞ నిస్తుంది. అది ముందు ఫలానా చోటికి పోవలె నంటుంది. ఆ పిమ్మట దాని ఆజ్ఞాపాలనములో స్థూలశరీరము లేచి చొక్కా వేసుకొని కాళ్ళు చేతులాడించు కుంటూ బయలు దేరుతుంది. అది అంటే సూక్ష్మశరీరము ఎట్టి మాటలను వింటుందో అటువంటి సంస్కారాన్ని సంపాదించుకుంటుంది. భాగవతామృతమును శృతిపుటములచేత త్రాగుతే ఆ మనుజు డమరు

పోతాడు. కావున స్వామీ! భాగవతము వినేటపుడు నాకు చిత్తము పరవశమవుతుంది. ఈ భాగవతమును గురించి వినిపించండి స్వామీ!

"ఇతర కథాకర్ణనముల నతి హేయత నొందెడి చిత్తమున ఘాత్మ రమా
పతి చరితామృత రతి సంసృతి వేదన లెల్ల బాయ జేయు మునీంద్రా!"
3-186

ప్రపంచములో ఒక్కొక్కరి దొక్కొక్క సంస్కారము. ఇద్దరు ఇంటి నుండి బయలు దేరుతారు. ఒకడు భాగవతం వినుటకు పోదా మంటాడు. మరొక్కడు అగ్గిరాముడు సినిమాకు పోదా మంటాడు. కావున స్వామీ! నాకు ఇతరమైన కథాకర్ణనములచే చిత్తము విసిగి పోయింది. రమాపతి చరితామృత రతిలో నాకు సంసృతి వేదనలెల్ల పోయేటట్లు జేయు మహాత్మా.

"భూరి విజ్ఞానవిదులగు నారదాది నిర్మలాత్మ్మలకైన వర్ణింపరాని
హరి కథామృత పానంబునందు విసివి యొల్లనను వాడెపో వెర్రి
గొల్లడనఘ 3-188

ఈ భగవత్సంబంధమైన కథను, ఇంక చాలు అనువాడే వెర్రి గొల్లడు. ఎందుకంటె శరీరానికి సుఖాన్నిచ్చేటివి విషయాలు. ఈ విషయాలు మనుష్యునికి పూర్ణ శాంతిని ప్రసాదించ లేవు. పరమాత్మ కథ అటువంటిది కాదు. అది ఆత్మసుఖాన్ని ప్రసాదిస్తుంది. ఆ రూప మున లభ్యమయ్యే ఆనందము పూర్ణ శాంతిని ప్రసాదిస్తుంది. శరీర భోగాల సుఖము, పరమాత్మ చింతనవలన కలిగే సుఖానికి భూమ్యా కాశముల యంత వ్యత్యాసము. శరీరభోగాలచే కలిగే సుఖము దీర్ఘ కాలికమైంది కాదు. అంతేగాకుండా భోగాలు శరీరమును త్వరగా నిర్వీర్యమొనర్చి శవప్రాయున్ని చేసివేస్తాయి. శంకరాచార్యులవా రన్నారు. "సుఖతః క్రియతే రామాభోగః పశ్చాద్ధంత శరీరే రోగః" భౌతికసుఖము ఎక్కువైనకొలల్ల రోగాలకు నిలయ మౌతుంది శరీరము.

భగవత్సుఖము ఎంతెంత ఎక్కువైతే అంతంత శరీరములో తేజస్సు పెరుగుతుంది. ఆత్మశక్తి అధికమవుతుంది.

కావున శరీరభోగమును మానవుడు పెంచుకోరాదు. భోగ మనుభవింపబడుతుంది ఇంద్రియముల ద్వారా. ఇంద్రియములకు భగవంతు డేమి పేరు పెట్టినాడు? మాత్రాః అని భగవద్గీతలో పేరు పెట్టినాడు. మాత్రాః అంటే "మీయంతే ఆభిః విషయాః" అని నిర్వచనము. అంటే విషయాలను కొలత వేసి చెప్పేదని అర్థము. ఆ మనిషి బాగానే ఉన్నాడు కాని ముక్కు పొడుగుంటే బాగుండె. ఇపుడు ఫాన్ గాలి వస్తూంది. ఇది ఇంతకంటె ఎక్కువ వచ్చియుంటే బాగుండె నని త్వగింద్రియము కొలత వేసి చెప్పుచున్నది. ఇటులనే విషయాలను కొలచుపాత్రలు ఇంద్రియాలు. ఇది ఒక అర్థము.

ఇంకొక అర్థమేమంటే మాత్రాః అంటే పరిమితముగ వాడుకొనబడవగినవి అని. డాక్టరు వద్దకు పోయి మాత్ర యిప్పించుకుంటాము. వాటిలో కలిసే వస్తువులు పరిమితముగ కలిసియుంటే సరిపోతుంది. లేకుంటే "నా కేతిమాత్ర వైకుంఠయాత్ర" అవుతుంది. ఇంద్రియాలను భగవంతుడు పరిమితమైన ప్రయోజనము కొరకిచ్చినాడు. ఉదాహరణకొరకు ముక్కిచ్చినాడు. దీనిని గురించి తెలుసుకుందాము. ముక్కు ఎందుకిచ్చినాడంటే శ్వాసతీసుకొనుటకు, వాసన చూచేందుకు, కాని మనమంతటి ప్రయోజనమే దానితో పొందకుండా నశ్య మెక్కించుచున్నాము. ఇది దురుపయోగమే. దానితో ముక్కు చెడిపోతుంది. గుడ్డలు చెడిపోతాయి. శబ్దము నోటితో రాక ముక్కు ద్వారా వికృతమై వస్తుంది. ఇక్కడ ఎవరైనా నశ్యము తీసుకునే వారుంటే విమర్శిస్తూన్నా ననుకోవద్దండి. శాస్త్ర చర్చచేసుకుంటున్నాము. పరిమితముగా వాడుకునేందుకొరకు మాత్రల నిచ్చినాడు భగవంతుడు. నోరు యిచ్చిన దెందుకంటే మంచిమాటలు మాట్లాడు

కునేందుకు, స్వచ్ఛమైన ఆహారము తీసుకునేందుకు. దానితో మనము త్రాగరాని దానిని త్రాగి, తినరానిది తింటే ఆ జీవుడు శిక్షకు అర్హుడే. భోంచేసేటపుడు త్రేపు వస్తుంది అంటే ఏమని గుర్తు? అది చెప్తుతుంది. Mister! There is no space inside, please stop eating అని చెప్పినట్లు. మనవానికి నాలుకకు రుచి తగిలింది. ఈ కొంచెమేలే, ఈ కొంచెమేలే - అంటూ అధికముగ తింటాడు. తినే సుఖము కొంచెము సేపు. ఆయాసము కలిగి పొర్లడము చాలాసేపు. సుఖాన్ని కోరితే అధికకాలము వరకు బాధ. అసలు భోగానందము ఆనందమే కాదు. విషయానందమిట్లనే ఉంటుంది. పరమాత్మానందము దీనికి వ్యతిరేకమైంది. ఆత్మానందము కలిగినపుడు మానవుడు పరవశుడౌతాడు. శరీరానందము, మానసికానందము, ఆత్మానందమని ఆనందము మూడు విధాలు. చాలామంది శరీరానందము లోనే మునిగి తేలుతుంటారు. శరీరానందముకంటే బలీయమైనది మానసికానందము. దానికంటే శ్రేష్ఠమైనది ఆత్మానందము.

ప్రతివానియందు ఆత్మయున్నది. ఆనందము దాని సహజ స్వరూపము. కావున భాగవతము ద్వారా అట్టి ఆత్మానందము లభ్యమవుతుంది. కాబట్టి భగవత్సంబంధమైన భాగవతము వినిపించవలసినది మహాత్మా! అంటే మైత్రేయుడు విదురుని నమ్రశీలతకు, మెచ్చుకొని విదురా! నీవు సామాన్యుడవుకాదు. అందువలననే శ్రీకృష్ణ భగవానుడు నీకు తాను చెప్పిన జ్ఞానమును చెప్పవలసినదిగా నాకు ఆజ్ఞాపించిరి. నీ పేరును మూడు మార్లు ఆయన ఉచ్చరించినారు. అందునను నీవు అసలు యమధర్మరాజువు.

"మాండవ్యశాపాద్భగవాన్ ప్రజాసంయమనోయమః ।
భ్రాతృక్షేత్రే భుజిష్యాయాం జాతః సత్యవతీసుతాత్ ॥" 5-20

మాండవ్య మహర్షి శాపమువలన యమధర్మరాజునైన నీవు దాసీ పుత్రుడవై జన్మించినావు. ఈ కథను క్లుప్తముగ తెలుసుకొందాము.

ఒక పర్యాయము దొంగలు దోచుకొని పోతూండగా రాజ భటులు వారివెంట పడ్డారు. దొంగలకు తప్పించుకునే విధానము సాధ్యము కాక మాండవ్యమహర్షి వద్ద వదలిపోతారు. రాజభటులు మాండవ్య మహర్షినే దొంగగా భావించి ఆయనను రాజువద్దకు తీసుకొని పోతారు. సాయంత్రమైనందున రాజు దర్బారు వదలి అంతఃపురంలోనికి పోతాడు. రాజభటులు మాత్రము వెళ్ళి రాజుతో దొంగ చిక్కినాడు. పట్టుకొని వచ్చినాము. ఏమి శిక్ష ఇవ్వాలెనని అడుగుతారు. రాజు వాన్ని గర్తు కెయ్యమంటాడు. ఆ మాండవ్య మహర్షిని వధ్య స్థలానికి తీసుకపోయి భూమిలోనికి ఉాటపాతి దానిపై ఆయనను ఎత్తి కూర్చో బెట్టుతారు. ఆ కత్తి ఆసనమునుండి గుచ్చుకొని ఆయన చావవలె. ఇదీ గర్తుకు వేయుడమంటే. కాని ఆయన దానిపై కూర్చొని గాయత్రీ మంత్రం జపము చేస్తూ కూర్చున్నాడు. సాయంత్రం ఆ ఋషిని ఆ విధముగా కూర్చోబెట్టి కొంచెము సేపు చూచినారు, ఆయన చస్తాడేమోనని. ఆయన చావలేదు. తెల్లవారిన పిదప మనము వస్తాము అంతలోకి చనిపోయి యుంటాడని ఆ గర్తుకు వేసినవారు వెళ్ళి తెల్లవారిన పిదప వచ్చి చూస్తే యింకేముంది! మహానుభావుడట్లనే గాయత్రీ జపము చేసుకుంటూనే ఉన్నాడు. చావలేదు. ఈయన ఎవరో మహానుభావుడై యుంటాడని భటులు రాజువద్దకు పోయి జరిగిన సంగతి చెప్పినారు. ఆ రాజు పరుగెత్తుకుంటూ ఋషీశ్వరుని వద్దకు వచ్చి ఆయనను దర్శించి కాళ్ళపై బడి మహాత్మా! తామెవరో తెలియదు. నిన్న సాయంత్రం నా వద్దకు నా భటులు వచ్చి దొంగ చిక్కినాడంటే గర్తుకు వేయమంటిని. నేను మిమ్ములను మొదట దర్శించియుంటె అపుడే తెలుసుకునేవాణ్ణి, నా తప్పు క్షమించవలసినదని ప్రార్థించినాడు. అపుడా మాండవ్య మహర్షి నేను నిన్నుగాదు యమధర్మరాజువద్దకు వెళ్ళి నా కెందుకీ శిక్ష యిప్పించి నాడో అడుగుతానని యమలోకానికి వెళ్ళినాడు.

యమునితో కారణమడిగినాడు. అపుడు యమధర్మరాజు ఆ ఋషికి చెప్పినాడు. "మీరు చిన్నతనములో తూనీగ తోకలో ముల్లు గుచ్చినారు. అందువలన మీకీశిక్ష అనుభవించవలసి వచ్చినది" అందుల కాయన కోపించి "చిన్నతనములో తెలియని కాలములో చేసిన తప్పుకు స్వప్నలోకములో శిక్షనిస్తే తీరిపోవును గదా! నాకు ఇంతటి వయస్సున నీ శిక్ష విప్పించిన నీవు భూలోకములో దాసి యోనియందు జన్మనెత్తెదవు గాక" అని శపించి వెళ్ళిపోయినాడు. అందువలన సిట్లు విదురుడై పుట్టినాడు. ఇది మాండవ్యమహర్షి యమధర్మరాజుకు శాపమిచ్చిన కథ ఎంతటివాడైనా కర్మఫలమునుండి తప్పించుకు నేందుకు వీలులేదు. ఆ మైత్రేయుడు విదురునితో నీవు సామాన్యుడవు కాదు.

"భవాన్ భాగవతోనిత్యం సమ్మతః సానుగస్య చ।
యస్య జ్ఞానోపదేశాయ మాఽఽదిశత్ భగవాన్ వ్రజన్॥ 5-40

నీవు భాగవతుడవు. అందువలనసే శ్రీకృష్ణుడు జ్ఞానోపదేశము చేయవలసినదని నన్నాజ్ఞాపించినాడు.

భగవద్గీత భారతములో బోధించినాడు అర్జునునికి. దానికి భగవద్గీత అనే పేరు సార్థకమైనది. భాగవతము ఏకాదశ స్కంధములో భగవంతుడు ఉద్ధవునికి బోధించినాడు. అది భగవద్గీత అనే పేరుతో ప్రచలితము కాలేదు. అది ఉద్ధవగీత అనబడినది. దీనిని చూస్తే భగవంతుడు తన భక్తుడైన ఉద్ధవునికి ఎంత గొప్పదైన స్థానమిచ్చినాడో చూడండి. ఈ విధముగ ఆయన మైత్రేయునికి కూడ ఉద్ధవునితో సహా వినిపించినాడు. ఆవిధముగ వినిపించి ఉద్ధవున్ని బదరికాశ్రమమునకు పోవలసినదని ఆజ్ఞాపించి మైత్రేయునికి విదురునికీ ఆత్మబోధను చెప్పవలసినదని ఆదేశించినాడు. ఈ ఏకాదశ స్కంధము భక్తి, జ్ఞాన వైరాగ్యముల సారము, కాలగర్భములో భగవానుడవకాశము కలుగజేస్తే సావకాశముగ చెప్పుకుందాము.

సర్వేజనా సుఖినస్సంతు.

పదియవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదునొకండవ రోజు ఉపన్యాసము

"శ్రీకరమైన యెవ్వని నిరీక్షణ మాత్రమునన్ మహాద్భుతా
నేక విలాసవైఖరుల నీ భువనంబులు నిక్కమైన య
ట్లై కనుపించు నెవ్వని సకృత్స్మరణంబున నివ్వి వెండియున్
చీకటి యెండ నట్లణగు చిన్మయు నా విభునాశ్రయించెదన్.

"తల్లీ శారద నీదయ నెల్లగొనగ భాగవతము వివరింపుచు నా
యుల్లమున నిలిచి యెడపక సల్లలితోక్తులను కూర్చు సరణి
యొసగవే॥

భక్తాగ్రేసరులారా! భాగవతోత్తములారా! పుణ్యాత్ములారా!

కర్మతో కూడుకున్న యీ లోకములో మానవు డెట్టి ఆసక్తి కలిగియున్నాడో ఆ విధమైన కర్మలయందు రక్తుడై యుంటాడు. జీవిత ములో సాంగత్యము చాలా ప్రధానతను వహిస్తుంది. మహాత్ములు, సజ్జనుల సహవాసము కొంతమందికి గిట్టదు. ఆ సజ్జనులను చూస్తూనే వానికి ఏవగింపు. కాని ఒక్కొక్కని పూర్వపుణ్య భాగ్యము కలిసి వస్తే సజ్జనుడే ఆతనిని బలవంతముగ తన వశము చేసుకుంటాడు.

ఒకచోట జరిగిన విషయము. ఉత్తరహిందూస్థానములో జరిగిన ఘట్టము. ఒక పెద్ద శేటు. అతని దుకాణము చాలా పెద్దది. దానిలో దాదాపు ఇరవై మంది గుమాస్తాలు. ఒక సన్న్యాసి

పోతూ పోతూ ఆ శేటును చూచినాడు. ఎత్తైన గద్దెమీద కూర్చు న్నాడు. నేనింత గొప్ప ధనికున్ని అనే అహంకార మతని ముఖము పైన తొణకిసలాడుచున్నది. ఈ సన్న్యాసి అతనికేమైనా కొంత వినిపిస్తా మనుకున్నాడు. ఇట్లు పలికినాడు. "క్యా శేట్ జీ! జరా మేరీ బాత్ సున్ తేహో! నా మాట కొంత వింటావా? శేట్ పలుక లేదు. మరల అన్నాడు. క్యాం శేట్ జీ జరా మేరీ బాత్ సున్ నేకా మౌకా హై నహీంతో దుకాన్ మకాన్ మే మరనా హై? నా మాట యేమైనా వింటావా? లేక దుకాణంలోనైనా మకాన్ (ఇంటి)లోనైనా చస్తావా? అంటే అతడు మరొక్కచోటికి పోయేవాడు కాదు. ఆ పట్టణములో అనేకముగ సత్సంగాలు జరుగుతూంటాయి. కాని ఇతడెచ్చటికిని పోడు. శేట్ యీ మాట విని "క్యా బక్తా హై చలే జావ్ యహాఁ సే" ఏమి వదరుతున్నావు? త్వరగా పో ఇక్కడి నుండి" అన్నాడు. ఆ మహానుభావుడు అక్కడి నుండి పోయినాడు. కాని ఆ శేటును బాగు పరచవలెనను ఇచ్ఛ ఆయనకు కలిగింది.

మరు దినము ఆ శేటు గంగానదీ స్నానానికి పోయినాడు. ఆయన పోతూనే ఈ మహాత్ముడు ఆయన రూపములో ఇంటికి వచ్చినాడు. కుమార్లు "ఏమి తండ్రీ! ఇంత త్వరగా వస్తివి?" అని ప్రశ్నించినారు. దాని కాయన "నేను గంగానది దగ్గరకు పోతినండ్రా. అక్కడ నా వలెనే మరొకడు స్నానము చేస్తున్నాడు. వాడు ముందువస్తే మీరు మీ తండ్రినైన నన్ను కనుక్కోలేక తాపత్రయ పడుతారని ముందేవస్తిని" అన్నాడు. దానికి కుమార్లు "అట్లనా! ఇంటికి రానీ! మమ్ములను మోసము చేయుటకు ఎవడో మాయ వేషం వేసుకొన్నా డ"ని అంటూండగా కొద్ది సేపులో వారి నిజమైన తండ్రి స్నానము చేసివచ్చినాడు. అపుడు కుమార్లు వాకిట్లోనుంచి లోపలకి రానీయ లేదు. అక్కడినుండే "ఎవడవు నీవు? మమ్ములను మోసము చేయ డానికి మా తండ్రివలె దొంగ వేషము వేసుకొని వస్తావా? పొతావా

లేదా? అని అందరు తన్నడానికి ప్రయత్నమైనారు. తండ్రికి దిక్కు తోచ లేదు. ఇదంతా మాయాజాలమువలె నున్నది. "ఏమండ్రా? ఏమైందిరా మీకు? నేను నిజమైన తండ్రినిరా!" అన్నాడు. విస్తుపోయినాడు. అపుడు కుమారులు "మా తండ్రి మొదటనే వచ్చినాడు" అని తండ్రిని జూచి "నీవు దొంగతండ్రివి. ఇక్కడి నుండి మెల్లగా పొతేనే సరిపోతుంది, లేకుంటే అర్ధచంద్రాకార ముపయోగించవలసి వస్తుంది" అని తిరస్కారంగా మాట్లాడినారు. ఆ శేటు చేయునది లేక ఆ యూరియందు రాజు ఉంటే ఆయన వద్దకు పోయి తన గోడును చెప్పుకున్నాడు. ఆ రాజు వెంటనే ఇంటిలోని వారి నందరిని పిలువ నంపినాడు. చూచినాడు. ఇద్దరు ఒకే రూపముతో ఉన్నారు. అపుడు రాజు నిజమైన తండ్రిని తెలుసుకునేందుకు వెనుకటి ప్రశ్నలు కొన్ని వేసినాడు.

"నీ పెద్ద కుమారునికి పెండ్లి ఎప్పుడైంది?" దీనికి నిజమైన తండ్రి కొద్ది ఆలోచన చేస్తూండగ మహాత్ముడు తక్షణం చెప్పినాడు. "రాజు మరొక ప్రశ్న వేసినాడు, "ఆ పెండ్లి కెంత ఖర్చైంది"? దీనికి నిజమైన తండ్రి సరిగా చెప్పలేక పోయినాడు. మహాత్ముడు పైసలతో దేఖీలు కరెక్టుగా చెప్పుటయే కాకుండ ఫలానా చోటనున్న బహీలో ఈ వివరాలన్నియు వ్రాసి పెట్టబడియున్నాయని వివరాలు చెప్పినాడు. అపుడా రాజుకు నిజమైన తండ్రిపైన కోపం వచ్చి పది కొరడా దెబ్బలు వేయించినాడు. "ఇతరులను మోసము చేస్తావా? వెళ్ళిపో యిక్కడి నుండి" అని తండ్రిని తరిమివేసినాడు. పాపమా శేటుకు కలిగిన దుఃఖ మింతా అంతా కాదు. ఊరి వెలుపలికి పోయి చావిడిలో కూర్చున్నాడు నిన్నటివరకు ఎంతటి గౌరవమర్యాదలతో ఉండినాను. ఈ దినం ఊరిలోనుండి తరిమివేయ బడితినే! హా హాతవిధీ! అంటూ దుఃఖిస్తూ కూర్చున్నాడు. అచ్చటికి సన్న్యాసివచ్చి "ఏమి శేటుగారూ! నా మాట లేమైనా వినడానికి సమయమున్నదా?" అన్నాడు.

అంటూనే లేచిపోయి ఆయన కాళ్లపైన సాష్టాంగపడి స్వామీ! నా గతి యిట్లైంది. ఏమి చేయను అని అతి దీనంగా మాట్లాడ సాగి నాడు. అపుడా మహాత్ముడు "నాయనా! నేనే ఆ విధమైన రూప ములో వచ్చి నిన్ను కష్ట పెట్టించినా. ఎందుకంటావా? మానవజన్మ వచ్చింది కేవలము భోగములలో ఉండేందుకు గాదు. ధనమును, ఐశ్వర్యమును చూచి మురిసి పోయేందుకు కాదు. ప్రతిదినము ఎవరి నైనా సజ్జనుని చేత బోధవినునట్లు నీవు నీ ధనము ద్వారా ఏర్పాటు చేసుకో. జ్ఞానము సంపాదించుకో. భగవత్ప్రాప్తిని సంపా దించుకో." అని బోధించి వెళ్ళిపోయినాడు. మరుదినం నుండి ఆ శేటు ప్రతిదినం శ్రవణ మేర్పాటు చేయించినాడు. బహుకాలము అనేకము లైన వేదాంత తత్త్వమును శ్రవణముచేసి తరించినాడు. ఈ రూప ముగ కూడ సత్కృత్తుగా జరుగుతుంది. కాని ఇది అన్నిచోట్ల కాదు. కావున మానవుడు భక్తి జ్ఞానములను ప్రయత్నపూర్వకముగా సాధించాలె.

అసలు ఈ జీవితము వచ్చియుండేదే దానికొరకు. అందువలననే భాగవతము చెబుతుంది —

"లబ్ధ్వార్థ ఇత్ నరజన్మ దుర్లభం
త్రాపిపుం స్త్వం శ్రుతి పారదర్శనమ్।
యస్త్వాత్మముక్తేనయతేత మూఢధీః
సహ్యాత్మహా స్వం వినిహంత్యసద్గ్రహాత్॥"

ఏదో యెన్ని జన్మలు కష్టపడ్డామో! ఇపుడు మానవజన్మ వచ్చింది ఇది శృతిపారమును దర్శించుటకు అంటే తత్త్వజ్ఞానము తెలుసుకొనుటకు యోగ్యమైంది. అట్టి ఉత్తమజన్మను పొందికూడ ఆత్మ ముక్తిమార్గములో దీనిని వినియోగించు కొనకపోతే కేవలము భౌతికమైన విషయములనే అనుకొనుచూ కాలము గడపేవాడు ఆత్మ హత్యా సదృశమైన పాపియని భాగవతము చెప్పింది. ఈ సత్యమును సర్వులు గ్రహించాలి.

ఇంక కథలోనికి దిగుదాము. విదురుడు మైత్రేయున్ని భగవంతుని అవతారములను గురించియూ సృష్టిని గురించియూ ప్రశ్నలు వేస్తాడు. భగవంతుని అవతారములోని కార్యములు ఆయనను కర్మబద్ధుని చేయజాలవు. ఆయన చేసే కార్యములు లీలలు. లీలలకు కర్మబద్ధత లేదు. మానవుడు చేసేవి కర్మలు. కర్మలు సకామములై ఉన్నంతవరకు జీవునికి జననమరణములు తప్పవు. కాని భగవంతునివి కర్మలే కాదు. కావున ఆయన ధర్మోద్ధరణకొరకు, సజ్జనులను రక్షించేందుకొరకు, దుర్జనులను శిక్షించేందు కొరకు జన్మనెత్తుతాడు. ఆయన జన్మనెత్తుటకు కారణము దుష్టుల దుర్మార్గములు, సజ్జనుల ఆర్తనాదములు. కావున భగవంతుని అవతారములలోని కర్మలు కర్మలు కావు. అవి లీలలు.

ప్రపంచములో సంతతి, సంపత్తి భగవదనుగ్రహాఫలములు కావు. ప్రారబ్ధఫలములు. భగవదనుగ్రహం పొందుతే మనశ్శుద్ధి కలుగుతుంది. మనశ్శుద్ధిలేనిదే ఈశ్వరదర్శనం కాదు. విదురుడు మైత్రేయున్ని ప్రశిస్తూన్నాడు.

"అగుణుండగు నీశ్వరునకు జగదవనోద్భవవినాశ సత్కర్మములున్ ।
దగు లీలలెట్టు లాతడు సగుణుండై యుంట ఎట్లు సౌజన్యనిధీ ॥"
2-31

స్వామీ! పరమాత్మ అగుణుడు కదా? ఆయన ప్రపంచోత్పత్తి, స్థితి వినాశములను చేయడం ఎట్లు సాధ్యము! ఆయన అసలు ఈ లీలలెందుకు చేయాలి? ఆయన సగుణుడౌట ఎట్లు? తెలుపవలసినదని వినయపూర్వకముగ ప్రశ్నించినాడు.

ఈ ప్రపంచములో ఎవరెవరిమనస్సెట్లు ఉంటుందో ఆవిధమైన మాటలు జరుగుతూంటాయి. ఇచ్చట వీరిద్దరు మహాత్ములు కావున వారికి తగిన మాటలు జరుగుతూన్నవి.

ఇంక మైత్రేయ మహర్షి సమాధానము చెప్పుచున్నాడు. "అన వర్భకుని గతి" అంటాడు. అంటే పిల్లవాడు ఆట్లాడుకొంటూ ఇల్లు అని ఇసుకతో కట్టాడు. కోట అని కట్టాడు. ఆడుకున్నంతసేపు ఆడుకొని ఆ కట్టినదంతయు కాలితో పడేసి పోతాడు. ఇది పిల్లవానివలె అంటే, మరి వానికి పరమార్థము లేదు. ఇది కర్మ కాదు. లీల.

ఇది విని విదురుడు మరల ప్రశ్న వేస్తాడు. స్వామీ! ఎక్కడ పరమాత్మ, ఎక్కడ బాలుడు? "బాలుడు క్రీడావిలోల మానస మున దీపించులీలాను రూపుడగుచు, కానిచో కామానుగతుడై రమించును నర్భకుండర్థివ స్త్వంతరమున." ఇది పిల్లవాని విషయములో ఎట్లు సరిపోతుంది? పిల్లవాడు ఆటలాడుకోవలెనను కోరికతో ఉంటాడు. ఆ కోరికతో ప్రేరేపింపబడి వస్త్వంతరముతోనైనా ఆడి తనకోరిక తీర్చుకోవడానికి ప్రయత్నం చేస్తాడు. వానిలో తీవ్రమైన కోరిక ప్రయత్నము ఇవన్నియు కనిపిస్తాయి. కాని పరమాత్ముడు నిరంతర తృప్తుడు. నివృత్త మనస్కుడు. అఖిలజగములను ఎట్లు కల్పించె? ఆయన క్రీడాదులందు సక్తుడెట్లాతాడు. త్రిగుణాత్మకమైన మాయగూడి ఎట్లు కన్పించెనో వివరముగ చెప్పగోరినాను. ఆ మాయతో పరమాత్మ ఎట్లు కలిసె? చిత్తమజ్ఞానస్థితిని పొంది ఖేదమెందుకు కలిగె? కొంచెము వివరముగ చెప్పవలసినదని ప్రార్థిస్తాడు విదురుడు.

దీనికి సమాధానముగ మైత్రేయుడు చెప్తాడు. భగవంతుడు నిర్గుణుడనే మాటను గురించి మనము కొంత తెలుసుకోవలసి యున్నది. నిర్గుణుడంటే గుణరహితుడని అర్థము. గుణము లేనివాడు. దీనిని కొంత వివరించుకోవలసి యున్నది. మనము ఏదేని వస్తువు యొక్క ఉనికి గుర్తించుటకు మనవద్ద ఏమేమి సాధనాలున్నాయి? అంటే కంటికి వస్తువు కనిపిస్తుంది. చెవికి మాట వినపడుతుంది.

మాటలు కంటికి కనిపించకపోయినా ఉన్నాయి అనునది చెవి ద్వారా తెలుసుకొంటాము. అట్లే త్వగింద్రియము ద్వారా గాలిని తెలుసుకొంటాము. ఈ విధముగ మనవద్ద పంచ జ్ఞానేంద్రియముల ద్వారా పంచ విధములైన వస్తువులను తెలుసుకొంటాము. ఇవే గుణములు. ఆ గుణములు పంచభూతముల ద్వారా కలిగినవి. ఆకాశమునకు శబ్దము గుణము. వాయువునకు స్పర్శ గుణము. అంటే వాయువునకు తన తండ్రియైన ఆకాశ గుణము శబ్దము, తన గుణము స్పర్శ రెండున్నవి. అగ్నివద్దకు వచ్చుసరికి గుణములు మూడౌతాయి, జలము వద్దకు వచ్చునప్పటికి శబ్ద, స్పర్శ, రూప, రసములను నాలుగుగుణములున్నవి. భూమివద్ద అయిదు గుణములు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములున్నవి. భూతమెట్లెట్లు స్థూలమవుతుందో ఆ విధముగ గుణములు పెరుగుతాయి. గుణములు తక్కువయ్యే కొద్దీ భూతము సూక్ష్మమవుతుంది.

ఉదాహరణకు భూమివద్ద 5 గుణములున్నవి కదా! జలము వద్దకు వస్తే నాలుగే గుణములు. అటులనే క్రమముగ ఆకాశము వద్దకు వచ్చేసరికి ఒకేగుణము శబ్దమున్నది. దానిని కూడ దాటిపోతే నిర్గుణము. "ఆత్మనః ఆకాశ స్సంభూతః ఆకాశాద్వాయుః వాయోరగ్నిః — ఇట్లు ఆత్మనుండి ఆకాశము పుట్టింది. ఆకాశము వరకే గుణముల పరిధి. భగవత్స్వరూపము దానికి కూడ ఆవలిది. కావున ఆత్మ నిర్గుణుడు. ఇంకొక వివరము. ఏమంటే! ఒక గుణముంటే ఆ వస్తువు ఇతరమైన దానితో పుట్టుతుంది. గుణమే లేకపోతే అది మరొకదానితో పుట్టదు. అది స్వయంభూః. ఆత్మ స్వయంభూః కావున నది నిర్గుణము. ఈవిధముగ భగవంతుడు నిర్గుణుడని తెలుసుకోవలెను. ఇపుడు మరొక విషయమును స్పష్టము చేసుకోవలె. గుణములు తక్కువైతే వస్తువతి విస్తారమవుతుంది. భూమికంటె జలమొక గుణము తక్కువది. కావున భూమికంటె జలము అతి విస్తారమైనది.

అట్లులనే నీటికంటె అగ్ని చాల విస్తారమైనది. అగ్ని భూతముల మధ్యలో నున్నది. దానికి క్రింద రెండు భూతములు మీాద రెండు భూతములు ఉన్నాయి. అది వ్యక్తావ్యక్తరూపములు రెండు ధరించియుంది. అంటే అగ్ని సర్వవ్యాపకము. అంతట ఉన్నది. ఒక శిష్యునికి గురువు బోధించుచు అగ్ని సర్వవ్యాపకమన్నాడు. శిష్యుడు "స్వామీ! ఈ టేబులులో కూడ అగ్ని ఉందా?" అని ప్రశ్నించినాడు. "ఉన్నది నాయనా!" అని గురువన్నాడు. అట్లైతే "వంట కానీ"అని బియ్యము గిన్నె తెచ్చి దానిపై పెట్టినాడట. అగ్ని ఉన్నది కాని అవ్యక్తముగ ఉన్నది. అది వ్యక్తమైతే అన్నమూ తయారౌతుంది. మరేమైనా కాల్చగలుగుతుంది.

అగ్నికి కేవలము శబ్ద, స్పర్శ, రూపములనే మూడు గుణాలున్నవి. అందువలన జలముకంటే అది విస్తీర్ణమైనది. వాయువుకు ఇంకొక గుణము తగ్గె. అందువలన అగ్నికంటే అతి సూక్ష్మము. ఇటులనే ఆకాశమునకు ఒకటే గుణము శబ్దము. కావున ఆకాశము తక్కిన నాలుగు భూతాలకంటే సూక్ష్మమైంది. ఆత్మ నిర్గుణమైనది. అది చెప్పరానంత విశాలమైనది. ఇచ్చటికే విషయాన్ని నిలుపుతే భావుకులైన వ్యక్తులకొక సందేహము కలుగవచ్చు. ఏమని! ఆకాశము నుండి క్రింది భూతములకు పై వాటి గుణాలు సంక్రమించినవి గదా! అటులనే ఆత్మనుండి ఆకాశము పుట్టి ఈ ప్రపంచము వ్యాపిస్తే పరమాత్మ గుణాలను తీసుకొని యీ ప్రపంచము వ్యాపించాలి కదా? అంటె ఈ ప్రపంచములో పరమాత్మగుణాలు దిగిరావాలి. మరి అవి ఏవి

ఈ విషయము జాగ్రత్తగా గమనించాలి. ప్రతివాక్యము లోను సామాన్యము, విశేషమని రెండు అంశములుంటాయి. అంటే పుస్తకము ఉన్నది, కలము ఉన్నది, అన్నచోట రెండు శబ్దాలకు రెండు అంశములున్నవి. ఇవి రెండును ఒకటి సామాన్యాంశమని,

మరొకటి విశేషాంశమని అనబడుతాయి. సామాన్యాంశమంటే అన్నిటిలోను, సామాన్యముగ ఉండే అంశము "ఉన్నది" అనునది. ఈ ఉన్నది అనే అంశము లేకుండా ఏ వాక్యముండదు. విశేషాంశ మంటే మారుతూండేదని అర్థము, పై వాక్యాలల్లో పుస్తకము, కలము అనునవి విశేషాంశాలు. ఇవి మారుతాయి. కాబట్టి విశే షాంశాలు. కాని సామాన్యాంశము మారదు. ఈ సామాన్యాంశము "అస్తి" అనిపించు కుంటుంది. వస్తువు వున్నట్లు ప్రతీది ప్రకాశిస్తుంది. కాబట్టి దీనిని భాతి అంటాము. ఇది మరొక్క శబ్దములో చైతన్యము అని చెప్పవచ్చును. ప్రపంచములోని ప్రతి వస్తువు వాటియొక్క ఉపయోగాన్ని బట్టి మానవునికి ప్రీతిగా ఉంటాయి. పులిపిల్లలు, సింహము పిల్లలు అన్నియు మానవునకు ప్రీతిగా కనిపిస్తాయి. ఇది ప్రీతి మూడవగుణము. ఈ రూపమున ప్రతివస్తువులోను అస్తి, భాతి, ప్రీతి ఈ మూడును ఉన్నాయి. ఇవియే పరమాత్మాంశాలు. వీటిని సచ్చిదానందములని చెప్పవచ్చును. ఇవి ప్రతివస్తువుకు ఆధారములు. అయితే మనకు ఇవి కనిపించవు. గోచరించవు. కాని నామము రూపములు గోచరిస్తాయి. అందువలననే శ్రుతి చెబుతుంది.

"అస్తి భాతి ప్రియం రూపం నామ చేదంశ పంచకమ్ ।
ఆద్యత్రయం బ్రహ్మరూపం జగద్రూపం తథోద్వయమ్ ॥ "

అనగా ప్రతి వస్తువులోను అయిదు లక్షణాలు కనిపిస్తాయి. అవి అస్తి, భాతి, ప్రీతి, నామము, రూపము అని వాటి పేర్లు. అయితే మొదటివి మూడు పరమాత్మ స్వరూపాలు. తరువాతవి నామము రూపము జగద్రూపములు. నామరూపములు పంచీకరణము నుండి యేర్పడిన రూపములు. నామరూపములలో పంచభూతాలు, పంచ గుణాలున్నాయి. వాటితోపాటు పరమాత్మ లక్షణాలైన అస్తి, భాతి, ప్రీతికూడ ఉన్నాయి. కాని ఇవి మనకు కనిపించవు.

సమస్తములైన నామరూపములకు ఈ మూడే ఆధారములు. అయితే ఇవి అగోచరములు. కాని బుద్ధితో నిట్లు వివేచించి తెలుసుకోవాలి.

ప్రతి వస్తువుకు మూలాధారము అస్తి భాతి ప్రీతులే. ఇట్లైనపుడు వస్తువులున్నవా? ఆధారమున్నదా? ఆధారము లేకపోతే వస్తువే లేదుకదా? ఈ రూపమున ఆధారరూపమైన పరమాత్మే ఉన్నాడు. ఆధేయరూపములు మాయామయములు. వీటికి స్వకీయమైన ఉనికి లేదు. ఇపుడు ఏది ఉన్నది? ఏది లేదు? అని నిష్కర్షగ అడుగుతే పరమాత్మయే ఉన్నది. ప్రపంచము లేదు అని చెప్పాలి. ప్రపంచము మిథ్య అన్నారు పెద్దలు. మిథ్య అంటే అత్యంతాభావమైనది కాదు. ఆకాశపుష్పము, కుందేటికొమ్ము, వంధ్యాపుత్రు డెక్కడైనా ఉంటారా? ఇవి అత్యంతాభావమైనవి. కాని ప్రపంచము అట్టిది కాదు. కనిపిస్తుంది. కాని ఉండదు. ఎండమావులయందు నీళ్ళు, స్వప్నప్రపంచము, రజ్జువునందు సర్పము ఇవి ఉన్నట్లు కనిపిస్తాయి. ఉన్నాయా? స్వప్నములో ఒక దరిద్రునికి గొప్ప ధనము చిక్కినట్లు వాడు గొప్ప ధనవంతుడైనట్లు ఆ లోకములోని ప్రజలు వానిని శ్రేష్ఠముగ సన్మానించినట్లు అనుభవము కలిగింది. కాని వాని దరిద్రము పోయినదా? వచ్చినట్టి ఈ స్వప్నము మూడుకాలముల యందును అసత్యమే. అటులనే త్రాడులో కనబడే సర్పము మూడు కాలములయందు అసత్యమే. పాముగా కనబడే సమయములో కూడ నది అసత్యమే. అటులనే ఎండమావులుకూడ. ఈ ప్రపంచము కూడ అట్టిదే. ఉన్నదేది అస్తి, భాతి, ప్రీతి స్వరూపములో పరమాత్మే ఉన్నాడు. ఆయనే దీని కాధారమైనప్పుడు ఆధారమే సత్యము. ఆధేయము సత్యమనిపించుకోదు. మనుష్యుని యథార్థస్వరూపము ఆత్మస్వరూపమే. వాని స్వభావాన్ని గురించి ఆలోచిస్తేకూడ యథార్థ తత్త్వము బోధపడుతుంది.

కావున మానవుని స్వభావమును పరికించి చూద్దాము. ఈ ప్రపంచములో ఎవరికైనా మరణమంటే ఇష్టమున్నదా ? లేదు. ఎందుకు లేదు? అంటే మనుష్యుడు తన స్వరూపముతో ఎప్పుడును చచ్చేవాడు కాదు. వాడు "అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే" అని భగవద్గీత నిష్కర్షగా చెప్పింది. అజుడు, నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడు. వాడు చంపబడే వాడు కాదు. శరీరము మాత్రము చంపబడుతుంది. వాడు తనస్వరూపముతో చచ్చేవాడు కాదు. కనుకనే చావంటే ఎవరికిని ఇష్టము లేదు.

ఒకచోట వివాహం జరుగుచున్నది. పెండ్లికుమారుడు లేచి వధువుకు తాళి గట్టేటపుడు కరెంటు తీగ వాని తలపైబడి చచ్చిపోయినాడు. ఇంతవరకు ఆనందోత్సాహాలతో ఉండిన ఆ యిల్లు ఆర్త నాదములతో నిండి పోయింది. "నాయనా! మాకిన్నారాక పోయె కదరా ఆ చావు. పెండ్లి పీటలపైన కూర్చున్న నీకు వచ్చె" అని రాగాలు తీసితీసి యేడ్వ సాగినారు. ఇంతలో బయటనుండి ఒక మహాత్ముడు పోతూ ఆ యింటిలోనికి పోయి సంగతి అంతా తెలుసుకొని "ఎవరైనా చచ్చేందుకు సిద్ధమైతే ఆ ఆయుస్సును ఇతనికి వచ్చునట్లుచేసి నేను ఈ పెండ్లికుమారున్ని బ్రతికిస్తానన్నాడట." ఎవరును ముందుకు రాలేదు. చావంటే ఎవరకిని ఇష్టము లేదు. వాడు సత్స్వరూపుడు. వాడు జ్ఞానస్వరూపుడు కాబట్టే ఒక విషయము తనకు తెలియకుండా ఉండడమిష్టము లేదు. అన్నియు తెలియవలె. ఈ కుతూహల మెందుకు? వాడు చైతన్యస్వరూపుడు కాబట్టి ఆ విధమైన స్వభావము కలిగి ఉన్నాడు. వానికి తన ఆత్మస్వరూపజ్ఞాన మనుభవమునకు వస్తే ఇంక తెలుసుకొనుట అనే జిజ్ఞాస తొలగిపోతుంది.

మరియొక్క ముఖ్యవిషయము. ఈ ప్రపంచములో ఎవరికైనా దుఃఖమిష్టము లేదు. ఎప్పటికి సుఖమే ఉండాలి. శాంతియే ఉండాలి.

ఆనందమే ఉండాలి. ఎందుకిట్టి వాంఛఉన్నది? మనుష్యుడు తన మూలస్వరూపముతో ఆనందుడు. కావున దుఃఖమంటే ఎవనికీ ఇష్టము లేదు. అందువలననే ఎవరైనా ఏడుస్తూంటే ఎందు కేడుస్తు న్నావని ప్రశ్న వేస్తాము. ఎందు కేడుస్తున్నావని ఎందుకు ప్రశ్న వేస్తాము? ఏడ్పుమానవుని స్వభావము కాదు. కావున ఆ విధముగ ప్రశ్న వేస్తాము. వారి స్వభావము ఆనందము. కావుననే ఆనందముగ నున్నవారి వద్దకు పోయి "ఎందుకు ఏడ్వడము లేదు మీరు?" అని ప్రశ్నించము.

మానవుడానంద స్వరూపుడైతే మాకు జీవితములో ఎప్పటికి ఆనందమను భవములో ఉండాలి కదా? ఆ అనుభవము మాకు కలుగుట లేదే అని అనవచ్చు. నీ స్వరూపములో నీవు ఒంటరివాడ వైతే ఆనందమున్నది. గాఢనిద్రలో నీవు దేహముతోటి, మనస్సు తోటి సంబంధము వదలుకున్నావు. నీవు ఒంటరిగా ఉన్నావు. అందు వలన అప్పటి నీ యనుభవము ఆనందము మాత్రమే. అటులనే జాగ్ర దవస్థలో కూడ నీవు కానివాటిని దేహము, ఇంద్రియములు, మనస్సు బుద్ధులను వేరుచేసి నీవు నీవుగా వుండే యోగాభ్యాసము, ధ్యానా భ్యాసము చేసి సిద్ధిని సాధిస్తే నీవు ఆనందస్వరూపుడవనే అనుభూతి కలుగుతుంది. ఆ ఆనందమే ఆత్మానందము. అదియే బ్రహ్మానందము. నీ యథార్థ స్వరూపమది. ఆ విధమైనది నీ స్వరూపమైతే, చచ్చేపుట్టే శరీరము నేననుకొని మాయలో చిక్కుపడ్డావు.

దేహేంద్రియమనోబుద్ధులు మాయా కల్పితములు. వాటికి స్వయముగా అస్తిత్వము లేదు. నీ స్వరూపము సచ్చిదానందము. అస్తి భాతి ప్రీతి అనేది. ఇపుడు సత్యవస్తువేది. ఆత్మ. అసత్యవస్తువేది ప్రపంచము - దాని రూపనామములు. లేని ప్రపంచాన్ని, సత్యము కానట్టి ప్రపంచాన్ని సత్యముగా భావించి నీ స్వరూపమును మరచి దేహము నేననుకొని దుఃఖభాజనుడవైనావు.

ఇంక విదురుడడిగిన ప్రశ్నకు మైత్రేయ మహర్షి సమాధానము వినండి. మనుష్యుని యథార్థస్వరూపము నిర్గుణము. దేహేంద్రియాదులతో సగుణము. అయితే ఈ సగుణావస్థలో కూడ ఉన్నదేది? ఆత్మస్వరూపమే లేనిదేది? దేహేంద్రియ మనోబుద్ధులు. ఈ దేహేంద్రియ మనోబుద్ధులు చంచలములు. నానావిధములైన అవస్థలను పొందుతూంటాయి. లోపలి ఆత్మ ఏ విధమైన మార్పులు లేకుండా ఏకరసంగా ఉంటుంది.

పూలమాలను పట్టుకున్నాము. మాల చాలా శోభాయమానంగా కనబడ్తూన్నది. ఆ విధముగ కనిపించుటకు కారణమేది? దారము. కాని దారము కనబడ్తుందా? కనిపించదు. కనిపించేవి పూలు. అవి ఆధేయములు. ఆధారము కనిపించదు. ఆధేయము కనిపిస్తుంది. తత్త్వశాస్త్రము ప్రకారం ఉన్నది అనే మాటకు లక్ష్యము ఆధారమే. ఆధేయములు చంచలములు. అనంతములు. పూలు అనేకము. నానావిధములైన మార్పులు గలవి. త్వరలో తమ రూపము మారిపోయేవి. కాని దారము ఒకటే. అది ఏకరసముగ ఉండేది. అయితే అది కనిపించదు. పూలనే చూచే దృష్టి మాయాదృష్టి. దారమును చూచేది తత్త్వదృష్టి.

మీరు నన్ను చూస్తూవున్నారు. దేనిని చూచుచున్నారు, ఈ శరీరాన్నే మీరు చూస్తున్నారు. దీనిలోపల అనేకములైన వస్తువులున్నాయి. కాని మీరు బయటి తొడుగైన శరీరమునే చూచి దాన్ని నా స్వరూపముగ భావించడము సబబుగాదు. లోపల జ్ఞానమున్నది. అది చైతన్యస్వరూపము. దాన్ని నేనుగా తెలుసుకోవాలి. అది లోపల వెలుపల వెలుగు రూపమున వ్యాపించియున్నది. ఇపుడు ఈ ప్రకాశము లేకుంటే ప్రపంచమే నడువదు. ఈ ప్రకాశము భగవత్స్వరూపము. ఇది సర్వవస్తువులకు లోపల వెలుపల వ్యాపించి ఉన్నది. ఈ ప్రపంచమునకు లోపల వెలుపల వ్యాపించియున్నది

పరమాత్మ స్వరూపము. కావుననే మంత్రపుష్పములో "యచ్చకించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేఽపివా అంతర్బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః" అని చెప్పబడింది. అంటే ఏది కంటితో చూస్తావో! దేనిని చెవితో వింటావో దానికి లోపల, వెలుపల ఆ పరమాత్మయే వ్యాపించియున్నాడు.

ఆ ఆత్మ స్వరూపమును దేహేంద్రియ మనోబుద్ధుల వికారము లంటలేవు. ఆత్మసర్వానికి ఆధారము. దాని ఆధారముచేతనే మనస్సు సంకల్పిస్తూంది. బుద్ధి నిశ్చయిస్తూంది. కన్ను చూస్తూంది. కాలు నడుస్తూంది. కాని వీటి వికారము లాయన నంటవు. ఎట్లా? లంకా దహనం సినిమాఉంది. లంక అంటుకుంది. లంకలోని వారందరు పెడ బొబ్బలు పెట్టి ఏడుస్తున్నారు. లంక అంతా అంటుకున్నది. పరదా అంటుకున్నదా! సినిమాకు పరదా ఆధారము కదా? ఆధారమైన పరదాను సినిమాలోని వికారాలేమియు వికృతిని కలిగించనట్లు సర్వా ధారుడైన పురుషున్ని దేహేంద్రియ మనోబుద్ధుల వికారాలు అంట జాలవు. మైత్రేయమహర్షి అంటున్నాడు.

"పురుషుడు నిద్రవో గలల బొందు సమస్త సుఖంబు లాత్మ సం
హారణ శిరోవిఖండనములాదిగ జీవునికిం బ బోధమం
దరయగ దోచుచున్న గతి నాది బరేశుడు బంధనాదులన్
బొరయక తక్కటెట్లనుచు బుద్ధిని సంశయమొందె దేనియున్"

3-238

అంటే మనుష్యుడు నిద్రబోతాడు. కలలు వస్తాయి, దానిలో ఏవేవో సుఖాలు కలుగుతాయి. అంతేకాదు తాను చచ్చినట్లు శిరస్సు నెవరో వచ్చి ఖండించినట్లు ఇవన్నియు తాను చూచుచుండి నట్లు స్వప్నాలు వస్తాయి. మేలుకుంటే ఇదంతా స్వప్నము. హుళక్కి అనుకుంటాడు. జీవునకీ యనుభవమున్నది కదా? పరమేశ్వరునికి లేకుండా ఎట్లుంటుంది? అని అంటావో ఏమో! అయన కేవిధమైన

బంధముగాని వికారముగాని కలుగదు. స్వప్నములో జీవునికి కల లోని ఫలములు అనుభవము లోనికి వస్తాయి. స్వప్నములో స్త్రీతో కలిసినట్లైతే స్ఖలనము కూడ జరుగుతుంది. ఆ స్వప్నము యథార్థము కాకపోయినను అర్థక్రియా కారిత్వములు అనుభవములో జరుగు చున్నట్లు తెలుసుకొనుచున్నాము కదా! అటులనే పరమాత్మకు కలుగవచ్చు కదా! అని అంటావేమో! అట్లు జరుగదు. జీవుడనగా అంతఃకరణములోని ఆత్మప్రతిబింబము. అంతఃకరణము, అంతఃకరణో పాధి చైతన్యము మాత్రమే, బింబము కాదు. బింబము పరమాత్మ స్వరూపము. అంతఃకరణోపాధి గల చైతన్యాంశమని చెప్పవచ్చును. భగవత్స్వరూపము ఏవిధమైన ఉపాధి లేనిది.

ఇపుడు మైత్రేయుడు పరమాత్మ కట్టి వికారములుండవని ఉదాహరణముతో చెప్పుచున్నాడు.

"లలితవిలోల నిర్మల జలప్రతి బింబిత పూర్ణచంద్రమం
డలము దదంబు చాలన విడంబన హేతువు నొందియున్ వియ
త్తలమున గంపమొందని విధంబున సర్వశరీరధర్మముల్
గలిగి రమించు నీశునకు గల్గనేరవు కర్మబంధముల్"

నీళ్ళలో ప్రతిబింబించిన చంద్రుని బింబము నీళ్ళుకదలినపుడు ఆ బింబము కూడ కదలినట్లు కనిపిస్తుంది. కాని ఆ కదలికలు అసలు బింబమునకు ఆకాశములో నున్న దానికి చెందవు. అటులనే అన్ని శరీరధర్మములు నిర్గుణమై, నిరామయమై, నిత్యశుద్ధ బుద్ధ ముక్తమైన ఆత్మకు సంబంధించవు.

కావున జీవున కవిద్యామహిమంజేసి కర్మబంధనాదికంబు సంప్రాప్తమగున్ గాని సర్వభూతాంతర్యామియైన ఈశ్వరునకు ప్రాప్తంబు గానేరదని మైత్రేయుడు స్పష్టముగ చెప్పుతాడు. జీవుడనగా అవిద్యో పాధిచే అల్పజ్ఞుడై యున్న భగవదంశము. వాడు తన ఉపాధిని

జ్ఞానముతో తొలగించుకున్నప్పుడు కేవల భగవదంశమే.
ఇట్టి ఉదాహరణనే శంకరాచార్యులెట్లు తెలిపినారో చూడండి.

"లోహేహూంతిభుగ్వ్యాప్తే లోహాంతర తాడ్యమానేపి ।
తిన్యాంతరివహ్నేః కిం స్యాన్నిర్ఘాతజం దుఃఖమ్ ॥"

ఇనుము ఎట్లుంటుంది? నల్లగా చల్లగా ఉంటుంది. అది అగ్ని సంపర్కము చేస్తే ఎట్లు మారుతుంది? ఎర్రగా, ఉష్ణముగా మారుతుంది. ఆ విధముగ ఎర్రగా, వేడిగా మారిన ఇనుమును సాగతీసేందుకొరకై సుత్తెలతో కొడ్తారు. ఆ దెబ్బ ఇనుముకా? అగ్నికా? అగ్నికి కాదు. ఇనుముకే, అయితే ఏదెబ్బ్లెప్పుడు పడుతాయి? అగ్ని సంపర్కమైనప్పుడే. అప్పుడే ఇనుము సాగుతుంది. అగ్ని సంపర్కము లేనప్పుడది సాగదు. కావున నల్లగా చల్లగా ఉండే ఇనుమును ఎవరును సుత్తితో కొట్టరు. దెబ్బలు పడడానికి అగ్నియే కారణము, కాని దెబ్బల పరిణామము దానిమీద నేమాత్రము ఉండదు.

అటులనే ఆత్మసంయోగముచేతనే జీవుని వ్యవహారము సాగేది. ఆ వ్యవహారములో కలిగే సుఖదుఃఖాలు ఆత్మను అంటవు, దీనికొక ఉదాహరణ (శ్రీ) శంకరులవారు చెప్పినదే.

'జలేశైత్యాదికంయద్వత్ జలభానుం న సంస్పృశేత్ ।
బుద్ధేః కర్మాదికం తద్వత్ చిదాభాసం న సంస్పృశేత్ ॥"

రాత్రి కమ్మరి వాడ నుండి ఒక కొత్త కుండ పెద్దది తెచ్చినావు. నిండాను నీళ్లు పోసిపెట్టినావు. తెల్లవారి సరికి నీళ్ళు మంచువలె చల్లగా నైనవి. సూర్యుడుదయించి ఆయన ప్రతిబింబము ఈ కుండలో పడినది. అయితే ఆ నీళ్ళ చల్లదనము ఆకాశములో ఉండే సూర్యున్ని చల్లబరుస్తుందా? ఆ సూర్యున్ని ఆ నీళ్ళ చల్లదనమెట్లంటుకోదో అదేవిధముగ బుద్ధీంద్రియాదుల కర్మలు చిదాభాసుడైన మూలమైన జీవస్వరూపాన్ని అంటవు. ఈ విధమైనది ఆత్మతత్త్వము.

కాని జీవునకు తన స్వరూపము తనకు తెలియక పోవడం అవిద్యా కారణం. ఆ అవిద్యయే అజ్ఞానం. అజ్ఞానం అంటే తన స్వరూపజ్ఞానం తనకు గోచరము కాక పోవడమే. ఇదియే మాయా ప్రభావము. మాయా లక్షణము అంటే ఉన్నదానిని లేనిదిగ, లేనిది ఉన్నట్లుగా భావించడమే మాయ. ఇది చాలా చిత్రమైంది. మాయా సంబంధమైన ఉదాహరణ ఒకటి యిస్తాను చూడండి.

ఒకవ్యక్తి కొంచెము మతిభ్రమణము కలవాడొక డుండినాడు. వానితో పరిహాసము చేస్తామని ఇద్దరాతని మిత్రులు వాని వద్దకు వెళ్ళి దీనముగ మాట్లాడుతూ చాలా అనర్థము జరిగెరా? అన్నారు. వాడేమిటిరా? అని ప్రశ్నించినాడు. వీరు "ఏమి చెప్పుదుమురా చెప్పడానికే నోరు రాలేదు. మీ యింటిముందునుండి మేము వచ్చితిమి, నీ భార్య మేము చూస్తూచూస్తూండగనే ముండమోసెరా" అని ఏడ్పు ముఖము పెట్టుకున్నారు. అపుడు ఆమె మొగుడైన వీడు "అయ్యో! నా ప్రియమైన భార్యా! అపుడే విధవవైతివా? ఇంకా కొన్నాళ్ళు ముత్తైదువగా ఉండజాలక పోతివా?" అని ఏడ్వ సాగినాడట. ఇదిగో! ఇట్టిదే మాయ. ఏమయ్యా! ఇంత పరిహాసముగ ఉన్నదా మానవుల బ్రతుకు? అంటే మహాత్ముల దృష్టిలో ఆ విధముగనే ఉన్నది. మానవునకు తన స్వరూప మేదో తమకు తెలియక పోతే అట్టి పిచ్చివారి లోనికే చేరిక. ఎందుకంటే దేహమే నేనని తన స్వరూపజ్ఞానమునకు వ్యతిరేకముగ జీవితము గడుపుతారు.

అయితే ఇక్కడ నొక గమనార్హమైన విషయముంది. ఈ విధమైన మాయయైనను ఎవడు భగవంతునికి భక్తుడౌతాడో వానికి ఆ మాయ అనుకూలమౌతుంది. గీతలో భగవానుడు చెప్పినాడు కదా!

'దైవీహ్యేషా గుణమయీ మమమాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే॥"

అంటే దైవీ సంబంధమైన ఈ మాయను నిర్లక్ష్యము చేసి ఆవలకు పోవుటకు వీలుకాదు. అయితే భగవంతున్నాశ్రయిస్తే దీనిని దాటవచ్చు. అయితే సీతారామాంజనేయములోని విషయము కూడా చాలా ముఖ్యమైనది. అచ్చట శ్రీరాముడు ఆంజనేయునితో చెప్తాడు.

"ప్రేమమీరంగ శ్రీరామ రామ రామ యనుచు
సతతంబు మత్స్వరూపాను భవము
జేయువారల దక్క నీ సీతమిగుల నెట్టివారల
చిక్కుల బెట్టు ననఘ."

నిరంతరము భగవదర్పిత చిత్తమై భగవంతున్ని స్మరిస్తూంటే పరవా లేదు. లేనివారిని యీ సీత అంటే మాయ చాలా చిక్కులలో పడవేస్తుంది.

ఈ ఉదాహరణలలో భగవద్భక్తుడుగా ఉంటే మాయవలన అపకారముండదని అంతమాత్రమే చెప్పబడింది. కాని శ్రీరామచంద్రుడు ఆంజనేయునికి నా భక్తునికి మాయ సహకారి యౌతుందనే విషయాన్ని చెప్తాడు. చూడండి.

"ప్రేమ చేనట్లు శ్రీరామ రామ యనుచు
నన్ను భజియించు మహాత్ములకును
మిగుల నిత్యాన పాయిని యగుచు
యోగసిద్ధి కావించు చుండు నీ శ్రీవధూటి."

చూడండి యీ యుదాహరణ సర్వాలు గమనింపదగ్గది. భగవద్భక్తులైన మహానుభావునకీ మాయ సాత్త్వికీ మాయయై యోగసిద్ధి కలిగిస్తుందట. ఇది మనకు ప్రధానముగ గుర్తింపదగినదియై యున్నది. ఇచ్చట యీ భాగవతములో కూడ విదురుడు "స్వామీ! ఇట్టి మాయ తొలగే ఉపాయము చెప్పమంటాడు. దానికి మైత్రేయ మహర్షి చెప్పిన సమాధానము.

"నరునకు నాత్మదేహజగుణంబుల బాపగ నోపు పంకజో
దర చరణారవింద మహితస్ఫుట భక్తియు నింద్రియంబు లీ
శ్వర విషయంబులైన మది సంచిత నిశ్చల తత్త్వమైన యో
సరసిజనేత్రు కీర్తనమె చాలు విపద్దశలం జయింపగన్."
3—242.

మనుష్యుని తన దేహాత్మబుద్ధిని పోగొట్టేది వాస్తవమైన భక్తియే. ఇంద్రియములన్నియు ఈశ్వర సేవలో ధృవపడుటకు భగవంతుని కీర్తన చేయడము ఉచితము. అదియే విపత్తులనుండి తొలగించే సముచిత సాధనమని పద్యార్థము.

"హరి చరణారవింద యుగళార్చన సన్నుతి భక్తియోగముల్
నిరతము గల్గువారె భవనీరజ గర్భులకందరాని భా
సురపదమందు జేరుదురు సూరిజన స్తవనీయ యట్టి స
త్పురుషుల పూర్వజన్మ ఫలమున్ గణుతింప దరంబె యేరికిన్."
3—243

నిరంతరము హరి చరణారవిందములను ప్రశంసిస్తూ భక్తియోగముతో నుండువారు బ్రహ్మాదుల కందరాని పదము చేర్తారు. అట్టివారి పూర్వ జన్మ పుణ్యమును లెక్కపెట్టుట కెవరికేని సాధ్యమా! అని భక్తిమార్గమును గురించి మైత్రేయ మహర్షి ప్రశంస చేస్తాడు.

పిమ్మట మైత్రేయ మహర్షి సృష్టిక్రమమును గురించి కూడ యీ విధముగ చెప్తాడు. మొదట ఆది అంతము శూన్యమై అవ్యయమై ఉండు పరమాత్మ తత్త్వమే ఈ ప్రపంచమునకు ఉపాదాన కారణము. ఒక కార్యము కావలెనంటే రెండు కారణాలుండాలి. ఒకటి ఉపాదాన కారణము, రెండు నిమిత్తకారణము. కంసాలి ఒక సొమ్ము చేసినాడను కొనుడు. ఆ వస్తువులో బంగారు ఉపాదాన కారణము, చేసినవాడు నిమిత్తకారణము. నిమిత్తకారణమును వదలి వస్తువుండొచ్చు. ఉపాదాన కారణాన్ని వదలి వస్తువుండజాలదు.

ఉంగిరము బంగారు లేకుండా ఉండగలదా? అట్టి ఉపాదాన కారణ విగా ప్రపంచానికి పరమాత్మయే. "సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్" అనునది శ్రుతి. మొదట సదేవ ఆ సత్స్వరూపమే ఉండినదని ఉపనిషత్తు. ఆ సత్స్వరూపానికి ఒక సంకల్పము కలిగింది. "ఏకోఽహం బహుస్యాం ప్రజాయేయేతి" అని. అంటే ప్రజాస్వరూపమున నేను పెక్కు రూపులుగానగును గాక అని. ఆ సంకల్ప మాత్రముతోనే త్రిగుణములు పుట్టినవి, పంచభూతము లుత్పన్నములైనవి. పంచభూతముల సత్త్వగుణ సంపర్కముతో జ్ఞానేంద్రియాలు – అంటే ఆకాశము వలన చెవి, వాయువువలన త్వగింద్రియము, అగ్నివలన కన్ను, జలమువలన నాలుక, భూమి వలన ముక్కు కలిగినవి. పంచభూతముల సమష్టి సృష్టివలన మనస్సు పుట్టింది, పంచజ్ఞానేంద్రియములు వ్యష్టి సృష్టులు. అంటే కన్ను వినలేదు. చెవి చూడలేదు, అవి తమకు నిర్ణయమైన పనులను మాత్రమే చేస్తాయి. కాని మనస్సు పంచభూతముల సమష్టి సృష్టి కావున చెవి ద్వారా వింటుంది. కంటి ద్వారా చూస్తుంది. పంచేంద్రియముల పనులను చేస్తుంది. ఇప్పటికి సత్త్వగుణ సృష్టియైనది.

ఇంక రజోగుణ సృష్టి ప్రారంభమైనది. పంచభూతములు రజోగుణ స్పర్శవలన పంచకర్మేంద్రియములు పుట్టినవి. అంటే ఆకాశమువలన వాక్కు, వాయువువలన చేయి, అగ్నివలన కాలు, జలము వలన గుహ్యేంద్రియము, భూమివలన గుదేంద్రియములు జన్మించినాయి. ఇక్కడ పంచభూతముల సమష్టి రజోగుణము వలన ప్రాణ వాయువు పుట్టింది.

ఇపుడు వీటి కార్యములను తెలుసుకుంటే మనకు వీటి స్వరూపాలు చక్కగ బోధపడుతాయి. ఆకాశమునకు ఇద్దరు కొడుకులు పెద్దవాడు సత్వగుణముతో పుట్టినవాడు చెవి. చిన్నవాడు రజోగుణముతో పుట్టినవాడు వాక్కు. పెద్దవాడు విషయములను లోపలికి

తీసుకొనేవాడు. చిన్నవాడు బయటకు వేసేవాడు. అంటే జ్ఞానేంద్రియ ములన్నియు విషయాలను లోపలికి తీసుకునే ద్వారాలు. కర్మేంద్రియములన్నియు వీటిని బయటకు వేసే ద్వారాలు. వాయువున కిద్దరు కొడుకులు. పెద్దవాడు చీమ పారాడుతుందని చెప్పితే చిన్నవాడు చేయిపోయి దులిపివేస్తాడు. అగ్నికిద్దరు కొడుకులు. కన్నుచూస్తుంది. కాలు అక్కడికి నడుస్తుంది. జలమున కిద్దరు కొడుకులు పెద్దవాడు నాలుక రసాన్ని తీసుకుంటాడు. చిన్నవాడు మర్మేంద్రియము. వాడు ఇంద్రియరూపమున ఆ సారమును బయటకు వేస్తాడు. భూమికిద్దరు కొడుకులు. ముక్కు గాలిని శ్వాసరూపమున తీసుకుంటుంది. మలేంద్రియము అపానవాయువు ద్వారా బయటికి వేస్తుంది. ఈ విధముగ వ్యష్టి ఇంద్రియముల జంట పని ఆటోమేటిక్‌గా చేస్తూంటుంది. ఇంక సత్వగుణ పంచభూతముల సమష్టి సృష్టియైన మనస్సు, అట్లే రజోగుణ సమష్టి సృష్టియైన ప్రాణము రెండు ఒక జంట. మనస్సు తాపత్రయపడితే శ్వాస అధికముగ ఆడుతుంది. మనస్సు ప్రశాంతిగ ఉంటే శ్వాస చిన్నగ ఆడుతుంది. అంటే అది కూడ శాంతిగ ఉంటుందని అర్థం.

ఇదంతయు సత్త్వ, రజోగుణముల సృష్టి. ఇప్పటికి మనుష్యుల సూక్ష్మశరీర సృష్టియైనది. అంటే సూక్ష్మశరీరమనగా పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణములు (ఒక ప్రాణ వాయువే ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన వాయువులని పంచ విధములుగా నైనది) అంతఃకరణము — మొత్తము పదారు ఇది సూక్ష్మశరీరము. అంతఃకరణమనుదానిని మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అని నాలుగుగా మార్చుకుంటే మొత్తం పంతొమ్మిది అవుతాయి.

ఇంక తమోగుణ సృష్టి ప్రారంభమైంది. ఈ సృష్టిలో పంచ భూతములు ఒకదానిలో నొకటి కలుసుకున్నాయి. అందువలన ఒక్కొక్క భూతానికి అయిదయిదు తత్త్వములుపుట్టినవి. ఆకాశము

వలన కామ, క్రోధ, శోక, మోహ, భయములు పుట్టినవి. వాయువు వలన చలన, వలన, ధావన, (పరుగెత్తుట) ప్రసారణ, (చాచుట) ఆకుంచనములు (ముడుచుకొనుట) పుట్టినవి. అగ్నివలన ఆకలి, దప్పి, నిద్ర, ఆలస్య, కాంతులు పుట్టినవి. జలమువలన రక్త, మూత్ర, స్వేద, (చెమట) లాలా, రేతస్సు పుట్టినవి. భూమివలన అస్థి. మాంస, నాడీ, నఖ, రోమములు పుట్టినవి. ఈ విధముగ త్రిగుణములు, పంచభూతములతో నీ బొమ్మ తయారైంది. పరమాత్మ తన అంశ ముతో హృదయస్థానమున చేరుకొని ఈ రథమునకు కదలే శక్తిని ప్రసాదించినాడు. ఈ విధముగ విదురా!

"ఆద్యంత శూన్యంబు నవ్యయంబును నగు
తత్త్వమింతకు నుపాదానమగుట
గుణ విషయములు గైకొని కాలమును
మహదాది భూతములు తన్నాశ్రయింప
కాలానురూపంబు గైకొని యీశుండు
తన లీలకై దనుదా సృజించె
కర మొప్ప నఖిలలోకమునందు దానుండు
దనలోన నఖిలంబుదనరుచుండు
గాన విశ్వంబునకు కార్యకారణములు
దాన యమ్మహాపురుషుని దనువు వలన
భాసి విశ్వంబు వెలియై ప్రభాసమొందె
మానితాచార యీ వర్తమాన సృష్టి." 3-342

భగవంతుడు తానే సర్వస్వమై తన లీలకొరకు తానే ప్రపంచ మును సృష్టించినాడు. దీనికి కార్యకారణములు తానే. లోపల వెలు పల తానే ఈ రూపముగ వ్యాపించినట్టి సృష్టి జరిగినదని మైత్రేయ మహర్షి చెబుతాడు.

సర్వేజనాః సుఖినస్సంతు.

పదునొకండవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పంద్రెండవ రోజు ఉపన్యాసము

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః॥"

"యోఽన్తః ప్రవిశ్యమమవాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిల శక్తిధరః స్వధామ్నా ।
అన్యాంశ్చ హస్తచరణ శ్రవణత్వగాదీన్
ప్రాణాన్నమో భగవతే పురుషాయతుభ్యమ్॥"

"శుక్లాం బ్రహ్మవిచార సార పరమామాద్యాంజగద్వ్యాపినీం
వీణాపుస్తకధారిణీయభయదాం జాడ్యాంధకారాపహామ్।
హస్తే స్ఫాటికమాలికాం విదధతీం పద్మాసనే సంస్థితాం
వందే తాం పరమేశ్వరీం భగవతీం బుద్ధిప్రదాం శారదామ్॥"

భక్తమహాశయులారా! భాగవతోత్తములారా!

పరమ పవిత్రమైన భాగవతా కథాశ్రవణము, ప్రాతఃకాలము లోనే ఈ విధముగ భాగవతము శ్రవణముచేయు బంగారువంటి అవకాశము మనకు లభ్యమైనది. బంగారువంటి అవకాశమని యెందు కంటారయ్యా! హాయిగా పండుకోకుండా ఇక్కడికి స్నానముచేసి రావాలె. తయారు కావలెనంటే కనీసము రోజుకంటె ఒక గంట ముందు లెయ్యాలె. నిద్ర పోగొట్టుకొని యిక్కడికి రావలసివస్తున్నది అని అంటారేమో. నిజమే గంట, గంటన్నర ముందు లేస్తేకాని

కాబట్టి గృహచ్ఛిద్రము నెల్లప్పుడు గోప్యముగ ఉంచవలెను. ముఖ్యముగ గుర్తించ వలసిన విషయమేమంటే ఇంటా బయటా సహనము ప్రేమ, పరోపకార భావముతో వ్యవహరిస్తూంటే గయ్యాళి వంటి భార్య కూడ అనుకూలవతి కావచ్చు. ఈ విధముగ గాక తీవ్రమైన కోపతాపాలకు గురియైతే ప్రారబ్ధకర్మ బాకీ పెంచుకున్నట్లౌతుంది.

ప్రారబ్ధకర్మ బాకీ పెంచుకోవడమంటే ఒక ఉదాహరణ చెప్తాను చూడండి. ఒక మెజిస్ట్రేటు ఒక నేరస్థునికి ఒక శిక్షనిచ్చినాడు. ఇరవై ఉల్లిగడ్డలైనా తిను. ఇరవై కొరడాదెబ్బలైనా తినమన్నాడు. వాడు కొరడాదెబ్బల కంటె ఉల్లిగడ్డలే తింటానని రెండు మాత్రం తిని "ఇక ఉల్లిగడ్డలు తినలేను, కొరడాదెబ్బలు కొట్టవలసినదని తలవాల్చినాడు. వీపుమీద కొట్టమని, రెండు కొరడా దెబ్బలు తినేవేళకు అది చాలా కష్టమనిపించింది. "అయ్యో! కొరడా దెబ్బలు తినలేను. ఉల్లిగడ్డలే తింటా"నని రెండు ఉల్లిగడ్డలు రెండు కొరడాదెబ్బలు. రెండు కొరడాదెబ్బలు రెండు ఉల్లిగడ్డలు. ఈ విధముగ రెండు శిక్షల ననుభవించినాడు. ఏదో ఒకటి అనుభవిస్తే సరిపోవును. వాడు రెండూ అనుభవించినాడు. మనకు ముందు చేసుకొన్న అప్పును తీర్చుకొనుటకు కష్టరూపకమైన సంఘటన మనవద్దకు వస్తే దాని ననుభవించుచూ క్రోధమునకు వశమై వాన్ని దిట్టుతూ, వీన్ని తిట్టుతూ ఈ విధముగ ప్రారబ్ధాన్ని పెంచుకొంటూన్న జనులే ఇప్పుడధికముగ కనిపించుచున్నారు. అస్సలు ప్రారబ్ధమెపుడు తీరిపోతుంది. సహనముతో ఏ మాత్రము వికృతిని పొందకుండా అనుభవించినపుడది తీరిపోతుంది. కావున సహనము పరోపకార చింతనము ఇవి రెండు చాలా ప్రధానము. ఇతరులవి తప్పులుగ కనిపించవచ్చు. కలిసిమెలిసి జీవితము గడపుటలో నీవెంట ఉండేవారివి నీకు గొప్పతప్పులుగ కనిపించవచ్చును. వాటిని క్షమించుటలో ఆత్మశక్తి పెరుగుతుంది. కోపతాపాలకు గురికారాదు.

ఈ రూపముగ క్షమ అనే కవచాన్ని ధరించి ప్రాతఃకాలముననే లేచి ఆసన, స్నాన, ధ్యానములను నెరవేర్చుకొని జీవిత రంగములోనికి ప్రవేశించండి. ఏ కార్యమైనను నిర్విఘ్నముగ నెరవేరుతుంది. భగవంతుని శక్తి అనంతము. ఆయన అనుగ్రహానికి పాత్రుడైతే అసాధ్యమనునది లేనంతటి శక్తిని భగవంతుడు ప్రసాదిస్తాడు. ఈ జీవితము ననుభవించిన వారికి మాత్రమే తెలుస్తుంది.

ఇంతేకు ఈ ప్రపంచములో నొక సత్యము గమనింపదగిన దున్నది. ఎంతవరకు మననుండి మేలు జరుగుతూంటుందో అంతవరకు మనలను గౌరవిస్తూంటారు. మననుండి ప్రయోజనము లేదని ఋజువైనప్పుడు మనలను పట్టించుకోరు. ఇది ప్రపంచములో సహజము. కాబట్టి మన మేమియు ఎదుటివారిని నిందించరాదు. మేలు చేసుకుంటూ పోతూండడమే మనము మన స్వభావముగ మార్చుకొనాలి. శంకరాచార్యులవారు కూడా దీనిని తెలిపినారు.

"యావద్విత్తో పార్జనసక్తః తావన్నిజ పరివారో రక్తః ।
పశ్చా జ్జీవతి జర్జరకాయే వార్తాంకో௨పి నపృచ్ఛతి గేహే॥"

మన మెంతవరకు ధనము సంపాదిస్తూంటామో అంతవరకు మనలను ఇంటిలోనివారు ఆదరిస్తూంటారు. ముసలితనము వచ్చి శరీరము నిర్వీర్యమైనప్పుడు ఎవరును మనలను పట్టించుకోరు. దీనిని గురించి మనము మనస్సును వికారపరచుకోరాదు.

అయినా ఒక సంగతి మాత్రము గమనింపదగినది యున్నది. ఏమంటే!

"ఆబ్రహ్మస్తంబ పర్యంతం సర్వం మాయామయం జగత్ ।
సత్యం సత్యం పున స్సత్యం హరేర్నామైవ కేవలమ్ ॥"

అంటే బ్రహ్మలోక పర్యంతం అన్నిలోకములు మాయామయములే. కాని హరినామం మాత్రం సత్యం సత్యం పునస్సత్యమైనది. కావున

భగవంతుని నామజపము, భగవంతుని ధ్యానసాధన చేసేవారు ముసలివారైనా వారు శాంతి చిత్తముతో జీవిస్తారు.

ఆ విధముగా గాక నిరంతరము కోరికలూ, భోగాలతో జీవించిన వారు ముసలివారైతే వారికి చిత్తచాంచల్యము కలిగి వదరుడు రోగమైనా కలుగుతుంది. ఎవరునూ నాతో మాట్లాడరే. నేనంత పనికి మాలిన వాడనైతినా? ఏమండ్రా! నేను బ్రతికే ఉన్నానురా? నాతో మాట్లాడండ్రా! అని ఇంటిలోని వారి నడుగుతాడు. వాళ్ళంటారు. "ఏమిటీ వదరడం. తిండి పెట్టుతున్నాము కదా! ఏదో ఇంత తిని పడి ఉండరాదా! ఎందుకీ గోల" అని వారు తిరస్కారముగ మాట్లాడు తారు.

దైవమార్గములో జీవితము గడపిన వాడు ముసలియైతే తాను ప్రశాంతంగా కూర్చొంటాడు. ఇతరులే వచ్చి "తాతా! తాతా ఏమైనా రెండు మాటలు చెప్పుతాతా!" అని ప్రాధేయ పడుతారు. ఇట్టి తాత కింత గౌరవముంటుంది. ముసలితనములో ఈ గౌరవము దేని ప్రభావము? భగవదాశ్రయ శక్తిప్రభావమది. కావున ఈ ప్రపంచములో భగవద్భక్తి అనునది మానవున కనంతశక్తిని ప్రసాదిస్తుంది. శ్రవణం మాత్రం సజ్జనుల ద్వారా తప్పక చేయాలి. ఈ మార్గములో వస్తే ఇటువంటి ఫలం. ఆ మార్గములో పోతే అటువంటి ఫలం. మరి మీరంతా ఎటువంటి జీవితము కావాలంటారో వివేచించుకోండి. ఎటువంటి ఫలము కావలెనో అటువంటి పనులు చేసి ఆ ఫలాన్ని పొందటం మానవునకే సాధ్యం. జంతువుల కిట్టి సుయోగం లేదు. అవి కేవలం ప్రారబ్ధ జన్మలు. మానవునికే ఇట్టి బంగారువంటి అవకాశం ఉన్నది. కావున చాలా హెచ్చరికగా మానవజన్మ గడపాలి. ఇంక కథలోకి వద్దాము.

నిన్న ఎంతవరకు జరిగింది భాగవత కథ? మైత్రేయుడు విదురుని ప్రశ్నలకు సమాధానాలు చెప్పినాడు. విదురున కద్భుతమైన ఆనందము కలిగింది. ఆయన ఆనందము పట్టలేక అంటున్నాడు.

“సంఛిన్నః సంశయో మహ్యం తవసూక్తాసినా విభో” 7-15
నీయొక్క ప్రబోధమనే ఖడ్గంచేత నా సంశయాలన్నియు ఛేదింప బడినాయి స్వామీ! నాకు పరమానందమైనది. నిజమే ప్రపంచములో అన్నివస్తువులు చిక్కుతాయి. కాని జ్ఞానము కావలెనంటే ప్రపంచములో చిక్కదు. పెద్దవారి వద్దకుపోయి వినయముతో వారిని ప్రశ్నిస్తే వారు చెప్పుతారు. ఆ జ్ఞానముతో జీవితం వెలుగు ననుభవిస్తుంది. ఈ విధముగ విదురు డానందపడి ఒక ప్రశ్న వేస్తాడు. స్వామీ! ఈ సృష్టి మొదట ఎవరితో ప్రారంభమైంది? అంటే మైత్రేయ మహర్షి సమాధానము చెప్పుతాడు. “విదురా! ఈ సృష్టి మొదట మనువుతో ప్రారంభమైంది. ఆయన భార్య శతరూప. వారిద్దరివలన సంతానము పెరుగుతూ మనుష్యుల సంఖ్య అధికమైంది. దుర్గుణాలు కలవారు, బలవంతులు రాక్షసులుగ పరిగణింపబడ్డారు, సద్గుణములు కలవారు దేవతలనబడ్డారు.

రాను రాను హిరణ్యాక్ష హిరణ్యకశిపులు పుట్టుతారు. వారిని భగవంతుడు అవతారమెత్తి చంపుతాడు. అంటూనే విదురుడు మహాత్మా! ఈ హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల కథ కొంత వివరంగా చెప్పండి. వారి జన్మలు రాక్షసమగుటకు కారణము సెలవివ్వ వలసినదని కోరితే మైత్రేయమహర్షి వారికథ నిట్లు ప్రారంభిస్తాడు.

విదురా! కశ్యపప్రజాపతి భార్య దితి. ఒకనాడు సంధ్యా సమయమున ఆ దితి తనను చక్కగ అలంకరించుకొని పతివద్దకు వస్తుంది. ఆయన కింకొక భార్య అదితి ఉంది. అదితికి దేవతల సంతానము పుష్కలముగ కలిగినది. దితికి సంతానవాంఛ కలిగింది. కశ్యప ప్రజాపతి అసాధారణమైన సిద్ధులుకల మహాత్ముడు. ఆ మహాత్ముని సంతానవాంఛచేత సంధ్యాసమయములో చేరవచ్చింది దితి. ఆమెకా సమయములో కామవాంఛ కూడ తీవ్రమైయుండినది. అందువలన

దితి తన భర్తవద్దకు విశేషంగా అలంకరించుకొనివచ్చి యీ విధముగ పలుకుతుంది. స్వామీ!

"గజవిభుడుద్ధతిన్ నటకంబలము న్వదళించులీల జి
త్తజుడు ప్రసూన సాయక వితానముచేత మదీయచిత్తమున్
గజిబిజి జేసి పెన్వగల గారియపెట్టగనాథ నీ పదాం
బుజముల గాన వచ్చితి ప్రభుత్వమెలర్పగ నన్ను గావవే॥ 3-451

మదించిన ఏనుగు అరటి చెట్లను పెకలించి వేయునట్లుగా మన్మథుడు తన కుసుమ బాణములచేత నా చిత్తమును గజిబిజి చేస్తున్నాడు. అందువలన నీ పాదాలనాశ్రయించి వచ్చినాను. నా కోరిక తీర్చి నన్ను రక్షించు ప్రభూ! అంటూ ప్రార్థింపసాగింది.

"అథ మే కురు కల్యాణ! కామం కంజ విలోచన।
ఆర్తోపసర్పణం భూమన్ అమోఘం హి మహీయసీ॥" 3-14-14

కల్యాణమూర్తీ! పద్మములవంటి సుందరమైన నేత్రములుకల మహానుభావా! ఆర్తురాలనై నీ వద్దకు వచ్చినాను. అమోఘమైన మహిమ కల మీరు నా వాంఛను నిష్ఫలము చేయకుందురు గాక!

ఈ విధమైన మాటలతో, కామ తీవ్రతతో కూడిన హావభావములతో మరల నిట్లంటూంది.

"కావున నీ యర్థము యాత్మావై పుత్ర యని వేదతతులం దోలన్
వావిరిపలుకగవినవే ధీవర ననుగావు మధికదీనం గరుణన్"
3-455

(దీనికర్థము సులభము)

స్వామీ! నన్ను రక్షించవలసినదని దీనయై ప్రార్థిస్తే కశ్యపుడంటాడు. ప్రేయసీ! "నీవు చెప్పిన యట్ల పురుషులకు, వంగనలవలన ధర్మార్థ కామంబులు సిద్ధించు. కర్ణధారుండు నావచేతన్ పయోధి గడచు చందంబున గృహమేధి సర్వాశ్రమవాసుల నరసి రక్షింపుచు

నిజాశ్రమంబున వ్యసనార్ణవంబు దరియించు. భార్య పురుషునందు నర్థంబు, భార్యయందు సకలగృహకార్య భారంబునుం జేర్చి పురుషుండు నిశ్చింతుండై సుఖయించుచుండు. మరియు నితరాశ్రమ దుర్జయంబులైన యింద్రియ శత్రువర్గంబుల భార్యాసమేతుండైన గృహస్థుండు దుర్గాధిపతియైన రాజు శత్రు సంఘంబుల జయించు చందంబున లీలా మాత్రంబునం జయించు. ఇట్టి కళత్రంబునకుం బ్రత్యుపకారంబు సేయ సకల గుణాభిరాములగు సత్పురుషులు నూరేండ్లకును, జన్మాంతరంబులకునైన సమర్థులు గారనిన మముబోటివారలు సేయనోపుదురే అయిన నీమనంబునం గల దుఃఖంబు దక్కుమని యిట్లనియె.'' 456

ఈ వచనములో కశ్యపుడు చెప్పిన మాటలు ఎంత ప్రభావవంతములో అంత సత్యంబులు ''స్త్రీల వలన పురుషులకు ధర్మార్థకామంబులు సిద్ధించు'' ననే మాట పరమసత్యము. ధర్మార్థ కామములు సిద్ధించవలెనంటే మానవుడు ముఖ్యముగ తనకున్న ఋణత్రయమును దూరము చేసుకోవలె. ఋణత్రయమంటె మూడుఋణాలన్నమాట. అవి ఏవి? శ్రుతి చెప్పే విధానము చూడండి —

''జాయమానో వై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవాన్ జాయతే

బ్రహ్మచర్యేణ ఋషిభ్యో, యజ్ఞేన దేవేభ్యో, ప్రజయా పితృభ్యః
ఏష దా అనృణయః పుత్రీయజ్వా బ్రహ్మచారీవాసీ (తైత్తిరీయం)

మనుష్యుడు పుట్టేటప్పుడే ఋషి ఋణము, దేవతల ఋణము, పితృ ఋణం అని మూడు ఋణాలతో పుట్టుతాడు. ఈ మూడు ప్రప్రథమమున తీర్చుకోవాలి. ఋషి ఋణము అంటే చక్కని జ్ఞాన విద్యనేర్చుకొని ఇతరులకు ప్రచారం చేయాలి. దేవతల ఋణం అంటే మనమనేక వస్తువులను జీవితములో ఆవశ్యకముగ వాడుకొనుచున్నాము భోంచేసే వస్తువుల నుండి భోగాలకుపయోగించే అనేక వస్తువులు దేవతల సహాయముతో మనకు లభిస్తూంటాయి. ఆ దేవ

తల ఋణము తీర్చుకోవాలి అంటే యజ్ఞము చేయాలి. యజ్ఞము లనేక విధములుగనున్నవి. వాటిని భగవద్గీత ఈ విధముగ పేర్కొన్నది.

"ద్రవ్యయజ్ఞా స్తపో యజ్ఞా యోగయజ్ఞా స్తథాపరే।
స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః॥"

అంటే ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము. స్వాధ్యాయ యజ్ఞము, జ్ఞానయజ్ఞము అని వివిధములుగ పేర్కొనబడ్డాయి, ఈ యజ్ఞములన్నియు మానవున్ని ఇంద్రియనిగ్రహపరున్ని చేసి సంయమనము నలవడేటట్లు చేస్తాయి. సర్వసాధారణముగ సులభముగ అర్థమయ్యేటట్లు చెప్పవలెనంటే పరోపకారమైన పని నిష్కామముగ చేయడం యజ్ఞము. మనమిట్టి యజ్ఞము చేసుకుంటూ దైవఋణాన్ని తీర్చుకోవాలి. తరువాత తగినట్టి భార్యను చేబట్టి ధర్మపూర్వకంగా సంతానాన్ని కనాలి. ఈ విధమైన కార్యములచేత ఋణత్రయము తీరిపోతుంది. కావున ధర్మార్థకామములను పొందుటలో ఋణత్రయ మును తీర్చుకొనుట ప్రధానాంశము. ఆ పని భార్యా పాణిగ్రహణము చేత సులభముగ తీరుతుంది. గృహస్థాశ్రమము అన్ని ఆశ్రమముల కంటే శ్రేష్ఠమైనది.

"కర్ణధారుండు నావచేత ..." నావ నడిపేవాడు గొప్పనదిని ఓడ సహాయముచే దాటునట్లు గృహస్థుడు తక్కిన ఆశ్రమములవారిని రక్షించుచూ కామమనే వ్యసనసముద్రమును స్త్రీ సహకారముచేత సుఖముగ దాటుతాడు. భార్య, పురుషునిలో సగము, గృహకార్యము లన్నింటిని నిర్వహించుచూంటుంది. కావున పురుషుడు ఆమె పైన భారము వేసి నిశ్చింతుడై ఉంటాడు. దుర్జయములైన ఇంద్రియాలను సులభముగ జయిస్తాడు. ఏ విధముగ కోటలోపలనున్న రాజు బయటి శత్రువులను కాల్చి చంపుతాడో ఆ విధముగ కాముడనే శత్రువును సంహారము చేస్తాడు. ఇక్కడ కశ్యపుడద్భుతమైన ఒక సత్యాన్ని

వెళ్లడించుచున్నాను. ఇటువంటి భార్యకు ప్రత్యుపకారము చేయడం సత్పురుషులైనట్టివారికి కూడ నూరేండ్లకుగాని సాధ్యము కాదు. అంతేకాకుండా జన్మాంతరంబులకుగాని సాధ్యము కాదంటాడు. తప కైతే సాధ్యమసలే కాదంటాడు.

ఈ విధముగా పలుకుచూ "ఓ దితీ! నీ కోరిక తీర్చుట నా కర్తవ్యము. కులశీల వర్తనములు కలభార్యవు నీవు. నీ కోరిక నేను తప్పకుండా తీరుస్తాను.

"తరుణీ యొక్క మహూర్తముండు మిది సంధ్యాకాల మిక్కాలమం
దరయం భూతగణావృతుండగుచు గామారాతి లీలన్ వృషే
శ్వర యానంబున సంచరించుట నభావ్యంబయ్యె నీ యుగ్రవే
ళ రమింపంగ నిషిద్ధకర్మమగునేలా ధర్మమున్ వీడగన్" 3-460

ప్రేయసీ! ఒక్క మహూర్తమాగుము. ఇది సంధ్యావేళ. ఈ సమయమున భూతగణములతో కూడుకొని వృషభముపై నెక్కి రుద్రుడు తిరిగే సమయమిది. ఈ యుగ్రవేళలో రమించుట కూడదంటాడు.

ఈ మాట దితి యేమాత్రము ఒప్పుకోదు. వేశ్యవలె ఆయన కొంగుపట్టుకొని తొందర పెట్టుతుంది. అపుడా కశ్యపుడు విధిలేక ఆమె కోరిక దీరుస్తాడు. తరువాత తాను స్నానముచేసి గాయత్రీజపము చేసుకుంటాడు. ఆ సందర్భమున దితి తాను భర్త వలదన్నను తప్పు పని చేసింది. కావున లజ్జతో తలవంచుకొని నిలిచియున్నది. ఆమె మాట్లాడుటకు సాహసింప జాలకున్నది. కాని భర్త యేమి చెప్పు తాహో వినవలెనని కాచుకున్నది. అపుడు కశ్యపుడంటాడు.

"ప్రియురాలా! నీవు వద్దన్నను వినక ఉగ్రవేళ రమిస్తివి. అందువలన నీకు దర్పోద్ధతులిద్దరు కుమారులు పుట్టుతారు. భూమికి బరువై పోతారు.

"అట్టి దుష్కర్ములకును మహాత్ములలిగి
విశ్వవిదుడైన హరికిని విన్నవింప
నతడు గోపించి హరి కులిశాయుధమున
గిరులగూల్చిన గతి వారి ధరణి గూల్చు" 3-478

ఈ విధమైన వారి బాధలకు సజ్జనులలిగి తాళజాలక భగవంతు నికి విన్నవించితే ఆయన దేవేంద్రుడు పర్వతాలను తన వజ్రాయుధ ముతో నరికినట్టుగ వారిద్దరిని నాశనము చేస్తాడు.

ఈ విషయం విని దితి విపరీతముగా దుఃఖిస్తుంది. చెడు సమ యాలలో రమించరాదు. ప్రపంచములోని జనులు కేవలము కామ మునకు బానిసలై కాలమును గుర్తించక స్త్రీలతో రమించుట వలన నేమో ఇపుడున్న ప్రజలలో అధిక సంఖ్య గలవారు చెడ్డవారుగ జీవితాలను గడపుచున్నారు. దితి యీ విధముగ దుఃఖించి తన భర్త కాళ్ళపై పడుతుంది. అపుడు కశ్యపుడు కనికరించి "వారిద్దరిలో నొకని కుమారుడు మహాభక్తుడౌతాడు" అని చెప్తాడు.

తాను మాత్రమే భగవద్భక్తి చేయువాడు సామాన్యభక్తుడు. తన ద్వారా ఇతరులకు ప్రేరణ గలిగించి వారినికూడ భక్తులనుగా చేసేవాడు మహాభక్తుడు. ప్రహ్లాదుడు ఆ విధమైన మహాభక్తుడు. ప్రపంచములో రాజశాసనముతో సమాజము మార్పు చెందదు. మహాత్ములైన వారితో మార్పు చెందుతుంది.

దేశములో అడుగడుగున పోలీసు స్టేషన్లున్నవి. ఈ సిబ్బందిపైన ప్రభుత్వానికి కోట్ల రూపాయలు ఖర్చగుచున్నవి. కాని వారివలన ప్రజలలో మార్పు వచ్చుట లేదు. మహాత్ముల మాటలవలన ప్రజలలో గొప్ప పరివర్తనము కలుగుతుంది.

సాధారణమైన మానవుడు తన శరీరమును గురించి దాని సుఖమును గురించి చేయరాని పనులు చేస్తాడు. దానికి వాని ఇంద్రి

యోల్బణము కారణము. శరీరమును గురించి దాని వాస్తవికతను గురించి ఆలోచిస్తే మానవునకు తప్పక వైరాగ్యం కలుగుతుంది. త్రోవలో పడిన ఎముకను తుచ్ఛముగ చూస్తాము. దానిని తాక వలెనంటే ఏవగించుకుంటాము. ఈ శరీరమంతా ఎముకలతో నిండి యున్నది. దీని వాస్తవికతను గురించి విచారిస్తే తప్పక వైరాగ్యము కలుగుతుంది. కాబట్టి ఈ శరీరసుఖముకొరకై చేయరాని పనులు చేయడం అవివేకం అజ్ఞానం, అని కొద్దిపాటి జిజ్ఞాసతో తెలుసుకో వచ్చు. ఈ మాత్రం గమనించుకోజాలక తుచ్ఛమైన శరీరముతో మనుష్యులు తాదాత్మ్యత చెంది ఘోరమైన కార్యాలకు పూను కుంటారు.

ఇంతకు ప్రతివ్యక్తియు తన ఇంద్రియములపై తగినంత ఆధిపత్యము కలిగియుండవలె. ఇంద్రియములపై తగినంత అధికారము లేకపోతే మనుష్యజీవితం పలువిధములైన కష్టములకు గురికావలసి వస్తుంది. ఇంద్రియోద్రేకమునకు వశురాలై దితి యెన్నివిధములైన పాపములకు గురియైనది ? వినుడు. కాలగత దోషము. అంటే కాల మును, గుర్తించకుండా మెలగింది. దేవతాపరాధకృత దోషము మరియొకటి. ఏమంటే శంకరుడు తిరిగే సమయమిది. ఆయన కోప గించుకుంటాడని కశ్యపుడు మొదటనే చెప్పినాడు. పతియొక్క ఆజ్ఞో ల్లంఘనము. ఇంకొకటి అసంయమ దోషము. పతి సంధ్య జేసు కుంటూండే సమయములో పోయి ఆయనను తొందరపెట్టడం క్షమించ రాని ఇంద్రియదౌర్బల్యం కదా ! ఇన్ని దోషాలు ఆమెకు సమకూరినవి. ఇంక ఇపుడు పశ్చాత్తాపపడితే ఏమి లాభము ? లోకులు సాధారణ ముగ భోగాలనుభవించేపుడు నవ్వుతూ అనుభవిస్తారు. దాని ఫలము అనుభవానికి వచ్చినపుడు ఏడుస్తూ ఏడుస్తూ పశ్చాత్తాపపడుతారు. ఇట్లనే జరిగింది యీమె కథ.

అక్కడ దేవలోకంలో స్వర్గంలో సనకసనందనాదులు భగ వంతుని దర్శనార్థమై వస్తారు. వారిని జయవిజయులు లోపలికి

వెంటనే పోరాదని అడ్డగిస్తారు. సనకసనందులు వారిని భూలోకములో రాక్షసులై పుట్టుదురు గాక అని శాపమిస్తారు. ఆ శాపానికి భీత చిత్తులై వారు శ్రీమన్నారాయణున్ని ఆశ్రయిస్తారు. ఆయన మహాత్ముల శాపమిది. దీనికి ప్రతిక్రియలేదు. అనుభవించవలసినదే నని వారికొక విషయం చెప్తారు. మూడు జన్మలలో నాకు విరోధులై నాచే చంపబడి మీ స్థానములకు వస్తారా? లేక ఏడు జన్మలలో నాకు భక్తులై జీవితాలు గడపి మీ స్థానములోనికి వస్తారా? ఈ రెంటిలో మీరే ఐచ్ఛికముగ నిశ్చయించుకోండి. ఈ అవకాశమును ప్రసాదిస్తున్నా" నంటాడు. అపుడు వారు మూడు జన్మలలోనే మీవద్దకు తిరిగివస్తాము. ఏడు జన్మల ఎడబాటునుసహింపజాల మంటారు. నారాయణుడు తథాస్తు అంటాడు.

దితి గర్భము ధరిస్తుంది. కాలము ననుసరించి గర్భము పెరిగి ప్రసవిస్తుంది. హిరణ్యాకశిపుడు, హిరణ్యాక్షుడు పుడ్తారు. పుట్టిన తరువాతవారు దినానికి రెండుబారెలు పెరుగుతారట. భాగవత భాష సమాధిభాష. ఇది కేవలము వాచ్యార్థమైన భాషగాదు. దీనిలో గమనించవలసిన విషయమున్నది. హిరణ్యాక్షుడు లోభి. హిరణ్యము అంటే బంగారు. దానిలో పైకన్ను గలవాడు. అంటే ఎక్కడ చూచినా ఐశ్వర్యము నాదే ననువాడు. హిరణ్యాకశిపుడంటే అహంకారము. మనుష్యునిలో లోభము, అహంకారమనునది దినదిన ప్రవర్ధమానములు అని సూచించుటకు హిరణ్యాక్ష హిరణ్యకశిపుల మాట చెప్పబడినది. మరొక్క మాటలో హిరణ్యాక్షుడు అంటే సంగ్రహ వృత్తి. హిరణ్యాకశిపుడు అంటే భోగవృత్తి.

అసలు యీ అవతారాలనే మానవ జీవితంలో కలిగే ఉద్రేకాలకు రూపకాలంకారమైన భాషగా పోల్చి చెప్పినవని కొందరి ఊహ. రావణుడు కామావతారము, శిశుపాలుడు. దంతవక్త్రుడు

వీరు క్రోధావతారము. హిరణ్యాక్ష హిరణ్యకశిపులు లోభావ
తారము.

కామమును మానవుడు తన వివేకముతో మార్చుకోవచ్చును.
అది కోపమంత ప్రమాదమైంది కాదు. అందువలన భగవంతుడు
కేవలం మానవావతారముతో రావణాసురున్ని చంపివేసినాడు. ఇంక
శిశుపాల దంతవక్త్రులను క్రోధావతారులను ద్రుంచుటకు శ్రీకృష్ణుని
అవతారమెత్తవలసి వచ్చినది. రామావతారములో ఆయన నడచు
కున్నట్లు నడచుకో, కృష్ణుడు చెప్పినట్లు నడచుకో అన్నారు పెద్దలు.
శ్రీకృష్ణావతారము దివ్యావతారము. క్రోధము కామముకంటె
తీవ్రమైనది కావున క్రోధావతారులను చంపుటకు భగవంతుడు దివ్యావ
తారము నెత్తవలసి వచ్చింది. శ్రీకృష్ణుడు జననము నుండియూ
దివ్యత్వమే ప్రకటించినాడు. ఇది అందరికి తెలిసిన విషయమే.
హిరణ్యాక్ష, హిరణ్యకశిపుల అవతారము లోభావతారము. లోభము
మానవుని ఉద్రేకాలలో తీవ్రతిమమైనది. కావున దానిని జయించడం
కష్టతరము. అందువలననే లోభావతారులను చంపుటకు రెండు అవ
తారముల నెత్తవలసి వచ్చినది.

హిరణ్యాక్షున్ని చంపుటకు వరాహావతారమెత్తినాడు. వరాహ
మంటే వర=శ్రేష్ఠమైన, అహము=అంటే దినము. శ్రేష్ఠమైన దినము
అనగా జ్ఞానప్రాప్తి సమయమని తలంచవచ్చును. లోభము అజ్ఞానానికి
చిహ్నము. జ్ఞానప్రాప్తి అజ్ఞాన నాశనమని అర్థము. అందువలననే
ఎంతవరకు వరాహము పుట్టలేదో అంతవరకే హిరణ్యాక్షుని ఉనికి.
ఆ మీదట లేదు. జ్ఞానప్రాప్తి అయ్యేవరకు అజ్ఞానముంటుంది. ఈ
సత్యమునే వరాహావతారము బోధిస్తుంది.

శ్రీశంకరాచార్యులవారంటారు. మానవులకు శరీరపుతోలును
గురించి ఎంతటి ఆసక్తి ఉన్నదో, మరి దానిని గురించి ఎన్ని రకాలుగ
వర్ణిస్తారో! ఆత్మను గురించి అంతటి ఆసక్తిగాని, మరి దానిని గురించి

వర్ణనగాని చేయరు మానవులు. నిరంతరము శరీరపు ఉద్రేకాలకు లోనగుచూ శాంతిలేని జీవన విధానములో శాంతిమార్గాన్ని వదలి తాపత్రయముతో జీవితాన్ని గడపుతూంటారు. జ్ఞానములో బుద్ధిని స్థిరము చేసుకోకుంటే జీవితంలో వైక్లబ్యమే అనుభవములోనికి వస్తుంది.

జ్ఞానములో బుద్ధిని స్థిరము చేసుకోకపోతే జీవితమంతా వ్యాకులమునకు గురి కావలసిందే. అట్లుగాక జ్ఞానమును స్థిరపరచుకోవాలంటే హిరణ్యాక్షున్ని చంపాలి. అంటే లోభమును దూరము చేసుకోవాలి ఉపనిషత్తు "త్యాగేనైకే అమృతత్వమానశుః" అని స్పష్టముగ చెప్పినది. త్యాగముచేతనే అమృతత్వము సిద్ధిస్తుంది. ఈ విధముగ అవతార తత్త్వాన్ని అర్థము చేసుకోవాలి. మానవుడు తన వివేకముచేత కామ, క్రోధ, లోభములను దూరము చేసుకోవడంలోనే వాని కల్యాణమున్నదని చెప్పటకే పద్ధతిని వ్యంగ్యరూపములో అన్నిపురాణాలు చెప్పుచున్నవి.

సదాచారముచేత జీవితము గడుపబూనినపుడు సహజముగా మానవునకు నిగ్రహము వహించవలసి వస్తుంది. కామ క్రోధాదులను వశములో పెట్టుకోవలసి వస్తుంది. తద్వారా మహాత్ముల సంపర్కము లభిస్తుంది, వారిచేత జ్ఞానప్రాప్తి అవుతుంది. యజ్ఞవరాహము జన్మించినదా హిరణ్యాక్షుడు చావవలసినదే. యజ్ఞమంటే ఏమి? మనోవాక్కాయముల ద్వారా ఏ ప్రాణికిగాని నష్టము, కష్టము కలుగకుండా జీవితమును పరోపకార పూర్వకముగ నడుపడమే యజ్ఞము. నిరంతరము మనస్సును ప్రసన్నముగ పెట్టుకొని జీవితమును త్యాగమయము చేసుకోవడం యజ్ఞం.

కొందరు కారణం లేకుండానే ఎప్పుడు విసుగుపడుతూంటారు. లేక కోపముచేత కాలుతూంటారు. అది ఆత్మఘాతుకచర్య. శ్రీముని మాణిక్యం నరసింహారావుగారి జీవితములోని సంఘటన. ఆయన

టీచరుగాక ముందు తహసీల్దారు ఆఫీసులో ఉద్యోగిగా ఉండేవారు. ఆ సెక్షను సూపరెంటెండెంటు ఎప్పుడూ విసుగుకొంటూ "కాల్బేయ్, కాల్బేయ్" అంటూండేవాడట.

ఒకనాడు ఒక కాగితమును "వచ్చింది సార్" అని శ్రీముని మాణిక్యంగారు చెప్పుతూ ఒక కాగితమును తెచ్చారంట. దానిని విని "తగలెయ్" అన్నాడట సూపరెంటెండెంటు. శ్రీ నరసింహారావుగారు అగ్గిపుల్ల గీసి కాల్చివేసినారు. అపుడా సూపరెంటు అడిగినారట "ఏమి ఆ కాగితము" అని దానికి నరసింహారావుగారు "మీరేదో మీ కూతురుకు వివాహం చెయ్యవలెనని రెండు మాసములు సెలవులడిగి యుంటిరట. దానికి సెలవు శాంక్షన్ అయివచ్చిన కాగితమది. మీరు తగలెయ్ అంటే తగిలేసినా"నన్నాడు. అపుడా సూపరెంటు విపరీతమైన వ్యాకులానికి గురియైనాడు. దీని ద్వారా ముఖ్యంగా తెలుసుకోవలసినది చాలా ఉంది. ఎప్పుడు కూడ విసుగు పడరాదు. ఓర్పుతోను ప్రసన్నముగాను నిరంతరము ఉండుట మానవుడు నేర్చుకోవాలి. సంతోషముతో లోభమును చంపాలి, వినయముతో అహంకారమును చంపాలి. ఈ విధముగ జీవితమును పవిత్రము చేసుకుంటూ భక్తి జ్ఞానములను సాధించిన లోభాహంకారములు నశిస్తాయి.

ఇదేవిధముగ భగవంతునికి పదారువేలమంది భార్యలనే విషయముకూడ. భగవంతునికి భార్యలెందరు? ఇది లెక్కించుటకు సాధ్యముకాదు. శ్రీకృష్ణున్ని హృషీకేశుడు అంటారు. హృషీకము లంటే ఇంద్రియములు. హృషీకేశుడు ఇంద్రియములకు నాథుడు. మనిషివద్ద ఇంద్రియాలెన్ని ఉన్నాయి? పంచ జ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు పంచప్రాణములు, అంతఃకరణము, మొత్తము కలుపుతే పదారు. ఇవన్నియు శ్రీకృష్ణునకు భార్యలు

కృష్ణుడంటే కర్షయతీతి కృష్ణః అని అర్థం. ఆయన ఆకర్షించేవాడు. తనవైపు అన్నింటిని ఆకర్షించేవాడు కావున హృషీకేశుడు.

ఇక్కడ పైన చెప్పినవి పదారు మాత్రమే ఉన్నాయి పదారు వేలు ఎట్లాయె? అంటే ఒక్కొక్కదాని విధానములు వేలు. ఒక నాలుక ఉన్నది. దాని రుచులెన్ని? అనంతములు అట్లే కన్నులున్నవి. వాటి రూపములెన్ని? అనంతములు. ఎక్కడ అనంతముగ ఉంటాయో అక్కడ వేయి అనుట పరిపాటి. భగవంతుని అనంతరూపమును వర్ణించేటపుడు "సహస్రశీర్షాపురుషః సహస్రాక్షస్సహస్రపాద్" అంటే ఆయనకు తలలు వేయి. కన్నులు వేయి అన్నారు. ఇవి అనంతత్వమునకు సూచికములు మాత్రమే. కావున కేవలము వేయి తలలు అయిన కన్నులు రెండువేలుండాలి. చేతులు రెండువేలుండాలి అని చెప్పవలసియుండె. కావున ఇంద్రియాలు పదారు మాత్రమే ఉండినప్పటికి వాటి యభిరుచుల, భిన్నత్వములనంతములు. కావున ఆయనకు భార్యలు పదారువేల మంది అనునది సార్థకమగుచున్నది. ఇది తాత్త్వికమైన అర్థము. ఈ విధమైన అర్థాలు మనము గమనిస్తే మన మనస్సు రమిస్తుంది. భాగవతము నిట్లు ఆయా సందర్భాలను బట్టి అర్థము చేసుకొనవలె. అస్సలు భాగవతమెప్పుడు రచింపబడినది? వేదవ్యాసులవారికి అనుభవ పరిపాకం, జ్ఞాన పరిపాకం, వయః పరిపాకం, బుద్ధి పరిపాకం కలిగిన తరువాత రచింపబడింది. దీని తరువాత మరొక్క గ్రంథాన్ని రచించలేదు వేదవ్యాసులవారు. దీని రచనకు కారణము నారదుడు. నారదునికి శిష్యులు వేదవ్యాసులవారు, ధృవుడు, ప్రహ్లాదుడు. ఈ విధముగ నారదునిచేత ప్రబోధింపబడినవాడై విఘ్నేశ్వరున్ని వ్రాతగాడుగా గైకొని లిఖింపబడినదీ భాగవతము. కావున నిది భక్తి జ్ఞానముల రసాయనము. ప్రత్యేకించి ముముక్షువునకిది కల్పవృక్షము.

అస్సలీ భాగవతము ఏ సందర్భములో నిర్మాణమైనది? మృత్యు భయ సందర్భమున నిది సంభవించినది. ప్రతి మనుష్యునకు మృత్యు భయము చాలా గొప్పది. మృత్యుభయ నివారణమార్గమేది? భగవచ్ఛరణమే. భగవంతునాశ్రయిస్తే మృత్యుభయము తొలగిపోతుంది. అందువలన నీ ప్రపంచములోని మనుష్యులకు కల్యాణకరమైన మార్గ మెప్పుడు చిక్కుతుందంటే రెండు మాటలను జ్ఞాపకము పెట్టుకున్నప్పు డన్నాడొక హిందీకవి.

"దో బాతనకో భూల్ మత్ జో చాహాత కల్యాణ్!
నారాయణ ఇక మౌత్ కో దూజై శ్రీ భగవాన్॥"

మొదటిది మృత్యుస్మరణ. మృత్యువు తనకు వస్తుంది అంటే మనుష్యుడు భయకంపితుడౌతాడు. ఆ భయము తొలగవలెనంటే భగవంతుని నామమును శ్రద్ధతో స్మరణ చెయ్యాలి. అపుడా భయము తొలగి పోతుంది.

ఒకచోట ఒక వ్యక్తికి చిన్నవయస్సులోనే మృత్యువు కలుగుతుందని చెప్పినారు. అతడింకను యౌవనమును పొందలేదు. ఈ మాట విని అతడు మహాత్ములైన వారివద్దకుపోయి వారి పాదములకు నమస్కారముచేసి తనకు మృత్యువును తొలగించవలసినదని ప్రార్థించే వాడు.

మహాత్ములు ఆ బాలుని మాటలు విని చెప్పినారు. నాయనా! నీవు మృత్యువు నుండి భయపడుచున్నావు. మృత్యువు ఎవరిని వదలదు. పుట్టినవాడు గిట్టవలసినదే. ఎవరైనా మృత్యువును తప్పించు కున్నవారున్నారా? అయితే మమ్ములను నీవాశ్రయించి నావు. మేమొక మేలు చేస్తాము నీకు. "ఏమి చేస్తారు స్వామీ?" అని యువకుడు ప్రశ్నించినాడు. వారు "నాయనా! మృత్యుభయము లేకుండా చేస్తాము. మా నుండి కలిగే ఫలితమిది" అన్నారు.

మత్యువనునది మానవునికి నిద్ర యెట్టిదో అట్టిదే. కావున మృత్యు భయము తొలగిపోతుంది భగవంతున్నాశ్రయిస్తే. కావున భగవంతుని నామస్మరణ నిరంతరము చేస్తూండాలి.

భగవంతున్నే రూపమున స్మరణ చేస్తూండిననూ సరియే. ఆయన చేత చంపబడిన వారందరు చచ్చిపోలేదు. ఉద్ధరింపబడినారు. పూతన, కంసుడు, శిశుపాలుడు, మొదలగువారు భగవంతునిచేత చంపబడలేదు. ఆయన చేత ఉద్ధరింపబడినారు. చంపబడినవారు ఉద్ధరింపబడినారనుట ఎట్లు సార్థకమౌతుంది? అంటారేమో! పరీక్షిన్మహారాజా! భగవంతుని చేత చంపబడుట అంటే అంత్యకాలముగ ఆయననే దర్శిస్తూ ప్రాణములను వదలినవారు కదా! ఆయన స్మరణవల్లనే అంత్యకాలములో మానవు డుద్ధరింపబడ్తాడు ఆయననే చూస్తూ భయముతో ఆయననే స్మరిస్తూ చచ్చినవారంతా ఉద్ధరింపబడిన వారిలోనికే చేరిరి. కావున నారదుడు రాజసూయాంతములో ధర్మ రాజుతో నిట్లంటాడు.

"కామోత్కంఠత గోపికల్ భయమునన్ కంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తి నేమునిదె చక్రింగంటి మెట్లైన ను
ద్దామధ్యాన గరిష్ఠులైన హరిజెందన్ వచ్చు ధాత్రీశ్వరా!"

"భగవంతున్ని పతిగా భావించి గోపికలు ఆ పరమాత్మున్ని పొందిరి. భయముతో కంసుడు, వైరముతో శిశుపాలుడు, మీరంతా ప్రేమతో, భక్తిచేత మేము, భగవంతున్ని కనుగొన్నాము.

పాండవుల భక్తి సఖ్యభక్తి. కావుననే శ్రీకృష్ణపరమాత్మ గుర్రాలను తోలి "పార్థసారథి" అని యూనివర్శిటీ డిగ్రీని పొంది దానితో ఆయన తృప్తిపడ్డాడట. అయ్యో! గుర్రాలను తోలి గుర్రాలను తోలేవాడని కైటిలు పొంది సంతోషపడ్డాడంటే ఏమి

దీని మహిమ! అంటే సఖ్యభక్తి. తన భక్తునికి తాను గుర్రాలు తోలేవాడని పిలిపించుకొనుటలో ఆయనకు ఆనందము. ఇది భక్తి మహిమ. భగవంతుడు తన భక్తులపై ఎంతటి ప్రేమను చూపువాడో దానికిది ఒక తార్కాణము.

ఈ రూపముగా భగవంతున్ని ఏ రూపముననైనను తీవ్రముగ స్మరించినట్లైతే పొందవచ్చు. అందువలన శ్రీశుకుల వారంటారు. "తస్మాత్కేనాప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్" ఏదో ఒక ఉపాయముచేత మనస్సును కృష్ణునియందుంచాలి. మనస్సు యేదో రూపమున భగవంతున్ని గురించి నిరంతరము చింతన చేస్తూండేట్లు అభ్యాసము చేస్తూండాలి. హిరణ్యాక్ష హిరణ్యకశిపులను భగవంతు డుద్ధరించినాడు. ఈ కథలోని స్వారస్యమును కొంత విచారిద్దాము.

దితి అంటే భేదబుద్ధి. దితి కొడుకులు దైత్యులు. అంటే రాక్షసులు. సర్వానర్థాలకు కారణమేమంటే భేదబుద్ధి. జీవితమును బాగుపరచుకొనే భగవన్మార్గములో భేదబుద్ధి ఉండరాదు. భగవద్గీతలో కూడ "సంశయాత్మా వినశ్యతి" అని సంశయాత్ముడైనవాడు నశిస్తాడని చెప్పబడినది. తాను ఒకరిని నమ్మడు. నమ్మనివానిని నమ్మించడం సాధ్యమవుతుందా? శంకరాచార్యులవారు ప్రశ్నోత్తరిలో అంటారు. "కంఠగతైరప్యసుభిః కస్యహ్యాత్మా నశక్యతే జేతుమ్" అంటే కంఠగతమైన నీళ్లలో వుండి ప్రమాణం చేసినా కూడ ఎవని మనస్సును విశ్వసింపజేయలేము?" అని ప్రశ్న. దానికి సమాధానము చూడుడు. "మూర్ఖస్య, శంకితస్య, విషాదినోవా కృతఘ్నమ్" అంటే మూర్ఖుడు, శంకాన్వితుడు, విషాదముచేత నున్నవాడు, చేసిన మేలును మరచేవాడు వీరి మనస్సులను మనము రంజింపజేయజాలమన్నాడు. ఆ విధముగ దితి భేదబుద్ధి కనుకనే భర్త మాటను పెడచెవిని బెట్టి రాక్షససంతానాన్ని కన్నది. సూక్ష్మముగ మరొక్కమాటలో చెప్పాలంటే భగవంతుని యందు సందేహము గల మనస్సు దితి. దాని నుండి కలిగేటివన్నియు అనర్థాలే.

ఈ భేదబుద్ధి ద్వారానే అహంకారము కలుగుతుంది. పెద్దకొడుకు కేటికి అహంకారమే. హిరణ్యాకశిపుడే అహంకారము. అహంకారము మానవునికి మహాశత్రువు. నీవు అటువంటివాడవు. ఇటువంటి వాడవు. నీతో సమానుడెవ్వడు ? అంటే అజ్ఞానియైన మానవునికి జోకొట్టినట్లుంటుంది. భగవంతునికి మధుసూదనుడనే పేరున్నది. మధువంటే తేనె. తేనె బలే తీపైనది. మానవుని మనస్సుకు మహాతీపైన అహంకారున్ని చంపినవాడు మధుసూదనుడు. అహంకారాన్ని చంపుతే ఎవడైనా మధుసూదనుడు కావచ్చు. అహంకారాన్ని చంపుతే మానవుడు మహాత్ముడు కావచ్చు. అహంకారముతో మానవుడు హతుడై పోతాడు. హిరణ్యాకశిపుడు చాలా కాలం ఉండలేదు.

చైనా దేశములో కన్ఫ్యూజియస్ అనే ఒక తత్త్వవేత్త ఉండినాడు అతడు చాలా వృద్ధుడై పోయినాడు. మరణమాసన్నమైనది. శిష్యులు ఆయన్ను చుట్టుముట్టి ఉన్నారు ఆ సందర్భములో నొకడు లేచి "మహాత్మా! నీవు శరీరము విడిచేసమయ మాసన్నమగుచున్నట్లుంది. ఇపుడొక సందేశాన్ని యిచ్చి వెళ్ళవలసినది" అని ప్రార్థించినాడట. దానికాయన "ఇంకను సందేశము మిగిలి ఉన్నదా ? నిరంతరము ఉపదేశించుటయందే నా జీవితము గడచిపోయినది కదా?" అన్నాడు. 'అవును స్వామీ! ఆఖరు సమయములో మీ సందేశమమూల్యముగ ఉంటుంది" అన్నాడు శిష్యుడు.

దానికాయన శిష్యున్ని దగ్గరకు పిలిచి నోరుతెరచి "ఏమి ఉన్నది ఏమిలేదు?" అని ప్రశ్నించినాడు. ముసలివాడు కాబట్టి పండ్లు లేవు. "నోటిలో పండ్లు లేవు స్వామీ! నాలుక ఉన్నది" అన్నాడు శిష్యుడు. దానికాయన మరల ప్రశ్నించినాడట. "నాలుక ముందు వచ్చినదా? పండ్లు ముందు వచ్చినవా ?" దానికి శిష్యుడు "స్వామీ! నాలుక మొదటి వచ్చింది. పండ్లు తరువాత వచ్చేవి" అన్నాడు. "తరువాత వచ్చి మొదటనే ఎందుకు పండ్లూడి పోయి

నాయి ?" అని ప్రశ్నించినాడు. దానికి శిష్యుడు సమాధానము చెప్పజాలక పోయినాడు. అపుడు గురువు "నాయనా! పండ్లు వెనుక వచ్చి ముందు పోయినాయి. నాలుక మొదట వచ్చింది. చివరివరకు ఎందుకుందంటే! అది మెత్తనిది. మనిషి కూడ మెత్తగా వినయము కలిగియుంటే నాలుగు కాలాలు బ్రతుకుతాడు. పండ్లవలె నిలుక్కొని ఉంటే త్వరగా అంతమవుతాడు." అని మర్మ సందేశము నిచ్చి అతడు కన్ను మూసినాడట. దీనిలో నెంతటి మహాత్మ్యబోధ ఉన్నదో చూడుడు!

ఈ విధముగ అహంకారము కఠినమైనది. అది వంగేది కాదు. దానిని జయించడం చాలా కష్టం. అహంకారముంటే మమకార ముంటుంది. అహం అనేది శబ్దానికి ఆది. దాని షష్ఠీ విభక్తి ప్రత్యయమే మమకారం. అహం ఉంటే మమ ఉంటుంది. అహం అంటే నేను. మమ అంటే నాది. నేను, నాది అనే వాటి సంతతయే యీ సంసారం.

ఒక ఊరు. ఆ పల్లెటూరిలో ఒక పెద్ద రైతు, ఒక చిన్న రైతు ఉండినారు. ఒకనాడు ఉదయము పెద్దరైతు ఎద్దులు, చిన్న రైతు ఎద్దులు కొండకు పోయినాయి. వాటి కేమి వచ్చిందో యేమో పోట్లాడుకున్నాయి. పెద్దరైతు ఎద్దును చిన్నరైతు ఎద్దు చంపింది. దీనితో చిన్నరైతు భయకంపితుడైనాడు. పెద్ద రైతుతో పోయి వినయమున చెప్పి సమాధాన పరుద్దాము. లేక అతడు కోపగించుకున్నట్లైతే నా బ్రతుకే యీ వూరిలో కష్టమైనదా తుందని చిన్నరైతు పెద్దరైతింటికి తొందర తొందరగా పోయి నాడు. మనస్సు తాపత్రయముతో నున్నప్పుడు వొకటి చెప్పబోయి యింకొకటి చెబుతాము. అటులనే ఆ చిన్నరైతు "రెడ్డిగారూ! రెడ్డిగారూ! చాలా అనర్థం జరిగింది రెడ్డిగారూ" అన్నాడు.

అప్పుడే టిఫిన్ చేసి బ్రేవ్ అని త్రేపుకుంటూ పెద్దరైతు టువాలతో చేతిని తుడుచుకుంటూ "ఏమి జరిగింది?" అన్నాడు. చిన్నరైతు "రెడ్డిగారూ! మీ యెద్దు మా యెద్దును పొడిచి చంపిందండీ!" అన్నాడు. అది విని "ఏమిటీ! మా యెద్దు మీ యెద్దును పొడిచి చంపిందా? ఏమి చేస్తాము? మనుషులే ఒకరి నొకరు పోట్లాడుకొని చంపుకుంటూంటే పశువుల సంగతి యేమనాలె? పోపోనాయనా!" అన్నాడు. ఈ మాటలు విని ఆ చిన్నరైతు తన పొరబాటును గమనించి "అట్లుగాదు రెడ్డిగారూ!" అన్నాడు. "మరి ఇంకెట్లు" అన్నాడు పెద్దరైతు. "కాదు రెడ్డిగారూ! మా యెద్దు మీ యెద్దును పొడిచి చంపింది రెడ్డిగారూ!" అన్నాడు. దానికి పెద్ద రైతు కోపగించుకుంటూ "ఏమేమీ! మీ యెద్దు మా యెద్దును పొడిచి చంపిందా? కళ్ళు నెన్నెత్తికి వచ్చినాయిరా? ఎవడురా? అక్కడ!" అన్నాడు. సేవకుడు వచ్చినాడు. వీన్ని ఆ స్తంభానికేసి కట్టివేయండ్రా. వేయిరూపాయలు తెచ్చియిస్తే వదలండి అన్నాడు. "లేకుంటే లేదని" ఖచ్చితంగా చెప్పినాడు. ఈ యుదాహరణ ద్వారా అహంకార మమకారముల విషయము స్పష్టమవుతుంది. తనది చంపినది అంటే వేదాంతము చెప్పినాడు ఆ పెద్దమనిషి. తనది చచ్చిందనే వేళకు ఉద్రేకములోకి వచ్చినాడు. ఈ ప్రపంచములో నాదంటే ఒక రకము. నీదంటే ఒకరకం. ఈ రెంటిని అంటే అహంకార మమకారములను నిగ్రహించడం చాలా కష్టము. దితి భేదబుద్ధి కాబట్టి దాని సంతాన మది.

ఈ అహంకారము రాత్రి చావదు. పగలు చావదు. ఇంట చావదు. బయట చావదు. పంచభూతములతో దేనితోనూ చావదు. అది అన్నింటికి గడపవంటి హృదయములో పుట్టింది. అక్కడనే అది చావాలి. ఎక్కడ సంశయోదయమైనదో అక్కడ

నివృత్తి కావాలి. సంస్కృతములో అంతరాలాపమనే ఒక గ్రంథ మున్నది. దానిలో ప్రశ్నే తగిన సమాధానమవుతుంది. కేవలము ఉచ్చారణ భేదమే కారణం. అక్షరాలను మార్చవలసిన పనిలేదు. చూడుడు. "కా శీతలవాహినీ గంగా" అంటే శీతలవాహినియైన గంగ ఎక్కడ ఉన్నది? అని ప్రశ్న యౌతుంది. దానికి సమాధాన మేమంటే "కాశీ తలవాహినీ గంగా" అంటే కాశీలో ఆ శీతల వాహిని గంగ ఉన్నది అని దాని సమాధానము. కేవలము కా అనే అక్షరాన్ని ఏకముగ ఉచ్చరిస్తే ప్రశ్న, మిగతా అక్షరాలతో కలిసి ఉచ్చరిస్తే సమాధానము అవుతుంది. కావున హృదయ ములో పుట్టిన అహంకారము దాని పక్కతతోనే తొలగి పోవలె. సమాధానము ఎవరి ద్వారా పొందాలి? పెద్దవారి ద్వారా. పెద్ద వారిని కనుగొనుట, వారి ద్వారా బోధను పొందుటకు కూడ మానవుడధికారి కావాలి. ఈ రూపమున ఈ కథలోని అంతరార్థ మును వివరించుకున్నాము. ఇంక కథలోనికి పోదాము.

హిరణ్యాక్షుడు ఈ విధముగ జన్మించి భూమిని చాపజుట్ట సాగినాడు. భగవంతుడు వరాహావతార మెత్తినాడు. హిరణ్యాక్షుణ్ణి చంపినాడు. వరాహమంటే శ్రేష్ఠమైన దినమని - అంటే జ్ఞానము కలిగిన దినమని ఇంతకు ముందు దీని అంతరార్థము చెప్పుకున్నాము. యజ్ఞవరాహము వచ్చిందా? హిరణ్యాక్షుడుండే వీలు లేదు. హిర ణ్యాక్షుడు - యజ్ఞవరాహము రెండు ఉండవు. హిరణ్యాక్షున్ని వరాహము చంపేసింది, అంటే జ్ఞానము - అజ్ఞానము, అంటే వెలుగు-చీకటి కలిసి ఉండవు. హిరణ్యాక్షుడు చస్తే వాని తల్లి, భార్య తక్కినవారు విపరీతముగ దుఃఖిస్తే హిరణ్యకశిపుడు స్మశా నములోనికి పోయి తల్లికి, మరదలికి ఆత్మోపదేశము చేస్తాడు. వాళ్ళందరితోనూ, ముఖ్యముగ తల్లిని ఉద్దేశించి చెబుతాడు. తల్లీ!

"నీరాగార నివిష్టపాంథుల క్రియన్ నిక్కంబు సంసార సం
చారుల్ వత్తురు పీడిపోదురు సదా సంగంబు లే దొక్కచో
శూరుల్ పోయెడి త్రోవ బోయెను భవత్పూనుండు తల్లీ మహా
శూరుం డాతడు తద్వియోగమునకున్ శోకింపగా నేటికిన్."
7-38

హిరణ్యాకశిపుని యీ బోధ ఎంత అద్భుతమైనదో! ఎంత సత్యమైనదో, చూడండి. నీరాగారమంటే చలివెందర. ఒకడు చలివెందర వేసి నీళ్ళు చల్లగా పెట్టి అక్కడ కొంత చల్లని నీడను పాక ద్వారా కల్పించినాడు. అక్కడ నాలుగు రోడ్లనుండి వచ్చే పోయేవారు. ఆ చలివెందరలో చల్లని నీళ్ళు దండిగా త్రాగేసరికి చెమట విపరీతముగ వస్తుంది. కావున అచ్చట కొంచెముసేపు పాకనీడలో కూర్చొని పోయేవారు. నాలుగు రోడ్లనుండి జనంవచ్చి నీరుత్రాగి కొంచెము సేపు కూర్చొనుటలో కలియుట ఎట్టిదో అట్టిదే యీ సంసారములోని జనుల కలయిక. "సంసార సంచారుల్ వత్తురు పీడిపోదురు. సదా సంగంబు లేదొక్కచో" - సంసార సంచారులంటే భార్య, బిడ్డలు, బంధువులు, బాంధవులు, వీళ్ళందరు వస్తారు. కలుస్తారు. కాని ఎల్లప్పుడు కలిసి ఉండడం మాత్రం లేదు. సదా సంగంబు లేదు అంతా ఎప్పటికి కలిసి ఉండరు. ఎవరి దారి వారికి ఉంది. కొంత సేపుండి అంతా పోయేవారే. ఎంతటి తాత్త్వికమైన అర్థమును బోధించినాడో చూడుడు! ఎంత ఓదార్చినను వానితల్లి, మరదలు, మిగతావారందరు వారిశోకము నాపుకొనజాలక గట్టిగా ఏడుస్తూంటారు. అపుడు సుయజ్ఞోపాఖ్యానమనే ఒక కథను చెప్తాడు. ఉశీనర దేశపురాజు కాలముచేసి చస్తే భార్యబిడ్డలు విపరీతముగా ఏడుస్తూన్నారు. సాయంసమయమైనది. వారు ఏడ్పు మాని ఇంటికి పోవడం లేదు. అపుడు యముడు బాలకుని వేషము వేసుకొనివచ్చి వారి కాత్మబోధ చేస్తాడు. ఆయన వారితో అంటాడు.

"మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహి పుట్టుచున్
చచ్చుచు నుంట జూచెదరు చావక మానెడివారి భంగి నీ
చచ్చిన వారికేడ్చెదరు చావున కొల్లక డాగవచ్చునే
యెచ్చట బుట్టె నచ్చటికి నేగుట నైజము ప్రాణికోటికిన్."7-46

చోద్యమంటే విస్మయము. దేహిపుట్టుచున్ చచ్చుచు నుంట చూస్తారు. కాని తాము మాత్రము చచ్చేవారము కామనుకుంటారు. ఇది మాయ. ఒక పర్యాయము దేవలోకమునకు నారదుడు వెళ్ళినాడట. దేవేంద్రుడు భూలోకములోని విశేషాలేమి నారదా? అని అడిగినాడట. దానికి నారదుడుఏమి జెప్పెదు దేవేంద్రా! చచ్చేవారు చచ్చిపోయిన వారిని గురించి చచ్చిపోతివా అని యేడ్చుచున్నారు. "ఇది విశేషమన్నాడట." ఏడ్చేవాడు చచ్చేవాడే. ఈ దినం వాని వంతు, రేపు నా వంతు అని అనుకోరు. ఇది మాయాప్రభావము. చావును తప్పించుకొనుటకు ఎవరికైనా సాధ్యమా! ఎవరికిని సాధ్యము కాదు. కాని నాకు కాదులే, నాకు జరుగదులే అనుకుంటాడట మానవుడు. మరి చావు వానికి లేదా! దానిని గురించి హెచ్చరిక పడవద్దా?

ఒక వీధిలో చివరి యింటిలో దొంగలు దోచుకొని పోయినారు. మరుదినమునుండి ఆ వీధిలోని వారు పండుకునేటపుడు దొడ్డిలోని వాకిలి సరిగా వేసినామా లేదా? లోపలి వాకిలి సరిగా వేసినామా? అని మాటిమాటికి గడెలను చూచి పండుకుంటారు గదా? ఆ మాదిరి యమధర్మరాజు ఒక్కొక్కనిని తీసుకొని పోతూంటే హెచ్చరిక పడవద్దామరి? హెచ్చరిక పడాలి. ఈ దినం వానినెత్తుకపోయె. రేపు నన్నుకూడ ఎత్తుక పోవచ్చు. చావునుండి తప్పించుకొనుటకు ఎవనికి సాధ్యముకాదు. అందరికి అది తప్పదు. అచ్చటకి నేగుట నైజము ప్రాణికోటికిన్. ఇది ఒక నగ్న సత్యము. ఎక్కడి నుండి వచ్చినామో అచ్చటికి పోతాము. ఉదాహరణకు నేను

మాయింటినుండి వచ్చినాను. మీరేదో గొప్పగా ఆదరించు చున్నారు. నేనిక్కడనే ఉంటానా? ఉండను. మా యింటినుండి వచ్చిన నేను మా యిల్లు చేరుకొనియే శాంతి పడుతాను. అంతవరకు నాకు తృప్తి ఉండదు.

ఎచ్చటినుండి మన మందరము వచ్చినాము? ఏది మన స్వస్థలము? మన స్వస్థలానికి పోయేవరకు మనకు శాంతి ఉండదు. ఈ లోకము మన స్వస్థలము కాదు. ఒకవేళ ఇదే మన స్వస్థలమైతే దీనిని వదలిపోయే ప్రసక్తియే లేదు. స్వస్థలము కాదు కాబట్టే దీనిని వదలి పోవలసి వస్తుంది. మన స్వస్థలమేది? "యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ప్రయంత్యభిసంవిశంతీతి తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి" మనము ఎచ్చటి నుండి వచ్చినామో, దేనిచేత పెరుగుచు వికసించుచున్నామో! దేనియందు లయం కావలెనో అది మనచోటు. దీనినే బ్రహ్మ అన్నారు.

ప్రపంచములో ఎవరైనా మనము ఎక్కడి నుండి వచ్చినా వంటే సమాధానము చెప్పనివాడు కాని ఎక్కడినుండి వచ్చినానో తెలియదు నాకంటే గాని అట్టివానిని పిచ్చివానినిగా చూస్తామా? లేదా? ఇచ్చటకూడ నీ వెచ్చటినుండి వచ్చినావు? అని శ్రుతి అడుగుతూంది. చిత్రమేమంటే మనస్వస్థల మేదో మనకు తెలియదు. అట్టి స్థితిలో మనము మన స్వరూపము తెలుసుకోజాలనంత కాలము మనము పిచ్చివారమే. మన స్వస్థానమును తెలుసుకొనక పోవడం, ఆ విధంగా తెలుసుకొనుటకు కించిన్మాత్రమేని ప్రయత్నం చేయని వాడు వ్యర్థజీవనుడే కదా? ఇపుడు మనము చేయవలసిన ప్రప్రథమ కర్తవ్యము మన స్వస్థానాన్ని గురించి తెలుసుకోవలె. ఈ ప్రపంచ మంతా waiting room తో సమానమే. ఈ వెయిటింగ్ రూములో ఎల్లకాలముండుటకు వీలుపడదు. రైలు వచ్చేవరకు మాత్రమే

ఉండుటకు పర్మిషన్. రైలు వస్తూనే ఎక్కిపోవలసినదే. ఈ వెయి టింగ్ రూములో ఎల్లకాలము ఉండేవాడవు కావు. ఇది నీయిల్లుగా భావించుకోవద్దు. అందువలన శ్రీ శంకరాచార్యుల వారంటారు:—

"దైవా త్ప్రాప్తం గతం యం కించిద్విషయ మాద్యమల్పం వా।
నోతుష్యన్నచ సీదన్ వీక్ష్య గృహేష్వతిథివ న్నివసేత్॥"

విధివలన ఏకించిత్తైనా అధికమైనదైనా వస్తువు పోనీ ఉండనీ. నీవు పొంగక క్రుంగక నీ యింటిలో అతిథివలె ఉండు. ఎన్నో వస్తువులు నీ వనుకున్నవి వస్తాయి, పోతాయి. కాని నీవు సంతోషించవద్దు. విషాదపడవద్దు.

నీ వద్ద నున్న వాటిని వస్తువులను కాని ధనమును కాని సజ్జనులకు సత్కార్యాలకు ఖర్చుపెట్టుకో. ఈ ప్రపంచములోని వస్తువేదియు నీది కాదు. కావున ఉండినను పోయినను నీవు దానిపై మమకారము పెట్టుకోవద్దు. నీ యింటిలో నీవు ఈ విధమైన వివేకము కలిగి వస్తువులను చూస్తూ అతిథిమాదిరి ఉండు. ఆ వస్తువులు నీవి కావు. నీవు యజమానుడవు కావు. కావున దుఃఖించవద్దు. నిరంతరము ప్రసన్నముగ, ఆనందముగ, తృప్తిగ ఉండు.

ఒక ధనికుని యింటిలో సోఫా ఉండింది. ఒక సన్న్యాసి వచ్చి పండుకుందామని గుడ్డతీసుకొని సోఫాను దులుపుకుంటూఉండినాడు. ఆ యింటి యజమాని వచ్చి చూచి "ఏమయ్యా! ఏమట్ల దులుపుతున్నావు?" అన్నాడు. ఆ సన్న్యాసి కొంచెము పండుకుందామని నాయనా!" అన్నాడు. "ఇదేమి సత్రమా" అని యజమాని అన్నాడు. "సత్రమంటే ఎట్టిది నాయనా!" అని సన్న్యాసి అడిగినాడు. "అంటే వచ్చినవాడు వచ్చినట్లే పోయినవాడు పోయినట్లే." అన్నాడా ధనికుడు. దానిని విని ఆ సన్న్యాసి నీవుండక ముందు ఎవరుండిరి?" అని ప్రశ్నించినాడు. "మా తండ్రిగారు." "అంత

కంటే ముందో" "వారి తండ్రిగారు" "మరి యిది సత్రము నంటిది గానే ఉన్నదే! వచ్చినవాడు వచ్చినట్లే. పోయేవాడు పోయినట్లే. మరి ఇది సత్రము గాక మరేమిటి?" అన్నాడు. యథార్థములో చూస్తే యీ ప్రపంచ మొక సత్రము. దీనిలో ఎవనికీ స్వాతంత్రత లేదు. అట్టిది ప్రపంచము. అంటే స్వామీ! ఎందుకు యీ జీవులను పుట్టించి పెంచి లయము చేస్తావు? మమ్మల నెందుకిట్లు కష్ట పెడతావు! అంటే "ఇమం ప్రాప్య భజస్వమామ్" అన్నాడు భగవంతుడు. దీనిని పొందియే నన్ను చేరగలవు. నన్ను చేరు కొనుటకు ఇదియే దారి. నీకు యీ జన్మను ప్రసాదించినాను. నన్ను చేరుకో. ఇచ్చట ఏదియు శాశ్వతము కాదు. వ్యక్తి, పదవి ప్రతిష్ఠ ఇవన్నియు క్షణక్షణము మార్పుజెందేవే. అసలు జగత్తంటే మారి మారి పోయేదని అర్థం. ఈ విధముగ మారి మారి పోయేదైనా మానవుడు భగవంతున్ని చేరవలసియుంటే వానికి యీ మానవ జన్మే మోక్ష ద్వారం. దీనిలో ఆ గొప్పతనం ఉన్నది.

"ఎవ్వడు సృజించు బ్రాణుల నెవ్వడు
రక్షించు ద్రుంచు నెవ్వడనంతుం
డెవ్వడు విభుడెవ్వడు వాడిట్టిధయున
మనుచు బెనుచు హేలారతుడై." 7-48

ఈ ప్రపంచములోని ప్రజలను ఎవ్వడు పుట్టిస్తాడో వాడే రక్షిస్తాడు. వాడే తనలోనికి తీసుకొంటాడు. దీనిని గురించి మానవుడు భయపడ నవసరము లేదు. మనిషి భయముతో బయటకు పోతే యేమో! రాత్రిపూట ఎక్కడైనా ఏదేని ప్రమాదం వస్తుందో నని భయపడవలసిన పని లేదు. ఏ పూట కేది జరుగవలెనో అదే విధముగ జరుగుతుంది, మన చేతిలో యేమియు లేదు.

"ధనము వీథిబడిన దైవవశంబున
నుండు పోవు మూలనున్ననైన
అడవి రక్షలేని యబలుండు వర్ధిల్లు
రక్షితుండు మందిరమున జచ్చు." 7-49

దైవవశముచేత కూడ వీధిబడిని ధనము మరల మన కందుతుంది. మూలన ఎంతో శ్రద్ధగా కాపాడుచుండిన ధనము కూడ పోతుంది. అడవిలో ఏలాటి రక్షణలేని పిల్లవాడు పెరిగి పెద్దవాడౌతాడు. రక్షితుడు డాక్టర్లతో చికిత్స పొందుతూండినను బ్రతకడు. అంతా భగవంతుని లీల.

శ్రీ కృష్ణ గోవింద హరేమురారే హేనాథ నారాయణ వాసుదేవ.

ఓం సర్వేవై సుఖనస్సంతు.

పంద్రెండవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదుమూడవ రోజు ఉపన్యాసము

ప్రార్థన.

"నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరన్ పనిసేయు హస్తయుగమున్ నీ మూర్తిపై చూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపై చిత్తమున్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా." 10-406

"హరి భక్తులతో మాటలు ధర నెన్నడు
తరగనట్టి ధనముల మూటల్
వరముక్తి కాంత తేటలు అరిషడ్వర్గంబు
జొరనియరుదగు కోటల్."

భక్తశిఖామణులారా! భాగవత శ్రవణ పరిపూత మనస్కులారా!

ఈ ప్రపంచములో మానవజన్మ సర్వశ్రేష్ఠమని అడుగడుగునా తెలుస్తూండినను దీని గొప్పతనమును గుర్తించక పోతే, దీనితో పొందవలసిన ప్రయోజనాన్ని పొందకపోతే తప్పెవరిది? మనదే. దానికి పలువిధములైన పరితాపపడడమే మిగులుతుంది. భాగవత మంటుంది.

"లబ్ధ్వా సుదుర్లభమిదం బహుసంభవాంతే
మానుష్యమర్థద మనిత్యమపీహ ధీరః।
తూర్ణం యతేత న పతేదనుమృత్యు యావ
న్నిఃశ్రేయ సాయ విషయః ఖలు సర్వతః స్యాత్॥"

అనేక జన్మలు గడచిన పిమ్మట యీ సుదుర్లభమైన మానవ జన్మ లభించింది. ఈ సత్యం తెలుసుకొని ధీరుడై మానవుడు తన యావచ్ఛక్తిని వినియోగించి ధన్యుడు కావాలి. ఈ మనుష్య జన్మ చివరిది. వచ్చింది. ఐతే ఎటువంటిదిది? అర్థదం. అర్థదం అంటే అర్థము నిచ్చునది అని అర్థము. అర్థమంటే ఏమి? అర్థమంటే ధన మని సర్వసామాన్యముగ తెలిసిన అర్థం. కాని ఇచ్చట ఆ యర్థ మన్వయము కాదు. మానవునికి పురుషార్థములు నాలుగున్నవి. అవే ధర్మ, అర్థ, కామ, మోక్షములు వీటిలో ధర్మార్థ కామములు గౌణపురుషార్థములు. మోక్షము ప్రధాన పురుషార్థము. ఈ విధ ముగ గౌణపురుషార్థములను, ప్రధానపురుషార్థములను ప్రసాదించే దని అర్థము. ఈ విధమైన పురుషార్థములను ప్రసాదించేదైనను ఇది అనిత్యమైనది. ఈ ప్రపంచములో పుట్టిన వాడెల్ల గిట్టవలసిందే. ఈ సిద్ధాంతము పైన ఎర్ర గీ రెగేసిన మొనగాడొకడు లేడు. అందరు చావవలసినదే. అందువలన మనుష్యుడు ధీరుడై పూర్తిగ ప్రయత్నించవలె. ఎంతవరకు మృత్యువు రాదో అంతవరకు — మృత్యువు వచ్చేలోపలనే శ్రేయః ప్రాప్తిని పొందవలె. విషయము లలో మామూలు మానవుడు భోగాపేక్షతో కాలమును పోగొట్టు కుంటాడు. ఆ విధముగ కాకుండా విషయములవైపు ఆకర్షితుడు కాకుండా శ్రేయః ప్రాప్తికొరకై మోక్షప్రాప్తికొరకై ప్రయత్నిం చాలె. సర్వత్ర విషయము లుంటాయి. కాని యీ జ్ఞానము సర్వత్ర లభ్యమయ్యేది కాదు. విషయములు పశుజన్మలకు కూడ ఉంటాయి. మనుష్యుడై పుట్టింది విషయాలలో నిమగ్నుడై నిమ్న మైన జీవితము గడపేందుకు కాదు. అందువలన భాగవతములో మరల నిట్లు చెప్పబడింది.

"లబ్ధ్వా కథంచి న్నర జన్మ దుర్లభమ్,
తత్రాపి పుంస్త్వం శ్రుతి పారదర్శనమ్।

యస్త్వాత్మముక్తౌ నయతేత మూఢధీః,
సహ్యాత్మహా స్వం వినిహంత్య సద్గ్రిహాత్ ॥ ”

ఏదో విధముగ నరజన్మ పొందినావు నాయనా! ఇది దుర్లభమైనది. అందులోను పుంస్త్వం అంటే పౌరుషశక్తి కలది. లౌకికమైన స్త్రీ పురుషభేద మిచ్చట చెప్పలేదు. శరీరమనేది పురం. పురములో ఉండేవాడు పురుషుడు. ఈ మానవజన్మకు పౌరుషశక్తిని భగవంతుడు ప్రదానము చేసినాడు. దానిచేత వీనికి కర్మాధికారం ప్రదత్తం చేయబడినది. కావున పౌరుషశక్తిని కలిగియున్నావు. శ్రుతి పారమును దర్శించే యోగ్యత కలిగిన జన్మయిది. ఇంతటి మహోత్కృష్టమైన జన్మను పొంది కూడ యెవడైతే దీనిని- ఈ మానవ జన్మను ఆత్మ ముక్తియందు వినియోగించడో వాడు ఆత్మహంత్యా సదృశుడు. అంటే ఆత్మహత్య చేసుకొనేవాడు. అంటే అంత పాపియౌతాడన్నమాట. కావున దీనిని శ్రేయః ప్రాప్తి మార్గములో వినియోగించాలి. అట్టివాడే సార్థకజీవి. అట్టి మార్గమును చక్కగ చూపించి జీవితమును కల్యాణకరముగా చేసుకొనే మహాద్భాగ్యము భాగవత శ్రవణము ద్వారా లభ్యమవుతుంది.

భగవంతుని అపారమైన కరుణ ద్వారా మనకీ యవకాశము లభించింది. కాబట్టి ఆయనకు అనంత అనంతములైన ప్రణామములను చెల్లించి కార్యక్రమమునకు ఉపక్రమిస్తాము.

గడచిన దినము మనమెంతవరకు చెప్పుకున్నాము? హిరణ్యకశిపుడు తన తల్లికి, మరదలుకు, తక్కిన వారికి ఓదార్పు చెప్పుచున్నాడు. అతడు ఎంతెంత వేదాంతము చెబుతాడో ఆశ్చర్యము గొలుపుతుంది.

"పాంచభౌతికమైన భవనంబు దేహంబు
పురుషుండు దీనిలో పూర్వకర్మ
వశమున నొకవేళ వర్తించు దీపించు
తరిమైన నొకవేళ తలగిపోవు
చెడునేని దేహంబు చెడుగాని పురుషుండు
చెడడాతనికి నింత చేటులేదు
పురుషునికిని దేహపుంజమునకు వేరుగాని
యేకత్వంబు గానరాదు
దారువుల వెలుంగు దహనుని కైవడి
గాయముల జరించు గాలిభంగి
నాళలీనమైన నభము చాడ్పున వేరు
దెలియవలయు దేహి దేహములకు." 7-51

ఈ దేహము పాంచభౌతికమైనది. పంచ పంచ అంటే 25 తత్త్వములతో ఏర్పడినది. దీనిలో పురుషుడు తన పూర్వజన్మవశమున కొంత కాలముంటాడు. అది పూర్వకర్మ వశమున లభ్యమైంది. ఇటువంటి శరీరం, ఇటువంటి బుద్ధి, ఇటువంటి తల్లిదండ్రులు, వివిధములైన బంధువులు వీరందరు ఋణానుబంధముతో అంటే పోయిన జన్మలో చేసుకున్న కర్మ కొద్ది లభించినారు. మరల ఇపుడు చేసుకుంటూండే కర్మవలన మరల వచ్చే శరీరము నిర్మాణమవుతూంటుంది. దీనిలో ఆయన దీపిస్తాడు. వయస్సు తీరుతే దీనిని వదలిపోతాడు. చెడేది దేహమే కాని పురుషుడు చెడేది లేదు. పురుషునికి, దేహానికి ఏకత్వము లేదు. అతడు వేరు. శరీరము వేరు. దారువులంటే చెట్లలో అగ్ని ఉంది. గాయములలో గాలి తిరిగినట్లు అతడు తామర తూడులోని ఆకాశమువలె దేహముకంటే దేహి భిన్నుడై వుంటాడు.

ప్రపంచములో తల్లిదండ్రి, స్నేహితులు, బంధువులు వీరందరు కలలో వచ్చిన వారివలె వస్తారు. పోతారు. కల ఎవనికైనా సత్యమవుతుందా? ఇదంతయు మాయా భ్రాంతి. అశాశ్వతములను ప్రత్యక్షముగ అందరిని చూస్తాడు మానవుడు. కాని వాటిపై సత్యత్వపు భ్రాంతిని పొందుతాడు. ఈ ప్రపంచము మాయామయము. కనిపించేదంతయు నశించే దేనను సత్యమెరింగిన మహాత్ములు నిత్యానిత్యంబుల నెరింగి సుఖదుఃఖములనే ద్వంద్వములచే చలించరు.

కావున ఓ అమ్మలారా! మీరు కూడ రేపో ఎల్లుండో ఇదే గతిని పొందుతారు. చచ్చి భూమిపై బడ్డ రాజుకొరకై ఏడ్చుట మానండి. శరీర మెప్పటికైనా చచ్చేది దాని స్వభావము, చచ్చిన వారివద్ద ఎంత ఏడ్చినను లాభము లేదు. వారు తిరిగి వచ్చుట అసంభవము. అని యీ విధముగ కపట బాలకుడైన యముని బోధలు విని ఆ రాజు భార్యబిడ్డలు లేచి పోయినారని హిరణ్యాకశిపుడు చెప్పితే వానితల్లి, మరదలు అందరు వివేకమును పొంది తిరిగివస్తారు.

వివేకమును కోల్పోయి మమకారముతో దుఃఖించుచున్న వారికి కొన్ని సాంత్వనమైన మాటలు అద్భుతమైన ప్రయోజనమును కలిగిస్తాయి. ఈ బోధవలన శ్రోతకు ధైర్యము, వివేకము కలుగుతుంది. ఈ రూపమున తల్లి మొదలగు వారి దుఃఖము దూరమైపోయినది. అందరు ఇంటికి వస్తారు. వచ్చిన పిమ్మట హిరణ్యాకశిపుడు ఒక సమావేశ మేర్పాటు చేస్తాడు. అందరు సమావేశమైన సభలో "నా తమ్ముడైన హిరణ్యాక్షున్ని చంపిన వానిపై పగ తీర్చుకోవాలి. వాన్ని నేను సంహారము చేస్తాననియు, అందరు తనకు సహకరించవలెనని చెప్తాడు.

'హిరణ్యకశిపూ రాజన్ అజేయ మజరామరమ్ ।
ఆత్మాన మప్రతి ద్వంద్వం ఏక రాజం వ్యధిత్సత॥''

ఆ హిరణ్యకశిపుడు అజేయము, జరామరణములు లేనట్టి స్థితిని, ప్రతిద్వంద్వుడు లేనంత ఏక రాజత్వమును పొందవలెనని తలంచినాడు

ఈ విధముగ తలంచి దీనిని పొందుటకు తపస్సే సరియైన సాధనమని భావించి తపస్సుకు పోవుటకు నిశ్చయించుకుంటాడు. మందరపర్వతముపైకి పోవుటకు ప్రయాణమవుతాడు. వాని భార్య లీలావతి అడుగుతుంది. ''నాధా! ఎక్కడికి ప్రయాణమై పోవు చున్నారు?''. హిరణ్యకశిపు డంటాడు ''అనన్య సామాన్యమైనట్టి నారాయణుడనే వాడున్నాడు కదా! మా తమ్ముణ్ని చంపినవాడు. వాణ్ని జయించే శక్తిని సంపాదించుకొని వస్తాను.'' అని వాడు ఇంటినుండి బయలుదేరి వెళ్ళుతాడు.

ఇపుడిక్కడ చెప్పే సంఘటన విష్ణుపురాణములోనిది. వాడు తపస్సుకు వెళ్ళుచుండగా దేవేంద్రుడు బృహస్పతిని హిరణ్యకశిపుని తపస్సు విఘ్నము చేయవలసినదిగా ప్రార్థిస్తాడు. దానికి బృహస్పతి సమ్మతించి వాత్సల్యదృష్టితో వెళ్ళుతాడు. ఏ చెట్టుక్రింద వాడు తపస్సుకు కూర్చుంటాడో ఆ చెట్టుమీద బృహస్పతి చిలుక రూప ముతో ''నారాయణ నారాయణ'' అని అంటూండడం మొదలు పెట్టుతాడు. దానిని విని హిరణ్యకశిపుడు అపశకునముగ భావిస్తాడు. శుభమా! అని తపస్సుకు నేను వస్తే ఈ దుష్టశబ్దముతో అపశకు నము కలిగెనని వెనక్కు వస్తాడు. చూడండి, నారాయణ శబ్దము వానికి అపశకునమైనది. వాడు ఇంటికి వస్తూనే లీలావతి అడిగింది. ''నాధా! మీ రెందుకు ఇంత తొందరగా తిరిగి వచ్చితిరి. మీరింత వరకు మీ జీవితములో నెప్పుడు ఏ కార్యమును గాని సాధించియే వచ్చేవారు. ఇపుడే నాతో చెప్పిపోయిన కార్యమును సాధన చేయ

కుండానే వచ్చితిరి. ఏమిటిది? నాకు ఆశ్చర్యముగ నున్నదే' అని అడిగింది. దానికి హిరణ్యాకశిపు డంటాడు.

"ఏమి చేయుదునే! నేను వెళ్ళి తపస్సుకు ఏ చెట్టుక్రింద కూర్చుంటినో ఆ చెట్టుమీద ఒక చిలుక నారాయణా, నారాయణా, నారాయణా అని అనడము మొదలు పెట్టింది. దానిని అపశకునముగ భావించి నేను తిరిగి వచ్చితిని. రేపు మరల పోతాను". ఈ మాటలు వినింది లీలావతి. తన భర్త నారాయణ నారాయణ అని ఉచ్చరించడం ఆమెకు పట్టరాని ఆనందమైనది. భగవన్నామమును. పవిత్రమైన నామమును తన భర్త ఉచ్చరించుట ఆమెకు విస్మయము వేసింది. ఇతనితో ఇంకను అనిపించాలె అని భావించి "ఏమేమి నాథా! ఒక చిలుక పలికెనా? స్పష్టముగ పలికెనా?" "అవునే, నారాయణ, నారాయణ అని గట్టిగా పలుక ప్రారంభించె" అని అన్నాడు. భార్య లీలావతి తాను పలువిధముగ ప్రశ్నలు వేసి తన భర్తతో మాటిమాటికి నారాయణ నామమును ఉచ్చరింప జేసింది. ఆ దినం తానే స్వయముగ అతని కిష్టమైన వంటకములను చేసి, రాత్రి పాదములను వత్తుచూ అదే నామమును పలువిధములుగా ప్రశ్నలువేసి పలికించింది. భార్య వినయమైన దైతే, భర్త ఆమె కోరినట్లు నడచుకుంటాడు. ఈ విధముగ పలికించుచూ భగవంతుని నామాన్ని అష్టోత్తర శతముగ అంటే 108 మార్లు పలికించింది. ఆ దినము గర్భము నిలిచింది. ఆ గర్భమే ప్రహ్లాదుడు. లీలావతి పరమ భాగవతోత్తమురాలు. పుట్టిన ప్రహ్లాదుడు మహా భక్తుడు.

మరుదినము హిరణ్యాకశిపుడు ఈ దినము నేను వాపసు తిరిగి రాను. ఒక వేళ ఆ చెట్టుక్రింద చిలుక పలుకతూంటే వేరే చెట్టు క్రిందికి పోయి తపస్సు చేస్తాను. మరల వాపసు రాను, అని నిశ్చ

యము చేసుకొని పోతాడు. మందరపర్వతము మీదికి పోయి అద్భుతముగ తపస్సు చేస్తాడు.

స తేపే మందర ద్రోణ్యాం తపః పరమ దారుణమ్।
ఊర్ధ్వ బాహుర్నభో దృష్టిః పాదాంగుష్ఠా శ్రితావనిః॥ 7-3-2

మందర ద్రోణపర్వతమునందు అతడు దారుణమైన తపస్సు చేసినాడు. చేతులు పైకెత్తినాడు. ఆకాశమునందు చూపు పెట్టినాడు. కనురెప్ప కొట్టడం లేదు. కేవలము బొటనవ్రేళ్ళపైన భూమిపై నిలిచినాడు.

ఈ తపస్సుచేత బ్రహ్మాండము దద్దరిల్లింది. దేవలోకములో పొగలు లేవసాగినాయి. దేవతలందరు భయపడుతూ బ్రహ్మదేవుని వద్దకు పోతారు. "స్వామీ! ఈ విపత్తు ఏమిట"ని ప్రశ్నిస్తారు. దానికి బ్రహ్మదేవుడు హిరణ్యకశిపుని తపః ప్రభావమని చెప్తాడు. దేవతలందరు "స్వామీ! అతని కోరిక చెల్లించి మమ్ములను రక్షింపవలసినదని" ప్రార్థిస్తారు. బ్రహ్మదేవుడు వెంటనే హిరణ్యకశిపుని వద్దకు వస్తాడు. హిరణ్యకశిపుడు అస్థిపంజరమువలె ఉన్నాడు. అపుడు తన కమండలములోని నీరు వానిపై జల్లుతాడు. బ్రహ్మ. తత్క్షణమే వాడు సర్వాంగ సుందరుడై ప్రకాశిస్తాడు. అపుడు బ్రహ్మ "దైత్యేంద్రా! ఏమి నీ యుగ్రమైన తపస్సు! ఇంతకు ముందెవరు చేయలేదు. భవిష్యత్తులో మరెవ్వరు చేయజాలరు. నీ సమాధికి మెచ్చి నేను వచ్చినాను. నీ యభీష్టము లేమి ఉన్నాయో తెలుపవలసినది" అని అన్నాడు.

అపుడు హిరణ్యకశిపుడు బ్రహ్మను చూస్తాడు. పరమానంద భరితుడౌతాడు. ఆయనకు అభివాదము చేస్తాడు. పిమ్మట తాను యీ విధమున బ్రహ్మదేవున్ని కోర్తాడు.

"గాలిం గుంభిని నగ్నినంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలం ఘస్రములం తమః ప్రబల భూరి గ్రాహిరక్షో మృగ
వ్యాలాదిత్య నరాది జంతు కలహవ్యాప్తిన్ సమస్తాస్త్ర శ
స్త్రాలిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ యిప్పింపవే."
7—90

గాలి, భూమి, అగ్ని, జలము; ఆకాశము, దిక్కులయందును. రేయియందుగాని, పగలుగాని, చీకటియందుగాని, మృగములచే గాని, సర్పములు, ఆదిత్యులు, నరులు మొదలుగాగల జంతువులు, కలహవ్యాప్తిన్ సమస్తమైన శస్త్రములతో మృత్యువులేని జీవనమును ప్రసాదించవలసినది.

బ్రహ్మదేవుడు ఏమంటాడు? ఏమనగలడు? వాడు కోరినదంతేయు ఒప్పుకొనవలసినదే. అట్లు ఒప్పుకోకపోతే వాడు వదలిపెడతాడా? "నాయనా! తథాస్తు" అన్నాడు. ఈ విధముగ బ్రహ్మదేవునితో వరములు పొంది వాడు మహాగర్వముతోను, విజయోత్సాహముతోనూ బయలు దేరి యింటికి పోతాడు.

ఓం సర్వేషాం సుఖినస్సంతు.

పదుమూడవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదునాలుగవ రోజు ఉపన్యాసము

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥"

"యోఽన్తః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిల శక్తి ధరస్స్వధామ్నా ।
అన్యాంశ్చ హస్త చరణ శ్రవణత్వగాదీన్
ప్రాణాన్ నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥"

పరమ భక్తాగ్రేసరులారా! భాగవతాసక్త పరిపూత చిత్తులారా।

పరమపవిత్రమైనట్టి భాగవత కథాశ్రవణము, ప్రాతఃకాలములో అన్య కార్యకలాపములలో ప్రవేశించక ముందే భాగవతమును శ్రవణము చేసుకునే భాగ్యాన్ని భగవంతుడు మనకు ప్రసాదించినాడు.

మానవుని జీవితానికి మరణకాల మొక గీటురాయి. ఆ దినం జీవితమునకంతటికి Judgement లభిస్తుంది. ఇంతకు జీవన విధాన మెట్లుండవలె నంటే మరణకాలాన్ని సంస్కరించేదిగా ఉండాలి. మరణకాలములో ప్రపంచ మోహము తన వికట స్వరూపాన్ని చూపిస్తుంది. అంతో యింతో కొంత సాధన చేసుకున్న వారు కూడ ఆ మాయా మోహానికి లొంగిపోతారు.

అందువలన మరణకాలాన్ని బాగుపరచుకొనే ఉద్దేశ్య ముండాలి జీవన విధానములో. ఇన్‌కంటాక్స్ లెక్కలు సరిగ్గా వ్రాసుకొన్న వాడు ఆఫీసరు ముందర భయపడడు. వాడు ఎడమ చేతితో పుస్తకాలు పారవేసి చూచుకోండి అని కేర్‌లెస్‌గా ఉంటాడు. వ్రాయుటలో గోల్‌మోల్ చేసిన వాడు సరిగా పుస్తకాలను చూపించడు. చూపించే కాలములో తబ్బిబ్బౌతాడు, తాపత్రయ పడుతాడు. ఏదో అంతో ఇంతో లంచము తీసుకోండి సార్! అయిదు వందలిస్తా! వేయినూటాయలిస్తా! నని ప్రాధేయ పడుతాడు. రేపు మనలను భగవంతుడు కూడ ఖాతాల నడుగుతాడు. చేతుల నిచ్చుంటిని వాటితో ఏమి చేసినావు? నోరు నిచ్చియుంటిని. దాని ఖాతా ఏమి చేసినావు? భగవంతుని ఖాతాను చూపేటపుడు ఖోటా చేసియుంటే మన గతి అధోగతియే. అట్లు లేకుండా భగవంతు డిచ్చినట్లు ఇంద్రియాలను వినియోగించుకొని భగవన్నామస్మరణలో కాలము గడుపుకొని యుంటే భయమే లేదు. ఇంద్రియములకు భగవంతుడు భగవద్గీతలో మాత్రాః అని పేరు బెట్టినాడు. మాత్రాః అంటే పరిమితముగ వాడుకో దగినట్టివి అని అర్థము. ఉదాహరణకు నోరు నిచ్చినాడు. ఎందుకు? అంటే మంచి ఆహారాన్ని తీసుకొనేందుకు, మంచి మాటలను మాట్లాడేందుకు. దానితో తినరాని దానిని తిని మాట్లాడరాని మాటలు మాట్లాడితే దానిని దురుపయోగము చేసినట్లే. అట్లే ముక్కు నిచ్చినాడు. దానితో శ్వాస తీసుకోవాలి. వాసన చూడాలి. దాని ప్రయోజన మంతమటుకే. ఈ మానవుడు నశ్యమెక్కిస్తాడు, ఎందుకొరకు? సుఖము కావాలెనని. ఇది కూడ ఖాతాను దురుపయోగము చేసుకున్నట్లే. ఈ విధముగ ఖాతాలను దురుపయోగం చేసుకుంటే వానికి శిక్ష తప్పదు.

ఈ ప్రపంచములో నే కార్యమును మనము చేసుకుంటామో దానికి తగినంత ఫలమనుభవించ వలసినదే. అటులనే అంతఃకరణ

మొక పాత్రవంటిది. దానిలో నెట్టి విచారములనుంచుకుంటే అట్టి సంస్కారము యేర్పడుతుంది. ఒక గంపలో మురిగిన పేడను పెట్టి తీసినాము. వాసన చూస్తే కంపు వాసన వస్తుంది. అట్లుగాక వికసించిన మల్లెపూవులను పెట్టి తీస్తే తత్సంబంధమైన సువాసన వస్తుంది. అంతఃకరణమనే దొక పాత్ర. ఆ పాత్రలో నెట్టి వస్తువులు పెట్టవలె? అంటే నీ కెట్టివాసన కావాలె? మరణకాలములో నిశ్చింతిగా శరీరమును భగవద్భావనతో వదలిపెట్టే వాసన కావాలె. భగవద్గీతలో ఒక విషయముంది.

"దేహినోఽస్మిన్ యథాదేహే కౌమారం యౌవనం జరా ।
తథా దేహాంతర ప్రాప్తిః ధీరస్తత్ర న ముహ్యతి॥"

అంటే దేహికి దేహములో కౌమారము, యౌవనము, ముసలితనం ఎట్లో అట్లే ఒక దేహమును వదలి మరొక్క దేహమును గ్రహించుట. కావున ధీరుడైనవాడు మోహామునకు గురికాడు అని దాని అర్థము.

ఇక్కడ కొంచెము గమనముంచాలి. ఏమంటే ఈ శరీరికి శరీర అవస్థ లెటువంటివో అటులనే ఒక శరీరాన్ని వదలి ఇంకొక శరీరాలను ధరించుట అన్నాడు భగవంతుడంటే భావుకమైన వ్యక్తికి సందేహము కలుగుతుంది. ఇక్కడ అర్థము పొసగడం లేదండీ! అంటాడు. ఏమంటే ఒక శరీరమును వదలి మరియొక శరీరమును పొందడం కేవలము ఒక శరీరానికి అవస్థలు మారినట్లే అంటే మనకు ముసలితనములో యౌవనములో చేసిన పనులు కొన్ని, బాల్యములో చేసిన పనులు కొన్ని జ్ఞాపకముంటాయి. అవస్థ మారినట్లే శరీరముయొక్క మార్పు అంటే మనకు వెనుకటి శరీరాల విషయాలు జ్ఞాపక ముండాలి కదా? మరి ఆ విధముగ లేవే? అని ప్రశ్నిస్తాడు. ఈ ప్రశ్న యథార్థమని పిస్తుంది భగవానుడు చెప్పిన విషయము తప్పుకాజాలదు. కాని మన అను

భవములో రాని విషయాన్ని ఎట్లు నమ్మవలె? అనుభవానికి వ్యతిరేకమైనపుడు మనము భగవద్గీతను నమ్మవలెనా? త్రోసివేయ వలెనా? భగవంతుని వాణి అమోఘమైనది. దానిలో ఏలాటి పొరబాటు ఉండదు. మన అనుభవములోనే ఏదో లోటు ఉండాలి, అని భక్తితో భగవద్గీతను చూచి ఆలోచిస్తే మనకు సమాధానము లభిస్తుంది. ఏమని!

ధీరుడైనవాడు మోహము చెందడు. మరణకాలములో మానవుడు ధీరుడై మోహము చెందని వానికట్లు వెనుకటి విషయాలు జ్ఞాపకముంటాయి. ఎవని మనస్సు మరణకాలములో మోహము చెందుతుందో వానికి వెనుకటి విషయాలు జ్ఞాపకముండవు. కావున మరణకాలములో మోహము చెందకుండు మార్గమును మన మనుసరించాలి. అపుడు మాత్రమా భగవద్భక్తి పూర్ణముగ అనుభవములోనికి వస్తుంది. మరణకాలములో "స్వామీ! నీవీ శరీరాన్నిచ్చినావు. దీనితో నేమేమి నాటక మాడాలనో ఆడిపించినావు. ఇపుడు నీ శరీరాన్ని నీవు తీసుకుంటున్నావు. "త్వదీయ వస్తు గోవింద! తుభ్యమేవ సమర్పయే" నీ వస్తువు స్వామీ! నీకే అర్పించుచున్నానని మోహము చెందని మనస్సుతో నేమానవుడు శరీరాన్ని వదలుతాడో ఆ మానవునికి వెనుకటి విషయాలు జ్ఞాపకముంటాయి. కావున ఆ భగవద్భక్తికి యిట్లు సమాధానము చెప్పుకోవాలి.

అసలు మరణమంటే భయపడ నవసరములేదు. మరణమంటే మోహముతో, భయముతో మానవులందరు భయకంపితు లౌతారు. మరణమంటే దాని తత్త్వాన్ని తెలుసుకొన జాలక పోవుటయే కారణము. మరణమంటే పాత చొక్కావదలి క్రొత్త చొక్కాను వేసుకోవడమే. ప్రపంచములో ఎవనికైనా క్రొత్త చొక్కా లభ్యమౌతూంటే పాతచొక్కానే వేసుకొని ఉండడం ఇష్ట

ముంటుందా? ఉగాది పండుగ. పిల్లవాడు చినిగిపోయిన పాత చొక్కా వేసుకొని తిరుగుచున్నాడు. దానికి వాని అమ్మ "నాయనా! ఉగాదిపండగరా! ఈ దినం పాత చొక్కా వేసుకోరాదు. కొత్త చొక్కా పాలిస్టర్ గుడ్డతో కుట్టించినదిరా! దానిని వదలి దీనిని వేసుకోరా" అంటే "ఊహూ, నేను దీనినే వేసుకొని ఉంటాననే వానిని అజ్ఞాని, మూర్ఖుడంటాము కదా? కావున మరణ కాల మాసన్నమైనపుడు సంతోషముతో దీన్ని వదలజాలని వాడు ఆ బాలునితో సమానమే. కావున మరణకాలమంటే పాత చొక్కాను వదలి కొత్త చొక్కాను వేసుకోవడమే. ఒకవేళ జననమే లేదు, అంటే మోక్షము లభించినట్లే. కాబట్టి యీ రూపమున ఆలోచిస్తే రెండు విధాలాకూడ విచారించవలసిన పని లేదు. భయపడవలసిన అవసరమే లేదు. అందువలననే దైవీ గుణాలలో మొట్టమొదటిది అభయం.

"అభయం సత్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః"

మరణభయమును మానవుడు దూరము చేసుకోవాలె. ఎందుకంటే దానిద్వారా మనకు నష్టము లేనే లేదు. పైపెచ్చు లాభమే ఉంది. తల్లి బిడ్డకు పాలిస్తుంది. ఒక స్తనములో పాలైపోతాయి. అపుడు ఆ తల్లి పిల్లవాన్ని రెండవ స్తనమువైపు తిప్పుతుంది. అంతే. అక్కడ పుష్కలంగా పాలున్నాయి. దీనిలో పాలు లేవు. ఈ సంగతి తల్లికి తెలిసి తిప్పుతుంది. అయితే పిల్లవాడేడుస్తాడు. అటులనే ప్రకృతిమాత ఒక శరీరముతో ఎన్నాళ్ళుండవలెనో అన్నాళ్ళుండ నిచ్చి మరొక్క శరీరము వైపు వీన్ని త్రిప్పుతుంది. కాని ఈ గడ్డాలు మీసాలు వచ్చిన పిల్లలు ఏడుస్తారు. ఏడ్వవలసిన పని లేదు. పైపెచ్చు పాలుకలిగిన స్తనమువైపు తిప్పేటపుడు సంతోషపడవలె. జనన మరణ రహస్యం తెలుసుకున్నవాడు దుఃఖించవలసిన పని

లేదు. నీవు అజ్ఞాన చేష్ట, శరీర మెంతవరకుండవలెనో ఉండనీ! అది వాని యిష్టం ఎప్పుడంటే అప్పుడు పోనీ అది వాని యిష్టం. "హూమేం హామిలాల్" అనేది ఒక సామెత. ఏదేది జరుగుతుందో అది భగవంతుని యిష్టం. ఆయన ఇష్టములో నీ యిష్టం కలుపు.

ఒక మహానుభావుడు పడవలో నదిలో ప్రయాణం చేస్తున్నాడు. దారిలో తుపానువచ్చి నదిలో పెద్ద పెద్ద అలలు లేయబట్టినాయి. అప్పుడతడు బయట ఉన్న నీళ్ళను నావలోనికి వేయసాగినాడట, కొంచెము సేపులోనే వాతావరణం బాగుపడింది. అప్పుడు పడవలోని నీళ్ళను బయటకు వేయసాగినాడట. ఏమిటిదయ్యా నీవు చేసేది? అని ప్రక్కమనిషి అడిగితే ఆయన నేను హూంమే హాంమిలా రహాహూం అన్నాడట. "భగవంతుని సంకల్పములు నీ సంకల్పమును కలిపివేయి," ఆ విధముగ జ్ఞానము పొందితే భయమెక్కడిది? భగవంతుని సంకల్పముతో నీ సంకల్పమును కలుపు భగవంతుడేమంటున్నాడు? ఇదంతయు నాదే అంటున్నాడు. నీది యేమాత్రము లేదు అంటున్నాడు. "హరిమయము విశ్వమంతయు, హరి విశ్వమయుండు సంశయము పనిలేదా హరిమయముగాని ద్రవ్యము, పరమాణువులేదు వంశ పావన వింటే" అంతా హరిమయమే. అంతా ఆయనదే. నీ వొక రూపాయను నాది అని జేబులో వేసుకుంటావు. ఆ రూపాయ నవ్విందట. "ఏమే రూపాయా! నవ్వుతావంటే "ప్రొద్దున నుండి నన్ను జేబులో వేసుకొనే ప్రతివాడూ 'నాది' 'నాది' అనుకుంటూనే వేసుకుంటున్నాడు. కాని ఒక్కడైనా నన్ను నిలుపుకొనుటలేదు. వాస్తవముగా చూస్తే ఇల్లు నాది, బిడ్డలు నావి, ధనము నాది, అది నాది ఇది నాది అని ఈ వెర్రి మానవుడు ముద్రవేసుకుంటున్నాడు. కాని తాను చచ్చిపోయేటప్పుడు వీటిని తీసుక పోతున్నాడా? ఇవి వానివెంట పోవుచున్నవా?

ఒకడు పది అంతస్థుల భవనం కట్టించినాడు. చాలా బాగా కట్టించినాడు. ఆ భవనాన్ని చూచినవాడు విస్మయము పడవలసిందే. దానికి తోడు వాడు విజిటర్స్ బుక్కు నొకదానిని పెట్టినాడు. ప్రతివాడు భవనాన్ని చూచి విజిటర్స్ బుక్కులో తన అభిప్రాయాన్ని వ్రాసిపోవాలె. ఒకతూరి ఒక మహాత్ముడు వచ్చినాడు. ఆయునను సాదరముగ పిలుచుకొని వచ్చి తన భవనాన్ని క్రింది నుండి పై వరకు తానే చూపించినాడు. అంతా చూచిన పిమ్మట భవనము బాగుంది కాని! అన్నాడట ఆ మహాత్ముడు. ఇంతవరకు "కానీ" అన్నవాడు లేడు. "కానీ' అంటే ఏమి అర్థము స్వామీ!" అని అడిగినాడట. దాని కాయన "నాయనా! దీని నెంతో శ్రమ కోర్చి కట్టించినావు. నీకింకొక సంవత్సరములోనే మరణమున్నది. అపుడు దీనిని నీవు వదలిపెట్టి పోవలసి ఉంటుంది" అన్నాడు. ఇది వింటూనే ఆ ధనికునకు విపరీతమైన దుఃఖము కలిగింది. ఇంతగా కష్టపడి కట్టుకొంటి. దీనిని విడిచిపెట్టి పోవలసి వస్తుందే అని విలపించ సాగినాడట. ఆ విధముగ వస్తువులు మనిషి వెంట ఎల్లప్పటికి ఉండవు. ఎందుకు? వానివి కావు. అవన్నియు పరమేశ్వరునివి. కావున మనిషి కిష్టమొచ్చినట్లు అవి ఉండవు. వాటికి - వానికి వియోగము తప్పదు. ఇంతేకాదు. ఆ మహాత్ముడు ఆ భవనము కట్టుకున్నవానితో మరొక్క మాట అన్నాడు. "నాయనా! నీవు కర్మజాలక పై అంతస్థులో చస్తే నిన్ను పదంతస్తులు క్రిందికి మోయవలెనంటే చాలా కష్టమవుతుంది" అన్నాడు. తన మరణము మాట అంత సమీపంములో నని విని వాడు భయభ్రాంతుడై నాడు.

సంయోగము అనేది ఎక్కడ ఉన్నదో అక్కడ వియోగమున్నది. సంయోగము మాత్రముండాలె. వియోగముండరాదు అనే సిద్ధాంతమిక్కడ పొసగదు. భర్తృహరి అంటాడు –

"అవశ్యం యాతారశ్చిరతరముషిత్వాపి విషయాః
వియోగే కో భేదస్త్యజతి న జనో యత్స్వయమమూన్।
వ్రజంతః స్వాతంత్ర్యాదతుల పరితాపాయ మనసః
స్వయం త్యక్తా హ్యేతే శమసుఖమనంతం విదధతి॥"

విషయాః అంటే వస్తువులు అవశ్యముగ పోయేటివే. చిరకాలముండిననూ ఒకదినము పోయేవే. one way trafic లేదిక్కడ. సంయోగమయిందా? వియోగము తప్పదు. అయితే ఈ వియోగములో వాటి తత్త్వము తెలుసుకొని మమకారము వదలిపెట్టినవారు శమసుఖం పొందుతారు. వారికి మొదటనే తెలుసు. ఏమని? అవైనా వదలిపోతాయి. నేనైనా వదలి పోతానని, అందువలన అట్టివారు శమసుఖం పొందుతారట. ఆ విధముగా గాక వాటిపైన మమకారము పెట్టుకొని వాటి వియోగం సహించలేనివారు అతులమైన పరితాపము పొందుతారట.

కావున నీవు వస్తువులతో కలిసియుండిన కాలములోనే ఇవి నావి కావు. పరమాత్మునివి. అనే భావనను దిన దిన ప్రవర్ధమానము చేసుకోవాలి. ఆ విధముగ పరమాత్మ భావనను పొందుతూండిన కాలములో వాటి వియోగము జరిగితే నీవు ముందునుండి "నావి కావని" అనుకుంటూాంటివి కావున వియోగం కలిగినప్పుడు దుఃఖముండదు. ఈ వస్తువులపై మమకారముంటే మరణకాలము సఫలంకాదు. జీవితములో నే వస్తువుపైన అధికమైన ఆసక్తి యున్నదో ఆ విషయము మరణకాలములో స్మరణకు వస్తుంది. భగవంతునిపైననే అధికమైన ఆసక్తికలిగి వస్తువులపై మమకారము తగ్గించుకొని నిరంతరము భగవత్స్మరణతో జీవితము గడపుతాడు. మరణమును మంగళకరమైన దానినిగా మార్చుకుంటాడు. ఈ విధముగ మరణకాలమును మంగళమయము చేసుకొనువాడే సార్థక జీవనుడు. ప్రహ్లాదుడట్టివాడు. అతని విషయమును గురించి భాగవతకారుడేవిధముగా చెప్పుతాడో చూడుదుము.

హిరణ్యకశిపుడు బ్రహ్మదేవునితో వరములు పొంది వచ్చి సమావేశము చేస్తాడు. తన పరివారమునకు, సేవకులకు అందరికి ఆజ్ఞ యిస్తాడు. ఆ నారాయణుడు సజ్జనులవద్ద ఉంటాడు. కావున సజ్జనులైన వారిని నానా హింసలు పెట్టండి. కొట్టండి. తిట్టండి. ఎట్లైనను సరియే నారాయణున్ని పట్టుకరండి. అని ఆజ్ఞ యిస్తాడు. ఈ విధముగ హిరణ్యకశిపుడు భగవంతునిపై పగతో వ్యవహరిస్తూంటే వాని కుమారుడు ప్రహ్లాదుడు సకలసద్గుణ గరిష్ఠుడై మహా భక్తుడై ఉంటాడు. ఈ పద్యములో ప్రహ్లాదుని గుణగణాలు ఎంత శ్రేష్ఠమైనవో చూడండి.

"ఆకారజన్మవిద్యార్థ వరిష్ఠుడై గర్వసంస్తంభసంగతుడు కాడు,
వివిధమహానేక విషయసంపన్నుడై పంచేంద్రియములచే బట్టువడడు,
భవ్యవయోబల ప్రాభవోపేతుడై కామరోషాదుల గ్రందుకొనడు
కామినీప్రముఖ భోగములెన్ని గలిగిన వ్యసనసంసక్తి నావంక బోడు
విశ్వమందుగన్న విన్నయర్థములందు వస్తుదృష్టి జేసి వాంఛ యిడడు
ధరణినాథ దైత్య తనయుండు హరిపరతంత్రుడై హతాన్య తంత్రుడగుచు॥" 1-117

ఆకారమునందు విద్యయందు దర్శనమునందు శ్రేష్ఠుడై కూడ గర్వమిసుమంతయు లేనివాడు. భోగాలకు కొదువలేదు. అనేకములైన విషయాలతనికి అందుబాటులో ఉన్నాయి. కాని ఇంద్రియములకు చిక్కడు. వయస్సు బలము మొదలగు వాటితో ఒప్పుచున్నను వ్యసనమేమాత్రము లేదు. కామినీ వాంఛలేదు. విశ్వమునందు కన్న విన్న యర్థములందు వస్తుదృష్టిని విచారించి వాంఛించడు. అతడు నిరంతరము హరి పరతంత్రుడై ఇతరమైన సర్వవిషయములయందు ఉపేక్షాభావము నూనినాడు. యౌవనము,

రూపము, ధనము, వయస్సు ఇవన్నియు కలిగియుండి నిగ్రహము కలిగియున్నవాడు గొప్పవాడు. ఈ ప్రపంచములో యౌవనము, ధనము, అధికారము, అవివేకము ఈ నాలుగులో ఏ ఒకటైననూ మానవుని పతనానికి జాలు. నీతిశాస్త్రము దీనినే చెబుతుంది. చూడుడు.

"యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా।
ఏకైకమప్యనర్థాయ కిముయత్ర చతుష్టయమ్॥"

పైన చెప్పిన నాలుగింటిలో ఒక్కటుంటే అనర్థానికి చాలు. మరి నాలుగు ఒకచోట ఉంటే చెప్పవలెనా? అని శ్లోకార్థము.

యౌవనమంటే ఏమి? మీసాలు వచ్చేటపుడు దేశాలు కనిపించవని అంటూంటారు కదా! ఎదుటివాడు కంటికి కనిపించడు. ఊ-నువ్వేమి నాకు లెక్క అనే అహంకారముంటుంది. అటువంటిది యౌవనము

ధనము సంగతి చెప్పవలెనా? ధనమెచ్చిన మదమెచ్చును, మదమెచ్చిన మత్సరంబు మానక హెచ్చుక్ - అని దాని సంగతి నెంత చెప్పినా తీరదు - ఈ ప్రపంచములో ధనము విషయాన్ని చెప్పాలంటే - దానంతమంచిది లేదు. దానంత చెడ్డదిలేదని చెప్పవచ్చును. కాని గర్వముతో కూడుకున్న వానివద్దనున్న ధనం అనర్థాలకే దారితీస్తుంది. ప్రభుత్వమంటే అధికారము. కొందరికి అధికారము వస్తే నిరసీలకుక్కుంటారు. సుమతిశతకకారుడు,

"అధరము కదలియు కదలక,
మధురములగు మాటలుడిగి మానవ్రతుడై
అధికార రోగపూరిత
బధిరాంధక శవము జూడ పాపము సుమతీ"

అన్నాడు. ఈ విధముగ అధికారము కలుగుతే బధిరుడౌతాడు. అంధుడౌతాడు.

మనము వీటిని గురించి యిట్లు విమర్శ చేసుకుంటూన్నాము కదా ? అవి మనవద్ద ఉన్నప్పుడు వాటిని దూరము చేసుకొనుట మన ప్రథమ కర్తవ్యము. మనవద్ద ఒక్క దుర్గుణం ఉంటే ఆహా! ఇది ఉండ కూడదు కదా! యౌవనం అనేదానిలో మనమున్నప్పుడు దాన్ని సుగుణముల చేత కాపాడుకోవాలి. ఈనాడు అమ్మాయీలు, అబ్బాయీలు యౌవనాన్ని కాపాడుకోవాలి. యౌవనాన్ని కాపాడుకుంటే వారు ముసలితనములో శాంతిగా, ప్రసన్నముగ దినాలు గడుప గల్గుతారు. ఒకవేళ దాన్ని కాపాడుకోజాలక పోతే ముసలితనములో దైన్యముగ పిచ్చి పిచ్చిగా దినాలు గడపుకోవలసి ఉంటుంది. యౌవనాన్ని కాపాడుకుకేందుకు ఇటువంటి ఉపన్యాసాలకు యువకులు రావాలి. అట్లావారు నా ఉపన్యాసాలకు వస్తే నాకు చాలా ఆనందము. ఎందుకంటే యువకులలో సదాచారమనే భావవిప్లవము వస్తే దుర్మార్గమును వారు సహించరు. దుష్టత్వమును ఎదిరిస్తారు. ఈ విధమైన విప్లవము యువకులలో జాగరితమైతే దేశముయొక్క స్వరూపమే మారిపోతుంది. యౌవనాన్ని కాపాడుకున్నవాడే గృహస్థ జీవితములో భార్యతో సుఖిస్తాడు. వివాహము కాకముందే అపామార్గములో నడచి రోగాలకు గురియైతే భార్యతో సుఖించే అర్హతే లేనివాడౌతాడు. ప్రత్యేకించి యిప్పటికాలము యువకులకు, యువతులకు చాలా హెచ్చరికగ ఉండవలెనని హెచ్చరించవలసి యున్నది. ప్రపంచములో నలువైపుల జాలముపరచినట్లు మానవుడు గుర్తించి నడుచుకోవాలి, తలిదండ్రులు తమ పిల్లలను ఆ విధముగ గమనిస్తూండవలె.

తల్లిదండ్రులు చెప్పినట్లు నడచుకొనేవారి ఉన్నతి చాలా గొప్పదిగా ఉంటుంది. లేచినప్పుడు తల్లిదండ్రులకు పిల్లలు, తమ భర్తలకు స్త్రీలు పాదనమస్కారము చేసి పెద్దవారి మనస్సు నొవ్వకుండా నడచుకుంటే వారిజీవితం ఉజ్జ్వలమైన ఉన్నతిని పొందుతుంది.

వారు ధర్మపూర్వకముగా వివాహము చేస్తే ధర్మేణ, అర్థేన, కామేన నీవు నీ భార్యతో స్వేచ్ఛగా ఉండవచ్చును. ఈ మార్గములో నడచుకొనుటచే ఆత్మశక్తి పెరుగుతుంది. "ధర్మా విరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" అంటాడు భగవానుడు. అంటే ధర్మానికి విరుద్ధము కానట్టి కామము నాయొక్క స్వరూపము అని అర్థము. దీనిలో మరొక్క నగ్న సత్యము గమనార్హము. ఎవరైతే యౌవనాన్ని కాపాడుకొని ధర్మమార్గములో జీవితం గడపుతారో వారు ముసలివారైతే ప్రశాంతముగ ఉంటారు. ముసలితనములో ప్రసన్నముగ ఉండేవారు మహాత్ములు. ఆ విధముగ యౌవనాన్ని కాపాడుకోక అధర్మపూర్వకముగ జీవితము గడుపుతారో వారు పదరుడు రోగానికైనా గురియౌతారు. చిత్త చాంచల్యము చేత దీనులై మర్యాదలేని జీవితాన్నైనా గడుపుతారు.

ఈ ప్రపంచము నగదు బజారు. దీనిలో అప్పు సప్పు బేరము లేదు. ఒక మంచి కార్యముచేస్తే అక్కడికక్కడనే దాని ఫలము. ప్రపంచమంతా భావమయము. కాబట్టి మంచి భావముతో ప్రపంచములో స్వర్గమును సృష్టించగలము. ఆ విధముగ గాక అధర్మముతో కూడిన స్వార్థ, లోభాదులతో కూడిన భావమును వ్యాపింపజేసిన ప్రపంచము నరకము కాగలదు. ప్రహ్లాదుడు సకల సద్గుణ గుణాభిరాముడు. బుద్ధుడు లోకములో నున్న దుఃఖాన్ని దూరము చేయుటకై అతిలోక సుందరియైన తన భార్యను, ముద్దులొలుకు తన ఏకైక పుత్రున్ని వదలి అరణ్యాలకు పోయినాడు. ఏమిటి వారి భావనావిధానము! ఆ విధమైనట్టి మహామనీషుల ముందర స్వార్థ చింతనలతో, పరస్త్రీలతో తమ కామమును నీచముగ తీర్చుకొనుట ఎంతటి జుగుప్సాకరమైన, హేయమైన విధానము! అట్టి వారికి ఇహమునందు సద్గతి లేదు. పరమునందు దుఃఖమే శేషమై

ఉంటుంది. ప్రహ్లాదుడు "భవ్యవయోబల ప్రాభవోపేతుఁడై కామ రోషాదుల గ్రందుకొనఁడు" ఈ విధమైన స్వచ్ఛమైన జీవితము కలవాడు కావాలి. అందుకనే మనము భాగవతము వింటున్నాము. ప్రహ్లాదుడు ప్రపంచములోని వస్తు సృష్టిని గమనించి పొంది వాటి యందాసక్తుడు కాడట. వస్తువులు మానవున్నాకర్షిస్తాయని కొందరి భావన. వస్తువులు జడములు. వాటియందాకర్షించే శక్తి లేదు. బజారులో నుండి మనము పోవుచున్నాము. రకరకములైన వస్తువులున్నాయి. అవి మనలను ఆకర్షించుట లేదు. మనలోని విషయ వాంఛ పోయి వాటియందు తగుల్కొని రాగమును కల్పించు చున్నది. వాస్తవముగ వస్తువులు జడములు. అవి మనల నాకర్షించుట లేదు. మనలోని రాగబుద్ధియే మనల నావిధముగ నాటక మాడిపిస్తుంది. ప్రహ్లాదుని మనస్సు నిరంతరము హరిపరతంత్రమైనది. అందువలన ఇతరమైన సంకల్పాలకు, వాంఛలకు ఆయన మనస్సులో స్థానమే లేదు. దేనియందు మనస్సు ఆసక్తమై ఉంటుందో దానిలో నది లీనమవుతుంది. సామాన్యమైన మానవుని మనస్సు ప్రాపంచిక భోగములపై లంకించికొని ఉంటుంది వాని భావము. క్షుద్రమై ఉంటుంది. అదే భగవంతునిపై లగ్నమైతే అద్భుతమైన ఆనందమును ప్రసాదించునదిగా మారుతుంది. ప్రహ్లాదుని గుణముల విషయమై భాగవత మింకను ఏమి చెప్పుతుందో చూడుడు.

"గుణనిధియగు ప్రహ్లాదుని గుణము
లనేకములు గలవు గురుకాలమునన్
గణుతింప నశక్యంబులు ఫణిపతికి
బృహస్పతికిని భాషాపతికిన్. భాగ. 7-120

గుణములకు నిధి యట ప్రహ్లాదుడు. నిధి అంటే ఖజానా అని అర్థము. ఆయన గుణములను వర్ణించుటకు దీర్ఘకాలము చాల

దట. వాటిని గురించి వర్ణించుట ఆదిశేషునికి, బృహస్పతికి, బ్రహ్మ దేవునికి సాధ్యము కాదట.

ఇట్టి శక్తి దేనిలో ఉన్నది? మానవుడు భగవంతుని వైపు అభిముఖుడైతే ఇంత శక్తి మానవునికి సమకూరుతుంది. భగవంతు డనంత కల్యాణ గుణాభిరాముడు. ఆయనయందు మనస్సును లగ్నము చేసుకుంటే ఆ గుణాలు భక్తునియందు ప్రతిబింబిస్తాయి. అపుడు మనుష్యు డింత గొప్ప శ్రేణికి చెందినవాడౌతాడు. ప్రహ్లాదుడు నిరంతరము ఏ పని చేస్తూండినను భగవంతుని నామమును మరువడట.

"పానీయంబులు ద్రావుచుం గుడుచుచుం భాషించుచుం హాసలీ
లా నిద్రాదుల జేయుచుం దిరుగుచుం లక్షించుచుం సంతత
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతా స్వాద సం
ధానుండై మరచెం సురారిసుతుడే తద్విశ్వముం భూవరా!"
7-123

ఏ పని చేస్తూండినను నిరంతరము శ్రీమన్నారాయణుని పాద పద్మముల చింతన యనెడు అమృతపానముచేత ఆ ప్రహ్లాదుడీ విశ్వాన్ని మరచిపోయినాడు. అట్టిది భగవత్తన్మయత.

ఇట్లు నప్రమత్తుండును, సంసార నివృత్తుండును, బుధజన విధేయుండును, మహాభాగధేయుండును, కర్మబంధ లతాలవిత్రుండును, పరమ భాగవత శ్రేష్ఠుండును, పవిత్రుండునైన పుత్రునియందు విరోధించి అనుకంపలేక చంపం బంపె ననిన నారదునకు ధర్మజుం డిట్లులనియె. భా. 7-125.

"పుత్రుల్ నేర్చిన నేర్వకున్న జనకుల్ పోషింతు రెల్లప్పుడున్
మిత్రత్వంబున బుద్ధిసెప్పి దురితో న్మేషంబు వారింతురే
శత్రుత్వంబు దలంప రెట్టియెడ నా సౌజన్య రత్నాకరున్
బుత్రున్ లోకపవిత్రు దండ్రి నెగులన్ బొందింప నెట్లోర్చెనో."
భా. 7-126

తన కుమారున్ని చంపే ప్రయత్న మెట్లు చేసె స్వామీ! కుమారుడు ఎంత చెడ్డవాడైనా చంపుతారా? అందులో సుగుణ ములకు సముద్రమువంటి వాడని మీరు చెప్పుచున్నారు. అంతటి లోకపవిత్రుడైన పుత్రున్ని చంపుటకు పూనుకోవడం. ఇది నాకు చాలా చిత్రముగ నున్నది. దీన్ని వివరించి చెప్పవలసినదని ధర్మ రాజు నారదున్ని ప్రార్థించినాడు.

వస్తువు ఒకటే. అయినను విలువలు మారుతాయి. ఇది వారి వారి సంస్కారముపైన ఆధారపడి ఉంటుంది. హిరణ్యకశిపు నిది రాక్షసవృత్తి. ప్రహ్లాదునిది దివ్యవృత్తి, హిరణ్యకశిపుడు తన కుమారుని వ్యవహారము చూస్తాడు. తన విచారములతో నే మా త్రము సహకరించడు. దీర్ఘముగ విచారిస్తూ ఇట్లనుకుంటాడు.

"లభ్యంబైన సురాధిరాజపదమున్ లక్షింప డశ్రాంతమున్
సభ్యత్వంబున నున్నవా డబలుడై జాడ్యంబుతో వీడు వి
ద్యాభ్యాసంబున గాని తీవ్రమతి గాడంచున్ విచారించి దై
త్యేభ్యుం డొక్కదినంబునన్ బ్రియసుతున్ వీక్షించి
సోత్కంఠుడై." 7-129

ఏమి వీని చిత్తవృత్తి? దేవేంద్రపదవి లభ్యమైన దానిని ఏ మాత్రము లెక్కపెట్టడు. నిరంతము ఏదో ఒక ధోరణిలో ఉంటాడు. ఏదో వీనిలో జాడ్యమున్నది. కాని చదువు చెప్పిస్తే గాని బుద్ధిమంతుడు గాడని ఒకదినం ప్రహ్లాదున్ని దగ్గరకు పిలుచు కుంటాడు.

"నాయనా! కుమారా! నా మాటలు వినురా!

"చదువనివా డజ్ఞుండగు చదివిన సదసద్వివేక చతురత గలుగున్
చదువగ వలయును జనులకు చదివించెద నార్యులొద్ద చదువుము
తండ్రీ!" 7-130

పిల్లవాడు ఏ చదువు నేర్చుకోవలెనో అది నేర్చుకొనియే ఉన్నాడు. చదువులలో రహస్యమెల్ల ముందే ఎరిగియున్నాడు. కావున అతనికి చదువవసరము లేదు. ఆ సంగతి వీని కేమి తెలుసు? తెలియక చండామార్కులను పిలువనంపి వారితో యిట్లు చెప్తాడు.

"అంధ ప్రక్రియ నున్నవాడు పలుకం డస్మత్ప్రతాప క్రియా
గంధంబించుక లేదు మీరు గురువుల్ కారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకు పెద్దలు మముం బాటించి యీ బాలకన్
గ్రంథంబుల్ చదివించి నీతికుశలున్ గావించి రక్షింపరే." 7-132

మహాత్ములారా! ఈ పిల్లవాడు విద్య లేనివాడు. నా ప్రతాపాదులను కూడ గుర్తించే యోగ్యత లేకున్నాడు. కావున వీనికి బుద్ధి గరపవలసినదని చెప్పినాడు. వారాపిల్లవాన్ని పిలుచుకపోతారు. ఏది చెప్పినను ఒక తూరి ఉపాధ్యాయులు చెప్పితే అట్లే మరల ఒప్పజెప్పుతాడు. ఏకసంధాగ్రాహి. అందునను ఆయనకు తెలియని విషయమంటూ ఒకటి లేదు.

"ఏ పగిదివారు జెప్పిన నా పగిదిన్ జదువుగాని యట్టిట్టని యా
క్షేపింపడు తానన్నియు రూపించిన మిథ్యలని నిరూఢమనీషన్"
7-135

ఈ విధముగ కొంతకాలము గురుకులవాసమునం దుంచి, పిమ్మట తన కుమారుని కేవిధముగ విద్య నేర్పుచున్నారో తెలుసుకొనగోరి, భ్రాంతుడై యున్న తన కుమారుడేమి చదివినాడో ఎరుగగోరి తన సౌధములో కూర్చొని కుమారున్ని పిలువనంపుతాడు.

"మోదముతోడ దైత్యకుల ముఖ్యుడు రమ్మని చీరబంచె బ్ర
హ్లాదకుమారకున్ భవమహార్ణవ తారకు గామ రోషలో
భాది విరోధివర్గ పరిహారకు కేశవచింతనామృతా
స్వాదకఠోరకున్ కలుషజాల మహోగ్రవనీ కుఠారకున్" 7-137

ఈ మధ్యలో గురువులచే విని వుంటాడు. ఆ గురువులు హిరణ్యాకశిపునితో "దైత్యరాజా! మీ కుమారుని బుద్ధి చాతుర్యము ఏమని చెప్పుదుము. ఎంత కఠినమైన పాఠము గాని ఒక్క పర్యాయము వింటే చాలు వాటినంతటిని ఒప్పజెప్పుతాడు. మహా కుశాగ్రబుద్ధి" ఈ మాటలు విని సరే కుమారున్ని వారే రూపమున చదివించినారో తెలుసుకుందామని తలంచినవాడై నిజనందనున్ని పిలిపిస్తాడు.

పై పద్యములో ప్రహ్లాదుని గుణగణములు వర్ణనయున్నది. ప్రహ్లాదుని గుణాలను వర్ణిస్తూ వర్ణిస్తూ పోతన తన్మయుడై పోతాడు. నిజముగా చూస్తే ప్రపంచములో సజ్జనుడైనవాని నెవరు పొగడరు! దుర్మార్గుడైనట్టివాన్ని అందరు నిందిస్తారు. లోకములో అందరికి ఒక సహజమైన భావన ఉన్నది ఏమని? "నన్ను అందరూ మంచియే అనవలె"నని అందరి కోరిక. అందరితోను ప్రశంసలనే పొందవలెనను వాంఛ ఉంటుంది. కాని నడక ఆ విధముగ ఉండదు. బుద్ధి భూము లేలుదామని ఉంటుంది. అదృష్టము గాడిదలను కాస్తుంది.

అయితే ఒకశక్తి మానవునకున్నది. ఆ శక్తి యేమిటంటే మానవుడు తన స్వభావాన్ని కూడ మార్చుకుంటాడు. ఒకానొక సందర్భములో వాడు దురభ్యాసాలు కలిగియుండినపుడు తన అభ్యాసాలు మంచివి కావు, ఈ రూపమున జీవితం పాడవుతుంది అని వాడు గంభీరముగ తెలుసుకుంటే దానిని వదలిపెట్టి జీవితమును భవ్యమైన మార్గమున మలచుకుంటాడు. ఆ విధమైన శక్తి మానవునకున్నది.

చరిత్ర త్రిప్పిచూస్తే వేమన పరమకాముకుడు. వేశ్యాలోలుడు. పన్నులూకలు వసూలు చేసినవి ఇంటిలో పెట్టితే వాటిని కూడ ఎత్తుకొనిపోయి వేశ్యకిస్తాడు. మరుదినం ఆ పైసలు

ఖజానాలో జమ కట్టకపోతే అన్నకు బేడీలు వస్తాయి అని తెలుస్తూనే పరుగెత్తుకుంటూ వేశ్యయింటికి పోయి దానిని ప్రాధేయపడి అర్థిస్తాడు. "ప్రియురాలా! ఇవి కాళ్ళు కాదు చేతులు. నిన్న నేను నీకు యిచ్చిన పైకం నాకిచ్చేయ్. మరల నీకిస్తాను. ఇప్పుడు మా అన్న జైలుకు పోవలసిన పరిస్థితి వచ్చింది. ఈ ఆపదను తొలగించు'' అని ప్రాధేయుడై ప్రార్థిస్తే ఆ వేశ్య అంటుంది. ఏండీ! భోగముదానికిచ్చిన డబ్బు, గోడకు పూసిన సున్నము మరల వాపసు వస్తుందా? పో పో'' అని తిరస్కరించి మాట్లాడుతుంది. "నిన్నటి వరకు నన్ను చూస్తే దేవునివలె చూచి భోగాన్ని కలిగించిన వేశ్య ఈ దినమిట్లు తిరస్కారంగా మాట్లాడుతుందా'' అని వెంటనే యోగియైనాడు.

అదిగో! ఆ విధమైన మార్పు కావాలి. ఇపుడు యువకులలో, పెద్దవారిలో జీవితాన్ని గురించి ఇట్టి మార్పు రావాలి. త్రాగుడు విషయములో, వ్యభిచారవిషయంలో, అవినీతి మార్గములో నడచుచున్న వారిలో నిట్టి పరివర్తనాన్ని కలిగించాలి. భావ విప్లవం కలిగించాలి. జీవితంలో దురాచారంలో సుఖాన్ని వెతకుతున్నారు. నిజముగా దురాచారములో మానవునికి సుఖశాంతులున్నాయా? లేవు. సదాచారములో నిజమైన సుఖశాంతులున్నాయి. ఈ సత్యమును సర్వులకు అర్థమయ్యేటట్లు బోధించాలి. సదాచారములో ధైర్యము కలుగుతుంది. దానిలో బుద్ధి కుశాగ్రమవుతుంది. జీవితములో నిజమైన వెలుగు వస్తుంది. ఇదిగో! ఇపు డీవిధమైన భావవిప్లవం కావాలి. ఇట్టి విప్లవం మనము కలిగించాలి. గవర్నమెంటు ఏమీ చేయజాలదు. సమాజములో ఒక విధమైన చైతన్యం వెల్లుబికి రావాలి. అట్టి మంగళమయమైన మార్పు వచ్చినపుడే మన సమాజము బాగుపడుతుంది. దురభ్యాసముల యందు మునిగి తేలే వారికందరికి దీనిని మనసుకు పట్టేటట్లు

వారు ఫీల్ అయ్యేట్లు సమాజములోని వారు వారివెంటబడి బోధించాలి. పరివర్తనం కొరకు ప్రయత్నించాలి. సమాజంలో ఈ మార్పు వచ్చినపుడు సుఖశాంతులు విలసిల్లుతాయి.

దారులు కొట్టి జీవించేవాడు రత్నాకరుడు. అతడే వాల్మీకి అయినాడు. వల్మీకమంటే పుట్ట. పుట్టలోనుండి వచ్చి వాల్మీకి యైనాడు. దారులు కొట్టి భయంకరమైన జీవితం గడపేవాడు. నారదున్ని కలుసుకొనుటవలన, ఆయన వాన్ని మారవలెనని సంకల్పించడం వలన దారులు కొట్టే గజదొంగ రామాయణం వ్రాసి, ఆదికవి అనిపించుకొని ఆచంద్రతారార్కము యశస్సు నార్జించినాడు. ఈ విధమైన మార్పు మానవునిలో మాత్రమే కలుగుతుంది వీనిలో భగవదంశయున్నది. అది మనుష్యున్ని మాధవునిగా కూడా మార్చివేయ గలదు.

మానవుడు ఆ విధమైన గొప్ప గుణాలతో శోభించవలె నని చెబుతూంటే దానిని విని "నేనెక్కడ! ఆ దివ్యమైన గుణాలెక్కడ! నక్క ఎక్కడ? నాగలోక మెక్కడ?" అని భావించుకొని తన్ను తాను ఎవరునూ కించ పరచుకోరాదు. సంయయము, సదాచారము ను జీవితంలో స్వీకరించిన ఎంతటి యున్నతినైనా మానవుడు పొందవచ్చును. ప్రయత్నిస్తే తప్పక సఫలం కాగలదు. ప్రహ్లాదుని గుణగణములను ఎట్లు చెప్పుచున్నాడో చూడండి.

"భవమహార్ణవ తారకు, కామరోషలోభాది విరోధివర్గ పరిహారకు, కేశవచింతనామృతా స్వాదకఠోరకున్" సంసార సముద్రాన్ని దాటినాడట. కామక్రోధాది శత్రువర్గాన్ని సంహరించినాడట. కేశవచింతనమనే అమృతాన్ని త్రాగి గొప్ప శక్తిగల వాడైనాడట. కావున ఈ మార్గమే బంగారు వంటి మార్గము. ఆ ప్రహ్లాదుని విషయం చదివినపుడు నేను కూడ జీవితములో నట్టి ఉన్నతిని సాధించవలెనని మనకందరికి ఉత్సాహము కలుగవలె.

సరే ఈ విధమైన ప్రహ్లాదున్ని పిలిపించుకొని హిరణ్యకశిపుడు ఆప్యాయముగ తన తొడపై కూర్చో బెట్టుకున్నాడు. ముద్దాడినాడు. శిరస్సు మూర్కొన్నాడు. లాలించినాడు. చెప్పుచున్నాడు. కుమారా!

"ఉత్సాహ ప్రభుమంత్ర శక్తియుతమై యుద్యోగ మారూఢ సం
విత్సంపన్నుడ వైతివే? చదివితే వేదంబులున్ శాస్త్రముల్
వత్సా! రమ్మని చేర జీరి కొడుకున్ వాత్సల్య సంపూర్ణుడై
యుత్సంగాగ్రము జేర్చి దానవ విభుం డుత్కంఠ దీపింపగన్."
7-139

ఈ పద్యములో హిరణ్యకశిపుని రాజనీతిజ్ఞత, వ్యవహార కుశలత అద్భుతముగ గోచరిస్తుంది. ఉద్యోగమంటే పని చేయుట. ఏదైనా కార్యము చేయబూనుకుంటే మూడు విధములైన శక్తులుండాలట. ఉత్సాహశక్తి, ప్రభుశక్తి, మంత్రశక్తి. ఉత్సాహము లేకపోయినా, ప్రభుశక్తి లోపించినా, మంత్రశక్తి ఉపయోగింపబడక పోయినా కార్యము సఫలము కాజాలదు. నీవు చక్రవర్తివి కాబోతావు. కావున దానికి కావలసిన యోగ్యతను బాగా విజ్ఞతతో నేర్చుకున్నావా? ఈ విధమైన చాతుర్యమును వృద్ధిపరచుకొనుటకు వేదములు, శాస్త్రములు చదివితివా? అని ప్రశ్నిస్తూ, తన తొడపైన వాత్సల్యముతో లాగి కూర్చోబెట్టుకున్నాడు. అడుగుచున్నాడు.

పుత్రా! ఏమేమి చదివితివి తండ్రీ!

"అనుదిన సంతోషణములు జనితశ్రమతాప దుఃఖ సంశోషణముల్
తనయుల సంభాషణములు జనకులకుం గర్ణయుగళ
సద్భూషణముల్." 7-140

కుమారునియొక్క మధురమైన మాటలు మహాసంతోషమును కలిగించి లోపలి తాపమును పోగొట్టాయికదా! తండ్రి

యొక్క చెవులకు యోగ్యమైన కొడుకు భాషణములు నిజమైన భూషణములు నాయనా! నీవు మాట్లాడే ప్రతిమాట నాకెంతో ఇంపుగా ఉంటుంది. కావున,

"పుత్రా నీకు భద్రం బెయ్యది చెప్పుమనిన కన్నతండ్రికి ప్రియ నందనుం డిట్లనియె." 7-141

'నీకు భద్రం బెయ్యది" అంటే ఎట్టి ప్రశ్నో చూడండి. సమస్త జనులకు భద్రము నేనే. నన్నాశ్రయించిన వారు మాత్రమే భద్రంగా ఉంటారని హిరణ్యకశిపుని భావన. తన కుమారుడు కూడ దీనినే చెప్తాడని వాని ఊహ. అయితే ప్రహ్లాదుడు తండ్రి యభిప్రాయమునకు వ్యతిరేకముగా ఏమి చెప్పతాడు? ఎట్లా చెప్పతాడు? నిర్భయముగా, నిస్సంశయముగా చెప్పతాడు. తండ్రీ!

"ఎల్ల శరీర ధారులకు నిల్లను చీకటి నూతి లోపలన్
ద్రెళ్ళక వీరు నేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్నతని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లము జేర్చి కారడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ." 7—142

హిరణ్యకశిపుని భావన ఎట్లుండినది. గురువులు నేర్పిన విద్యేది? 'హిరణ్యకశ్యపాయ నమః' అని గురువులు నేర్పిన విద్య నేర్చుకొని ఉంటాడని వాని విశ్వాసము. కుమారుడు తన ఆశను అడియాస చేసే సమాధానము పై పద్యము ద్వారా చెప్పుచున్నాడు. 'శరీర ధారులెల్లరు తమ యిల్లు అనే చీకటిలో పడకుండా, మీరు—మేము అనే భేదభావన యనెడు మతిభ్రమతో చరించకుండా, సర్వము ఆ పరమాత్ముని దివ్య లీల అని భావించి ఆయన యందు చిత్తము నుంచి నిశ్చింతగ ఉండడము మేలు తండ్రీ అన్నాడు.

ఈ మాటలు వినుసరికి వానికి మనస్సులో ఎట్లెట్లో అయి ఉంటుంది. అయినను కొడుకుపైన ఉండే వాత్సల్యము కొద్ది తాను

నవ్వినాడు, మాటలు మాత్రము ప్రతిపక్షీ కనుకూలమైనవే. ఈ మాటలు అతనికి ములుకుల వలె పొడిచికొని ఉండవచ్చు. కాని పుత్రుడు చాలా ముద్దుగ ఉన్నాడు. కావున ఎట్లో ఆ మాటలలోని చేదును దిగమ్రింగి నవ్వినాడు. నవ్వి ఇట్లంటున్నాడు.

"నాకుం జూడగ చోద్యమయ్యెడుగదా నా తండ్రి యీ బుద్ధి దా
నీకున్ లోపల దోచెనో పరులు దుర్నీతుల్ పఠింపించిరో
యేకాంతంబున భార్గవుల్ పలికిరో యీ దానవశ్రేణికిన్
వైకుంఠుండు కృతాపరాధుడతనిన్ వర్ణింప నీకేటికిన్." 7-145

పుత్రా! నీ మాటలు వింటే నాకు చాలా విస్మయము కలుగు చున్నదిరా! ఈ విధమైన విచిత్రపు బుద్ధి నీకే స్వయముగ పుట్టినదా? లేక ఏకాంతమున గురువు లేమైనా బోధించిరా? నాయనా! వైకుంఠుడు మన దానవశ్రేణికి విరోధి. కావున వానిని వర్ణింపవద్దు కుమారా! మీ చిన్నాయనను చంపినాడు. కావున వానినుండి మనస్సు త్రిప్పుకో.

ఇదిగో! నేను చెపుతున్నా చూడు నేను చెప్పినట్లు నీవు చేయి.

"సురలన్ ద్రోలుటయో సురాధిపతులన్ శిక్షించుటో సిద్ధులం
బరివేధించుటయో మునిప్రవరులం బాధించుటో యక్షకి
న్నరగంధర్వ విహంగ నాగ పతులన్ నాశంబు నొందించుటో
హరియంచున్ గిరియంచు నేల చెడ మోహాంధుండవై పుత్రకా."
7-146

దేవతులను పరిగెత్తించడమో, దిక్పతులను నొప్పించుటయో సిద్ధులను మునులను బాధించుటో యక్ష కిన్నర, గంధర్వాదులను నాశము చేయుటో నీకు తగిన పని. పుత్రకా! హరి గిరి యని మోహాంధుండవై ఎందుకు చెడిపోతావు? నాయనా! అంటున్నాడు.

హిరణ్యకశిపునికి ప్రహ్లాదుడు చెడిపోతున్నట్లు కనబడు చున్నాడు. నిజముగా చెడిపోతున్నదెవరు? ఈ ప్రపంచములో ఒకడు ఇంకొకన్ని గురించి వానికి బుద్ధిలేదు అంటాడు. వాడుకూడ పిన్ని బుద్ధిహీనుడంటాడు. మరి ఎవరికి బుద్ధి యున్నట్లు?

సర్వసాధారణముగ ఒక సత్యము సర్వులు గమనింపదగినది. ఇంటిలో పిల్లలు మంచివాడు కావాలె అంటే తల్లిదండ్రులు ముందు సదాచారులుగా ఉండాలె వారు దారితప్పితే పిల్లలు కూడ దారి తప్పుతారు. ఒక పర్యాయ మొక వ్యక్తి యింటికి నేను పోయి యుంటిని. ఆ యింటి యజమాని తన కుమారున్ని పిలిచి "బుజ్జీ! ఈ బీడి అంటించుకొనిరా" అని బీడీ యిచ్చినాడు. వాడు 3 లేక 4 ఏండ్ల బాలుడు. బీడీ అంటించుకొని త్రాగుతూనే వస్తున్నాడు. నాకది సహింపరాక "ఏమయ్యా! పిల్లవాన్ని నాశనము చేస్తున్నా" వంటి. దాని కతడు నా మాటను పట్టించుకొననే లేదు. ఆ పిల్ల వాన్ని మా బుజ్జిగా అని ముద్దు పెట్టుకుంటున్నాడు. ఈ విధముగ పెద్దలను చూచి అనుకరించే శక్తి పిల్లలకు అద్భుతముగ ఉంటుంది. పిల్లలకు దురభ్యాసములు అలవడని మార్గములో వాళ్ళను కాపాడ వలె. అంటే పెద్దలు ఆదర్శమైన మార్గములో నడవాలి.

అయితే ఇక్కడ ప్రహ్లాదుని విషయములో ఇది వ్యతిరేకము. ఇది పుట్టుకతో వచ్చిన సంస్కార ప్రభావము. "యా నిశా సర్వ భూతానాం తస్యాం జాగర్తి సంయమీ" అన్ని భూతములకు ఏది నిద్రాసమయమో దానిలో సంయమి మేలుకొంటాడు. సామాన్య మానవులు రాగద్వేషాదులతో కూడుకొనియుంటారు. వారు దేని యందు ఆసక్తిగలిగి ప్రవర్తిస్తారో! సంయమీంద్రుడు అచ్చట నిద్రిస్తాడు. సామాన్యమానవులు దైవమార్గములో, ఆత్మసాధన మార్గములో నిద్రిస్తారు. దానియందితడు మేల్కొని ఉంటాడు.

మనము కథలోకి వస్తాము. ఈ విధముగ తండ్రి మాట్లాడినాడు "అనిన తండ్రి మాటలకు పురోహితు నిరీక్షించి ప్రహ్లాదుడిట్లనియె" 7—167

"అజ్ఞుల్ కొందరు మేము దామనుచు మాయంజెంది సర్వాత్మకుం
బ్రజ్ఞాలభ్యు వరాన్వయ క్రమములన్ భాషింపగా నేర రా
జిజ్ఞాసా పథమందు మూఢులు గదా చింతింప బ్రహ్మాది వే
దజ్ఞుల్ తత్పరమాత్ము విష్ణు నితరుల్ దర్శింపగా నేర్తురే. 7-148

అజ్ఞులైనవారు మేము - తాము అనుకొని మాయతో కూడి వ్యవహరిస్తారు. ఈ ప్రపంచములో ఉండే వాడొక పరమాత్మయే. ఆ పరమాత్మను తెలుసుకోలేక మాయలో పడి ఆయనను గురించి మాట్లాడలేరు. బ్రహ్మాది వేదజ్ఞులుకూడ ఆయనను దర్శింపజాలరు. ఆయన ప్రజ్ఞాలభ్యుడు. దురన్వయములచేత తెలుసుకో బడడు.

ఆ పరమాత్మ సర్వవ్యాపకుడు. అయినప్పటికిని మానవుడు అటు ఇటు చూచి ఇక్కడ ఎవ్వరు లేరని చేయరాని పని చేయబూను తాడు. మనుష్యుని స్వభావ మెట్టిదంటే తన పనిని ఎవరైనా చూస్తున్నారంటే ఒక రకముగా చేస్తాడు. చూడలేదంటే మరొక రకముగ చేస్తాడు. దీన్ని తెలిపే ఒక ఉదాహరణ.—

ఒకడు తన ప్రియురాలు ఎచ్చటనో ఉండేదానికి ఒక లెటరు గోప్యంగా వ్రాసుకుంటున్నాడు. అతి నిశ్శబ్దముగ ఏకాంతముగ వ్రాసుకుంటూంటే వాని స్నేహితుడు ఎవరికి వ్రాస్తున్నాడో, ఏమి వ్రాస్తున్నాడో చూద్దామని పిల్లి కాళ్లతో మెల్లగా వాని భుజములపై నుండి చూడ సాగినాడు. వ్రాసేవానికిది తెలిసింది. వాడు వ్రాసి నాడు. ఓ ప్రియురాలా! నీకింకను చాలా రహస్య విషయాలు వ్రాయాల్సి ఉండె అయితే నేనీ లెటరు వ్రాస్తూంటే ఒకడు బేవకూఫ్ నా వెనుక నుండి చూస్తూన్నాడు అందువలన ఇంక ఇంతకంటే

నీకు ఎక్కువ వ్రాయజాలను అని ఉత్తరం ముగించినాడు. చూచే వానికి కోపము వచ్చింది.

"ఏమోయ్! నీ యుత్తర మెప్పుడు జూచినానోయ్! నన్ను బేవకూఫ్ అంటున్నావు?" అన్నాడు. దానికి ఉత్తరం వ్రాసేవాడు "నీవు నా ఉత్తరం చూడకుంటే నిన్ను బేవకూఫ్ అన్నానని ఎట్లు తెలిసె? నేను నోటితో నిన్ను అనలేదు కదా!" అన్నాడు. కాబట్టి నేను చేసే పని సర్వేశ్వరుడు చూస్తూన్నాడనే జ్ఞానము మనకు స్థిరము కావాలి. ఆయన సర్వత్ర ఒకడే ఉన్నాడు. ఆయన లేనిచోటు లేదు. ఈ జ్ఞానమే స్థిరమైతే మానవుడు దుష్టకార్యాలు చేయజాలడు. ఇంక తత్వశాస్త్ర మేమంటుందంటే "సర్వం ఖల్విదం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" సర్వం బ్రహ్మ స్వరూపమే. అది తప్ప దానికన్యమైనది కించిత్తు కూడ లేదని చెబుతుంది. అజ్ఞులైనవారు మేము - మీరు అని భేదభావముతో వ్యవహరించి మాయకు గురియగుచున్నారు. ఒక్క పరమాత్మే సర్వత్ర వ్యాపించి ఉన్నాడను జ్ఞానము ప్రహ్లాదునికి స్థిరముగ నున్నది. ఈ జ్ఞానమునకు వ్యతిరేక మార్గమంతయు మాయా రాజ్యములోనిదే. మాయాదృష్టి భిన్నదృష్టి జ్ఞానదృష్టి అభిన్న దృష్టి. ప్రహ్లాదుని దిట్టి దృష్టి. కనుకనే తండ్రితో ఇంకను అంటున్నాడు. తండ్రీ!

> "ఇనుము మయస్కాంతి సన్నిధి నెట్లు భ్రాంత
> మగు హృషీకేశుసన్నిధి నా విధమున
> కరగుచున్నది దైవయోగమున జేసి
> బ్రాహ్మణోత్తమ చిత్తంబు భ్రాంతమగుచు." 7-149

తన మనస్సుయొక్క స్థితిని స్పష్టముగ చెప్పినాడు. నా చిత్తము అటువైపె పోతూన్నది. దీనిని త్రిప్పడం చేత కాదన్నట్లు

సూచన గోచరమగుచున్నది. ఇంకనూ చెప్పుచున్నాడు. ఏ యే విధముగ ప్రహ్లాదుడు చెప్పుచున్నాడో ఆయా విధముగ హిరణ్యకశిపునికి కోపమధికమగుచున్నది. అయితే ప్రహ్లాదుడు జంకకుండా నిర్లక్ష్యముగ తన మనస్సులోని స్థితినంతయు చెప్పుచున్నాడు.

"మందారమకరంద మాధుర్యమున దేలు
మధుపంబువోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికల దూగు
రాయంచ జనునె తరంగిణులకు
లలితరసాల పల్లవఖాదియై చొక్కు
కోయిల జేరునే కుటజములకు
పూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరక
మరుగునే సాంద్ర నీహారములకు
అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల." 7-150

కమలములోని మకరందము త్రాగే తుమ్మెద ముండ్లచెట్లపైకి పోదు. నిర్మలమైన గంగానదీ మందమంద తరంగములపై విహరించు రాజహంస సెలయేళ్ళలోనికి పోదు. మృదువైన మామిడి చిగురులను తింటూండే కోయిల ముండ్లపొదలకు పోదు. పున్నమనాటి చంద్రుణ్ని చూస్తూ ఆనందపడుచుండేటి చకోరపు పక్షి మంచుస్థలములకు పోదు. తండ్రీ! భగవంతుని దివ్యమైన పాదారవిందముల యందలి చింతనా అనే అమృతాన్ని త్రాగి మత్తెక్కిన నా చిత్తము యితరము నాశించదు. వేయి మాటలెందుకు తండ్రీ! నా చిత్తము మత్తెక్కి పోయినది. ఇంక యేమి చెప్పినా నా మనస్సు మారదని స్పష్టముగ చెప్పివేసినాడు.

ఈ మాటలను చెప్పేటప్పుడు మొదట ఆచార్యులను చూస్తూ చెప్పడం ప్రారంభించినాడు కావున పురోహితుల గుండెలు కొట్టు కొనసాగినాయి. వెంటనే రాజసేవకుండైన పురోహితుడు ప్రహ్లాదున్ని చూస్తూ వాని మాటలను తిరస్కరిస్తూ ఈ విధముగ చెప్ప సాగినాడు.

"పంచశరద్వయస్కుడవు బాలుడ వించుకగాని లేవు భా
షించెదు తర్కవాక్యముల జెప్పిన శాస్త్రములోని యర్థ మొ
క్కించుకయైన జెప్పవసురేంద్రునిముందట మాకు నౌదలల్
వంచుకొనంగ జేసితివి వైరివిభూషణ వంశదూషణా" 7-152

ప్రహ్లాదా! ప్రహ్లాదా! ఏమి పని చేసితివి? మేమేది చెప్పినామో అది చెప్పక మాకు అవమానము కలుగ జేసినావు. అంటూ ఇంకను పురోహితుడంటాడు.

"తనయుడుగాడు శాత్రవుడు దానవభర్తకు వీడు దైత్య చం
దనవనమందు కంటకయుత క్షితిజాతము భంగి బుట్టినా
డనవరతంబు రాక్షసకులాంతకు ప్రస్తుతి సేయుచుండు దం
డనమునగాని శిక్షలకు డాయడు పట్టుడు కొట్టుడుద్ధతిన్" 7-153

మహారాజా!

"నీపాపని చదివించెద నీపాదములాన యింక నిపుణత తోడన్
గోపింతుము దండింతుము కోపింపకుమయ్య దనుజకుంజరసింహా" 7-154

అని హిరణ్యకశిపునికి కోపము రాకుండ వ్యవహరించి ప్రహ్లాదున్ని మరల పిలుచుకొని పోతారు.

ఓం సర్వేవై సుఖినస్సంతు.

పదునాలుగవ రోజు ఉపన్యాసము సమాప్తము.

---:o:---



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదునైదవ రోజు ఉపన్యాసము

"ఓం గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః॥"

"యోఽంతః ప్రవిశ్య మమవాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిల శక్తిధరః స్వధామ్నా
అన్యాంశ్చహస్త చరణ శ్రవణత్వగాదీన్
ప్రాణాన్నమో భగవతే పురుషాయ తుభ్యమ్"

"క్షోణితలంబునన్ నుదురుసోకగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికి చంచరీకచయసుందర వేణికి రక్షితామర
శ్రేణికి తోయజాతభవ చిత్తవశీకరణైక వాణికిన్
వాణికి నక్షదామశుక వారిజ పుస్తక రమ్యపాణికిన్."

భాగవత శ్రవణాసక్త చిత్తులారా! పరమపుణ్యాత్ములారా! పరమపవిత్రమైనట్టి భాగవతము. భగవంతుని అపారమైన అనుగ్రహముచేతనే మనకిట్టి బంగారువంటి అవకాశము చిక్కింది. అందువలన భగవంతునికి మాటిమాటికి ధన్యవాదములు చెల్లించుకోవాలి. స్వామీ! ఏమి నీదయ! ఇంతటి రసముతో కూడుకున్న భాగవతాన్ని శ్రవణం చేసే భాగ్యాన్ని ప్రసాదించినావు; లోకములో ఎందరెందరో నిరంతరము కేవలము కడుపు నింపుకునేందుకు

రేయింబవళ్ళు తాపత్రయ పడుతూన్నారు, అయినా వారికి తృప్తి కలుగుట లేదు. నిరుపేదరికముతో తాపత్రయ పడేవారు కొందరు. కొందరు ధనమధికముగ ఉండి అనేకములైన దురభ్యాసాలల్లో వ్యసనములలో చిక్కుకొని తాపత్రయపడుతూండేవారు కొందరు. నానావిధములైన మార్గాలలో జీవితము గడపుచూ నీ శ్రవణామృతమును పొందుట యెట్టిదో ఎరుగని వారెందరో ఉన్నారు. అట్టి కాలములో మాకు ప్రాతఃకాలములోనే నీ శ్రవణామృతాన్ని గ్రోలే భాగ్యము ప్రసాదించినావు స్వామీ! అని భక్తిచేత పరవశమైన చిత్తముతో భగవంతున్ని ప్రపత్తిని పొంది నమస్కరిస్తాము.

జీవితమానందముగ జరుగుటకు పొట్టే ప్రధానము కాదు. పొట్టే ప్రధానమై ఉంటే హాయిగ, కమ్మగ తిని పండుకొమ్మంటే పండుకొంటూరా? శాంతిగ పండుకోరు. ఇపుడు ప్రభుత్వముయొక్క భావము తినడానికి తిండి, కట్టడానికి బట్ట, ఉండడానికి ఇల్లు - ఈ మూడు ఉంటే అందరు సుఖంగా బ్రతుకుతారని దాని విశ్వాసము. ఈ భావము తప్పు. మానవుడు కేవలము తన కడుపునిండితే అన్యమైన కోరికలు లేకుండా ఉండాలి. అట్లుండుట లేదు. పై మూడు పుష్కలముగ ఉండిన వారు శాంతిగా ఉన్నారా? మానవుడు కేవలం శరీరము మాత్రమే కాదు గదా! శరీరము ఆవల ఇంద్రియాలున్నవి. వాటి కావల మనస్సున్నది. దానికావల బుద్ధి ఉన్నది. దానికిపైన ఆత్మ ఉన్నది. ఆ ఆత్మ బుద్ధులు తృప్తి పడాలి. మన శ్శాంతి ఉన్న శరీరమునకు శ్రమయుండినను పరవా లేదు. మానవునకు శరీరమునకు సుఖము, మనస్సుకు శాంతి, ఆత్మకు ఆనందము లభించాలె. శరీరసుఖమునకంటే మించినవి శాంత్యానందములు. అవి ఎక్కడ చిక్కుతాయి? ఏ బజారులో చిక్కుతాయి? ఎంత డబ్బిస్తే చిక్కుతాయి? లక్షలు డబ్బిస్తే

చిక్కుతాయా? కోట్లు డబ్బిస్తే చిక్కుతాయా? అట్టి శాంత్యానందములను ప్రసాదించేసి మహత్తరమైన భాగవత శ్రవణము, దీనిచేత జ్ఞానప్రాప్తియై ఆత్మానందమును సులభముగ పొందే యీ యవకాశమును ప్రసాదించినావు తండ్రీ! అని మానవుడు లోపల భగవంతునికి కృతజ్ఞతలు తెలుపుకుంటుండవలె. వాని లోపల కృతజ్ఞతాభావమెంత అధికమౌతుందో అంత హృదయము నమ్రమవుతుంది. ఈ మార్గమున అద్భుతమైన ఆనందరసప్రాప్తి కలుగుతూంటుంది.

ఈ ప్రపంచములో ఒకమానవుడింకొక మానవునికి అవసరం పడినప్పుడు కొంత ధనం సహాయము చేస్తే, అదనులో శరీర సేవ గాని,సాంత్వనపు మాటలుగాని కొద్దిగా చేస్తే కనిపించినపుడంతయు మనము నమస్కారము పెడుతూంటాము. ''నాయనా! నీవా సందర్భములో ఆ విధముగ సహాయము చేయకపోతే ఈ దినం నేనిట్లుండే వాన్ని కాదు. భగవంతుడనంతమైన వస్తువుల నిచ్చినాడు. వానికి నమస్కారము చేయవద్దామరి? ఇన్ని అనంతములైన వస్తువుల నిచ్చి జీవితము కాపాడుచున్నాడే! ఆయనకు నమస్కారము చేయడమే కాదు. ఆయన విషయాలను స్మరించి ప్రపత్తిచేత నమ్రమైన హృదయముతో భావుకుడై పరవశము చెందాలి.

ప్రహ్లాదున్ని చండామార్కులు మరల చదివించుటకు పిలుచుకొని పోయినారు. అపుడు ప్రహ్లాదున్ని, తమ వద్ద కూర్చోబెట్టుకొని ప్రాధేయపడుతూ చెప్పుచున్నారు.

''త్రిప్పకు మన్న మా మతము దీర్ఘములైన త్రివర్గ పారముల్
దప్పకు మన్న నేడు మన దైత్యవరేణ్యుని ప్రోల నేము మున్
జెప్పిన రీతిగాని మరి చెప్పకుమన్న విరోధి నీతులన్
విప్పకుమన్న దుష్టమగు విష్ణు చరిత్ర కథార్థ జాలముల్.''7-158

ప్రహ్లాదా! మా మతము త్రివర్గమైనది. దీనిని త్రిప్పవద్దు నాయనా! మన దైత్యుని వద్ద మేమెట్లు చెప్పుతామో అటులనే చెప్పు, విరోధియైన విష్ణుని కథలను చెప్పనే వద్దు.

ఈ విధముగ వారు కొన్ని దినాలు చెప్పుతారు. శ్రద్ధగా చెప్పి మీ తండ్రితో మేము చెప్పిన పాఠములు మాత్రమే చెప్పుమని ప్రాధేయపడి ఒకదినము ప్రహ్లాదున్ని పిలుచుకొని చండామార్కులే హిరణ్యకశిపుని వద్దకు పోతారు. ఆయనతో చెప్పారు. మహానుభావా! మీ కుమారున్ని చదివించి తెచ్చినాము. మీరు విని ఆనందించండి.

"శిక్షించితి మన్యములగు పక్షంబులుమాని నీతి పారగుడయ్యెన్
రక్షోవంశాధీశ్వర! వీక్షింపుము నీ కుమారు విద్యాబలమున్."
7-161

ఆ విధముగ గురు కుమారులు చెబుతూంటే ఆ మాటలు చాలా మధురములుగా తోచినాయి. ఇంతలో పిల్లవాడు కూడ తండ్రికి సాష్టాంగ ప్రణామములు చేసి నిలుచుకుంటాడు. ఆ కుమారున్ని చేతులుచాచి వాత్సల్యముతో దగ్గరకు తీసుకుంటాడు. చాలాసేపు గాఢాలింగనం చేసుకుంటాడు. తన తొడమీద కూర్చోబెట్టుకుంటాడు. తలను నిమరుతాడు. గడ్డము పట్టుకుంటాడు. ముద్దు పెట్టుకుంటాడు. తలను మూర్కొంటాడు. ప్రేమాతిరేకమున కలిగిన ఆనంద బాష్పములతో ఆ కుమారుని వదనారవిందమును తడుపుతాడు. అపుడు మందమైన మధురాలాపములతో ఇట్లంటాడు. కుమారా! నా పున్నముల తండ్రీ!

"చోద్యంబయ్యెడు నింత కాలమరిగెన్ శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువులే వెంటం బఠింపించిరో
విద్యాసారమెరుంగ గోరెద భవద్విజ్ఞాత శాస్త్రంబులో
పద్యం బొక్కటి జెప్పి సార్థముగ తాత్పర్యంబు భాషింపుమా."
7-163

ఇంత కాలము జరిగింది పుత్రా! నీవు శాస్త్రశోధన చేసి యేమేమి చదివినావో నీకు తెలిసిన శాస్త్రములోని ఒక పద్యము చెప్పి దాని తాత్పర్యము వివరించు నాయనా! అన్నాడు.

అంతే కాదు ప్రహ్లాదా! నీతో సమానముగ చదివే దైత్య బాలకులు నీతిపాఠ మహిమలో నీకంటే అధికముగ నున్నారు. వారంతా అడిగినదే తడవుగా అన్ని విషయాలు చెప్తారు. పుత్రా! నీవు ఎన్నడు మతిమంతుడవౌతావో! అని తీవ్రమైన కాంక్షతో నిరీక్షిస్తున్నాను. నీ ఉత్కర్షను ప్రదర్శిస్తూ ఒక పద్యము చెప్పు తండ్రీ!

ఈ విధముగా అద్భుతమైన వాత్సల్యముతో పులకిత గాత్రుడైన తండ్రికి కుమారుడంటాడు. తండ్రీ!

''చదివించిరి ననుగురువులు చదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నే
చదివినవి గలవు పెక్కులు చదువులలో మర్మమెల్ల చదివితి
తండ్రీ! 7-166

ఈ మాట అంటే చదువులలో మర్మమెల్ల చదివితి అనే మాట వినుసరికి తండ్రికి పట్టరాని ఆనందమైనది. సమస్తము చదివితి, అనే కుమారుని మాటలు తండ్రిని పరవశము చేసినాయి. ''ఏదీ! త్వరగా చెప్పు కుమారా! (చదువులలోని మర్మము)'' అన్నాడు హిరణ్యకశిపుడు. ప్రహ్లాదుడు చెప్పుచున్నాడు.

''తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా
ర్చనముల్ సేవయు నాత్మలో నెరుకయున్ సంకీర్తనల్ చింతనం
బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యో
త్తమా.'' 7-167

ఇవి నవ విధ భక్తులు.

"శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్।
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్॥"

ఈ తొమ్మిది మార్గముల ద్వారా సర్వాత్ముడైన శ్రీహరిని నమ్మి, ఆయనే నాకు సత్యముగా భద్రమును కలిగించువాడని నమ్మియుండడము మంచిది తండ్రీ. ఇది వినేవేళకు తండ్రికి ఎట్లెట్లో అనిపించింది. ప్రహ్లాదుడింకా చెబుతున్నాడు.

"అంధేందూదయముల్ మహాబధిర శంఖారావముల్ మూక స
ద్గ్రంథాఖ్యాపనముల్ నపుంసక వధూ కాంక్షల్ కృతఘ్నావలీ
బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యముల్ క్రోడ స
ద్గంధంబుల్ హరిభక్తి వర్జితుల రిక్తవ్యర్థ సంసారముల్."
7-168

తండ్రీ! హరిభక్తి లేనట్టి మానవుల సంసారములు గ్రుడ్డి వానికి చంద్రోదయము వంటివి, చెవుటివాని ముందర శంఖమూది నట్లు, మూగవాని ముందర సద్గ్రంథముల్ చదివినట్లు, నపుంసకుని వద్ద సుందరమైన స్త్రీ ఉండినట్లు, కృతఘ్నులతో బాంధవ్యము చేసి నట్లు, బూడిదలో హోమము చేసినట్లు, లోభివద్ద ధన ముండినట్లు, పంది ముందర సద్గంధమును పెట్టినట్లు వ్యర్థము లైనవి.

ఉదాహరణలు, ఉపమానము లెట్లున్నవో చూడుడు! పోతన భాగవతము వ్రాయుట ఆంధ్రుల పున్నెము. ఈ పద్యము లొక్కొక్కటి ఒక్కొక్క రత్నము. ప్రహ్లాదుడింకా ఆగలేదు. చెబుతున్నాడు.

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము

విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీఁది బుద్ధి బుద్ధి
దేవ దేవుని చింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభినీ ధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి హరి జేరు మనియెడి తండ్రి తండ్రి.'' 7-169

మహాత్మా! ఆ శ్రీహరిని పూజించే చేతులే చేతులు. ఆయనను పలికే నాలుకే నాలుక. దేవతలను రక్షించే ఆ దేవ దేవుని చూచే చూపులే చూపులు.

ఆ శ్రీమన్నారాయణునికి మ్రొక్కే శిరమే నిజమైన శిరము. విష్ణుగాథలను గురించి వినే చెవులే చెవులు. ఆయనను చూచే కన్నులే కన్నులు. ఆయనను గురించి నడచే కాళ్ళే కాళ్లు. ఆయన మీద ఆధారపడి ఉండే బుద్ధియే నిజమైన బుద్ధి. ఆయనను గురించి చింతన చేసిన దినమే సార్థకమైన దినము. ఆయనను తెలిపే చదువే చదువు. ఆయనను గురించి చెప్పేవాడే గురువు. ఆయనను చేరమని చెప్పేవాడే నిజమైన తండ్రి.

అంటే నీవు నిజమైన తండ్రివి కావని చెప్పినట్లు.

ఇంకను జంకు కొంకు లేకుండా నిర్భయముగ తన అభిప్రాయాన్ని వెళ్లడించుచున్నాడు. ఏమి అతని నిర్భీకత! వినండి.

''కంజాక్షునకు గాని కాయంబు కాయమే
పవన గుంభిత చర్మ భస్త్రి గాక
వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమ ఢమ ధ్వని తోడి ఢక్క గాక

హరి పూజనము లేని హస్తంబు హస్తమే
తరుశాఖ నిర్మితదర్వి గాక
కమలేశు జూడని కన్నులు కన్నులే
తను కుడ్యజాల రంధ్రములు గాక
చక్రి చింత లేని జన్మంబు జన్మమే
తరళ సలిల బుద్బుదంబు గాక
విష్ణు భక్తి లేని విబుధుండు విబుధుడే
పాదయుగము తోడి పశువుగాక. 7-170

తండ్రి ఒక పద్యము చెప్పి అర్థమును వివరించమంటే ఏక ధాటిగా ఆశ్చర్యమును గొలుపునట్లు అద్భుతమైన శబ్దజాలముతో, పాండిత్యప్రకర్షతో నిలుపులేకుండా సెలయేరు గలగల ప్రవహించినట్లుగా చెప్పుచున్నాడు. ఈ విధమైన వాగ్వైభవమునకు తండ్రికి సంతోషమేగాని చెప్పే విషయము అతనికి విషమువలె గన్పట్టుచున్నది. అతని కనుబొమలు సుళ్ళు దిరుగుచున్నవి. పై పద్యార్థము చూడుడు. తండ్రీ! కమలనయనుడైన భగవంతునిసేవలో వినియోగపడని శరీరము వ్యర్థము. అది గాలితోకూడిన చర్మపు తోలుతిత్తి. వైకుంఠుని పొగడని నోరు ఢమ ఢమ అని వాగే ఢక్కా మాత్రమే. హరిని పూజించనట్టి చేయి చెట్టుకొమ్మతో చేసిన చెక్కగరిటవంటిది. ఆ మాధవుని చూడనట్టి కన్నులు శరీరమనే గోడకుండు రంధ్రముల వంటివి. చక్రిచింత లేనట్టి జన్మము నీటిబుడగవంటిది. ఆ విష్ణువుపైన భక్తిలేని మానవుడు రెండు పాదములు గల పశువుతో సమానమే. హిరణ్యకశిపుడు వింటూ విస్తుపోతున్నాడు. ఏమి యీ పాండిత్యం! ఏమీ యీ ధైర్యం! ఏమి యీ భక్తి! దేనికది Superlative degree లో అంటే అన్నీ వర్ణించుటకు వీలులేని అద్భుత శ్రేణిలో ఉన్నాయి.

తండ్రియొక్క విస్మయానికి హద్దులేదు. పిల్లవాడింకను చెప్పు చున్నాడు.

"సంసారజీమూత సంఘంబు విచ్చునే చక్రిదాస్యప్రభంజనము లేక
తాపత్రయాభీల దావాగ్నులారునే విష్ణుసేవామృత వృష్టిలేక
సర్వంకషాఘౌఘజలరాసులింకునే హరిమనీషా బడబాగ్ని లేక
ఘన విపద్గాఢాంధకారంబులడగునే పద్మాక్షునుతి రవిప్రభలులేక
నిరుపమాపునరావృత్తి నిష్కలంక ముక్తినిధి గానవచ్చునే
ముఖ్యమైన
శార్ఙ్గి కోదండచింతనాంజనము లేక తామరసగర్భునకునైన
దానవేంద్ర" 7-171

ఏమి శబ్దములయొక్క అభివ్యంజన కళ! అద్భుతము. సంసారమనే మేఘముల గుంపు భగవంతుని దాస్యమనే తీవ్రమైన గాలిలేక తొలగిపోదు. భగవంతుని సేవ అనే అమృతవర్షము లేక తాపత్రయమనే భయంకరమైన అగ్ని చల్లారదు. పాపపు సముద్రములు హరిభక్తి అనే బడబాగ్ని లేక ఇమికిపోవు. విపత్తులనే గాఢాంధకారములు పరమేశ్వరుని స్తోత్రమనే సూర్యప్రకాశ కిరణములు లేక నాశనము కాదు. సాటిలేని మోక్షము అనే ముక్తినిధి భగవంతుని చింతన యనెడు అంజనము లేక కనుగొన బడజాలదు.

"అని యివ్విధంబున వెరపు మరపు నెరుంగక ఉలుకు చెడి పలి కెడు కొడుకు నుడువులు సెవులకు ములుకుల క్రియనొదవిన పెదవుల దరంగదురుచు నదరిపడి గురుసుతునింగనుంగొని విమతకథ నంబులు గరపినాడవని దానవేంద్రుండిట్లనియె" — 7-172.

పిల్లవాని వైదుష్యమేమో వర్ణనాతీతము. హిరణ్య కశిపుడు అదరిపడినాడంటే ఆ బాలుని నిర్భీకత, వాణీ వైభవము

అసాధారణమైన బుద్ధి ప్రాశస్త్యము వీటియొక్క ఔన్నత్యము హిరణ్యకశిపునికి అందుకొనుటకు సాధ్యము కాలేదు.

అయితే గురువు తానే పిల్లవాన్ని పిలుచుకొని వచ్చి చిరుత వాని విద్యావైభవము చూడమన్నాడు. కావున గురువును చూచి హిరణ్యకశిపుడంటున్నాడు.

"పటుతర నీతిశాస్త్ర చయపారగుఁ జేసెదనంచు బాలు నీ
వటు గొనిపోయి వానికి యనర్హములైన విరోధి శాస్త్రముల్
కటిలత జెప్పినాడవు భృగుప్రవరుండ వటంచు నమ్మితిన్
కటకట బ్రాహ్మణాకృతివిగాక యథార్థపు బ్రాహ్మణుండవే"
7-173

గొప్పదైన నీతిశాస్త్రమునందు నైపుణ్యమును నేర్పుతామని బాలున్ని తీసుకపోయి అయోగ్యములైన విరోధిశాస్త్రములను కుటిలబుద్ధితో బోధించినావు. నీవు బ్రాహ్మణ ఆకృతిని కలిగి యున్నావు కాని నిజమైన బ్రాహ్మణుడవేనా ? అని గురువును నిందించినాడు.

ఈ మాటలు విను సరికి చండామార్కులు భయకంపితులై వణక సాగినారు. ఈ పిల్లవానితో వాళ్ళకు ప్రాణాంతకమైన పరిస్థితి యేర్పడ్డది. ప్రాణాలు అరచేతిలో పట్టుకొని వారు భయత్రస్తులై యీ విధముగ విన్నవింప సాగినారు. మహారాజా!

"తప్పులు లేవు మావలన దానవనాధ విరోధిశాస్త్రముల్
సెప్పము క్రూరులై పరులు సెప్పరు మీచరణంబులాన సు
మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీమ యెవ్వరుం
జెప్పెడిపాడిగాదు ప్రతిచింత దలంపుము నేర్పుకై వడిన్" 7-176

మావలన తప్పులు లేవు. విరోధి శాస్త్రములు మేము చెప్పము. మరి యెవరును చెప్పరు. ఈ మహాద్భుతమైన నీ కుమారుని ప్రజ్ఞ

సహజముగానే అతనికి సంప్రాప్తమైనది. దీనికి తగిన ప్రతిక్రియ ఆలోచించవలసినది, అని గురువులు చెప్పిరి. ఇంతటి అసాధారణమైన బుద్ధిచాతుర్యము అనన్య సామాన్యము. ఇంతేగాక మేము మీకు మిత్రులము. పురోహితులము. నీ పుత్రునికిట్టి బోధ చేయుటకు మేము శత్రువులమా? కాదు. మేమట్లు చేయజాలమని మిక్కిలి వినయముతో చండామార్కులు ప్రాధేయపడితే హిరణ్యకశిపుడు పుత్రున్ని చూచి అడుగుచున్నాడు.

''ఒజ్జలు సెప్పని యీ మతి మజ్జాతుడవైన నీకు మరి యెవ్వరిచే
నుజ్జాతమయ్యె బాలక తజ్జనులన్ బేరుకొనుము,
తగనా ప్రమోలన్'' 7_179

కుమారా! పెద్దలు సెప్పని యీ విధానము నాకు కొడుకువైన నీకెట్లు కలిగిందిరా! నీకెవ్వరు దీనిని నేర్పినారో వారి పేరు చెప్పు ప్రహ్లాదా! అని సౌమ్యముగా అడిగినాడు.

పిల్లవాని యీ ప్రజ్ఞచేత తండ్రి విస్మితుడైనాడు. వాడే హరిపైన భక్తి కలిగియుంటే ప్రహ్లాదుమన్నెంత మెచ్చుకొని యుండునో శబ్దములు జాలియుండేవి కావు. కాని వాడు శత్రుభావము కలిగియున్నాడు. అందువలన ఆ రుచిని అనుభవింపజాలక పోయినాడు. తండ్రి మాటలు విని కుమారుడు ప్రహ్లాదుడు అదే విధమైన శాంతచిత్తముతో చెప్పుచున్నాడు.

''అచ్చపు చీకటిం బడి గృహవ్రతులై విషయప్రమత్తులై
చచ్చుచు పుట్టుచున్ మరల చర్వితచర్వణులైన వారికిన్
చెచ్చెర పుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన యే
మిచ్చిననైన కావలగు నేగిననైన హరిప్రబోధముల్'' 7-181

తండ్రీ! దట్టమైన చీకటిలో బడి గృహసంబంధమైన విషయాలలో తన్మయులై చచ్చుచూ పుట్టుచూ మరల మరల చర్వితచర్వణులైన

వారికి హరి ప్రబోధములు కలుగుట తన స్వకీయమైన శుభేచ్ఛ చేత గానీ యేమైనా యిచ్చినాగానీ, కానలకు అంటే అరణ్యాలకు పోయినప్పటికగాని సాధ్యము కాదు గదా!

ప్రహ్లాదుని యొక్క ఆ భక్తిధార ఆగుట లేదు. ప్రవహింప సాగినది. ఇంకా చెప్పుచున్నాడు. తండ్రీ!

"కాననివాని నూతగొని కానని వాడు విశిష్ట వస్తువుల్
కానని భంగి కర్మముల గైకొని కొందరు కర్మబద్ధులై
కానరు విష్ణు గొంద రట గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా!"
7-182

గ్రుడ్డివాడు గ్రుడ్డివాడిని సహాయము గొని యే వస్తువులను తెలుసుకొన జాలని విధముగా మానవులు కర్మములతో చిక్కుకొని విష్ణువును తెలుసుకోజాలరు. కాని భగవంతుని పాదముల యందు కర్మములను అర్పించువారు మాత్రము పరమాత్మను పొందుతారు.

ఈ విధముగా అనర్గళముగా శ్రోతలు విస్మయపడేటట్లు ఇంతటి బుద్ధికుశలత, అభివ్యంజనా కళావైభవము ఎవరికైనను సాధ్యమా అనునట్లు ఆశ్చర్యమును బొందునట్లుగా ఇంకనూ చెప్పు చున్నాడు. ఇపుడు నిష్కర్ష తేల్చి తెలుపుచున్నాడు.

"శోధింపంబడె సర్వశాస్త్రములు రక్షోనాథ వేయేటికిన్
గాథల్ మాధవ సేముషీ తరణి సాంగత్యంబునం గాక దు
ర్మేధన్ దాటగ వచ్చునే సుతవధూ మీనోగ్ర వాంఛామద
క్రోధోల్లోల విశాల సంసృతి మహాఘోరామితాంభోనిధిన్."
7-183

తండ్రీ! సర్వశాస్త్రములు శోధింపబడినాయి. వేయి గాథ లెందుకు! భగవంతుని గుణగాన సాంగత్యమున గాక భార్యా,

బిడ్డలు, బంధువులతో చుట్టబడిన యీ సంసారసముద్రమును దుర్మేధతో తరించుట సాధ్యము కాదు. కేవలము భగవంతుని చింతనామృతము, శ్రవణామృతముతోనే యీ సంసారమును దాటుట సాధ్యము కాని మరొక్క మార్గము లేదు. సర్వశాస్త్రములు శోధింపబడినాయి. ఈ నిష్కర్ష తేల్చబడినది. వేయి మాటల నవసరమని తండ్రిని గురువులను నోరు మూయించినాడు.

ఇన్ని మాటలు తన తొడలపై కూర్చొని మాట్లాడుతూన్నాడు. అసాధారణమైన వీని ప్రజ్ఞముందర గురువుల మేధస్సు, తన ప్రజ్ఞ ఇంక లెక్కకు రావనుకున్నాడు. ఒక్కతూరి బ్రహ్మాండమైన కోపము వచ్చింది. ఒక్కతూరి ఆ ... అని గర్జించినాడు.

"అని పలికిన కొడుకును ధిక్కరించి మక్కువ సేయక రక్కసుల రేడు తన తొడలపై నుండనీక గొబ్బున దిగద్రొబ్బి నిబ్బరంబగు కోపంబు దీపింప, వేడిచూపుల మింట మంట లెగయ మంత్రులం జూచి యిట్లు లనియె." 7 - 184

"పంచాబ్దంబులవాడు తండ్రినగు నా పక్షంబు నిందించి యు
త్కంచి ద్భీతియు లేక విష్ణు నహితుం గీర్తింపుచున్నాడు వ
ల్దంచుం జెప్పిన మాన డంగమున పుత్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించి రండు దనుజుల్ మీమీ పటుత్వంబులన్."
7 _ 187

తన మనస్సు గజిబిజి యైనది. ఐదేండ్లవాడు. నా పక్షాన్ని నిందించి నన్ను తిరస్కరించి భయములేకుండా విష్ణువును కీర్తించుచున్నాడు. వలదని చెప్పిన వినడే. నా శరీరములో పుత్రరూపమున వ్యాధి పుట్టింది. వీన్ని మీరు తీసుకపోయి చంపిరాండి. అన్నాడు.

ఏమియు తోచుటలేదు. వీని బుద్ధి తిరిగేటట్లు లేదు. కావున వీన్ని చంపడమే మేలు శరీరములో పుండు పుట్టితే చికిత్సకుడు

దాన్ని కోసివేసి శేష శరీరమును రక్షించుకున్నట్లు వీన్ని చంపించి నా కులమును నిర్దోషము చేసుకుంటా ననుకుంటాడు.

ఆ రాజు ఎప్పుడు ఆజ్ఞ నిచ్చినాడో వెంటనే భయంకరమైన రాక్షసులు పలువిధములైన ఆయుధములు ధరించి, ఆ బాలునిపై బడినారు. నరుకుటకు ప్రయత్నించేవారు, పొడువబూనిన వారు, పలువిధములైన మారణప్రయత్నములు చేయసాగినారు.

''నదంతో భైరవానందం ఛింది భింధీతి వాదినః।
ఆసీనం చాహనచ్ఛూలైః ప్రహ్లాదం సర్వ మర్మసు॥''

రాక్షసులందరు భీకరమైన అరపులరచుచూ ఛేదించండి, ఛేదించండి అంటూ కూర్చున్నట్టి ప్రహ్లాదుని మర్మావయవములను బాధింపసాగినారు. వీరింతగా బాధిస్తూంటే వ్యాయామము చేత కండలు పురిదిరిగిన రాక్షసులు, మహాబలవంతులై యింతగా పొడుచుచూ బాధించుచున్నప్పటికిని తండ్రి ఊరకే ఉన్నాడు.

''బాలుడు రాచబిడ్డడు కృపాళుడు సాధుడు లోకమాన్య సం
శీలుడు వీడవధ్యుడని చిక్కక స్రుక్కక క్రూరచిత్తులై
శూలములం దదంగముల సుస్థిరులై ప్రహరించి రుగ్రవా
చాలత నందరున్ దివిజ శత్రుడు వల్దనడయ్యె భూవరా!''7-191

తండ్రి చూస్తూండి కూడ ఏమనకున్నాడు. వారిని వారించనే లేదు. ఎంతటి కఠిన చిత్తము! అయితే ఆ ప్రహ్లాదు డేట్లున్నాడు?

''పలువురు దానవుల్ పొడువ బాలుని దేహము లేశమాత్రము
న్నొలియదు లోపలన్ రుధిరముబ్బదు కందదు శల్య సంఘము
న్నలియదు దృష్టివై భవము నష్టముగాదు ముఖేందు కాంతియున్
బొలియదు నూతన శ్రమము పుట్టదు పట్టదు దీన భావమున్.''
7-192

ఆశ్చర్యము! విస్మయము! ఇంతమంది దానవులు ఆ బాలున్ని పొడుస్తూ, తన్నుతూ, నరుకుతూంటే ఆ దెబ్బలే మాత్రము తగులుట లేదు. బాలుని శరీరము కందదు. రక్తము గడ్డకట్టదు. ఎముకలు నొవ్వవు. కండ్లమీద పొడుస్తూంటే దృష్టికేమాత్రము హాని కలుగదు. ముఖకాంతి యేమాత్రము తగ్గదు, ఏ మాత్రము దైన్యభావమును పొందడు.

ఇంకా పిల్లవాడేమంటున్నాడు? ఎట్లున్నాడు? చూడండి.

"తన్ను నిశాచరుల్ పొడువ దైత్యకుమారుడు మాటిమాటికిన్
పన్నగశాయి యో దనుజ భంజన యో జగదీశ యో మహా
పన్న శరణ్య యో నిఖిల పావనయంచు నుతించు గాని తా
కన్నుల నీరు దేడు భయకంప సమేతుడు గాడు భూవరా! 7-193

ఆ రాక్షసు లావిధముగా బాధపెడుతూంటే మాటిమాటికి ఓ పన్నగశాయి! దనుజభంజన! జగదీశ! దీనరక్షకా! నిఖిల పావన అంటూ భగవంతుని పిలుస్తాడే కాని కన్నులలో నీరురాదు. భయకంపితుడు గాడు.

అందరికి అద్భుతమైన ఆశ్చర్యము కలుగుచున్నది. హిరణ్యకశ్యపు డెక్కడ! ఐదేండ్ల బాలు డెక్కడ! వాని భటులతో ఆ బాలున్ని చంపింప జాలక పోవడం ఇంతకంటే భగవద్భక్తిలోని శక్తికి మరొక ఉదాహరణ కావలెనా? ఆ మార్గమే అటువంటిది. ఇంకా ఆ ప్రహ్లాదుని స్థితిని చూడండి.

"ఇట్లు సర్వాత్మకంబై యిట్టి దట్టిదని నిర్దేశింపరాని పరబ్రహ్మంబు దానయై యమ్మహావిష్ణుని యందు చిత్తంబు జేర్చి తన్మయుండై పరమానందంబునుం బొందియున్న ప్రహ్లాదుని యందు రాక్షసేంద్రుండు దన కింకరుల చేతం జేయింపుచున్న మారణ

కష్టంబులు పాపకర్మునియందు బ్రయుక్తంబులైన సత్కారంబులుం
బోలె విఫలంబులగుటం జూచి. 7—195.

పరమాత్మను స్మరిస్తూ స్మరిస్తూ తానే పరమాత్మయై పోయి నాడు. ఈ ప్రపంచములో ఇది ఒక సత్యము. దేనిని గురించి తీవ్రముగ అనుకుంటూంటామో అదే తానై పోతాము. ఆ బ్రహ్మ స్వరూపమే తానై ఆ పరమాత్మయందు చిత్తంబు చేర్చి తన్మయు డైనాడు. ఆ బాలుని చంపుటకు చేసిన ప్రయత్నములన్నియు పాపాత్మునికి సత్కారము చేసినట్లు వ్యర్థములై పోతే వాటిని చూచి విస్మయపడి హిరణ్యకశిపుడను కుంటాడు.

"శూలములన్ నిశాచరులు స్రుక్కగ దేహము నిగ్రహింపగా
బాలుడు నేలపై బడడు పారడు చావడు తండ్రినైన నా
పాలికి వచ్చి చక్రధరు పక్షము మానితినంచు పాదముల్
ఫాలము సోక మ్రొక్కడనపాయత నొందుట కేమి హేతువో!"
7 - 196

వాని ఆశ్చర్యాని కంతులేదు. ఎందుకు? వానికీ సైన్సు తెలియదు. అయితే వాడు తన ప్రయత్నమును మానుకో లేదు. మహాక్రూరమైన చిత్తము కలవాడు. కనుకనే –

"ఒక మాటు దిక్కుంభి యూధంబు
దెప్పించి కెరలి డింభకుని ద్రొక్కింప బంపు
నొక మాటు విషభీకరోరగ శ్రేణుల
గడువడి నర్భకు గరువ బంపు
నొక మాటు హేతి సంఘోగ్రానలములోన
విసరి కుమారుని వేయ బంపు
నొక మాటు కూలంకషోల్లోల జలధిలో
మొత్తించి శాబకు ముంప బంపు

విషము బెట్ట బంపు విదళింపగా బంపు
దొడ్డ కొండ చరుల ద్రోయ బంపు

బట్టి కట్ట బంపు బాధింపగా బంపు
బాలు గిసిసి దనుజ పాలు డధప. 7 _ 197.

ఈ విధముగ ఏనుగులతో త్రొక్కించినాడు. భయంకర సర్పములతో కరిపించినాడు. భీషణమైన అగ్నిలో విసరి వేయించినాడు. సముద్రములలో ముంపించినాడు. విషము పెట్టించినాడు. పెద్ద పెద్ద కొండ చరియలలో విసరి పారవేయించినాడు. ఎన్నో విధముల వానిని చంపుటకు ప్రయత్నించినాడు. కాని చావ లేదు. ఈ విధముగ వానిని చంపుటకు సాధ్యమైనన్ని మార్గములలో ప్రయత్నించినాడు. కాని వాని ప్రయత్నములన్నియు వ్యర్థములై పోయినాయి. ఆ పాపరహితుడైన పాపని రూపు మాపలేక ఏకాంతములో విపరీతమైన చింతతో రాక్షసుడు తన మనస్సులో ఇట్లను కొంటాడు.

"ముంచితి వార్ధులన్ గదల మొత్తితి శైలతటంబులందు ద్రో
బ్భించితి శస్త్రరాజి పొడిపించితి మీద నిభేంద్రపంక్తి ద్రో
క్కించితి ధిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందు ద్రో
యించితి బెక్కుపాట్ల నలయించితి చావ డిదేమి చోద్యమో! 7-201

సముద్రములో పారవేయిస్తిని. గదలతో మొత్తించితిని. పర్వతంబుల మీద నుండి క్రిందికి నెట్టి వేయించితిని. అనేకములైన అస్త్రాలచేత పొడిపించితిని. ఏనుగలతో త్రొక్కించితిని. ధిక్కరించితిని. శపించితిని. అనేకవిధముల నలయించితిని. కాని చావడే. ఇదేమి ఆశ్చర్యమో!

హిరణ్యకశిపునికి దిక్కుతోచ లేదు. వీనిలో ఏమో అద్భుతమైన శక్తి ఉన్నది, అని ఈ విధముగ నేలకు తలను వంచుకొని పరి పరి విధముల వ్యాకులపడుతూ విచారపడుచున్నాడు.

ఓం సర్వేవై సుఖినస్సంతు.
పదునైదవ రోజు ఉపన్యాసము సమాప్తము.

—:o:—



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదునారవ రోజు ఉపన్యాసము

"శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలన కళాసంరంభకున్ దానవో
ద్రేక స్తంభకు కేళిలోల విలసద్దృగ్జాల సంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాంగనా డింభకున్"

"యోఽన్తః ప్రవిశ్యమమవాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిల శక్తిధరః స్వధామ్నా
అన్యాంశ్చహస్త చరణ శ్రవణత్వగాదీన్
ప్రాణాన్ నమో భగవతే పురుషాయ తుభ్యమ్"

పవిత్రాత్ములారా! భాగవతశ్రవణాసక్తమత్త చిత్తులారా!

భగవంతుడు, భక్తుడు, భాగవతము మూడును ఒకటే నన్నారు పెద్దలు. భాగవతము శ్రవణము చేస్తూ దానితో తాదాత్మ్యత చెందే భాగ్యాన్ని భగవంతుడు ఆ పార్థసారథి మనకు ప్రసాదించినాడు. ఆయనకు ప్రథమములో అనేకానేక ప్రణామములను చెల్లించుకొని కార్యక్రమమున కుపక్రమిస్తాము.

ప్రపంచములో నొక సత్యమున్నది. ఏమంటే! ఏ వస్తువు ఎక్కడి నుండి వచ్చిందో ఆ వస్తువు అక్కడికే పోయి చేరుకుంటుంది. నదులు ఎక్కడి నుండి వచ్చినాయి, సముద్రములలో నుండి సూర్యుని వేడిమికి జలము ఆవిరి రూపమున పైకిపోయి మేఘరూపమున వర్షించి నదులైనవి. ఆ జలము నదులరూపమున



ప్రవహించి మరల సముద్రములోనే వచ్చి చేరుతుంది. అంటే నది దేనినుండి వచ్చింది ? సముద్రము నుండి. మరల దానిలోనే లీనమవుతుంది. వ్యవహారములో చూడండి. నేను మాయింటి నుండి వచ్చినా, మీరిక్కడ నాకెన్ని సౌకర్యములు చేసిపెట్టినా మరల మా యింటికి నేను పోయి విశ్రాంతి తీసుకుంటా. ఇది దృష్టాంతము.

ఇక దార్ష్టాంతములో చూద్దాము. ఈ శరీరము మట్టిలో నుండి వచ్చింది. రేపు ప్రొద్దున మరణకాలములో మట్టిలో పోయి చేరుకుంటుంది. లోపలనున్న జీవుడో! అతడెక్కడ నుండి వచ్చినాడు ? భగవద్గీతలో భగవంతుడు చెప్తాడు 'మమైవాంశో జీవలోకే జీవభూతస్సనాతనః'' అంటే ఈ ప్రపంచంలోని జీవులంతా నా అంశము అంటాడు. అన్నప్పుడు మన స్వస్థానమేది ? ఎక్కడి నుండి వచ్చినాము ? అని ప్రశ్నిస్తే బ్రాహ్మణవాడి నుండి వచ్చినా, కుమ్మరివీధి నుండి వచ్చినా, అశోకనగరు నుండి వచ్చినా, అని చెప్తాడు. అది సత్యం కాదు. మనము పరమాత్మ నుండి వచ్చినాము. మన స్వస్థానము వేరు. మన యిల్లు వేరు. అది మరచి యీ లోకములోనికి వచ్చి నశ్వరమైన పదార్థములను నావి నేను అనుకుంటూ కంగారులో పడిపోయినాము మన స్వస్థానము పరమాత్మ కాబట్టి మనము ఎక్కడికి పోయి చేరుకోవాలి ? ''తద్విష్ణోః పరమం పదమ్'' విష్ణువుయొక్క పరమపదమును చేరుకోవాలి. అది మన స్వస్థలము.

స్వస్థలమును వీడి పరస్థలములో నున్నవానికి శాంతి సున్న. అందువలననే దేహబద్ధులైన, కర్మబద్ధులైన మానవులకు పరమశాంతి ఎక్కడి నుండి లభ్యము కావాలి. అందువలననే ''లోకం శోకహతం చ సమస్తమ్'' లోకమంతా శోకముతో హతమగు చున్నది. ఈ ప్రపంచము, ఈ శరీరము కొన్నాళ్ళు

మాత్రమే. రైల్వేస్టేషన్లలో వెయిటింగు రూము మాదిరి, మాయలో పడి మానవుడు వీటిని అనగా ఇల్లు, భూములు, ఆస్తులు పాస్తులు సత్యమనుకొని వాటితో ముడిపడ్డాడు. మొదట మన స్వస్థానమును తెలుసుకోవాలె. అపుడు ఎక్కడి నుండి వచ్చి నావంటే మనము పరమాత్మ నుండి వచ్చినా మన గలుగుతాము.

దేహము మట్టిలో నుండి వచ్చింది. మట్టిలో కలుస్తుంది. దేహానికి లోపల నుండే దేహి తన స్వస్థానము తెలుసుకుంటే పరమాత్మను స్మరిస్తూ తాను పరమాత్మలో లీనమవుతాడు. ఆ విధముగ గాక దేహము మట్టిలో కలిసె. ఆత్మ తన నిజస్వరూప జ్ఞానమును తెలుసుకొని పరమాత్మలో కలువకపోతే ఆ జీవుడు పిశాచియై అటు ఇటు గాలివలె తిరిగి నరక యాతన ననుభవించి కర్మదేవతలచేత ఏదో మురికి కూపములోనికి అంటే గర్భము లోనికి విసరివేయబడుతాడు. కాబట్టి ఈ శరీరముండగనే మనము మనస్వరూప జ్ఞానాన్ని పొందాలి.

రైలెక్కి ప్రయాణము చేసినట్లు మనము దేహాన్ని ధరించి ప్రయాణము చేస్తున్నాము. రైలెక్కిన మనుష్యుడు తాను మాట్లాడుతూండనీ, నిద్రపోనీ, ఏమైనా చేయుచుండనీ రైలు ప్రయాణము చేస్తూండినట్లు ఈ శరీరముకూడ స్టేషను వైపు పోతూంది. ఈ శరీరానికి రైల్వేస్టేషన్ నేది. దీనిని సర్వులు జ్ఞాపక ముంచుకోవాలి. దీనికి స్టేషను స్మశానము. అక్కడ దిగిన పిమ్మట జరిగేదేమి? లౌకికమైన ఉదాహరణ ప్రకారము స్టేషనులో దిగేవాడు వాడు చేరదగిన స్థానాన్ని ముందు తెలుసుకొనియైనా ఉంటాడు. లేకుంటే అడ్రసు కాగితము పైన వ్రాయించుకొని యైనా దిగి వారిని, వీరిని విచారించుకుంటూ తన గమ్యమును చేరుకుంటాడు. ఒకవేళ తాను చీటి వ్రాయించుకొని రాలేదు. తనకు ముందు గమ్యస్థానము తెలియదు. అట్లా వచ్చినవాడు –

వాని గతి యేమి? దిక్కు తెలియని గతి యౌతుంది. అటులనే మానవుడు తాను బ్రతికి యుండిన కాలములో మహాత్ముల సేవ జేసి తన స్వరూపజ్ఞానమును పొందజాలక పోయె. దానిని గురించి సాధన యేమాత్రము చేయలేదు. అట్టివాడు స్మశానమనే స్టేషనులో దిగితే వానిది యేమి గతి? దుర్గతి. దిక్కు తెలియక శోకగ్రస్తుడు కావలసిందే. అటులనే నేడు చాలామంది మహాత్ముల మాటలను వినక, శాస్త్ర జ్ఞానము లేక తన అడ్రసు తెలుసుకోకుండా స్మశానమనే స్టేషనులో దిగుచున్నట్లు వారి వారి నడకవలన తెలియుచున్నది. అట్టివారు చాలా దుఃఖ భాజనులౌతారు. వారే నరక యాతననుభవించేవారు. అట్లుగాక తన స్వరూప జ్ఞానమును పొందినవారు:—

"అంతకాలే చ మామేవ స్మరన్ ముక్త్వా కళేబరమ్।
యః ప్రయాతి త్యజన్ దేహం సయాతి పరమాం గతిమ్॥"

తన స్వరూప జ్ఞానము కలవారు అంత్యకాలములో తమ అంశియైన పరమాత్మను స్మరిస్తూ శరీరాన్ని వదలి పరమమైన గతిని పొందుతారు. మరణకాలములో మట్టిలో నుండి వచ్చిన శరీరము మట్టిలో గలిసె. పరమాత్మ నుండి వచ్చిన ఆత్మ తన స్వామియైన పరమాత్మను స్మరిస్తూ శరీరము ఎదలుటవలన తాను పరమాత్మలో కలిసిపోయె. శేషము లేకుండా జీవితం పరిసమాప్తమాయె. అందువలన మానవుని భౌతిక జీవితం ఎట్లా ఉండాలి? అంటే అది వాని మరణకాలాన్ని సంస్కరించేదిగా ఉండాలి. అది భక్తి మార్గము ద్వారా సులభసాధ్యం. ఈ భాగవతం ఆ భక్తి మార్గమును చక్కగా బోధిస్తుంది. ఇంక కథలోనికి ప్రవేశిద్దాము.

హిరణ్యకశిపుడు వ్యాకులములో చింతన జేస్తున్నాడు. ఏమేమో కష్టాలకు గురి చేసితిని. చంపుటకు ఎన్నెన్నో ప్రయత్న

ములు చేసితిని. చావకపోయె వానికర్థము కాలేదు. ఆశ్చర్యము, విస్మయము, భయము కలిగినాయి. భగవంతునికి భక్తుడైతే ఇంతటి శక్తి మహాత్మ్య కలుగుతుందని వానికి తెలియదు. కాబట్టి చావని కారణాన్ని గురించి తీవ్రముగా చింతాక్రాంతుడై విషాదముతో ఆలోచన చేస్తున్నాడు. మనస్సులో అనుకుంటున్నాడు. వీనిలో ఏమి మహాత్మ్యున్నదో!

"ఎఱుగడు జీవనౌషధము లెవ్వరు భర్తలులేరు బాధలన్
దరలడు నైజతేజమున తథ్యము జాడ్యము లేదు మిక్కిలిన్
మెరయుచునున్నవాడొక నిమేషము దైన్యము నొందడింక నే
తెరగునద్రుంతు వేసరితి దివ్యము వీని ప్రభావమెట్టిదో 7-202

జీవనౌషధము లేమైనా తెలుసునా? వాటినెరుగడే. వీనిని రక్షించేవారెవరైనా ఉన్నారా? అట్టివారొకరునూ లేరు. బాధల నన్న అనుభవింపడే. సహజ ప్రకాశములో నున్నాడు. ఏ విధమైన బాధలేకుండా ఉన్నాడు. మిక్కిలిగా మెరయుచున్నాడు. వీని ప్రభావము చాలా దివ్యముగా నున్నదే!

వానిని ఇంకను ఏయే మార్గములతో చంపవలెనో అన్ని మార్గములను ప్రయోగించినాడు. బ్రహ్మాండమైన బాధలు పెట్టుతాడు. కాని ఆ బాలుడు అన్నివేళలో నవ్వుతూనే ఉంటాడు. హిరణ్యకశిపుడు ఆగ్రహముతో చేసే పనుల నన్నిటిని బాధలుగా భావింపనే భావింపడు. ఇంకను ఇవన్నిటిని అనుగ్రహములనే తలుస్తాడు. నేను పెట్టే బాధలను గురించి పరులతో కూడ చెప్పుకోడే! ఏమిటీ విస్మయము! ఏ రూపముననూ ఎంత ఆలోచించినను, విచారించినను వాని మహాత్మ్య అర్థమే కాలేదు. చివరకు నిశ్చయపూర్వకముగ అనుకుంటున్నాడు.

"కావున వీడు మహాతపఃప్రభావ సంపన్నుండు. వీనికెందును భయంబు లేదు. వీనితోడ వైరంబువలన తనకు మృత్యువు సిద్ధించు.

అని నిర్ణయించి చిన్నబోయి, ఖిన్నుండై, ప్రసన్నుండుగాక క్రిందు
జూచుచు విషణ్ణుండై చింతనంబు సేయుచున్న రాజునకు మంత
నంబున చండామార్కులిట్లనిరి" 7-205

ఇచ్చట వానికి భయము కలిగింది. ప్రహ్లాదుడు మహాతపః
ప్రభావ సంపన్నుడు అని నిర్ణయము చేసుకుంటున్నాడు. ఆయన
కేవలము భగవత్పరమైన చిత్తము కలిగిఉన్నాడు. ఆ భక్తిలోనే
ఆ మహత్తు ఉన్నది. భగవద్భక్తులతోటి వైరము పెట్టుకుంటే
మృత్యువు కాక వేరే మేలు జరుగుతుందా? తనకు మృత్యువు తప్ప
దనుకున్నాడు. చిన్నబోయినాడు. ఖిన్నుడైనాడు. కేవలము
చింతాక్రాంతుడై తలవంచుకొని దిక్కుతోచక విచారించుచున్న
రాజుతో చండామార్కులంటారట :—

"శుభ్రఖ్యాతివి నీ ప్రభావము మహాచోద్యంబు దైత్యేంద్ర రో
షభ్రూయుగ్మ విజృంభణంబున దిగీశవ్రాతమున్ బోరులన్
విభ్రాంతంబుగ జేసి యేలితిగదా విశ్వంబు వీడెంత యీ
దభ్రోక్తుల్ గుణదోష హేతువులు చింతంబొంద నీ కేటికిన్"
7-206

దైత్యేంద్రా! నీ వెక్కడ! వీడెక్కడ? కనుబొమల సుళ్ళచేత
దిక్పతులకు భయభ్రాంతులనుగ చేసేవాడవు. విశ్వమునే ఏలిన
నీశక్తి ఏమి! ఈ బాలుడేమి లెక్క! చింతాక్రాంతుడవు
కావలదు.

ఈ పిల్లవాన్ని మరల పిలుచుకొనిపోయి త్రివర్గవిద్యను
బోధిస్తాము. మీరు నిశ్చింతగా ఉండండి. అని పిలుచుకొని
పోతారు. ప్రహ్లాదుడు వాళ్ళవెంట పోతాడు. వారు ఎంతో
శ్రద్ధగా వాళ్ళ త్రివర్గవిద్యను బోధిస్తారు. ప్రహ్లాదుడు "న సాధు
మేనే తచ్ఛిక్షాం ద్వంద్వారామోపవర్ణితమ్" ద్వంద్వారాముడు
అంటే విషయభోగ పరాయణునికి సరిపోయే ఆ విద్యను ప్రహ్లాదుడు

ఇది సరియైన విద్యకాదనుకున్నాడు. ఎందుకంటే హిరణ్యకశిపుని సిద్ధాంతమిది. చతుర్వర్గ సిద్ధాంతముకాదు. ధర్మము, అర్థము, కామము ఇదియే జీవితములో సాధింపదగినవి. మోక్షమవసరము లేదు, ఆ శిక్షను ప్రహ్లాదుడు తన మనస్సులో సరికాదని నిశ్చయము చేసుకొన్నాడు.

ఈ శిక్ష భోగాపేక్షకలవానికి. కాముకుడైన వానికి సరిపోతుంది. కాని మోక్షాపేక్షకలవానికిది గిట్టదు. అందువలన ప్రహ్లాదుడు వారు చెప్పేవిద్యను దాని సంగతిని పూర్తిగా గ్రహించి వారు బోధించేటపుడు ఊరకుండేవారు. ఒక పర్యాయము.

"యదాచార్యః పరావృత్తో గృహమేధీయ కర్మసు
వయస్యైర్బాలకైస్తత్ర సోపహూతః కృతక్షణైః"

అంటే ఆచార్యు డొకపర్యాయము గృహకార్యములో లీనమై ఉండగా రాక్షస బాలుర నందరిని తనవద్దకు పిలుచుకున్నాడు. అందరూవచ్చి ప్రహ్లాదుని చుట్టు ముట్టినారు. అప్పుడు ప్రహ్లాదు డంటాడు.

"బాలకులార రండు మనప్రాయపు బాలురు కొందరుర్వి పై
గూలుట గంటిరే గురుడు క్రూరు డనర్థచయంబునందు దు
శ్శీలత నర్థకల్పనము జేసెడి గ్రాహ్యముగాదు శాస్త్రముల్
మే లెఱిగించెదన్ వినిన మీకు నిరంతరభద్రమయ్యెడిన్ 7-212

బాలకులారా! ఇటురండి. నామాటలు వినండి, మన వయస్సులోనున్న వారంతా మరణించుట చూస్తున్నారు కదా! గురుడు క్రూరుడు. అర్థమును మనకు చక్కగా బోధించుట లేదు. అర్థానికి అనర్థాన్ని కల్పించి బోధిస్తున్నాడు. నేను శాస్త్రముయొక్క విధానము మీకు బోధిస్తాను. వింటే మీకు నిరంతర భద్రము కలుగుతుంది.

ఈ విధముగ వారినందరిని పిలుచుకొని గురువు చెప్పే శాస్త్రము మనకర్థముకాదు, నా మాట వింటే మీకెప్పుడు కల్యాణమే కలుగుతుంది. అని వారికి ఏ విధమైన ఆత్మబోధ చేస్తాడో చూడుడు. దీనిలో ఒక్కటి గమనించదగిన విషయ మున్నది. ఇంతకాలము రాక్షసబాలురు గురువు చెప్పే త్రివర్గమే విన్నారు. ఆ మార్గమునందే వారు అసక్తులైయున్నారు. ఆ విధమైన సంస్కారములో నున్న వారి మనస్సులను ఆశ్చర్యము కలిగించేటంత ఆకర్షణీయమైన మాటలలో, ఉపమానములతో చెప్పు చున్నాడు.

"కంటిరే మనవారు ఘనులు గృహస్థులై
విఫలులై గైకొన్న వెఱ్ఱితనము
భద్రార్థులైయుండి పామరు సంసార
పద్ధతి నూరక పట్టుబడిరి
కల యోనులందెల్ల గర్భాద్యవస్థల
పురుషుండు దేహియై పుట్టుచుండు
తన్నెఱుంగడు కర్మతంత్రుడై కడపట
ముట్టడు భవశతంబులకునైన
దీన శుభములేదు దివ్యకీర్తియులేదు
జగతి పుట్టి పుట్టి చచ్చి చచ్చి
పొరల నేల మనకు పుట్టని చావని
త్రోవ వెతకుకొనుట దొడ్డబుద్ధి. 7-214

పెద్దలైన మనవారందరు గృహస్థాశ్రమములో ప్రవేశించి విఫలులై వెఱ్ఱితనమును పొందుచున్నారు. దీనిని చూచుచున్నారు కదా! ఈ సంసారములోని అనుభవములందరికి తెలిసినవే. ఒక మనిషి అంటాడు. "ఏమి లేదండీ. నా యిద్దరు కుమారులకు పెండ్లిచేసి తరువాత రామా కృష్ణా అనుకుంటూ ఏకాంతముగ కూర్చుంటా"

నంటాడు. పెద్దవానికి పెండ్లి చేస్తాడు. చిన్నవానికి చేసేసరికి ఒకటి రెండు సంవత్సరాలు గడుస్తాయి. ఇంతలో పెద్దవానికి కొడుకు పుడ్తాడు. అట్లే కొంతకాలము గడచే వేళకు చిన్నవాని కొడుకు పుట్టి తాతా! ఎక్కడికి పోతావు? నేను వస్తా. నన్ను తీసుకొనిపో! అని మారాము చేస్తాడు. ఇంకను స్వేచ్ఛ తగ్గిపోతుంది. ఇవొక్క విధానములో చెప్పినా! సంసారబంధములు మరెన్నియో లెక్కకు లేనన్ని ఉంటాయి. మనుష్యులు భద్రార్థులు. భగవదంశీసంభూతులు. అయియుండికూడ సంసారివిషయ వ్యసనాలల్లో నిష్కారణముగ వివశులై పడియున్నారు. ఎన్ని యోనులలోనో జన్మాలు! వీటి కంతము లేదు. ఇంతకు తన స్వరూపము తెలుసుకో లేక కర్మతంత్రుడై పోతాడు. కాబట్టి ఇది శుభమైన మార్గము కాదు. పుట్టి చచ్చి ఏతింబానలాగా మాటి మాటికా యవస్థను బొందుట సరికాదు. పుట్టుక చావులేని దొడ్డమార్గమును మనమనుసరించాలి.

ప్రహ్లాదుడు ఈ ప్రపంచములోని మానవజీవిత స్వరూపాన్ని ఏ విధముగా చిత్రిస్తాడో చూడండి. ముఖ్యముగ సంసారబంధములో కామబంధము సర్వప్రధానము. దానిలో చిక్కుకున్నవానికి వ్యసనమే కాని సుఖము లేదు.

మానవుడు సంసారములోనే ఉండాలె. ఎట్లుండాలె? తామరాకును నీటిబిందు నంటనట్లుండాలె. సంసారములో తానుండినను తనలో సంసారముండరాదు. నీటిలోనే పడవ ఉండాలె. కాని పడవలోనికి నీరురారాదు. దోమలలోనే దోమతెర ఉండాలె. కాని దోమతెరలోనికి దోమలు రారాదు. సంసారమును కాదని మన మెక్కడ పోయి యుండాలె? కాని ఆ సంసారమును గురించియే లేనిపోని ఆలోచన లుండరాదు. భార్యాభర్త లిద్దరొక మంచముపై పండుకన్నారు. సంతానమింకను కలుగలేదే అని

అనుకుంటున్నారు. భార్య అన్నది "మనకు కుమారుడు కలుగుతే మంచము చాలదే మరి", దానికా భర్త కొద్దిగా జరిగి 'ఈ స్థల మైతే సరిపోతుంది కదా" అన్నాడు. మరల భార్య "ఈ స్థలము ఒక కుమారునికైతే సరిపోతుంది. ఇద్దరు పుట్టితే ఎట్లా"? అని అన్నది. దానికి వీడు మరికొంత జరుగబోయి మంచము క్రింద బడ్డాడు. మోచేయివద్ద ఎముక బెణికింది లబో శంకరా! అని ఏడ్వసాగినాడు. ఇరుగు పొరుగువారు వచ్చి "ఎందుకురా! ఏడు స్తున్నా"వంటే "పుట్టబోయే రెండవకుమారుని వలన నా చేయి ఎముక విరిగిందండీ" అని ఏడుస్తాడట. దానికి వారన్నారు, "ఒరే! పుట్టకముందే వాడు నీ చేయిని విరిచినాడే. వాడు పుడుతే మరేమి చేస్తాడో!" ఈ విధమైన అనర్థపరంపరకు తావలమై నిరంతర మును సంసారమును గురించి చింతించుచుండుట తగదు. జీవిత ములో దాని స్థానమెంతో అంతలో దానిని ఉంచాలె. రేయిం బవళ్ళు దానిని గురించికాదు అనుకొనవలసినది. భగవంతున్ని గురించి అనుకొనవలె.

ఈ విధముగ జరుగుచుండుట ఎందుకు? అంటే ప్రతివాని వ్యవహారము కామమయమై ఉంటుంది. మనుష్యుని జీవితములో అధికమైన వ్యసనము కామమును గురించే ఉంటుంది. నాయన లారా! ఎంత పెద్ద పండితుడైనా స్త్రీ ముందర జింకపిల్లైపోతాడు. తన ఆయుస్సు తరగిపోవుచుండుట గుర్తించడు. ఈ హీనస్థితిని గుర్తించండి. కావున ఈ కామమార్గమును వదలాలి. మానవుడు తన కార్యముల ద్వారా తన భవిష్యజ్జీవితాన్ని తయారుచేసు కుంటాడు. శిల్పి సుత్తె, వులి తీసుకొని ఒకరాతిని వందలయేట్లు వేలయేట్లు కొడితే రాయి శిల్పమవుతుంది కదా? అటులనే మాన వుడు త్రికరణములచేత చేసేపనులతో తన భవిష్యజ్జీవితము నిర్మల మగుచున్నది. ఆ త్రికరణములను ప్రేరేపించేది కేవలము కామ మైతే తత్సంబంధమైన జన్మే సంప్రాప్తమవుతుంది.

ఏ మనుష్యుడైనా నీ కెటువంటి జన్మ కావాలె? అంటే అన్నింటిని Superlative Degree లో కోరుకుంటాడు. కాని దాని కనుగుణముగా తన ఆలోచనా విధానములను, మాటలను, చేతలను మార్చుకోడు. మరి అట్టితరి వాడు కోరుకున్న రూపము, సంపత్తి మొదలగునవి ఎట్లు లభ్యమౌతాయి?

ఇంతకు మానవుడు తన ఆత్మజ్ఞానాన్ని సంపాదించుకోవాలె; సర్వేశ్వరుడైన పరమాత్మపై భక్తి కలిగి ఉండాలె. తన స్వరూపము తాను బాగా తెలుసుకోవలె. దేహము నేను కాదంటాడు. కాని తన స్వరూపము తనకు తెలియదు. ఇది మహావిచిత్రమైన మాయ. దారినపోయే వాడిని "ఎవడవురా బాబూ నీవు?" అంటే నేనెవరో నాకు తెలియదంటే వాన్ని పిచ్చివాడంటామా? మంచివాడంటామా? వ్యవహారములో మానవుడు నేను దేహము కాదు అంటాడు. ఇంద్రియములు కాదు, మనస్సు కాదు, బుద్ధి కాదు అంటాడు. మరి ఏమి స్వరూపముతో ఉన్నావు నీవు? నీ స్వరూపము నీ కెపుడైనా అనుభవములోనికి వచ్చిందా? వచ్చియుంటే దాని అనుభవ మెట్టిది? అది రావలెనంటే ఏమి చేయవలె? తనను ఎఱుగడు. కర్మచక్రములో చిక్కుకొన్నాడు. దాని నుండి నివృత్తి పొందాలి. అని హెచ్చరిస్తూ సామాన్యముగ నేటి మానవుని మానసిక స్థితి ఏ విధముగా కాముకమై ఉంటుందో దానిని చిత్రిస్తూన్నాడు.

"హాలాపాన విజృంభమాణ మదగర్వాతీత దేహోల్లస
ద్బాలాలోకన శృంఖలానిచయ సంబద్ధాత్ముడై లేశముక్
వేలా నిస్సరణంబు గానక మహావిద్వాంసుడున్ గామినీ
హేలాకృష్టకురంగ శాబకమగున్ హీనస్థితిం గంటిరే?" 7_215

మత్తెక్కించే పదార్థములను త్రాగుచూ, మదముచేత, గర్వముచేత స్త్రీలను దుష్టమైన కామబుద్ధితో చూస్తారు. ఆ స్త్రీ చూపులూ

కలిస్తే ఆ శృంఖలములచేత బద్ధుడౌతాడు. చిల్లిపడిన కుండలో నుండి నీళ్లు పోతూన్నట్లు పోతూండే కాలమును గుర్తించలేడు. మహావిద్వాంసుడు కూడ అమూల్యమైన ఆయుస్సు గడచిపోయేది తెలుసుకోనలేక కామకేళి నాకృష్టమైన జింకపిల్లయై స్త్రీ వెంట పోతాడు.

కామమంటే మాయే. ఆ కామము నన్నేమి చేయజాలదని యెవరును అనుకోనరాదు. చాలా జాగ్రత్తగా ఉండాలి. వేద వ్యాసుల వారివద్ద జైమిని మహర్షి ఉండేవాడు. వేదవ్యాసుడు పాఠము చెబుతూంటే జైమిని మహర్షి వ్రాసేవాడు ప్రతిరోజు పాఠము చెబుతూంటే జైమిని మహర్షి గుడ్డిగా వ్రాసేవాడు కాదు. తనకు సమ్మతమని తోస్తే వ్రాసేవాడు లేకుంటే ప్రశ్న వేసేవాడు. ఒకనాడొక పాఠము వచ్చింది. ఏమని! ''బలవా నింద్రియగ్రామో విద్వాంసమపకర్షతి'' అని అంటే బలవంతమైన ఇంద్రియ గ్రామము విద్వాంసున్నికూడ ఆకర్షిస్తుంది అని దాని అర్థము. అపుడు వ్రాస్తూ వ్రాస్తూ జైమిని మహర్షి ఆగినాడు. ''స్వామీ! బలవంతమైన ఇంద్రియగ్రామము అవిద్యావంతున్ని, అజ్ఞానిని ఆకర్షించవచ్చు గాని విద్వాంసున్ని ఆకర్షిస్తుందా? అంత శక్తి దానిలో ఉన్నదా'' అని అడిగినాడు. వ్యాసులవారు శిష్యా! ఈ దినానికి పాఠము చాలు. ఇంక రేపు వ్రాస్తువు లెమ్మని చెప్పినాడు. మధ్యాహ్నం భోంచేసి కొద్దిగా విశ్రాంతి తీసుకొని వ్యాసులవారు ''నాయనా! నేను పొరుగూరికి పోయి రావాలె. పోయి వస్తాను. ఆశ్రమాన్ని జాగ్రత్తగా చూచుకుంటూండు'' అని బయలుదేరినారు.

ఆ దినం పున్నమ. సాయంత్రం యేడు గంటలకు కొంచెము వర్షము పడింది. ఆ వర్షములో తడిసి ఒక సుందరి ఆశ్రమము వద్దకు వచ్చింది. ''స్వామీ! నేను అబలను. నేను చేరదగిన

స్థలము చాలాదూరమున్నది. ఈ రాత్రికి మాత్ర మిచ్చట ఉండి తెల్లవారుతూనే నా దారిన నేను పోతాను. దయయుంచి ఈ రాత్రి ఇచ్చట ఉండుటకు ఆశ్రయ మివ్వండి.'' అని ప్రార్థించింది. మొదట జైమిని వద్దన్నాడు. స్త్రీలతోనే సమస్త పాపములు కలుగుతాయి. వెళ్లిపొమ్మన్నాడు. అయితే ఆమె అతి సోయగముతో కోయిలవంటి కంఠముతో హావభావములతో మాట్లాడుతూ ప్రాధేయపడు తూంటే ఒప్పుకున్నాడు. ఇంతలో వెన్నెల బాగా రాసాగింది. వర్షమాగిపోయింది. ఆమె పలుచని వస్త్రముతడిసి శరీరపు భాగము కూడ కొంత కనబడుతూంది. ఆయన ''అదిగో! ఆ కుటీరములోనికి వెళ్ళి తలుపు పెట్టుకో. తెల్లవారేవరకు తలుపు తీయవద్దు సుమా! అన్నాడు. ఆమె వయ్యారముగా కుటీరములోనికి వెళ్ళింది.

జైమిని అరుగుమీద కూర్చున్నాడు. ఆ స్త్రీ ఆయనకు ఎంతో అందముగ కనిపించింది. ఆలోచింపసాగినాడు. స్త్రీ అంటే ఇంత అందముగ ఉంటుందా? ఏమి ఆ మాటల తీపి! ఆ అవయవ ముల పుష్టి! అయినా ఆమె వచ్చినపుడు మేఘాలు అడ్డముగ ఉండడము వలన ఆ సౌందర్యాన్ని సరిగా చూడజాలక పోతిని. ఇపుడు వెళ్లి చూస్తాను.

అయినా నేను పోవడం బాగుంటుందా? మరి ఆమె సౌందర్యమును బాగా చూచే అవకాశమేది? ఎట్లైతే నేమి? ఇపుడెవరు లేరు. పోయి మాట్లాడి ఆమెను బాగా చూస్తామను కున్నాడు. కూర్చోలేక పోయినాడు. కుటీరము వద్దకు వెళ్ళి గొళ్ళెము కొట్టినాడు, పిలిచినాడు. లోపలినుండి పలుకే లేదు. కుతూహలము పట్టడానికి సాధ్యము కాలేదు. కుటీరము పై కెక్కి గడ్డిని తొలగించి రంధ్రము చేసుకొని దాని నుండి క్రిందికి దుమికి నాడు. చూస్తే ఇంకేముంది. బారెడు గడ్డం. వేదవ్యాసులవారు

నిష్ఠలో కూర్చొన్నారు. అతని గుండె బెత్తెడు క్రిందికి జారింది. సాష్టాంగపడ్డాడు. అపుడు వేదవ్యాసులవారు నగుచూ "జైమినీ! బలవానింద్రియగ్రామో విద్వాంసం నాపకర్షతి కదా"? అన్నాడు. అపుడు జైమినీ మహర్షి "స్వామీ! బలవానింద్రియగ్రామో విద్వాంసం అపకర్షతి అపకర్షతి అపకర్షత్యేవ" అన్నాడు. పారమీా విధముగ అనుభవములోనికి వచ్చేటట్లు చేసి వ్యాసమహర్షి ముందు పాఠం చెప్పినాడు, ఇట్టిది కామమంటే, దాని విషయంలో నిర్లక్ష్యముగ ఉండరాదు. మానవుని గొప్పతనము ఎప్పుడు తెలుస్తుంది. ఏకాంతములో కాంతతో, కనకముతో వాని వ్యవహారము చూచినపుడు వాని గొప్పతనము తెలుస్తుంది. ఈ విధమైన ఉదాహరణలు ఎందుకు? మనము హెచ్చరికగ ఉండేందుకు.

మాయ అద్భుతమైన శక్తి గలది. దానినుండి తప్పుకోవడం చాలా కష్టం. ఎప్పు డేరూపమున మనుష్యున్ని మాయ ముంచుతుందో! ఒక మనిషి మరణిస్తున్నాడట. అతనితో మాయ వచ్చి "నా ఆటలు నీ ముందర సాగక పోయె. నీవు ధీరుడవు" అన్నదట. దానికాతడు "ఇపుడే కాదు. ఇంకా కొంత ప్రాణమున్నది. ఈ కాలములో నీవేమి చేస్తావో!" అన్నాడట. అందువలన ప్రపంచములో మానవుడు చాలా హెచ్చరికగ ఉండవలె. ప్రహ్లాదుడు రాక్షస బాలురకు చెప్పుచున్నాడు. రాక్షసబాలకులారా!

"విషయసక్తులైన వివిధాహితులతోడ
మనకి వలదు ముక్తిమార్గ వాంఛ
నాదిదేవు విష్ణు నాశ్రయింపుడు ముక్త
సంగజనులగూడి శైశవమున" 7-216

విషయములలో ఆసక్తులై యుండి వివిధమైన అహితుల గూడి ఉండడము తగదు. ముక్తిమార్గము కోరి ఆదిదేవున్ని విష్ణున్ని ఆశ్రయించండి. బాల్యములో ముక్తులైన మహాత్ములతో మోక్షము ను కోరి వ్యవహరించండి.

"సర్వాంతర్యామియైన పరమాత్మ నాశ్రయింపుడు. జనార్దన చరణసరసీరుహయుగళ స్మరణ సుధారసపాన పరవశులమైతిమేని మనకు దైవవశంబున నకాంక్షితంబులై ధర్మార్థకామంబులు, కాంక్షితంబై మోక్షంబు సిద్ధించు. పరమ పురుషుండైన హరికి నాత్మ సమర్పణంబు సేయుట మేలు. పరమాత్మ తత్త్వజ్ఞానోదయంబునం జేసి స్వపరభ్రాంతి జేయక పురుషుండు యోగవధూతత్త్వంబున నాత్మ వికల్పభేదంబునం గలలో గన్న విశేషంబుల భంగి తథ్యంబనక మిథ్యయని తలంచు. 7-217.

మనకు మోక్షము కావాలి. కావున సర్వాంతర్యామియైన పరమాత్మ నాశ్రయించాలి. ఆయన పాదయుగళ స్మరణ అనెడు అమృతరస పానమునందు పరవశులమైతే చాలు. ధర్మార్థకామంబులు కోరకుండినను సహజముగ లభిస్తాయి. అంటే సర్వాంగ సుందరమైన తృప్తికలుగుతుంది. దీనికొక ఉదాహరణ:—

ఒక భక్తుడు శివున్ని గురించి తపస్సు చేసినాడు. వాడెట్టి వాడంటే గ్రుడ్డివాడు, రోగి, దరిద్రుడు ఇంకెన్నో కొరతలున్నాయి. శంకరుడు ప్రత్యక్షమై ఏదైనా ఒక వరము కోరుకొమ్మన్నాడు. నీకు ఆరోగ్యమైనా కోరుకో, కన్నులనైనా కోరుకో అని ఈశ్వరుడు చెప్పినాడు. ఆ గ్రుడ్డివాడు "నేనుకూడ ఒకటే కోరుకుంటా స్వామీ!" అని పట్టాభిషిక్తుడైన కుమారున్ని చూచే భాగ్యమిమ్మన్నాడు. అంటే పట్టాభిషిక్తుడైన కుమారుడంటే పెండ్లి ఉండాలి. అష్టైశ్వర్యములు ఉండాలి. చూచే భాగ్యమంటే కన్ను

లుండాలి. మనవాడు శంకరుడ్నే భోలా చేసివైచినాడు. అంటే భగవంతున్నాశ్రయిస్తే సర్వాంగసుందరమైన ఉన్నతి కలుగుతుంది అన్నమాట.

అట్టి పరమదేవునికి ఆత్మసమర్పణము చేయడం శ్రేయస్కరము. పరమాత్మ తత్త్వజ్ఞానోదయముచేతనే పురుషుడు మాయనుండి తప్పించుకొంటాడు. ఈ ప్రపంచములోని విషయము కలలో గన్న ప్రపంచమువంటిదే. అని యీ విధముగ రాక్షస బాలురకు ఆత్మజ్ఞానోపదేశం చేసినాడు. ఈ మాటలన్ని రాక్షస బాలురకు చాలా విచిత్రముగ కనిపించినాయి. వారు విస్తుపోయినారు. ప్రహ్లాదా! ఈ జ్ఞానము నీకెట్లు గలిగెనయ్యా!

"మంటిమి కూడి భార్గవ కుమారకులొద్ద ననేక శాస్త్రముల్
వింటిమి లేదు సద్గురుడు వేరొకడెన్నడు రాజశాల ము
క్కంటికినైన రాదు సొరగా వెలికిం జనరాదు నీకు ని
ష్కంటకవృత్తి నెవ్వడు ప్రగల్భుడు సెప్పె గుణాఢ్య చెప్పుమా"
7-220

చండామార్కులెన్నియో శాస్త్రములు చెప్పగా వింటిమి. మాకు నీకంటే సద్గురువు వేరేలేదు. ఈ రాజభవనము ముక్కంటి కూడ ప్రవేశించుటకు సాధ్యము కాదే. ఏ ప్రగల్భునిచేత నీ విటువంటి అద్భుతమైన జ్ఞానమును పొందితి వయ్యా!

ఇంక మేము నిన్నే సేవిస్తాము. నీవే రాజువని భావిస్తాము. నీకే బహుమానములు చెల్లిస్తాము. అయ్యా! నీకింతటి వింత ప్రకాశమెట్లు కలిగెనో మాకు చెప్పవలసినదని ప్రార్థించినారు.

ఈ విధముగ వారు ప్రశ్నవేస్తే వెనుకటి కథ వారికి చెప్పినాడు. హిరణ్యకశిపుడు తపస్సుకు పోయినపుడు దేవేంద్రుడు వచ్చి లీలావతిని తీసుకొని పోతూంటాడు. అతని భయమేమంటే! వీని

వీర్యము కుమారుడుగా పుడితే వానితో దేవతలకెంత బాధ కలుగు తుందో. కావున వానిని ప్రసవిస్తానే అంతము చేస్తాము. అంత టితో భవిష్యత్తులో దేవతలకు రాబోయే బాధనివారణ అవుతుం దని దేవేంద్రుని భావన. కాని దారిలో నారదుడు తటస్థపడి దేవేంద్రా! ఈమె గర్భములో పరమభాగవతోత్తముడు పుడ్తాడు. అతనితో దేవతలుద్ధరింపబడుతారు. వాని తండ్రికీ కుమారుడే మరణకారకుడౌతాడంటే'' దేవేంద్రుడు సంతోషముతో వదలి పెడ్తాడు. పిమ్మట నారదుడు ఆమెను తనవద్దకు తీసుకపోయి గర్భ ములో ఉండిన యీ బాలునికి ఆత్మోపదేశము చేస్తాడు. ఈ విష యము రాక్షస బాలురకు వినిపిస్తాడు.

ఇది విని రాక్షసబాలురు విస్మితులై ప్రహ్లాదా! ఇంకను చెప్పవయ్యా! నీ మాటలు మాకు మంత్రాలవలె గోచరించు చున్నాయి. అంటే చెప్పుచున్నాడు.

''సంసారమిది బుద్ధిసాధ్యము గుణకర్మ
గణబద్ధ మజ్ఞానకారణంబు
కలవంటి దింతియకాని నిక్కము కాదు
సర్వార్థములు మనస్సంభవములు
స్వప్నజాగరములు సమములు గుణ
శూన్యుడైన పరమునికి గుణాశ్రయమున
భవవినాశంబులు పాటిల్లినట్లుండు
పట్టిచూచిన లేవు బాలులార
కడగి త్రిగుణాత్మకము లైన కర్మములకు
జనకమైవచ్చు నజ్ఞానసముదయమును
ఘనతర జ్ఞానవహ్నిచే గాల్చి పుచ్చి
కర్మ విరహితులై హరి గనుటమేలు'' 7-238

వేదాంతసారమంతా చెబుతున్నాడు. ఈ సంసారము యథార్థము కాదు. బుద్ధిచేత ఆలోచనచేస్తే ఈ సంగతి యథార్థమని తోస్తుంది. ఒక ఉదాహరణ. ఒక మనిషి అచ్చట కూర్చున్నాడు. ఒకడు వచ్చి అన్నా అని పిలుస్తాడు. మరొకడు వచ్చి తండ్రీ అని పిలుస్తాడు. భార్య వచ్చి ఏమండీ అని పిలుస్తుంది. ఆ మనిషి ఒకడే కదా? ఒకడే మనిషి యైనప్పుడు ఇన్ని విధాలా సంబంధము ఎట్లేర్పడినాయి? అతడు ఒకడే ఐనప్పుడు అందరికి ఒకే రూపముగ కనిపించాలి ఇన్ని విధాలా కనిపించేది ఏది. మాయారూపము. అతడు మిథ్యనే. వీరందరు మిథ్యలే. అయితే యీ మిథ్యయైన జగత్తుకేది ఆధారము?

ఒక ఊరిలో వెలుపలి భాగములో ఒక సత్రము. దానిలో ప్రతిరోజు నలుగురు సాధకులు పోయి విచారణచేసి కొంత అధ్యయనము చేసుకొని వచ్చేవారు. ఒకనాడు సాయంత్రం నలుగురు ఉన్నప్పుడు ఏదో పెండ్లిగుంపు వచ్చింది. అక్కడికి వచ్చి సరికి గొప్పగా వర్షము వస్తూంది. వారంతా ఆ సత్రములోనికి పోయినారు.

ఈ నలుగురు ఆ పెండ్లి గుంపును వినోదముగ చూస్తున్నారు. ఆ పెండ్లి కూతురు మంచి అందగత్తె. ఆమెను వరుడు మాటి మాటికి ఓరగంటితో చూచి మురిసిపోతున్నాడు. అత్త మామగారు మాకెంత మంచిఅల్లుడు చిక్కెనని వాళ్ళు ఆనందపడుతున్నారు. పెండ్లికూతురు స్నేహితురాండ్రు ఇంత మంచి భర్తను పొందినది మా స్నేహితురాలు అని వారు హర్షము ననుభవించుచున్నారు. ఆ పెండ్లి కూతురును చూచినారు ఈ నలుగురు. ఒకడు అన్నాడు. చూడండి మిత్రులారా! ఆ పెండ్లికూతురు ఒకతే. అయితే తండ్రికి కూతురుగా, భర్తకు భార్యగా, చెల్లెలికి అక్కగా, వదినెకు మరదలుగా కనిపించుచున్నది కదా! ఇన్ని రూపాలు ఆమెకు ఉన్నాయా? అని ప్రశ్నించినాడు.

తక్కిన మిత్రులలో ఒకడన్నాడు. "నాకు పెండ్లికూతురు పెండ్లికూతురు మాదిరి కనిపించలేదు. ఆమె కేవలము అస్థిమాంస మజ్జలతో కూడిన రూపము కనిపిస్తూంది. పైన చర్మము లేకుంటే ఉండే జుగుప్సాకరమైన రూపము కనిపిస్తూంది నాకు" అన్నాడు. ఇంకొకడు "ఊహూ! అది కూడ కాదు. మిత్రులారా! నాకు కేవలము అస్థిపంజరము కనిపిస్తూంది. ఈ శరీరానికి అస్థిపంజరము ఆధారము కదా!" అన్నాడు. ఇంకొక సాధకుడు "అట్లా కాదు. నాకేమి కనబడుచున్నదో చెప్తాను వినండి. సమస్త ప్రపంచములోని నామరూపములకు పంచభూతములు ఆధారములు. ఆ పంచభూతములలోని అణువులు ఒక్కొక్క పరిమితిలో కలిస్తే ఒక్కొక్క ఆకారము యేర్పడుతుంది. నాకు పెండ్లికూతురుగా కనిపించలేదు. నాకు పంచభూతములే కనిపిస్తూన్నాయి అంటాడు. ఇంక నాలుగో సాధకుడన్నాడు. "ఓహో! నాకు అదికూడ కాదు. పంచభూతములకు ఆధారమైన ఆత్మస్వరూపము ఒక్కటే కనిపిస్తూంది. అదే సర్వాధారము. ప్రపంచమున కంతకు ఆ పరమాత్మే ఆధారము కదా?" అన్నాడు. ఈ సాధకుల విచారమునుండి తేలిందేమి? కనిపించే ప్రపంచానికి కనిపించని ఆత్మస్వరూపమాధారము అని ఈ విధముగచూస్తే సంసారమెక్కడ ఉంది? కనుకనే 'సంసారమిది బుద్ధి సాధ్యమ'ని చెప్పబడింది' ఇది కేవలము గుణము కర్మ ఈ రెంటిచేత ఏర్పడినది. దీనికి కారణము అజ్ఞానము. కావున దీనికి స్వతంత్రమైన ఉనికి లేదు. స్వప్నమువంటిది. సమస్తములైన కల్పనలు కేవలము మనస్సునుండి పుట్టినవి మాత్రమే. స్వప్న మెట్టిదో జాగ్రతకూడ అటువంటిదే. ఆత్మ నిర్గుణము. కాని మాయచేత గుణము నాశ్రయించుకున్నట్లు తోస్తుంది. కాని అవి ఉన్నాయా? అని చూస్తే ఆయనకు అంటవు. అంటినట్లు మాయాదృష్టి కలవారికి తోస్తుంది.

ఒక టేబులుమీద స్ఫటికపురాయి ఉన్నది. ప్రక్కనే ఎఱ్ఱటి పుష్పమున్నది. స్ఫటికపురాయి తెల్లదైనను ఇప్పుడు ఎఱ్ఱగ కనబడ్తూంది. అయితే ఇపుడు ఎఱ్ఱగా ఉన్నదా ఆ స్ఫటికపురాయి? దాని యథార్థమును విచారిస్తే ఎఱ్ఱగా కనపడే కాలములో కూడ అది తెల్లగనే ఉన్నది. అటులనే జీవుడుగా కనిపించే కాలములో కూడ ఇతడు ఆత్మస్వరూపుడే. పట్టిచూస్తే వికారాలు వాస్తవముగా లేవు. త్రిగుణాత్మకములైన కార్యములనుండి పుట్టివచ్చున దంతయు అజ్ఞాన సమూహమే. గుణములు మాయ. వాటినుండి కలిగే క్రియలు మాయ కావున ఘనతరమైన జ్ఞానముతో వీటి నన్నిటిని కాల్చివేయాలి. ఆ విధములైన సాధనతో మానవుడు కర్మ విరహితుడై శ్రీహరిని కనుగొనుట మేలు. ఇది వినేసరికి రాక్షస బాలురకు కలిగే ఆశ్చర్యానికి మేరలేదు. చకితులై ప్రహ్లాదుని నోటినుండీ అమృతమే వచ్చుచున్నదని తదేకచిత్తులై శ్రవణము చేయుచున్నారు. ప్రహ్లాదుడు వారికి జ్ఞానసారమును ప్రసాదిస్తున్నాడు. ఆ జ్ఞానప్రాప్తికి సాధనములైన ముఖ్యవిషయాలు వివరణ పూర్వకముగ బోధిస్తున్నాడు.

గురువును సంపాదించుకోవాలి. ఆయనకు సేవ జేయాలి. సర్వలాభ సమర్పణంబును, సాధుజన సంగమును. వాసుదేవుని యందలి ప్రేమయు ఈశ్వర ప్రతిమారాధనంబును, హరికథాతత్పరత్వమును, నారాయణ గుణకర్మనామ సంకీర్తనంబును, వైకుంఠ చరణకమల ధ్యానంబును, భగవంతుని దర్శన పూజనములును ఇవి యన్నియు కలిగియుండాలి. భాగవత ధర్మములపై రతి గలిగి యుండాలె. సర్వభూతములలో భగవంతు డున్నాడని అన్నిటిని సన్మాన దృష్టితో చూడాలి. కామాది శత్రువర్గమును జయించాలి. ఈ విధముగ చేస్తూంటే భగవంతుని యందు మతి కలుగుతుంది.

ఈ విధముగ రాక్షసబాలురకు ప్రహ్లాదుడు చెప్పుచున్నాడు.

ఓం సర్వేవై సుఖినస్సంతు.

పదునారవ రోజు ఉపన్యాసము సమాప్తము.

——:o:——



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదునేడవ రోజు ఉపన్యాసము

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీ గురవే నమః ॥"

"పాలిన భక్తి ముక్తిద నవారిత తాండవ కేళికిన్ దయా
శాలికి శూలికిన్ శిఖరిజాముఖ పద్మమయూఖమాలికిన్
బాలశశాంక మౌళికి గపాలికి మన్మథ గర్వపర్వతో
న్మూలికి నారదాది ముని ముఖ్యమనస్సరసీరుహాళికిన్"

భక్తశిఖామణులారా! భాగవతోత్తములారా!

పరమపవిత్రమైన భాగవతము వింటున్నాము. దీని ద్వారా మనము సమయమును సదుపయోగము చేసుకొనే ప్రయత్నం చేస్తున్నాము. మరణకాలములో భగవంతుని స్మరణచేస్తూ శరీరమును వదలునంతటి మంగళమయమైన భాగ్యము మనకు కలుగవచ్చును. జీవితములో నేవిషయమున కధిక ప్రాధాన్యము నిచ్చి నడచుకుంటుంటామో మరణకాలములో తక్కిన సంకల్పాలనన్నిటిని ప్రక్కకు నెట్టి ఆ విషయమే ముందుకు వస్తుంది.

ఒక మనిషి అన్నాడట. భగవంతుని స్మరణ మరణకాలములో వస్తే చాలుకదా? బ్రతికినంత కాలము ఎందుకు శ్రమపడాలె. అంతే కాకు భగవంతుని స్మరణ వస్తుందా? అంత

ఉద్ధరగా ఆ నామము మరణకాలములో వచ్చుట సాధ్యమా? తులసీదాసన్నాడు. 'జన్మజన్మముని జతన కరాహీ అంతరామకహా ఆవతినాహీ'' అని. కాబట్టి జన్మజన్మాల ప్రయత్నముంటేనే కాని లేకపోతే అంత్యకాలములో నామము పలుకుటకు రాదు. దేనిని జీవితములో ఆసక్తితో అనుకుంటూంటామో అదే వస్తుంది.

ఒకడు బంగారు వ్యాపారస్థుడు జబ్బుతో పడ్డాడు. భగవంతుని నామస్మరణ చేసే అభ్యాసమే లేదు వానికి. డాక్టరు వచ్చి థర్మామీటరుతో వాని జ్వరతాపము కొలిచి నూట ఐదుందన్నాడు. దానికి వాడు ''నూటా అయిదు ఉంటే మనము తొంభై అయిదుకు కొన్నాము కదండ్రా. బంగారంతా అమ్మివేయండ్రా'' అని అరువసాగినాడట. జీవితములో వాడు నిరంతరము ఆ బంగారు వ్యాపారములోనే తత్పరుడై యుండినాడు. అందువలన వానికదే రంధియై పోయినది. ఈ విధముగ ఉంటుంది మనుష్యుల చిత్తవృత్తి. విషయాలపైకే మనస్సు పోతుంది కాని భగవంతునివైపు మరలదు.

ఈ విషయమును గురించి భాగవతము అద్భుతముగ చెప్తుంది.

''హిత్వాఽత్యాయాస రచితాగృహాపత్య సుహృచ్ఛ్రియః।
తమోవిశంత్యనిచ్ఛంతో వాసుదేవ పరాఙ్ముఖః॥''

మరణకాలములో వానికి మనస్సు పడే తాపత్రయమును వివరించుచున్నాడు. ఎంతో ఆయాసపడి సంపాదించుకున్న గృహము, సంతానము, భార్య, మిత్రులు, వస్తువులు మొదలగు వాటిని వదలి పోయేటపుడు దుఃఖపడుతూ అంధకారములో పడిపోతారట. వాసుదేవుని స్మరించజాలరట.

మనము శరీరములో ఉండగనే మంచి శిక్షణ మన మనస్సుకు మన బుద్ధికి యిచ్చుకోవాలె. ఈ సాంసారికమైన వ్యవహారాలల్లో ఉంటూ ఈ సంసారము అశాశ్వతమని, పరమాత్మయే శాశ్వత

మని ఆ పరమాత్మను పొందేందుకే భగవంతుడు యీ యిల్లును, భార్యాబిడ్డలను ఐశ్వర్యాదులను యిచ్చినాడని, అందరిని ఆ పరమాత్మను పొందు మార్గములో తనతో సహా తోడుకొని రావలెనని బుద్ధిమంతుడు తలచాలి. దీనికి ప్రధానమైనది సజ్జన సహవాసము. ఆ విధమైన వ్యాసంగమునందు శ్రద్ధగల చిత్తము గలవాడైతే వాని మరణము మంగళమయముగ ఉంటుంది. అట్టి సాధన ప్రతి మానవుడు చేసుకోవాలి. ఈ మార్గమున పెద్దలను సేవించుచూ భగవత్పరమైన చిత్తముతో కాలము గడపుతూంటే భక్తిజ్ఞానములు స్థిరమైతే వాని జన్మ ధన్యమవుతుంది. ప్రహ్లాదుడు రాక్షస బాలురకు ఇదే విషయమే ఉపదేశము చేస్తున్నాడు.

ఉపదేశములో ఆయన కొన్ని అద్భుతమైన సలహాల నిస్తాడు, రాక్షసబాలురు అద్భుతమైన ఏకాగ్రతతో వింటున్నారు.

రాగాది యుక్తమనస్సు గల మనిషికి సంసారబంధము నుండి తొలగించే హరి చింతన సుఖము మోక్షసుఖమును బోలి ఉంటుంది. ఈ విధముగ బుధులు చెప్తారు. ఆ హరి భజన మేమాత్రము కష్టము కాదు. ఆయన సర్వాలయందు ఆకాశము వలె వ్యాపించి ఉంటాడు. విషయసుఖాల వలన మానవునికి ప్రయోజనమే లేదు. భోగములు, పుత్ర కళత్ర మిత్రాదులు క్షణభంగురంబులు. స్వర్గాదిలోక భోగములు కూడ తుచ్ఛములే. మనుష్యుడు విద్వాంసుడనని అహంకారముతో కర్మలుజేసి విపరీతమైన ఫలములను బొందుతాడు. కర్మములు ఫలాలను గోరకుండా చేయాలి. ఫలాన్ని కోరిచేస్తే దుఃఖము కలుగుతుంది. సాధారణముగ పురుషుడు దేహము కొరకు భోగాలను కోర్తాడు. దేహమేమో నిత్యంకాదు. ఇది జీవికి వెంటరాదు. ఇది చచ్చిపోతే తోడేళ్ళు, నక్కలు దీన్ని భుజిస్తాయి. మనుష్యుడు చచ్చి వాని

కర్మ కనుకూలమైన జన్మనెత్తుతాడు. ఆ విధమైన అజ్ఞానము విస్తరిస్తే జననమరణ ప్రవాహము కూడ అధికమైతుంది. ధర్మార్థ కామములు అజ్ఞానతంత్రములు మోక్షము జ్ఞానముచేత మాత్రమే లభ్యమవుతుంది. మోక్షప్రదాతయగు హరి సర్వప్రాణులకు ప్రియుడు. మనుష్యులు నిష్కామ హృదయులై హృదయగతుడైన పరమాత్ముని నిజభక్తిచేత భజింపవలయును.

ఇంక ఆ దానవ బాలురకు భక్తి మహిమను చెప్పుచున్నాడు.

"దానవ దైత్యభుజంగమ మానవ గంధర్వ సురసమాజములో ల క్ష్మీనాథు చరణకమల ధ్యానంబున నెవ్వడైన ధన్యత గాంచున్" 7-242

రాక్షసులు, సర్పాలు, మానవులు, గంధర్వులు, దేవతలలో ఎవ్వరైనను భగవంతుని చరణములను ధ్యానించినట్లైతే ధన్యత్వము సిద్ధిస్తుంది. వారు వీరను భేదము లేదు. ఇంకనూ చెప్పుచున్నాడు.

"చిక్కడు వ్రతముల గ్రతువుల
చిక్కడు దానముల శౌచశీల తపములన్
చిక్కడు యుక్తిని భక్తిని చిక్కిన
క్రియ నచ్యుతుండు సిద్ధము సుండీ" 7-243

వ్రతములతో, క్రతువులతో, దానము, శౌచము, శీలము తపములతో భగవంతుడు భక్తికి చిక్కినట్లు చిక్కడు. ఇది సిద్ధముగా తెలుసుకోండి. అని ఆ భక్తి మహిమను ఇంకను చెప్పుచున్నాడు.

"చాలదు భూదేవత్వము చాలదు దేవత్వమధిక శాంతత్వంబున్ చాలదు హరిమెప్పింపను శీలోద్యములార భక్తి చాలిన భంగిన్"

భక్తి ఎంతటి ప్రశస్తమైనదో అంత శ్రేష్ఠమైనది. బ్రాహ్మణత్వము కాదు. అధికమైన శాంతి కూడ దానితో సరికాజాలదు. భక్తియే హరిని మెప్పించుటలో శ్రేష్ఠమైనది. కావున -

"దనుజ భుజగయక్ష దైత్యమృగాభీల
సుందరీ విహంగ శూద్ర శబరు
లైన శాపజీవులైన ముక్తికి బోదు
రఖిలజగము విష్ణుడనుచు దలచి. 7-245

సమస్త జగత్తు భగవత్స్వరూపముగా భావిస్తే యెవరైనా ముక్తి పొందగలుగుతారంటూ నిష్కర్షగ చెప్పినాడు ప్రహ్లాదుడు. ఈ విధముగ వారికి బోధచేసి అందరిని తనవైపు త్రిప్పుకొని వారికి చివరి మాట చెప్పుచున్నాడు.

"తెండెల్ల పుస్తకంబుల నిండా చార్యునకు మరల నేకతమునకుఁ
రండు విశేషము జెప్పెద పొండొల్లనివారు కర్మ పుంజముపాలై."
7-246

పుస్తకాలన్ని తెచ్చి ఆచార్యులకు వాపసు చేయండి. ఏకాంతములో నా వద్దకు రాండి. అపుడు నేను విశేషమైన విషయాలు చెప్పుతాను. దీనిని గమనించనివారు కర్మపుంజము పాలై పోండి. అని అందరిని పిలుచుకొని "హరేరామ హరేరామ ...... అని సమూహికముగ భజన చేయుటకు ప్రారంభించినాడు. అందరును కీర్తనలో పరవశమై నాట్యము చేయసాగినారు.

ఇంతలో చండామార్కులు వచ్చి విస్తుపోయి ప్రమాదం ముంచుకొని వచ్చిందని "మానుకోండ్రా! మానుకోండ్రా!" అని కేకలు వేసినారు. వారు వినేటట్లున్నారా? పరవశులై, తన్మయులై భజన చేస్తున్నారు. వారు ప్రహ్లాదున్ని పట్టుకున్నారు. పట్టుకొంటూనే కరెంట్ షాక్ అయినట్లయింది. వారుకూడ యెగిరెగిరి భజన చేయసాగినారు. వీరందరు తన్మయులై ఎగిరెగిరి భజన చేయుట అచ్చట కొందరికి ఆశ్చర్యముగ కనిపించి హిరణ్యకశిపునకు తెలియజేసినారు. వెంటనే అతడు తన సేవకులను పంపినాడు వారుకూడ వెళ్ళి మాటలతో నిలుపుటకు ప్రయత్నం చేసినారు.

కాని వారు నిలుస్తారా? వారి చేతులు పట్టుకున్నారు. కరెంట్ షాక్ అయినట్లు వారూ ఆ భజనలో కలుసుకున్నారు. హిరణ్యకశిపుడు మరల కొందరు సేవకులను పంపినాడు. వారుకూడ పోయి భజనచేసే వాళ్ళను పట్టుకొని షాక్ తగిలి ఎగిరెగిరి భజనచేయ సాగినారు.

పోయిన వాళ్ళందరు అట్లే పోవడమే తిరిగి రావడం లేదు. హిరణ్యకశిపుడు ఎవరు తిరిగి రాకపోవడం చూచి విసిగి వేసారి తానే స్వయముగ పోయినాడు. దృశ్యము చాలా భయంకరముగ కనిపించింది. ఒరే! అని పెద్ద కేక వేసినాడు. ఎవడు వినిపించుకునే వాడు? అందరు తన్మయులై భజన చేస్తున్నారు. అపుడు ప్రహ్లాదున్ని పట్టుకున్నాడు. వానికి షాక్ కొట్టలేదు. వాడు కరెంట్ షాక్ తగలనంతటి మొద్దు. కొడుకును పట్టుకొని అందరిని ఆపినాడు. చండామార్కులు కూడ ఆడుతుండడం వానికి మహాశ్చర్యం వేసింది. ఇంక పరులతో ఏమి మాట్లాడవలె! కుమారున్ని గట్టిగా పట్టుకొని ఆపి గద్దించినాడు.

"సూనున్ శాంతగుణ ప్రధాను నతి సంశుద్ధాంచిత జ్ఞాను న
జ్ఞానారణ్యకృశాను నంజలిపుటీ సంభ్రాజమానున్ సదా
శ్రీనారాయణ పాదపద్మయుగళీ చింతామృతాస్వాదనా
ధీనున్ ధిక్కరణంబు జేసి పలికెన్ దేవాహితుండుగ్రతన్"

7-256

ఈ పద్యములో ప్రహ్లాదునియొక్క దివ్యత్వము వర్ణింపబడినది. శాంతగుణముతో నున్నవాడు. శుద్ధమైన జ్ఞానం కలవాడు. అజ్ఞానమనే అరణ్యాన్ని కాల్చివేసినవాడు. చేతులు జోడించుకొని భగవద్భజనలో తన్మయుడై ప్రకాశించేవాడు. భగవచ్చింతన అనే అమృతాన్ని ఆస్వాదన చేయుటలో తత్పరుడైనవాడు. ఇట్టి వానిని ధిక్కరించి హిరణ్యకశిపుడు ఉగ్రుడై పలికినాడు.

ఒరే! ప్రహ్లాదా! నా కడుపున చెడబుట్టినావురా! దుర్మార్గా! నా శత్రువును గురించి నీవు భజన చేయుటయే గాక ఇంతమందిని తన్మయులను చేసి ఆడిపిస్తావా? ఎక్కడి నుండి వచ్చిందిరా నీకింతటి శక్తి!

''అస్మదీయంబగు నా దేశమునగాని మిక్కిలి
        రవి మింట మెరయ వెరచు
నన్ని కాలములందు ననుకూలుడై కాని
        విద్వేషియై గాలి వీవ వెరచు
మత్ప్రతాపానలమందీ కృతార్చియై
        విచ్చలవిడి నగ్ని వెలుగ వెరచు
నతి తీక్ష్ణమైన నా యాజ్ఞనుల్లంఘించి
        శమనుండు ప్రాణుల జంప వెరచు
నింద్రుడాదల నా మ్రోలనెత్త వెరచు
        నమర కిన్నర గంధర్వ యక్షవిహగ
నాగవిద్యాధరావళి నాకు వెరచు
        నేల వెరవవు పలువ నీకేది దిక్కు? 7-257

ఒరే! నా ఆజ్ఞ లేక ఆకాశములో సూర్యుడు స్వేచ్ఛగా వెలుగడు. గాలిదేవుడు నా ఇష్టమున కనుకూలముగ వీస్తాడు. అగ్నిదేవుడు నా భయానికి స్వేచ్ఛగా వెలుగజాలడు. ఇంద్రుడు నా ముందర తల ఎత్త జాలడే. అమరులు, కిన్నరులు, గంధర్వులు మొదలైన సర్వులు అందరు భయపడ్తారే! పలువా! ఎందుకురా నీవు వెరవవు? ఎవడు నీకు దిక్కు! అని ఉగ్రుడై విదళించి అడుగుతాడు. అంతేకాదు. నీవు ఏమి చేస్తున్నావు?

''ఆచార్యోక్తము మాని బాలురకు మోక్షాసక్తి బుట్టించి నీ
వాచాలత్వము జూపి విష్ణు నహితున్ వర్ణించి మద్దైత్య వం

శాచారంబులు నీరు జేసితివి మూఢాత్మ్మ గుల ద్రోహి ని
న్నీ చుం జంపుట మేలు చంపి కులముం నిర్దోషముం జేసెదన్.
7-260

గురువు చెప్పినది వినక, పిల్లలందరకు మోక్షముపై నపేక్షపుట్టించి నీ వాక్చాతుర్యముచేత నాకహితుడైన విష్ణువును వర్ణించి, మా రాక్షసాచారములు మంటగలిపిన మూఢాత్ముడవు, కులద్రోహివి, నిన్ను చంపి కులమును నిర్దోషము చేస్తాను అంటాడు.

ఈ విధముగ బయటికి గంభీరముగ మాట్లాడుచున్నాడు. కాని లోపల వానికి భయముతో కూడిన ఆశ్చర్యమున్నది. ప్రపంచములో నేనే బలవంతుడనురా! ఎంత మందినో నా బలముతో జయించినాను. ఎవ్వని బలముతో నీవు నాకు ఎదురు తిరిగి మాట్లాడుచున్నావురా! అంటాడు. ఇంతటి ఉగ్రముతో, క్రోధముతో తండ్రి ప్రశ్నిస్తే తండ్రికి మిక్కిలి వినయముతో ప్రహ్లాదుడంటాడు. తండ్రీ!

"బలయుతులకు దుర్బలులకు బలమెవ్వడు
నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు ప్రాణులకును బలమెవ్వండట్టి
విభుడు బలమసురేంద్రా" 7-264

ఇంకనూ అంటాడు.

"వైరులెవ్వరు చిత్తంబు వైరిగాక
చిత్తమును నీకు వశముగా జేయుమయ్యా
మదయుతాసుర భావంబు మానవయ్యా
యయ్యా! నీ ప్రోల మేలాడరయ్య జనులు" 7-266

జనకా! శత్రువులు నీకు బయటలేరు. నీ చిత్తమే నీకు వైరి. కావున చిత్తమును మొదట వశముగా చేసుకో. మదము, దర్పము మానుకోవయ్యా! ప్రజలు నీ ముందట యథార్థము పలుకజాలరు.

''లోకములన్నియున్ గడియలోన జయించిన వాడ వింద్రియా
నీకము చిత్తమున్ గెలువనేరవు నిన్ను నిబద్ధుజేయు నీ
భీకరశత్రులార్వుర ప్రభిన్నుల జేసిన ప్రాణికోటిలో
నీకు విరోధి లేడొకడు నేర్పున జూడుము దానవేశ్వరా'' 7-267

తండ్రీ! లోకాలన్నియు ఒక గడియలో జయించినావు. కాని నీ యింద్రియాలను నీవు జయించలేదు. నిన్ను బంధించే భీకరమైన శత్రువులు నీలోనే ఉన్నారు. వారు కామ క్రోధ లోభ మద మత్సరములు. ఈ ఆరుగురు శత్రువులను నీవు జయిస్తే నీకు ప్రపంచములో శత్రువులే ఉండరు. ఈ విషయము నేర్పుతో తెలుసుకో తండ్రీ! అంటాడు. ఎంతటి అమృతమయమైన పలుకులివి? కాని ఆ హిరణ్యకశిపునకివి గిట్టవు. పట్టరాని కోపము వస్తుంది. తనకు హితవు నేర్పుచున్నాడు వీనికింతటి ధైర్యమా! అని వానికి కలిగిన విస్మయానికి మేరలేదు. గద్దించి అడుగుచున్నాడు. ఓరీ దుర్మతీ!

నీవు చెప్పే విష్ణువు ఎక్కడున్నాడు? ఏ విధముగ ఉన్నాడు? ఏ రూపములో నాకు గోచరిస్తాడు? ఆ విష్ణువును, నిన్ను ఇద్దరిని నాశనము చేస్తానురా! అంటే - ప్రహ్లాదుడు శాంతవదనుడై అంటాడు.

''కల డంభోధి కలండు గాలి కల డాకాశంబునన్ కుంభినిన్
గల డగ్నిన్ దిశలన్ బగళ్ళనిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్
గల డోంకారమునం ద్రిమూర్తుల త్రిలింగవ్యక్తులందంతటన్
గల డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల యీయా యెడన్''
7-274

తండ్రీ! ఆ ప్రభువు అన్నిచోట్ల కలడు. పంచభూతాలలో ఉన్నాడు. పగళ్లయందు, రాత్రులయందు, చుక్కలలో, చంద్రునిలో, ఓంకారములో, త్రిమూర్తులలో అంతటా ఆ ప్రభువున్నాడు తండ్రీ! ఇచ్చటనా? అచ్చటనా? అని వెతుక నవసరము లేదు.

''ఇందు గలడందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెతకి చూచిన నందందే కలడు దానవాగ్రణి వింటే''
7-275

ఆ చక్రి సర్వోపగతుడు తండ్రీ. అంటే అంతటా వ్యాపించియున్నాడు. ఎక్కడెక్కడ వెతకి చూస్తే అక్కడికక్కడనే కనిపిస్తాడు.

ఈ మాటలు విని హిరణ్యకశిపుడు ఒరే! అంతటా ఉన్నాడంటున్నావు ఈ స్తంభములో ఉన్నాడా! అని స్తంభమును చూపుతూ అడుగుతాడు. ఆ మాటలు విని ప్రహ్లాదుడంటాడు:—

''అంభోజాసను డాదిగాగ తృణపర్యంతంబు విశ్వాత్ముడై
సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబులో నుండడే
స్తంభాంతర్గతు డయ్యునుండుటకు నే సందేహమున్ లేదు ని
ర్దంభత్వంబున నేడు గానబడు ప్రత్యక్షస్వరూపంబునన్''
7-282

బ్రహ్మదేవుడు మొదలుకొని గడ్డిపోచవరకు వ్యాపించియుండు విశ్వాత్ముడు ఈ స్తంభములో నుండుటకు ఏ మాత్రము సందేహము లేదు తండ్రీ. ఈ స్తంభములో ఉన్నాడు. ప్రత్యక్షముగ కనబడ్తాడు. అని ప్రహ్లాదుడు చెప్తాడు.

అపుడు హిరణ్యకశిపుడు పట్టరాని ఆగ్రహముతో ఇందున్నాడేమిరా? ఉంటే కనిపించనీ అని అరచేతితో తన బలము కొద్ది స్తంభాన్ని కొట్టినాడు. కొట్టిన వెంటనే:—

''ఇట్లు దానవేంద్రుండు విస్రంభంబున హుంకరించి, బాలుని ధిక్కరించి, హరి నిందు జూపుమని దిగ్దంతి దంతభేదన పాటవ ప్రశస్తంబగు హస్తంబున సభామంటప స్తంభంబు వేసిన, ప్రేటుతోడన దశ దిశలును మిణుగురులు చెదర చిటిలి పెటిలి ఛట చ్ఛట, స్ఫట స్ఫట ధ్వని ప్రముఖ భయంకరారావ పుంజంబులు యాకాశ కుహరాంత రాళంబు నిండె. అపుడు శరత్కాల మేఘ జాలమధ్యము

ధగద్ధగాయమాన తటిల్లతాసమాన దేదీప్యమాన దంష్ట్రాకరుండును, మహోగ్రభ్రూలతాటంధ బంధుర భయంకరవదనుండును, మేరుమందర మహాగుహాంతరాళ విస్తార విపుల వక్త్ర నాసికావివరుండును, సంధ్యారాగరక్త ధారాధర మాలికాప్రతిమ మహోగ్రభంకమ తంతన్యమాన పటుతర సటాజాలుండును, ప్రహ్లాద హిరణ్యకశిపు రంజన భంజన నిమిత్తాంతరంగ బహిరంగ జేగీయమాన కరుణావీర రస సంయుతుండును మహాప్రభావుండునునైన శ్రీనృసింహదేవుం డావిర్భవించినం గనుంగొని.'' 7-285

రాక్షసుడావిధముగా బాలున్ని ధిక్కరించి స్తంభాన్ని కొట్టిన తోడనే పదిదిక్కులు మిణుగురులు వ్యాపించినాయి. భయం కరమైన శబ్దము పుట్టింది. మెరపువంటి దంతములు గలవాడును, పెద్దనైన కనుబొమలు కలిగిన భయంకరమైన ముఖము గలవాడును మేరుపర్వత గుహాలవలెతోచు నాసికా రంధ్రములు, నోరు కలవా డును, సంధ్యాకాలములో ఆకాశపురంగుతో సమానమైన జటలు గలవాడును, ప్రహ్లాదునికి రంజనమును, హిరణ్యకశిపునకు భయమును గొలుపు కరుణావీర రసముతో కూడినవాడును, మహాప్రభావుండైన శ్రీ నృసింహదేవుండావిర్భవించినాడు. ఆయనను చూచినారు. ఆయన ఎట్లున్నాడంటే —

''నరమూర్తిగాదు కేవల హరిమూర్తియు
గాదు మానవాకారము కే
సరి యాకారము నున్నది హరి మాయా
రచితమగు యథార్థము సూడన్.'' 7-286

ఈ విధముగ పూర్తి నరరూపము కాదు. సింహమురూపము కాదు. నరసింహ రూపముతో భగవంతుని మాయావతారము ప్రత్యక్ష మైంది. అయితే ఈ రూపముతో అపుడే ఎందుకు ప్రత్యక్షమైనా డంటే -

"తెంపున బాలుడాడిన సుధీరత సర్వగతత్వమున్ బ్రతి
ష్ఠింపదలంచి యిందు నరసింహ శరీరము దాల్చి చక్రి శి
క్షింపగ వచ్చినాడు హరిచే మృతియంచు దలంతునైన నా
సొంపును బెంపునందరును జూడ జరింతు హరింతు శత్రులన్"
7_287

బాలుడు సాహసముతో ఇందున్నాడు అన్నమాటను సత్యము చేసేందుకు నరసింహ శరీరము దాల్చివచ్చినాడు. నాకు హరిచేత చావు తప్పదు. అయినను నా ప్రతాపము చూపుతా, శత్రువును హరిస్తాననుకున్నాడట హిరణ్యకశిపుడు,

"అంతనద్దానవేంద్రుండు మహోద్దండంబగు గదాదండంబు గిరి గిర ద్రిప్పి నరమృగేంద్రునివైచిన నతండు దర్పంబున సర్పంబు నొడిసి పట్టు సర్ప పరిపంథిచేర్పున దితిపట్టింబట్టికొనిన, మిట్టిపడి, దట్టించి, బిట్టుకట్టలుక నయ్యసురవరుండు దృఢబలంబున నిట్టట్టు మిడిసి పట్టుదప్పించుకొని విడివడి, దిటవు తప్పక కుప్పించి యుప్పరంబున కెగసి విహంగకులరాజచరణ నిర్గళిత భుజంగంబు చందంబున దలంకనుడికి తన భుజాటోపంబున నరకంఠీరవుండు కుంఠితుడయ్యెడి నని తలంచి కలంగక చెలంగుచు నక్షీణ సమర దక్షతా విశేషంబు పలక్షించి భూనభోభాగంబుల వివిధవిచిత్ర లంఘన లాఘవంబుల పరిభ్రమణ భేదంబుల కరాళవదనుండై యంత రాళంబున దిరుగు సాళువడేగ చందంబున సంచరించిన సహింపక. 7-290

హిరణ్యకశిపుడు గదాదండమును గిరి గిర త్రిప్పుతూ నరసింహమూర్తిపై వేసినాడు. అపుడు ఆ దేవుడు గరుత్మంతుడు సర్పమును పట్టుకున్న విధముగ రాక్షసుని పట్టుకున్నాడు. అయితే వాడు అట్టిట్టు మిడిసి పట్టు తప్పించుకొన్నాడు. ఆకాశమున కెగిరినాడు. ఆ విధముగ గరుత్మంతుని పట్టు వదిలించుకొన్న సర్పమువలె తప్పించుకొని తన పరాక్రమముతో ఆ దేవుడు కుంఠితుడౌతాడను

కున్నాడు. వాడు భూనభోంతరాళమున విచిత్ర విచిత్రముగా ఎగురుతూ తిరుగుతూవుంటే నృసింహామూర్తి సహింపక.—

"పంచాననోద్ధూత పావకజ్వాలల
భూనభోంతరమెల్ల బూరితముగ
ప్రళయార్క చంచలాప్రతిమ భాస్వరములై
ఖరనఖరోచులు గ్రమ్ముదేర
సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టిసారించి బొమలు బంధించికెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి
పట్టె నరసింహుడా దితిపట్టినధిప." 7-291

ఆ నరసింహస్వామి ముఖమునుండి అగ్నిజ్వాలలు బయలుదేరి భూమ్యాకాశములు నిండిపోయినాయి. ప్రళయకాలములోని మెరపులవలె పదునైన గోళ్లు ప్రకాశిస్తున్నాయి. జటలు విదళించి గర్జనజేసి, తీవ్రముగ హిరణ్యకశిపుని చూచి, నాలుక నాడించుచు లంఘించి వాన్ని నరసింహస్వామి ఒడిసి పట్టినాడు.

గొప్ప పాము ఎలుకను పట్టుకున్నట్లుగా పట్టుకున్నప్పుడు హిరణ్యకశిపుడు తప్పించుకొనుటకు సాధ్యము కాక బాధపడ్డాడు.

ఇంకను గరుత్మంతుని కాళ్ళలో చిక్కుకున్న సర్పమువలె నున్న హిరణ్యకశిపుని నృసింహస్వామి ఆగ్రహుడై తన తొడల మీద జేర్చి భయంకరములైన తన నఖములతో వానిపొట్టను బ్రచ్చినాడు. వాని శరీరము వజ్రతుల్యము. అట్టి శరీరమును గోళ్లతో బ్రచ్చుసరికి వజ్రాయుధము పర్వతమును భేదించినంత శబ్దమైంది.

ఈ విధముగ నరరూపము కాదు. కేసరిరూపము కాదు. తాను నృసింహరూపము ధరించి వచ్చినాడు. రేయికాదు. పగలు

కాదు. సంధ్యాసమయము. అంతర్భాగము, బహిర్భాగము కానట్టి వాకిలి కడపమీద, ఆకాశము కాదు, భూమి కానట్టి తొడలపైన; ప్రాణసహితంబులు, ప్రాణరహితంబులు గాని గోళ్ళతో, త్రిలోక భయకరుడైన రాక్షసుని వధియించె. అపుడాయన ఉగ్రరూపము చూచుటకు భయంకరముగ నున్నది. నాలుక నాడించుచూ అక్కడనున్న రాక్షసుల నందరిని జంపినాడు. దేవతలు స్తుతి యించిరి. ఎంత స్తోత్రము చేసినను ఆయన ఉగ్రరూపము శాంతము కాలేదు. అపుడు వారందరు లక్ష్మీదేవి వద్దకు వెళ్ళి ఆయనను శాంతింప జేయమని వేడిరి. లక్ష్మీదేవి ప్రయత్నము సఫలము కాలేదు. అపుడు దేవతలందరు ప్రహ్లాదున్ని ప్రార్థించిరి. ఆ ప్రహ్లాదుడు కాళ్ళకు మ్రొక్కినంత మాత్రముననే ఆయన సౌమ్యుడైనాడు. ప్రహ్లాదున్ని ఎత్తుకొని తొడలపై కూర్చొబెట్టుకొని శరీరము నిమురుతూ ప్రేమతో దయగలవాడై అంటాడట.

నాయనా! ప్రహ్లాదా! 'క్వేదం వయః, క్వచవపుః, సుకుమారమేతత్, క్షంతవ్యమంగ యదిమే సమయే విలంబః" వయస్సు ఎంత చిన్నది! శరీర మెంతకోమలముగ నున్నది? చాలా సుకుమారుడవే బాలకా! అని బుజ్జగించుచూ ఏమంటాడో దీనిపై పాఠకులు ధ్యానముంచి చదువవలె. ఆ నరసింహస్వామి "క్షంతవ్య మంగ యదిమే సమయే విలంబః" అంటే! కుమారా! ఆ దుర్మార్గుడు నిన్ను విపరీతమైన బాధలు పెడుతూంటే నేనొక వేళ నిన్ను రక్షించుటకు వచ్చుటలో ఆలస్యమైనట్లైతే క్షమించు కుమారా! అంటాడట. ఆ నృసింహదేవుడెక్కడ ఈ పంచ శర ద్వయస్కుడైన బాలుడెక్కడ? ఇది వాత్సల్యానుగ్రహము నకు పరాకాష్ఠ. నాయనా! నన్ను క్షమించమనడం ఎంత విచిత్రం! అందువలన దేవదేవుడైన పరమాత్మే గమ్యుడు. మనకు ఆయనే దిక్కు. అంత దయామయుండింకొక డెవడు? కావున పరమాత్ముడు

తన భక్తులయెడ ఎంత తీవ్ర పరీక్ష చేస్తాడో! ఈ భాగము చదువునపుడెవరికైనా కళ్ళనీళ్ళు దుమికి రావా?

ఆ పిమ్మట ప్రహ్లాదుడు మరల అంటాడు.

"సత్త్వాకరుడవైన సర్వేశ నీయాజ్ఞ శిరముల నిడుకొని చేయువారు, బ్రహ్మాదు లమరులు భయమొందుచున్నారు, నీ భీషణాకృతి నేడు చూచి రోషంబుమాను నీ రుచిర విగ్రహములు కల్యాణకరములు గాని భీతికరములు గావు లోకంబులకు వృశ్చిక పన్నగముల భంగి భయముసేయు నసురమర్దించితివి సాధుహర్షమయ్యె నవతరించిన పనిదీరె నలుక యేల కలుషహారివి సంతోషకారివనుచు నిన్నుదల తురు లోకులు నిర్మలాత్మ. 7-354

స్వామీ! సత్త్వస్వరూపుడవైన భగవంతా! బ్రహ్మాదులు నీ యీ రూపము చూచి భయపడుచున్నారు. రోషముతో కూడ నీ రూపములు కల్యాణకరములే. భయమును గొల్పేవి కావు. లోకాలకు తేలు, పామువలె భయపెట్టే రాక్షసున్ని మర్దించితివి. సాధువులకు, సజ్జనులకు సంతోషమైంది. నిన్ను సర్వులు పాపమును పోగొట్టే పావనుడవని లోకులు స్మరిస్తారు స్వామీ! ఇంకను —

"జనులు దిక్పాలుర సంపదాయు ర్వైభవ
ముల గోరుదురు భవ్యంబులనుచు
నవి యెంతయును రోషహాసజృంభిత
మైన మా తండ్రి బొమముడి మహిమ
జేసి, విహితంబులగు నట్టివీరుండు నీచేత
నిమిషమాత్రంబున నేడుమడిసె
కావున ధ్రువములుగావు బ్రహ్మాదుల శ్రీవిభవంబులు జీవితములు
కాలరూపుడవగు నురుక్రముని చేత
విదళితములగు నిలువవు వేయునేల
యితర మే నొల్ల నీ మీది ఎరుకకొంత
కలిగియున్నది కొలుతు కింకరుడనగుచు. 7-357

సర్వేశ్వరా! ప్రజలు దిక్పాలురయొక్క సంపద, ఆయుస్సు వైభవములను కోర్తారు. అట్టివారందరు మా తండ్రి బొమముడి

చేత వణకి పోతూండిరి. అంతటి బలవంతుడు నీచేత ఒక నిమిష ములో హతుడై పోయె! కాబట్టి బ్రహ్మాదుల ఐశ్వర్యములు, జీవిత ములు శాశ్వతములు కావు. కాలరూపుడవగు నీ చేతి అన్నియు వినశింపబడుతాయి. స్వామీ! నేను సేవకుడనై నిన్ను సేవిస్తాను. నాకంతే చాలు అంటాడు. మరియును —

ఈ మనుష్యుని వ్యవహారములు చాలాచిత్రముగ ఉన్నాయి ప్రభూ! ప్రపంచములోని భోగములు ఐశ్వర్యములు ఎండమావుల వంటివని తెలుసుకోలేడు. భోగాలు రోగాలు కలిగిస్తాయని విరక్తుడు కాడు. నిరంతరము కామము అనే అగ్నిచేత తప్తు డౌతూంటాడు. దుష్టసౌఖ్య పరంపరలో చిక్కి దీని సారము ముట్టజాలక కొట్టు మిట్టాడుతూంటాడు స్వామీ! అంటూ ఏమి చెప్తాడో చూడండి.

"కామహర్షాది సంకలితమై చిత్తంబు
భవదీయ చింతన పదవి సొరదు
మధురాది రసములు మరగిచొక్కెడు
జిహ్వ నీ వర్ణనమునకు నిగుడనీదు
వివిధదుర్భాషలు వినగోరు వీనులు
వినవు యుష్మత్కథా విరచనములు
సుందరీముఖముల జూడగోరెడి చూడ్కి
తావకాకృతులపై దగులు పడదు
ఘ్రాణ మురవడి దిరుగు దుర్గంధములకుఁ
దనువు గొలుపదు వైష్ణవధర్మమునకు
అణగియుండవు కర్మేంద్రియములు పురుషు
గలచుఁ సవతులు గృహమేధినిఁ గలచినట్లు" 7-363

ఈ విధముగ భగవంతున్ని స్తోత్రము చేస్తున్నాడు. రేపటి వరకు చేయనీ.

ఓం సర్వేవై సుఖినస్సంతు.

పదునేడవ రోజు ఉపన్యాసము సమాప్తము.

——:o: —



శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పదునెనిమిదవ రోజు ఉపన్యాసము

"అజ్ఞాన తిమిరాంధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః॥"

"సముడై యెవ్వడు ముక్తకర్మచయుడై సన్న్యాసియై యొంటి పో
వ మహాభీతినొహో కుమారయనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములున్ తన్మయతన్ ప్రతిధ్వనులు చక్కంజేసె మున్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణి తపోధన్యాగ్రణిన్ ధీమణిన్.

భాగవతకథా శ్రవణాసక్తచిత్తులారా! భక్తప్రవణులారా! పరమపవిత్రమైన భాగవత కథాశ్రవణము. పరమాత్ముని అపారమైన అనుగ్రహముతోనే మనకిట్టి భాగ్యము కలుగుతుంది. అందునను యీ ప్రహ్లాద చరిత్ర పరమపవిత్రమైంది. దానిని సావకాశంగా శ్రవణము చేయుట అంటే జీవితములో నిది మహత్తరమైన భాగ్యము. అందువలన సర్వేశ్వరునకు సాష్టాంగ ప్రణామములొసంగి కార్యక్రమమును ఉపక్రమిద్దాము.

ప్రహ్లాదుడంటున్నాడు. స్వామీ ఈ చిత్తము కామము, హర్షము మొదలగు వికారాలతో కూడి ఉంటుంది కాని నీ చింతనమునే ఆనందములో నిలువదే. ఏమిచేతును స్వామీ! అటులనే మధురాది రసములతో చిక్కిపోయేది ఈ జిహ్వ.

"జిహ్వయాతి ప్రమాదిన్యా జనోరస విమోహితః।
మృత్యుమృచ్ఛత్య సద్బుద్ధిః మీనస్తు బడిశైర్యథా॥"
భాగ. 11 స్క. 6 అ. 19 శ్లో,

నాలుక అతి ప్రమాదకరమైనది. జనులు రసవిమోహితులు. ఈ నాలుకకు చిక్కినవారు కాలముచేత మృత్యువును పొందే చేపలవలె విపత్తులకు గురి యౌతారు. నాలుకరుచికి గురియైన వారి స్థితి యిట్లుంటుంది. ఈ విధముగ గృహమేధిని సవతులు అంటే గయ్యాళివంటి భార్యలు గలవాని గతి యెట్లుంటుందో ఇంద్రియాలకు చిక్కినవాని స్థితిన్నీ అటులనే ఉంటుంది.

లోకములో పదిమందికి బానిసయైన వానిస్థితి యెట్లుంటుంది? ఒకడు మంచినీళ్ళు తెమ్మంటాడు. ఒకడు మంచము వేయి అంటాడు. మరొక్కడు మరొక్క పని ఇట్లు చెప్పి తక్షణం చేయి అని తొందర పెట్టుతూంటే గులాం గతి దైన్యంగా ఉంటుంది? ఆ విధముగ గాక ఒకమనిషికి పదిమంది సేవకులైతే ఎట్లుంటుంది? మంచముపైన కూర్చొని ఒరే! ఆ పని చేయ్ ఒరే ఈ పని చేయ్. అని కడుపులో చల్ల కదలకుండా పనిచేయించుకుంటూంటాడు. కావున పది మందికి సేవకుడైతే వాని జీవితం కడు దుఃఖమయము. పది మందికి యజమాని అయితే వాని జీవితం కడు సుఖమయం. ఇంద్రియములను వశములో పెట్టుకుంటే నీవు యజమానివి. ఇంద్రియములకు నీవు వశమైతే వాటికి నీవు గులామువు.

శంకరాచార్యులు వివేక చూడామణి అని ఒక గ్రంథము వ్రాసినారు. దానిలోని ఒకశ్లోక మెట్లుందంటే గాగర్ మె సాగర్ మిలాయా" అన్నట్లుంది. అంటే అర్థమేమి? ఒకడు ఒకముంతలో సముద్రాన్ని నింపినాడట. ముంతలో సముద్రాన్ని ఎట్ల నింపినాడయ్యా? అంటే గొప్పదైన అర్థాన్ని కొద్దిమాటలలో ప్రభావ

పూర్వకముగా ప్రకటిస్తే "గాగర్ మే సాగర్ మిలాయా" అని హిందీలో చెప్తారు. ఆ పుస్తకములోని ఒక శ్లోకం చూడండి.

"శబ్దాదిభిః పంచభిరేవ పంచ పంచత్వమాపుః స్వగుణైశ్చబద్ధాః।
కురంగ మాతంగ పతంగ మీనభృంగాః నరః పంచభిరంచితః కిమ్॥"

శబ్దాదిభిః = అంటే శబ్దాదులచేత అని. శబ్దాదులంటే ఏమి? తన్మాత్రలు అని వాటి నంటారు. మానవుడు పొందే సుఖదుఃఖాలు వీటితోనే. పంచభిరేవ పంచ = అయిదింటిచేత అయిదు ప్రాణులు, పంచత్వమాపుః = తమ ప్రాణాలు పోగొట్టు కుంటున్నవి. అవి యేవి? అంటే కురంగము = జింక, మాతంగము = ఏనుగ, పతంగము = దీపపు పురుగు, మీనం = చేప, భృంగము = తుమ్మెదలు వీటి నీ క్రింది పట్టిక చూడండి. శబ్ద తన్మాత్రలు అయిదు. పంచ ప్రాణులు అంటే అయిదు.

పంచ తన్మాత్రలు =

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము,
కురంగ, మాతంగ, పతంగ, మీన, భృంగము,

శబ్దాకర్షణ కురంగము (జింక)కు ఎక్కువ. స్పర్శాకర్షణ మాతంగము (ఏనుగ)కు ఎక్కువ. రూపాకర్షణ దీపపు పురుగున కెక్కువ. గంధముయొక్క ఆకర్షణ తుమ్మెద కెక్కువ. ఇవన్నియు ఒక్కొక్క ఆకర్షణ యెక్కువ ఉంటేనే తమ ప్రాణములు పోగొట్టుకుంటు న్నాయే. నరుడు ఐదు ఆకర్షణలతో అలరారుచున్నాడు. వాని సంగతి చెప్పవలెనా? అంటూరు శంకరాచార్యులవారు.

కురంగమునకు శబ్దాకర్షణవలన జరిగే పరిణామమును చూడండి. దానిని వలలో వేసుకోగోరినవాడు చెట్టుక్రింద ఉర్లు బన్ని చెట్టుమీద కూర్చొని వ్లూటతోనైనా, మరే సాధనముతో నైనా సంగీతరాగాలాపన చేస్తే జింకలు ఆ శబ్దమువైపు మోరలు పైకెత్తుకొని పరుగెత్తుకుంటూవచ్చి వలల్లో పడిపోతాయి. పిమ్మట

వాడువచ్చి వాటిని పట్టుకొంటాడు. దీనితో దానిజన్మకు పంచత్వము కలిగె. అంటే దానికి మరణము కలిగెనని అర్థము. వాడు దానిని తీసుకొనిపోయి చంపుకొని తింటాడు.

మాతంగమునకు స్పర్శాకర్షణ ఎక్కువ. మామూలుగ ఏనుగను పట్టేవారు భూమిని బాగా త్రవ్వి కందకముచేసి దానిపైన చాపలు పరచి దానిపై మట్టివేసి అక్కడక్కడ గడ్డిపోచలుకూడ నాటుతారట. ఆ యేనుగు మామూలు స్థలమనుకొని రావాలె. ఆ తడకపై అడుగు పెట్టితే దాని బరువుకు తడక విరిగి గుంతలో పడ వలెనని దానిని పట్టే మానవుల భావన. కాని సృష్టిలో అనేక చిత్రాలు ఉన్నాయి. ఏనుగకు ఒక ఫర్లాంగు దూరములో నున్న పుడే ఇచ్చట ఈ ప్రాంతములో కందకమున్నదని తెలిస్తుందట. అపుడది ఒక బరువైన చెట్టుకొమ్మను తొండముతో పెరికి ధక్ ధక్ అని కొట్టుచేస్తూ పోతుందట. అయితే ఇట్లు కందకము త్రవ్వి చేసే తతంగమంతా చేసి ఆవలవైపు ఒక ఆడయేనుగును కట్టివేస్తే దాని వివేకమంతా భ్రష్టమై పోతుందట. ఆ ఆడయేనుగ వైపు పరుగెత్తి పోతుందట. గుంతలో ధన్ అని పడిపోతుంది. దాని నట్లే 5, 6, రోజులు గుంతలోనే ఉంచి ఆ పిమ్మట దాని వెంటో హింసపెట్టి గడ్డకుతీసి వశము చేసుకుంటాడట. ఈ విధముగా నది తన స్వేచ్ఛా జీవితమును పోగొట్టుకొనె.

పతంగమంటే దీపపు పురుగు. ఇది దీపమువద్దకు వస్తుంది. దానికి రూపాకర్షణ ఎక్కువ. కాబట్టి దీపపు రూపును చూచి ఆ శిఖపైన పడుతుంది. దానితో దాని ఒళ్లు కాలుతుంది. ఆ పిమ్మట మరల అది స్వస్థతను పొంది ఆ దీపపు శిఖ రూపాకర్షణకు దానిలో పడి శరీరము కాలినదే నాకు ప్రమాదమనియైనా అను కోకుండా మాటిమాటికి పడి తన ప్రాణాన్ని పోగొట్టుకొంటుందట.

మీనమంటే చేప. దీనికి రసాకర్షణ మెక్కువ. దీన్ని పట్టే వారు ఎఱ అనే ఎర్రటి పొడుగాటి పురుగును గాలానికి తగిలించి వేస్తారు. దానిని తినుటకు చేపవస్తుంది. రుచికోరకై ఆ పురుగును వచ్చి పట్టుకొంటుంది. చేపకు గాలము తగులుకొంటుంది. బెస్త వానికి చిక్కిపోతుంది.

భృంగమంటే తుమ్మెద. దానికి వాసనాకర్షణ ఎక్కువ. అది ఆకాశములో పోతూండనీ, క్రింద కమలములో మకరందపు వాసనను అంత ఎత్తు నుండి కనిపెడుతుందట. అది ఆ విధముగ కనిపెట్టి అక్కడి నుండి చక్కగ దిగి కమలములోని మకరందము త్రాగుతుందట. మకరందము త్రాగితే కైపెక్కుతుంది. ఆ కమలములోనే పడిపోతుంది. పగలైతే సూర్యుడుంటాడు. కమలము వికసించుకొని ఉంటుంది. ఆ తుమ్మెద సాయంకాలము త్రాగి పడిపోతే మరల మెలకువ వచ్చినపుడది పోలేక తెల్లవారు సరికి ప్రాణాలే పోగొట్టుకుంటుందట.

శ్రీశంకరాచార్యులవారు వ్రాస్తారు. ఒక్కొక్క ఆకర్షణే ఉన్నది ఆ జంతువులకు. అంతలోనే అవి తమ ప్రాణాలను పోగొట్టుకుంటూన్నాయి. ఇంక మనుష్యుల సంగతి యేమి చెప్పవలె? వీనికి అయిదు ఆకర్షణలు సమానముగానే ఉన్నాయి అంటే మానవుడు హెచ్చరికగా ఉండాలె.

ప్రహ్లాదుడు గయ్యాళివంటి భార్యలుంటే మానవునకెంత కష్టమో వీటికి చిక్కి ఉండడమంత కష్టము అంటాడు. గయ్యాళి భార్యలవంటివి ఇంద్రియములంటే ఒక రూపకాలంకారమైన ఉదాహరణ జ్ఞాపకమునకు వస్తూంది.

ఒక ఊరిలో ఒక రాజు. అతనికి అయిదుగురు భార్యలు, అయితే ఒక్కొక్క భార్యను తాను వశము చేసుకొనవలెనని

ప్రయత్నము, ప్రయోగము చేసినాడు. చివరకు తానే అందరికి లొంగిపోవలసి వచ్చినది. నా రాజ్యములో పురుషులందరూ నావలె నేనా? లేక భార్యలను వశములో నుంచుకున్నవారెవరైనా ఉన్నారా? తెలుసుకొనగోరి బుధవారంనాడు మధ్యాహ్నం 11 గంటలకు రాజదర్బారు ముందున్న బహిరంగ స్థలములోనికి పెండ్లియైన పురుషులందరు రావలసినది అని దండోరా వేయించినాడు. రాజాజ్ఞ కావున అందరూ వచ్చినారు. ఒక్కొక్కరికి వచ్చిన కారణం చెప్పుటకు సాధ్యపడదని రెండు బోర్డులు పెట్టినారు. ఒకదానిపై "భార్యను వశములో నుంచుకున్నవారు." అనియు, ఇంకొక దానిపై "భార్య వశములో నున్నవారు" అనియు వ్రాయబడి ఉంది. వచ్చిన వారందరు ఆ బోర్డులను తెలుసుకున్నారు. "భార్య వశములో నున్నవారు" అనే బోర్డు క్రిందనే వచ్చిన వారందరు నిలుచుకుంటున్నారు. ఆ వగుస కిలో మీటర్ల పొడవున పెరిగి పోతూంది. సాయంకాలమైంది. రాజునకు మనస్సులో "అందరూ నావలెనే ఉన్నారు. ఇంక నాకు విచారమెందుకు?" అనుకొంటున్నాడు. ఇంతలో ఒకడు వచ్చి "భార్యను వశములో నుంచుకొన్నవారు" అనే బోర్డుక్రింద నిలుచుకున్నాడు. రాజుకు కుతూహలమైంది. ఒక్కడైనా పురుషసింహం నా రాజ్యములో న్నాడ'నుకున్నాడు. వానిని కౌగిలించుకొని అడిగినాడు. భార్యను నీవు వశములో నుంచుకున్నావా? లేదు రాజా! భార్య మాట వినకపోతే నా కొక క్షణము జరుగదన్నాడు. "అట్లైతే ఆ బోర్డు క్రిందకు పోయి నిలుచుకో పో" అన్నాడు రాజు. దానికి వాడు "లేదు మహారాజా! నేనక్కడికి పోను" అన్నాడు. "ఎందుకు పోవు" అని రాజు ప్రశ్నిస్తే దానికి వాడు "మహారాజా! నేను వచ్చేటపుడు నా భార్య ఎవరులేని బోర్డుక్రింద నిలుచోమ్మని ఆజ్ఞ రిచ్చింది. నీ యాజ్ఞనైనా ధిక్కరిస్తా కాని నా భార్య ఆజ్ఞను

ధిక్కరింపజాలను'' అన్నాడట. ఇంద్రియాలే భార్యలు. వాటికి లొంగిన వాని జీవితమింత అపహాస్య జనకముగ ఉంటుంది చూడండి. ప్రహ్లాదుడు ఈ యింద్రియములనుండి నన్ను రక్షించు స్వామీ! అంటున్నాడు. ప్రార్థిస్తున్నాడు. భక్తి పారవశ్యంతో ఇంకా భగవంతున్ని గురించి చెబుతున్నాడు.

''నీ గృహాంగణభూమి నిటలంబు మోవంగ
మోదించి నిత్యంబు మొక్కఁడేని
నీ మంగళ స్తవ నికరవర్ణంబులు
పలుమారు నాలుక బలుకఁడేని
నీ యధీనములుగా నిఖిల కృత్యంబులు
ప్రియభావమున సమర్పింపఁడేని
నీ పదాంబుజముల నిర్మలచిత్తుడై
చింతించి మక్కువ జిక్కఁడేని
నిన్ను చెవులార వినఁడేని నీకు సేవ
జేయరాఁడేని బ్రహ్మంబు జెందగలఁడె
యోగియైన తపోవ్రతి యోగియైన
వేదియైన మహాతత్త్వవేదియైన. 7_367

స్వామీ! నమస్కారముతో మానవునికి అహంకారము తొలగుతుంది. వినయము లభ్యమవుతుంది. నీ మంగళ స్తోత్రములనే పలుమారు నాలుకతో పలుకుతూండాలి. బ్రతికిన కాలములో పలుమారు భగవన్నామాన్ని ఉచ్చరిస్తే మరణకాలములో సహజముగా పలుకవచ్చు. నిన్ను చేరుకోవచ్చు. సర్వకార్యములను నీ సేవగా అర్పించాలి. నీ పదాంబుజములను చింతించుచూ తన్మయుడు కావాలి. నిన్ను గురించి శ్రవణము చేయవలె. నీకు సేవ చేయాలి. లేకుంటే యోగియైనా, తపస్వియైనా బ్రహ్మమును

జెందలేగు స్వామీ! అని ప్రహ్లాదుడింతవరకు స్తోత్రముచేసి ఆయ నను ప్రశ్న వేస్తున్నాడు.

పరమాత్మా! ఈ ప్రపంచము నింత కంటకావృతముగ ఎందుకు సృష్టించితివి ప్రభూ! అంటే నరసింహస్వామి అంటాడు. "కుమారా! మనుష్యుల మేలుకొరకే. జీవితములో కష్టాలు వస్తాయి. నీకు కష్టాలు వస్తే నా రాక సంభవమైంది. ప్రాపంచిక కష్టాలను చూచి మానవుడు భయపడరాదు, అయితే ఈ ప్రపంచ ములో నేను రెండమృతాల నిచ్చినాను కుమారా! ఆ రెండమృతా లను ఎవడు సేవిస్తాడో వానికీ ప్రపంచము కంటకావృతము కాదు. ఆ యమృతాలు ఏమంటావా? ఒకటి నామామృతము, రెండవది కథామృతం. ఈ యమృతాలను సేవించేవానికి ప్రపంచముకూడ అమృతమయమవుతుంది."

ప్రపంచములోని మానవులకు భగవంతుడు వివేకాన్నిచ్చి నాడు. దాని ద్వారా ప్రతివస్తువులో నున్న మంచిని చూచేది నేర్చుకోవాలి వస్తువులుంటే వాటిని సద్వినియోగం చేసుకోవాలి. ఒక ధనికుడొక బావి నాలుగురోడ్లు కలిపేచోట త్రవ్వించినాడు. దానిలో మంచినీళ్ళు పడినాయి. అందరు ఆనందముతో నీళ్ళు త్రాగుచున్నారు మరియొక ధనికుని కుమారుడొకడు బావిలో పొరపాటుగ పడ్డాడు. దానికా ధనికుడు బావి త్రవ్వినవానితో కొట్లాడుతాడట. 'నీవు ఇచ్చట ఎందుకు బావి త్రవ్వినావని. దీనిలో ఏమైనా అర్థమున్నదా? బావి త్రవ్వించుండేది దానిలో పడి చచ్చిపోయేటొరకు కాదు. దానిలో నుండి అమృతమయమైన నీరుతీసి త్రాగి ప్రాణాలు కాపాడుకునేందుకు. ఈ ప్రపంచమనే బావిలోపడి మునిగిపోయేందుకు గాదు సృష్టించి యుండేది. దీనిలో నుండి భగవన్నామామృతాన్ని, భగవత్కథామృతాన్ని త్రాగి జీవితమును ధన్యము చేసుకునేందుకు.

ప్రహ్లాదుడు నృసింహదేవున్ని ప్రార్థిస్తున్నాడు. స్వామీ! భవదీయ దాస్యయోగమును నా కనుగ్రహించు తండ్రీ! అని. ప్రశాంతుడైతే నరసింహస్వామి మెచ్చి దయార్ద్రహృదయుడై సౌమ్యముగా అంటాడట.

"సంతోషించితి నీ చరిత్రములకున్ సద్భద్రమౌగాక నీ
యంతర్వాంఛిత లాభమెల్ల కరుణాయత్తుండనై యిచ్చెదన్
జింతం జెందకు భక్తకాముడ నే సిద్ధంబు దుర్లోక్యుడన్
జంతుశ్రేణికి నన్ను జూచిన పునర్జన్మంబు లేదర్భకా" 7-369

నాయనా! కుమారా! నీ చరిత్రమును చూచి సంతోషించినాను. నీ కోరికలెల్ల తీరుస్తాను. నీకు భద్రమవుతుంది. నీవేమాత్రము చింతించవద్దు. భక్తులకు కాముడను. అంటే కోరిన కోర్కెలు నెల్ల యిచ్చేవాడను. నిజముగ నేను చూచుటకు సాధ్యపడేవాడను కాను. నన్ను దర్శించిన వారికి పునర్జన్మము లేదు బాలుడా!

నరసింహస్వామి ఇంకను చెప్పుచున్నాడు.

"సకల భావములను సాధులు విద్వాంసు లఖిలభద్రవిభుడనైన నన్ను
గోర్కెలిమ్మటంచు గోరుదు రిచ్చెద గోరు మెద్దియైన గుఱ్ఱ నీవు!
7-370

"అని పరమేశ్వరుండు ప్రహ్లాదుని యందుగల సకామంబు దెలియు కొరకు వంచించి యిట్లాన తిచ్చిన ప్రహ్లాదుండు నిష్కాముండైన యేకాంతభక్తుండు కావున కామంబు భక్తియోగంబునకు నంత రాయంబటంచు తలంచి యిట్లనియె, స్వామీ! ఉత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తిగలవారు వరంబు లిచ్చెదనని వంచింప నేల. సంసారబీజంబులును, హృదయబంధకంబులైన కామంబులకు వెరచి ముముక్షుండనై సేమంబుకొరకు నేమంబున నిన్నుం జేరితి. కామంబులును, నింద్రియంబులును మనశ్శరీర ధైర్యంబులును,

మసీమా ప్రాణధర్మంబులును, లజ్జాస్మరణ లక్ష్మీ తేజోవిభవంబులను నశించు, లోకంబులందు భృత్యులర్థకాములై రాజుల సేవింతురు. రాజులుం బ్రయోజనములర్థించి భృత్యులకు నర్థంబు లొసంగుదురు. నా విషయ మట్టిది కాదు. నాకు కామంబులేదు. నీకు ప్రయోజనంబులేదు. ఐన దేవా! వరదుండవయ్యెదవేని కామంబు వృద్ధి పొందని వరంబు కృపసేయుము. కామంబుల విడిచిన పురుషుడు నీతోడి సమానవిభుండగు, నరసింహ! పరమాత్మ! పురుషోత్తమ! అని ప్రణవపూర్వకంబుగ నమస్కరించిన హరి యిట్లనియె. 7-371

దీనిలో నొక ముఖ్య విషయమున్నది. ప్రాపంచిక సంబంధమైన కామ మెట్టిదైనను భక్తిలో అది అంతరాయమును కలిగిస్తుంది.

"కామేన కర్మ నాశస్స్యాత్ క్రోధేన జ్ఞాన నాశనమ్ ।
లోభేన భక్తినాశస్స్యాత్ తస్మాదేతత్త్రియం త్యజేత్ ॥"

అంటారు పెద్దలు. కామముచేత కర్మ నాశమవుతుంది. క్రోధముతో జ్ఞాన నాశము, లోభముచేత భక్తి భ్రష్టవుతుంది. కావున నీ మూటిని వదలవలెనని పెద్దల సూక్తి.

అస్సలు ఇపుడు నరసింహస్వామి ప్రహ్లాదుని చిత్తమును పరీక్షించుటకు "నేను ప్రత్యక్షమైతే అందరునూ కోరికలు కోరుకుంటూంటారు. నీవుకూడ కోరుకో నాయనా!" అంటాడు. దానికి ప్రహ్లాదుడు కోరికలు లేని వరమిమ్మంటాడు. ఇది సర్వులు గమనించదగిన విషయము. ప్రహ్లాదుని చిత్తము అనన్యమైనది. దీనికి నృసింహస్వామి మిక్కిలి సంతసించి అంటాడు —

నాయనా! నీవంటి విజ్ఞానవంతులు ఏ విధమైన కోర్కెలుం గోరరు, కుమారా! ప్రహ్లాద! రాక్షసభర్తవై మన్వంతర కాలమెల్లను పూర్ణమైన భోగములతో అనుభవించు. కల్యాణబుద్ధితో

నిరంతరము నా కథలను వింటూండు. సకల భూతములందు యజ్ఞేశుడ నైన నన్ను చూస్తూండుము. సమస్త కర్మములను నాకర్పించిన భావముతో చేస్తూండి కర్మచయమునెల్ల ఖండింపుము. సమస్త పాపములు తొలగిపోతాయి కుమారా! ఆ పిమ్మట నా వద్దకు నస్తావు.

"నరుడు ప్రియముతోడ నాయవతారంబు నీయుదారగీత నికరములను
మానసించెనేని మరిసంభవింపడు కర్మబంధ చయము గడచిపోవు"
7-374

నా అవతారము, నీ యీ కథను యెవ్వడైనను శ్రవణము చేస్తే మరల వానికి జన్మబంధము లేదు ప్రహ్లాదా! అతడు కర్మ బంధచయమును దాటి పోతాడు. ఆ విధముగా నృసింహస్వామి ఆశీర్వదిస్తే ప్రహ్లాదు డడుగుతూన్నాడు.

"స్వామీ! మా తండ్రి నీకు వైరియై అపకారము చేసి నాడు. ఆయన శుద్ధాత్ముడగునట్లు సద్గతిని చెందునట్లు నాకు వరమీ తండ్రీ" దానికి స్వామి, కుమారా! నీ సంబంధము చేత నీ తండ్రి ఎప్పుడో సుగతిని పొందినాడు." వంశములో ఒక్కడు జ్ఞాని యైనా భక్తుడైనా ఆ వంశములోని పితరులెల్ల తరిస్తారు. 'సంసారాచ్ఛ సముద్ధృతా స్వపితరః" అనునది ప్రమాణము. పితరులు సహజముగ తరిస్తారు. ఆ విధముగ గాక పాపాత్ములైతే పితరులకు దుర్గతులు కలుగుతాయని ప్రమాణము. అందువలన మానవుని జీవితము బాగుపడినను అనేకులతో సంబంధము కలిగి ఉంటుంది. ఆ ప్రయోజనము తనతో సంబంధీకులందరికి కలుగుతుంది. అటులనే జీవితము చెడిపోతే తన సంబంధీకులందరికి దాని ప్రభావము చేత విపరీతమైన దుఃఖము కలుగుతుంది. కావున మానవుడీ సత్యమును గమనించి తన జీవితము ద్వారా ఇతరులకు శ్రేయస్సు కలిగించే మార్గములోనే జీవయాత్ర గడపాలి.

ప్రహ్లాదుడు తండ్రికి పరలోక క్రియల నాచరించె. బ్రహ్మ అచ్చటికి వచ్చి నరసింహస్వామిని స్తుతిస్తాడు. ఆ నృసింహస్వామి బ్రహ్మతో "ఇటువంటి వరములింక ఎవరికి గాని దుర్మార్గులకు యివ్వవద్దు" అని ఆజ్ఞాపించి తిరోహితుడౌతాడు.

ఈ ప్రహ్లాదుని చరిత్రలో ముఖ్యముగ మనము గమనించవగిన విషయ మొకటి. నరసింహస్వామి నాయనా! నీవేమైనా కోరుకో అంటే నాకే కోరిక వద్దన్నాడు. అంతేగాక "ఉత్పత్తి మొదలు కామాద్యనుభవాసక్తిగల నాకు వరంబు లిచ్చెదనని వంచింప నేల" అంటాడు. పుట్టినప్పటినుండి కామాద్యాసక్తుల అనుభవము నాకున్నది. దానితో ఏమియు సారము లేదని నాకు అనుభవములో తెలిసిందంటున్నాడు. వాస్తవములో కామానుభవములో, కోర్కెలు కోరుటలో మానవుడు తన లక్ష్యమునుండి పతితుడౌతాడనుట నిశ్చయము. "కామంబులు విడిచిన పురుషుడు నీతోడి సమానుండగు" అనే విషయము అద్భుతమైనది. పరమ సత్యమైనది. కోరిక లేనివాడు భగవంతునితో సమానము. ఈ విషయము కఠోపనిషత్తులో కూడ వచ్చింది. యమధర్మరాజు నచికేతునితో అంటాడు —

"యదా సర్వే ప్రముచ్యంతే కామాయేఽస్యహృదిస్థితాః।
అథమర్త్యోఽమృతోభవతి అత్రబ్రహ్మ సమశ్నుతే॥"

ఎవనియొక్క హృదయములోని కామనలు పూర్తిగా తొలగి పోయినాయో ఆ మర్త్యుడు అమృత స్వరూపుడౌతాడు. ఇచ్చటనే బ్రహ్మస్వరూపుడౌతాడు అని శ్లోకార్థము. కాబట్టి ఈ విషయము మరల మననము చేయబడినది. దీనిలోని నగ్న సత్యమును సర్వులు హార్దికముగ గమనింతురు గాక! ప్రహ్లాద చరిత్రలో అన్నియు

అద్భుతమైన విషయాలే కాని ఈ విషయము సర్వులు గమనించి అనుసరించిన మానవజీవితము మాధవ జీవితము కాగలదు.

ఈ ప్రహ్లాద కథాశ్రవణముయొక్క మహిమ చెప్పబడుచున్నది,

"శ్రీరమణీయమైన నరసింహావిహారము నింద్రశత్రు సం
హారము బుణ్యభాగవతుడైన నిశాచర నాథ పుత్రు సం
చారము నెవ్వడైన సువిచారత విన్న బఠించినన్ శుభా
కారముతోడ నే భయము గల్గని లోకము జెందు భూవరా!
7-385

అతి రమణీయమైన నృసింహస్వామి విహారము, హిరణ్యకశిపు సంహారము, పుణ్యభాగవతుడైన ప్రహ్లాదుని విషయము ఎవ్వరైనను మంచి భావముతో విన్నను, చదివినను శుభమైన మార్గములో భయము లేనట్టి లోకమును జెందుతారు.

శ్రీ నరసింహ స్వామికీ జై!

ఓం సర్వేవై సుఖినస్సంతు

పదునెనిమిదవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## పందొమ్మిదవ రోజు ఉపన్యాసము

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥"

"ఆదర మొప్ప మ్రొక్కెడిదునద్రిసుతా హృదయానురాగ సం
పాదికి దోషభేదికి ప్రపన్నవినోదికి విఘ్నవల్లికా
చ్ఛేదికి మంజువాదికి నశేష జగజ్జననంద వేదికిన్
మోదకఖాదికిన్ సమదమూషకసాదికి సుప్రసాదికిన్"

భక్త మహాశయులారా! భాగవతశ్రవణాసక్త చిత్తులారా!

పరమపవిత్రమైన భాగవతము. ఇది భక్తిశాస్త్రము. మానవునకు ముఖ్యముగా భగవంతునిపై భక్తి ఉండాలి. ఎందుకు? సమస్తమునకు ఆయనే ప్రభువు. ఆయన అనుగ్రహము చేత యీ మానవుడు సర్వకష్టాలను తరిస్తాడు. భగవద్గీతలో భగవంతు డంటాడు. "మచ్చిత్త స్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి" సర్వదుర్గములు భగవదాసక్తచిత్తుడైతే అవలీలగా తరిస్తాడు. యోగక్షేమము కూడ ఆయనే చూస్తాడు. అయితే ఆ భక్తి ఎంత పరిమితిలో ఉండాలె? అది ఎంతమాత్ర ముండాలి? దీనిని గురించి భాగవతములోని ఏకాదశ స్కంధములో నవనాథులు విదేహ మహారాజుకు చెప్తారు. సర్వులు దీనిని శ్రద్ధగా గమనించాలి.

"ఏషణ త్రయమున నెంతబలంబుండు అంత బలంబుతో నబ్జనాభు చరణంబులు భజించి సల్పు సద్భక్తిచేచిత్తంబునందు సంచితములైన గుణకర్మ జాతనిగూఢ మలంబుల పురుషుండు నిశ్శేషములుగ నెపుడు మాయించునతని నిర్మలదృష్టి యగువాని కనులకు రవి దోచు కరణి అతని శుద్ధచిత్తమందు చూపట్టు తేటగా

నద్వితీయమైన యాత్మ తత్త్వము

అంత మరల బాడయవా విద్యకంబు

లజ్ఞాన మూలకములు సంశయములు."

ఏషణాత్రయము అంటే దారేషణ ధనేషణ, పుత్రేషణ అనేవి ఏషణ త్రయములు. దారేషణ అనగా భార్యపై ఆసక్తి, ధనముపై ఆసక్తి, సంతానముపై ఆసక్తి ఎంత ఉంటుందో అంత ఆసక్తి భగవంతునిపై ఉండాలట మనము కొంచెము కన్నులు మూసుకొని చూచుకుంటే మనలోపల అంతటి ఆసక్తి భగవంతున్ని గురించి ఉన్నదా? ఒక మహానుభావుడు మానవున కెంత భక్తి ఉన్నదంటే పాయసములోనికి చింతకాయ తొక్కు నంచుకున్నంత మాత్రమున్నదని నిష్కర్ష తేల్చి చెప్పినాడు. అంటే కేవలము అల్పముగా నున్నదని తాత్పర్యము. ఈ కొద్దిపాటి భక్తి చాలదు. "నీవే తప్ప ఇతఃపరం బెరుగ" — అన్నంత గాఢముగ ఉండాలి.

ఆ విధముగ ఉంటే ఏమవుతుంది? దానితో చిత్తమునందు సంచితములైన మలములు తొలగిపోతాయి. అపుడు దృష్టిదోషము లేని కన్నులకు సూర్యుడు కనిపించినంత స్పష్టముగ భగవంతుని అద్వితీయ తత్త్వం గోచరిస్తుంది. ఒక తూరి ఇట్టి దర్శనమైతే మరల అవిద్యాసంబంధములైన, అజ్ఞానమూలకములైన సంశయాలు కలుగవు. అయితే బుద్ధియనెడు త్రాసులోని ఒక పళ్లెములో ఏషణాత్రయము పెట్టితే, మరొక పళ్లెములో భక్తి పెట్టి యెత్తితే ఈ భక్తి పళ్లెము సమానముగ బరువు కలిగి ఉండాలి.

అంతఃకరణములోని మలములు ఎన్ని ? అవి మల, విక్షేప, ఆవరణములని మూడు. మలము అంటే తాను ఇంతవరకు గత జన్మలలో ఈ జన్మలో ఇంతవరకు చేసిన పాపములు అని తెలుసు కోవాలి. మనుష్యుడు చేసిన పాపము మలరూపములో అంతఃకరణ మనే అద్దానికి పేరుకుంటుంది అద్దముంది. కాని దానికి మసిపట్టింది. అపుడు మానవుని ముఖము అద్దములో స్వచ్ఛముగ కనిపించదు. దానిని తుడిచివేయాలి. అంటే భక్తియే దానికి ఉచితమైన సాధనము. అంతఃకరణములో మలముల వలన మానవుని మనస్సు మంచి విషయాలపైకి పోదు.

రెండవ మలము విక్షేపము. అనగా చాంచల్యము. అద్దము ముందర మనిషి తన ముఖము చూచుకొనగోరుచున్నాడు. అపుడు అద్దము కదలుచున్నది. అందువలన వాని ముఖము అద్దములో సరిగా కనిపించదు. ఇంతవరకు పలువిధములైన చాంచల్యములలో కాలము గడపినాడు మానవుడు. గాలికంటే వేగముగా తిరిగేది ఇపుడొక విషయముపై అనగా భగవంతునిపై నిలువమంటే నిలువదు. కావున దానికి భగవత్స్వరూపముపై నిలిచే టట్లు భక్తిని సాధించాలి. అంటే భగవంతుని స్మరణ, ధ్యానము, జపము మొదలగువాటిని అభ్యాసము చేయాలి.

అంతఃకరణముయొక్క మూడవమలము ఆవరణము లేక అజ్ఞానము అద్దమున్నది. దానిమీద పలుచని తెర అడ్డమున్నది. మనము మన ప్రతిబింబమును చూచుకొనలేము. కావున అజ్ఞానమును తొలగించుకొనకపోతే మనకు ఆత్మదర్శనము, లేక భగవద్దర్శనము కలుగదు. అజ్ఞానమును తొలగించుకొన వలెనంటే భగవద్జ్ఞానమే కావాలి. చీకటి పోవలెనంటే వెలుగుచేతనే అది సాధ్యమవుతుంది. అటులనే భగవత్సంబంధమైన జ్ఞానముచేతనే ఆవరణము తొలగిపోతుంది. ఈ విధముగ త్రివిధములైన మాలిన్య

ములు తొలగిపోతే అద్వితీయమైన ఆత్మతత్త్వము స్పష్టముగ బోధ పడుతుంది. భక్తి ఎంత పరిమితిలో ఉండాలి ? అని చెప్పే భాగవతముయొక్క సూక్తిని సర్వులు గమనించి భగవంతుని యందు దత్తచిత్తులు కావాలి.

భక్తి అనేది స్థూలవస్తువు కాదు. మనుష్యుడు భోజనానికి కూర్చున్నాడు. విస్తరలో స్వీట్, హాట్, అన్నము పప్పు కూరగాయలు వడ్డించబడినవి. ఏవస్తువు తీసుకొని నోట్లో పెట్టుకుంటే ఆవస్తువుయొక్క రుచి అప్పటికప్పుడే కనబడింది. భక్తి అట్టి స్థూలమైందికాదు. దీనిని భక్తితో, శ్రద్ధతో తత్పరమైన భావముతో దీని యొక్క రుచిని ఆసక్తచిత్తముతో పెంచుకోవాలి. ఇది భావమునకు సంబంధించినది. భావములో నిరంతరము భగవదాసక్తిని పెంపొందించుకోవాలి. అది పెరుగుటకు శ్రవణము ముఖ్యసాధనము. ఈ శ్రవణము చేయవలెననినను ఎన్నో ఆటంకములు ఏర్పడుతాయి. కాని దీనియొక్క మహత్తు తెలిసినవారు మిగతా అన్ని కార్యముల కంటే దీనిని ప్రధానముగ భావించినపుడు మాత్రమే దీనికొరకు వచ్చుట ఈ అమృత పానానుభవమును పొందుట జరుగుతుంది. అంత దృఢమైన ఆసక్తి లేకపోతే వచ్చుటకే సాధ్యముకాదు. కొందరు ఆ భగవంతుని అనుగ్రహముంటేనే కదండీ ? లేకపోతే ఇచ్చటికి వచ్చుట అందరికి సాధ్యమవుతుందా ? అని ప్రశ్నించవచ్చు. అవును. భగవదనుగ్రహము కావాలె. అది ఊరకరాదు. నీవు తో ప్రయత్నం చేస్తే, భగవంతున్ని నీలో వేడుకొని ఇట్టి అవకాశము కల్పించు స్వామీ ! అని వేడుకున్నప్పుడు ఈ భాగ్యము ప్రసాదితమవుతుంది. నీ ప్రయత్నమే లేక ఇది సాధ్యమే కాదు. ఏదో అనుకూలము చిక్కితే పోదాము లెమ్మనుకుంటే ఆ పూటకే ఎవరో వస్తారు. ఏదో పని పడుతుంది. అవకాశము జారిపోతుంది. నీలో తీవ్రమైన ఆసక్తి ఉంటేనే కాని లేకుంటే శ్రవణభాగ్యాన్ని పొందుట సాధ్యము కాదు.

మనుష్యునికి ముఖ్యముగా తనకు తన జన్మను ధన్యము చేసుకోవలె. ఇటువంటి కార్యములలో పాల్గొనవలె. సత్యాసత్య జ్ఞానము, నిజమైన ఆనందముయొక్క స్వరూపము, ధన్యజీవన మార్గవిధానము తెలుసుకోవలెననే కుతూహలము తీవ్రముగ ఉండాలె. తరువాత భగవంతుడనుగ్రహిస్తాడు. భగవంతున్ని ఈ విధమైన అవకాశాలు ప్రసాదించు స్వామీ! అని వేడుకోవాలి. ఆత్మానంద ప్రాప్తి జీవితములో మహత్తరమైన భాగ్యము. మానవుడు నిండు హృదయముతో దీనిని కోరి ప్రయత్నిస్తే సాఫల్యము తప్పక లభ్యమవుతుంది.

భగవంతుడీ మానవునికి పౌరుషశక్తి నిచ్చినాడు. తీవ్రేచ్ఛ కలిగియుంటే మానవునకు తప్పక సాధ్యమవుతుంది. నీవు ప్రయత్నమే చేయక భగవంతుడనుగ్రహిస్తే నాకు అవకాశము కలుగుతుంది లే, అంటే కలుగడం కష్టం. గీత ఈ విషయములో స్పష్టముగ చెప్పినది:-

“నాదత్తే కస్య చిత్పాపం న చైవ సుకృతం విభుః” అంటే సర్వేశ్వరుడు నీకు పాపము ఇవ్వడు. పుణ్యము ఇవ్వడు. నీవు చేసుకున్న కర్మే నీ జీవనరథాన్ని నడిపేది. ఆ కర్మ భక్తితో కూడినదైతే భగవదనుగ్రహం కలుగుతుంది. కనుక భక్తి ప్రధానము. ఆయన అధ్యక్షుడు మాత్రం. ఆయన ఏమియు అనడు. అయితే భగవంతుని అధ్యక్షతలోని ప్రయోజనమేమి? అంటే అధ్యక్షునికి అంతా గోచరమవుతూంటుంది. అందువలన ఎవడెవడేమేమి కర్మ చేసుకుంటాడో వాడు ఆ కర్మఫలమునుండి తప్పుకోలేడు. ఒక మనిషి ఇంకొక మనిషి పనులను ఎప్పుడు తెలుసుకుంటాడు? పని చేసిన తర్వాత తెలుసుకుంటాడు. కాని భగవంతుడో? నీ మనస్సులో నున్న సంకల్పాలను తెలుసుకుంటాడు. ఆయన సర్వవ్యాపి. సర్వగతుడు. అందువలన మానవుడు తాను చేసుకున్న కర్మఫలము నుండి వెంట్రుకవాసి ఫలంకూడ తప్పించుకోలేడు.

రామానుజాచార్యుల వారివద్ద వెంకటేశ్ అనే శిష్యుడు మహావిద్యావంతుడుండేవాడు. ఆయనపైన రామానుజాచార్యుల వారికి వాత్సల్యము ఎక్కువ. కాని తక్కిన శిష్యులకిది గిట్టలేదు. రామానుజాచార్యులవారు వెంకటేశ్ యొక్క బుద్ధికుశలతను శిష్యులకు చూపింపదలచి ఒక పర్యాయము శిష్యులకందరికి ఒక్కొక్క అరటిపండిచ్చి ఎవ్వరూ లేనిచోట తినిరావలసినదని ఆజ్ఞాపించినారు. ఒక్కొక్కడు చెట్టుదాపున, గుట్టదాపున, గోడదాపున తిని వచ్చినారు. కాని వెంకటేశ్ తినకుండా తెచ్చినాడు. గురువులు "వారందరు తినివచ్చినారు. నీవెందుకు తినకుండా వచ్చినావు?" అని ప్రశ్నించినారు. దానికతడు "స్వామీ! పరమాత్మ సర్వవ్యాపి కదా! ఆయన లేనిచోట చిక్కక వాపసు తెచ్చినానన్నాడు. ఆ విధముగ భగవంతుడు సర్వవ్యాపి, సర్వద్రష్ట.

ప్రాసంగికంగా వెంకటేశ్ కథ వచ్చింది. దాన్ని పూర్తి చేస్తాము. ఈ శిష్యులంతా వేంకటేశ్ పైన పగ తీర్చుకోవాలె ననుకున్నారు. వెంకటేశ్ ఒక కుటీరములో ఉండేవాడు. తెల్లవారి నాలుగు గంటలకు అనుష్ఠానమునకు కూర్చుంటే సూర్యోదయమైన పిమ్మట బయటికి వస్తాడు. ఒకనాడు ఈ శిష్య మర్కటాలు అందరి చెప్పులు ఒక మాలగా కట్టి కుటీరమునకు తగిలించినారు. ఆయన లోపలినుండి వస్తూంటే తలకు చెప్పులు తగలవలెనని వీరి వాంఛ. ఆయన లోపలినుండి సూర్యోదయమవుతూనే బయటికి వస్తూంటే చెప్పుల మాల తగిలింది. దాన్ని చూస్తూ అక్కడ దాగి లోలోపల ఆనందపడుతూన్నారు వాళ్ళంతా. కాని వెంకటేశు ఆ చెప్పులమాల తాకుతే అక్కడనే నిలుచుకొని ఆహా! ఏమి నా భాగ్యము! నా జన్మ తరియించె. అని అచ్చటనే ఆనందముతో ఒక శ్లోకము ఆశువుగ చెప్పినాడు.

"జ్ఞానావలంబికాః కేచిత్ కేచిత్ కర్మావలంబికాః।
వయంతు హరిదాసానాం పాదరక్షావలంబికాః॥"

అంటే కొందరు తరించవలెనంటే జ్ఞానమార్గాన్ని అవలంబిస్తారు. కొందరు కర్మమార్గాన్ని అవలంబించి దీర్ఘకాలసాధన చేసుకుంటారు. నేనైతే హరిదాసుల పాదరక్షల అవలంబనముతో సులభముగ తరించి పోతిని కదా ? అన్నాడట.

అక్కడున్న వాళ్ళంతా ఆయనకు చెప్పాలు తగులుతే ఆయన బాధపడాలి అని నిరీక్షిస్తున్నారు. కాని ఆయన ఆనంద పడుతూంటే అందరికి విస్మయము వేసింది. ఆ విస్మాట వారు వెళ్ళి వెంకటేశ్ కాళ్ళపై బడి "ఇంతటి గొప్పవాడవని తెలియక పొర పాటు చేసినాము. మా తప్పు క్షమింపమని" వేడుకున్నారట. ఇట్టిది వెంకటేశ్ చరిత్ర.

నిరంతరము భగవంతుని వైపు మనభక్తి ప్రవాహము వెళ్లు తూండాలి. నది సముద్రము వైపు పరుగెత్తినట్లు మానవుని చిత్తము భగవంతునివైపు అప్రయత్నముగ ప్రవహిస్తూండాలి. ఒకని ముందర రూపాయ నోటు, రెండు రూపాయలది, పదిది, యాభైది, నూరుది నోట్లు పెట్టి ఏదైనా ఒకటి తీసుకొమ్మంటే నూరు రూపాయల నోటు తీసుకుంటాము. ఏది అన్నింటికంటే అధిక మైన విలువయైనదో దాన్ని తీసుకుంటాము కదా ? అటులనే మన ఆసక్తిని క్షుద్రమైన వస్తువులయందు పెట్టితే అది వ్యర్థమవుతుంది. సర్వేశ్వరునిపై పెడితే సఫలమవుతుంది. కాబట్టి జీవితము చాలా విలువైంది. దానిని అత్యధికమైన శ్రేష్ఠమార్గములో గడవాలి. అంటే మరణానంతరము కూడ తన వెంట వచ్చే వస్తువుకై ప్రయత్నించాలి. భౌతికమైన వస్తుసముదాయ సంపాదనలోనే జీవితమును ఖర్చు పెట్టుకొన్న అది నీ వెంటరాదు. కావున వివేక

ముతో ఆలోచించండి. మీ వెంట రాని వస్తు సంపాదనలోనే జీవిత మును కోరుపెట్టిన మరణానంతరము దుఃఖమే మిగిలేది. కావున భగవత్ప్రాప్తికొరకై ప్రయత్నిస్తే అది సఫలమైన జీవన విధానము.

మానవునకు చతుర్విధములైన పురుషార్థములున్నవి. అవి ధర్మ, అర్థ, కామ, మోక్షములు. వీటిలో మధ్యలోని అర్థకామ ములు, ప్రారబ్ధాధీనములు. వాడు కష్టపడి సంపాదించవలసినవి ధర్మమోక్షములు. ధర్మమోక్షములపై దృష్టిని కేంద్రీకరించి ఆ రెంటిని సాధించుటకు ప్రయత్నిస్తే ఆజన్మ సఫలమౌతుంది. చూడండి దినానికి ఇరవై నాలుగు గంటల కాలమున్నది. కనీసం దినానికి ఒక గంట దైవప్రాప్తికొరకై కేటాయించాలి. అల్పమైన జీవన విధానము కావలెనా? శ్రేష్ఠమైన జీవన విధానము కావలెనా? నీ వెంట రాని వస్తువులకొరకై జీవితాన్ని బలి చేయడం నికృష్టమైన మార్గము. దైవప్రాప్తికై నీవు జీవితము గడపడం శ్రేష్ఠమైన మార్గం. ఈ సాధన ఏకొద్దిగా జరిగినా అది మరణానంతరం జీవుని వెంట వచ్చి అతనికి సుఖమును కలుగ జేయుచూ జీవుని ఉన్నతికి తోడ్పడుతుంది. కావున రూపాయ నోటు తీసుకుంటావా? నూరు రూపాయల నోటు తీసుకుంటావా? ప్రయోజనమధికము కావాలెనంటే సర్వేశ్వరుడు, సర్వశక్తి మంతుడునైన పరమాత్మనాశ్రయించిన జీవితం గడపుము.

ప్రధానమని, గౌణమని రెండు శబ్దాలున్నవి ప్రధానమంటే ముఖ్యమైనది. గౌణమంటే అంత ప్రధానము కాదు. మానవుడు ప్రధానమైన మార్గాన్ని అనుసరించాలి అంటే పరమాత్మను పొందే ప్రయత్నము చేయాలి. అట్లుగాక ప్రపంచ విషయాలకే జీవితాన్ని ఖర్చు పెట్టుట గౌణమార్గమే. నిజాము నవాబు ఒక

పర్యాయము కారులో పోతూన్నాడు. కారు ముందర పది రూపా యల నోటు పడింది కనిపించింది. ఆ నవాబు కారు నాపి దిగి పది రూపాయల నోటు పడిన దానిని తీసుకొని కారు నెక్కి పోతాడా? వానికి పది రూపాయలనోటు ఏమి లెక్క! పవిత్రము, శ్రేష్ఠము నైన యీ మానవజన్మను కేవలము విషయభోగాలకే వెచ్చించు వారు జీవితముయొక్క శ్రేష్ఠత్వము నెరుగనివారు. కాబట్టి జీవిత మును శ్రేయోమార్గమున నడపవలె కాని ప్రేయోమార్గమున జీవితమును వ్యర్థం చేసుకోరాదు.

ప్రతివ్యక్తి ఇచ్చటికి వచ్చి శ్రవణము చేసేవారొక పర్యా యము ఆలోచించుకోవాలి. ఇంతవరకు జరిగిన జీవితములో ఏమి సాధించినారో ఆలోచన చేసుకోండి. శ్రవణం మానవునికి పశ్చాత్తా పాన్ని కలిగించవలె. ఇంత జీవితము గడచిపోయినదే. దీనిలో నేనేమైనా ఆధ్యాత్మమార్గమున ప్రవేశించి సాధన చేసినానా? ఈ జీవితము నశ్వరమైనదని పరమాత్మ ప్రాప్తికై శ్రద్ధగా ప్రయత్నించి నానా? ఈ విధముగ ఆలోచించండి. జరిగినది జరిగిపోయినది. ఇప్పటినుంచియైనా శ్రద్ధగా ఈ ఆత్మమార్గములో కృషి చేయండి. ఇది ఇప్పటి ఈ యుపోద్ఘాత సారాంశము.

ఇంతవరకు ప్రహ్లాద చరిత్ర విని తన్మయతను పొందినాము. దానికి తగిన కారణము కూడ ఉన్నది. ఒక వైపు మహాబల వంతుడు, దేవతలను కూడ గడ గడ వణకించు మహాబలశాలి, ఘోరమైన తపస్సు చేసి బ్రహ్మదేవునితో మరణములేని వరము పొంది వచ్చినవాడు హిరణ్యాకశిపుడు. మరియొక వైపు అయిదేండ్ల బాలుడు. కోమలమైనవాడు. ఇట్టి వీనిని వాడు ఎన్నో ప్రయత్నములు చేసి చంపించవలెనని ప్రయత్నించె వీడు చావకపోగా హిరణ్యాకశిపుడే చనిపోయె. ఇంతకంటె ఆశ్చర్యమేమున్నది? ఆ మహిమ భక్తిది.

భగవదనుగ్రహము పొందుతే అంతటి మహిమ వస్తుంది చూడండి. ఇంతటి మహిమ, ఇంతటి శక్తి ఈ భక్తి మార్గములో సంపన్న మవుతుందను కోవడములో ఎవరికైనా సందేహమా? లేదు. కాని ఆ విధముగ ప్రయత్నించడం అసాధారణమైన విషయమే. మరి అసాధారణశక్తి పొందాలి అంటే అసాధారణ ప్రయత్నం చేయవలసినదే.

మనము భాగవతము మూడవ స్కంధములో హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జననమైతే అచ్చటి నుండి వారికథ పూర్తిచేసే కొరకు సప్తమ స్కంధములోనికి పోయి విహరించినాము. ఇపుడు మరల మూడవ స్కంధములోనికి వస్తాము. అచ్చట మరొక అద్భుతమైన సన్నివేశమున్నది. కపిలదేవహూతి సంవాదము, అది మహత్తరమైన వేదాంతఘట్టము. మన ఉపన్యాసములు కపిలదేవహూతి సంవాదముతో సమాప్త మౌతాయి. కావున మూడవ స్కంధములోనికి రావాలి.

విదురుడు మైత్రేయ మహర్షిని ప్రశ్నిస్తున్నాడు. "స్వామీ! ఇంతవరకు పవిత్రమైన ప్రహ్లాదచరిత్ర విని చాలా ఆనందమైంది. సృష్టియొక్క ఆరంభములో ఎవరుండిరి? వారి నుండి మానవ సంతతి ఎట్లు విస్తరిల్లె? దీనిని గురించి కరుణతో చెప్పవలసినదని ప్రశ్నించె. దానికి మైత్రేయ మహర్షి అంటాడు.

మొదటివాడు స్వాయంభువ మనువు. ఆయన భార్య శతరూప. ఆ దంపతులకిద్దరు కుమారులు. వారు ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడనేవారు. ముగ్గురు కూతుర్లు. వారి పేర్లు ఆకృతి, ప్రసూతి, దేవహూతి. ఆకృతి రుచీక మహర్షితోనూ, దేవహూతి కర్దమునితోనూ, ప్రసూతి దక్షునితోనూ, వివాహాలు జరుగుతాయి. కర్దముడు - దేవహూతి గర్భములో కపిలుడుదయిస్తాడు. ఈ

మాట విదురుడు విని "మహాత్మా! ఆ కపిలుని కథను వివరముగ వినిపించు స్వామీ"! అంటాడు.

కర్దముడు మహాతపస్వి, కర్దముడంటే ఇంద్రియములను దమనము చేసి తన అధీనములో పెట్టుకున్నవాడని అర్థము. ఈ ప్రపంచములో ఎవడు తమ ఇంద్రియాలను వశములో పెట్టుకున్నాడో అతడు మహానుభావుడు.

"నిగృహీతేంద్రియ గ్రామో యత్ర యత్రవసేన్నరః ।
తత్ర తత్ర కురుక్షేత్రం నైమిశం పుష్కరాని చ" ॥

అన్నారు పెద్దలు. అంటే ఇంద్రియాలను అధీనములో పెట్టుకున్న వారు ఎచ్చటెచ్చట సంచరిస్తారో ఆ యా స్థలాలు కురుక్షేత్రాలు, నైమిశారణ్యాలు, పుష్కర తీర్థాలు అని అర్థం.

అతడంత పవిత్రుడు. ఇంద్రియాలకు వశుడైతే జీవితం పతనమవుతుంది. ఇంద్రియాలను వశములో పెట్టుకుంటే మనిషి యింత శ్రేష్ఠుడనిపించుకుంటాడు. లోకములో కూడ సమాజములో ఎక్కడ చూచినను వానికి గౌరవమే ఉంటుంది. కర్దముడు సంయమము కలవాడు. ఇంద్రియారాముడు ప్రపంచాన్ని చూచే చూపే వికృతంగా ఉంటుంది. ఒక బాగా మేసిన కోడిపోతూంది. ఒకడు శాకాహారి చూచినాడు. మరొకడు మాంసాహారి చూచినాడు. శాకాహారి మనస్సులో యే వికారమూ లేదు. మాంసాహారి మనస్సులో "అరశే ఈ కోడి ఎంత బాగుంది?" అనుకో వడంలోనే వాని సంకల్పాలు ఎక్కడెక్కడకో పోతాయి. కాముకుడు సుందరమైన స్త్రీని చూస్తే ఏమేమో తిక్కతిక్కగ ఆలోచిస్తాడు. కావున ప్రపంచమును భోగదృష్టితో చూచుట పాపము. ప్రపంచము భగవంతుని వ్యక్తస్వరూపము. ఇది ఇంతటి విచిత్రమైన వైవిధ్యమును కలిగియున్నది. కావున నిగృహీతేంద్రియులు

ఇంద్రియ దృష్టితో ప్రపంచాన్ని చూడరు. వారు భగవత్స్వరూప ముగ చూస్తారు. అందుకనే వారి వ్యక్తిత్వము అంతమహాత్వ పూర్ణముగ ఉంటుంది.

అందమైన స్త్రీ కనిపిస్తే ఆమెను లక్ష్మీదేవిగాచూడు. ఆమె లోని దేవుడు నిన్ననుగ్రహిస్తాడు. ఆ విధముగ గాక కాముకమైన దృష్టితో చూస్తే ఆమెలోని దేవుడు నిన్ను శపిస్తాడు ఈ సత్య మును సర్వులు గమనించదగినది.

శంకరాచార్యులు తన ప్రబోధ సుధాకరములో ఈ విధముగ వ్రాస్తారు.

"పశ్యతి పరస్య యువతీం సకామమపి తన్మనోరథం కురుతే।
జ్ఞాత్వైవ తదప్రాప్తిం వ్యర్థం మనుజోఽతిపాప భాగ్భవతి"

పరస్త్రీని చూచి కాముకుడు మనోరథం చేస్తాడు. ఆమె తన అందుబాటులో లేదని తెలిసి కూడ ఆమెను కోరి నిష్కారణమైనట్టి పాపభాజనుడౌతాడు.

మనుష్యులు ప్రపంచాన్ని వివిధమైన దృష్టులతో చూస్తారు.

ధనముపై తీవ్రమైన వాంఛ గలవారు ఎక్కడికి పోతే తమకు ధనం ప్రాప్తమవుతుంది. ఎట్లైతే ధనాన్ని ఎక్కువగా సంపాదించవచ్చుననే రంధి ఎప్పటికీ ఉంటుంది. కాముకుడు ఎక్కడ ఎవరిని చూచినా వికృతమైన చూపుతోచూస్తాడు. ఇది మనస్సుతో చేసేపాపము. ఒక మహాత్ముడంటాడు. నాయనా! నీకు ఏ స్త్రీని చూచినపుడు నీకు మనస్సు దుష్టమైన సంకల్పం చేసిందో అపుడు మనస్సు ద్వారా పాపము సంప్రాప్తమైనది. దానిని నీవు దగ్గర పెట్టుకోవద్దు. వెంటనే ఆ పాపమును అక్కడనే చుకాయించుకో, అన్నాడు ఎట్లంటే! ఏ స్త్రీని గురించి నీ మనస్సు దుష్టముగ ఆలోచించిందో అక్కడ ఆ స్త్రీకి నీ మనస్సుతో ప్రదక్షిణం చేయించి

కాళ్ళకు నమస్కారం చేయించు. ఈ క్రియ చేత మనస్సు చేత జరిగిన పాపాన్ని మనస్సు చేతనే నివృత్తి చేసుకున్నట్లౌతుంది.

ఇంక నారాయణమయంతో ప్రపంచాన్ని చూచేవారు ధీరులు వారి దృష్టి ఆలోచనా విధానమెట్లాంటుందో ఒక ఉదాహరణ చూడండి. శంకరాచార్యుల వారొకతూరి పండరినాథున్ని చూచినారు. ఆయన ఇటుక రాతిపై నిలుచుకున్నాడు పుండరీకుడు మాతాపితృ భక్తిగలవాడు. భక్తికారణంగా పుండరీకునికి పాండురంగడు ప్రత్యక్షమైనాడు. నాయనా! పుండరీకా! నీ మాతాపితృ భక్తికి మెచ్చి ప్రత్యక్షమైనానన్నాడు. అపుడు పుండరీకుడు "స్వామీ! తల్లిదండ్రుల సేవలో ఉన్నా, ఈ యిటుకపై ఉండండి. తరువాత వస్తా"నని ఒక యిటుక పార వేసినాడట. దానిపై స్వామి ఒంటికాలితో నిలుచున్నాడు.. ఎందుకంటే ఒక యిటుకపై రెండు కాళ్ళు నిలువవు. ఇంకొక కాలు పైకి పెట్టుకున్నాడు. ఆయనకు నడుము నొచ్చింది. దాన్ని చేతులతో పట్టుకున్నాడు. ఇది ఆయన నిలుచుకొని ఉండడంలోని తత్త్వము. అయితే శంకరాచార్యులవారు పోయి విగ్రహాన్ని చూస్తే ఆయనకు కలిగిన భావం చూడండి. ఆయన అంటాడు.

"భవాబ్ధిః ప్రమాణం ఇదం మామకానాం
నితంబంకరాభ్యాం ధృతో యేన యత్నాత్।
సమాగత్య తిష్ఠంత మానందకందం
పరబ్రహ్మలింగం భజే పాండురంగమ్॥"

ఆ పాండురంగస్వామి చేతులతో నడుము పట్టుకొని చెప్పుచున్నాడట. ఓ భక్తులారా! మీరు నా వారైతే అంటే నాకు భక్తులైతే సంసారసముద్రం ఇంతవరకే అని నడుముయొక్క భాగము చూపుచున్నాడట. నడుము వరకే. అట్టివారినీ సంసారసముద్రం ముంచ

జాలదు అని అక్కడికి వచ్చి చెప్పుచున్న ఆనందకందుడైన పాండు రంగి స్వామికి నమస్కారము చేస్తున్నానన్నాడు. కాబట్టి ప్రపంచం మారవలెననుకోవద్దు. నీదృష్టిని మార్చుకో. ఇంక కథలోనికి పోదాము.

కర్దముని భార్య దేవహూతి. భర్త కర్దముడైతే భార్య దేవహూతి అవుతుంది. దేవహూతి అంటే దేవున్ని ఆహ్వానించే దని అర్థము. భర్త కర్దముడైతే భార్య అట్టిది లభిస్తుంది. జీవునికి భార్య ఎవరు? బుద్ధి. వాడు కర్దముడు ఇంద్రియములపై పెత్త నము కలవాడైతే వాని బుద్ధి దేవహూతి అవుతుంది. సంయమము, సదాచారము వలన మానవునికి సాత్త్వికగుణం కలుగుతుంది. ఎవరికి ఈ సాత్త్వికగుణమధికముగ ఉంటుందో వారు పూజనీయులు. నేను ఆకులములో బుట్టినాను. నేను శ్రేష్ఠుడను అంటే ప్రయో జన మేమాత్రమును లేదు.

నేను శ్రీరామవంశములో పుట్టినానని ఒకడు దారినపోయే వారిని పిలిచి పిలిచి చెప్పుకునేవాడట. ఒకనాడు ఒక బ్రాహ్మణుడా దారిన పోతూండినాడు. వీడు ఆయనను కూడ పిలిచి నీవేవంశ ములో పుట్టినాడవని అడిగినాడు. అపుడాయన మాది అగస్త్య వంశం అని చెప్పినాడు. "అట్లైతే అగస్త్యులవారు సముద్రాన్ని త్రాగినాడు. నీవు ఈతొట్టెడు నీళ్ళు త్రాగుమని ఒక తొట్టి నిండా నీళ్ళు పోయించినాడు. ఊరికనే మాది అగస్త్యవంశ మంటే ఏమి లాభం. నీలో ఆ లక్షణముండాలి కదా మరి! అని అన్నాడు. ఆ బ్రాహ్మణుడు సామాన్యమైన మనిషి కాదు. ఆయన అన్నాడు. "నీది శ్రీరాముని వంశమైతే ఆయన సముద్రములో పెద్ద పెద్ద గుండ్లను తేల్చి వారధి గట్టించినాడు. నీవీ రాయిని ఆ నీళ్ళపైన తేల్చు మరి. నీవూ వూరికనే మాది శ్రీరామచంద్రుని వంశమంటే ప్రయోజన మేమి? నీవు యీ రాయిని నీళ్ళలో

తేల్చు. నేను తొట్టిపీల్చి త్రాగేస్తానన్నాడు. వీడు రాయిని తేల్చేది లేదు. ఆయన ఆ నీరు త్రాగేది లేదు. సరియైన నడక ఉండాలి. పురుషులు, స్త్రీలు సదాచారము కలిగి ఉండడము ప్రధానము.

స్త్రీలు ఒక యింటిలో పుట్టి మరొక యింటికి పోతారు. తమ నడక వలన తల్లిగారింటికి, అత్తగారింటికి వెలుగును కలిగిస్తారు. ప్రయత్నమువలన స్త్రీ పురుషులు సత్త్వగుణమును పెంచుకోవాలి. సజ్జన సహవాసములో ఉండాలి. ప్రపంచాన్ని పరమాత్మస్వరూపంగా చూడాలి. "నారాయణమయం ధీరాః పశ్యంతి జ్ఞానచక్షుషః" అన్నట్లు జీవితమును ఉదాత్తముగ నడపుకొనుటయే జీవనసాఫల్యానికి సరియైన దారి.

కర్దముడు ఒకతూరి శ్రీమన్నారాయణస్వామిని గురించి తపస్సు చేస్తాడు. స్వామి ప్రత్యక్షమౌతాడు.

"శబ్దబ్రహ్మ శరీరవంతుండు, సదాత్మకుండు, జ్ఞానైకవేద్యుండునైన గోవిందుం గనుంగొని సంజాతహర్ష లహరీ పరవశుండై, లబ్ధ మనోరథుండునగుచు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి"

3–744

ఆ పరమాత్మ శబ్దబ్రహ్మమే శరీరమున కలవాడు, సత్స్వరూపమే ఆత్మగా కలవాడు, జ్ఞానము చేత మాత్రమే తెలుసుకోదగినవాడు. అట్టి మహానుభావుడు దర్శనమిచ్చేసరికి హర్షము చేత పరవశుడైనాడట. సాష్టాంగముగ నమస్కరించినాడు. ఆ భగవంతుని దివ్యాననము చూస్తూ అన్నాడట.

స్వామీ! నిన్ను దర్శిస్తే కలిగే ఆనందము ముందర అంతయు తుచ్ఛముగానే తోస్తుంది. అయినను—

"తదాసచాహం పరివోఢు కామః సమానశీలాం గృహమేధ ధేనుమ్।
ఉపేయివాన్ మూలమ శేషమూలం దురాశయః కామదుఘాంఘ్రిపస్య॥"

నేను వివాహము చేసుకోదలచినాను. గృహస్థాశ్రమానికి తగిన భార్యను ప్రసాదించు స్వామీ! కామపత్ని వద్దు. సత్సంతానమును కలిగించే యోగ్యమైన భార్యను అనుగ్రహించుము.

స్త్రీ పురుషుల జీవితములో ప్రధానముగ గమనించవలసిన విషయమేమంటే! ఒంటరిగా పురుషుడు కాని, స్త్రీ కాని ధర్మ మార్గమున సులభముగా ముందుకు పోలేరు. ఒకరి సహకార మింకొకరికి కావాలె. పురుషునిలో వివేకముంటుంది. స్త్రీలో స్నేహ ముంటుంది. వివేకము, స్నేహముతో భక్తి ఉత్పన్న మవుతుంది. పురుషుడు జ్ఞానప్రధానుడు. స్త్రీ ప్రేమ ప్రధాన. తన్ను సమర్పించు కుంటుంది. అందువలన ఇద్దరి కలయిక వలన జీవితము శోభిస్తుంది.

ఇచ్చట చాలామందికి సందేహము కలుగవచ్చు. కర్దముడు పరమాత్మను ప్రత్యక్షము చేసుకొని మోక్షమడుగవచ్చును కదా! భార్య నిమ్మని ఎందుకు కోరినాడు? ముక్తి నెందుకు కోరలేదు? ఇచ్చట గృహస్థాశ్రమము యొక్క ఘనత తెలుస్తుంది.

మనుష్యుడు తల్లిగర్భములోనుండి పుట్టేటపుడే మూడు ఋణాలతో పుట్టినాడు. దానిని శృతి ఎట్లు చెప్పుతుందో చూడండి.

"జాయమానో వై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవాన్ జాయతే।
బ్రహ్మచర్యేణ ఋషిభ్యః యజ్ఞేన దేవేభ్యః॥
ప్రజయా పితృభ్యః ఏష వా అనృణం యః పృత్వ్రీ।
యజ్వా బ్రహ్మచారీ వాసీ. "తైత్తిరీ యోపనిషత్తు॥"

అంటే మనిషి పుట్టేటపుడే మూడు ఋణాలతో పుట్టినాడు. అవి ఋషి ఋణం, దేవ ఋణం, పితృఋణం, వాటిలో ఋషి ఋణాన్ని తీర్చుకొనుటకు బ్రహ్మచర్యముచేత విద్య నార్జించి దాని ద్వారా తాను దివ్యానందమును పొంది దాని నితరులకు బోధించాలి. ఈ మార్గంలో ఋషిఋణం తీరుతుంది. దేవతల ఋణాన్ని యజ్ఞము

లతో తీర్చుకోవాలి. యజ్ఞాలు ద్రవ్యయజ్ఞమని, తపోయజ్ఞమని, యోగయజ్ఞమని, స్వాధ్యాయ యజ్ఞమని, జ్ఞానయజ్ఞమని పలు విధాలు. ఇచ్చట యజ్ఞమంటే పరోపకారముగా చేసే పనులన్నియు యజ్ఞములే, తాను తన జీవితములో ఎన్నో వస్తువులను ఉపయోగించుచున్నాడు. వాటిలో ఇతరుల సేవ ఉన్నది. కావున తాను కూడ నిష్కామముగ ఇతరులకు సేవచేయడం యజ్ఞం. దానితో దేవతల ఋణం తీరుతుంది. పితృఋణం తాను తగిన పత్నిని చేబట్టి సంతానాన్ని కనుట చేత తీరుతుంది. ఇది క్రమం.

ఒకవేళ యీ క్రమాన్ని ఎవరైనా అతిక్రమించి నడిస్తే —

"అనధీత్య ద్విజో వేదాన్ అనుత్పాద్య తథా సుతాన్ ।
అనిష్ట్వాచైవ యజ్ఞైశ్చ మోక్ష మిచ్ఛన్ వ్రజత్యధః ॥"

వేదాలనభ్యసించకుండా, సంతానాన్ని కనకుండా, యజ్ఞములను నిర్వహించకుండా మోక్షానికి పోవలెనని కోరుకున్నవాడు అధో మార్గములో పడిపోతాడు.

భారతములో భీష్ముడంటాడు.

"గృహస్థం హి సదా దేవాః పితరోఽతిథయస్తథా ।
భృత్యాశ్చైవోప జీవంతి తాన్ భరస్వమహీపతే ॥"

గృహస్థాశ్రమం అందరికి కల్పవృక్షం. దేవతలు, పితరులు, అతిథులు, భృత్యులు అందరి జీవితం గృహస్థాశ్రమము పైననే ఆధారపడినది, కావున దానిని భరించవలసినది అని అర్థము.

ఇంకను:—

"యథా నదీ నదాస్సర్వే సాగరే యాంతి సంస్థితిమ్ ।
తథైవా శ్రమిణ స్సర్వే గృహస్థే యాంతి సంస్థితిమ్॥"

ఏ విధముగా నదీనదములన్నియు సముద్రములో కలుస్తాయో అదే విధముగ తక్కిన ఆశ్రమములన్నియు గృహస్థాశ్రమమునే ఆశ్రయించుకొని ఉంటాయి.

ఈ రూపముగ గృహస్థాశ్రమము శ్రేష్ఠమైనది. కావున కర్దమ మహర్షి గృహస్థాశ్రమములో చేర కోరి పరమాత్మను తగిన భార్యను ప్రసాదించమని భగవంతున్ని వేడుకున్నాడు.

మరియొక విషయము. మనుష్యునిలో కామము సహజముగ ఉంటుంది. అది నశించనిదే సంన్యాసము తీసుకోరాదు. భగవంతుడు దానిని తీర్చుకునేందుకు ధర్మ మార్గాన్ని చూపినాడు. ఈ మార్గానికి తలుపులు తెరచి పెట్టినాడు. సంన్యాసులకే మోక్షప్రాప్తి అనుకొనే వారు తెలియనివారు. ఎందుకంటే త్రిమూర్తులు తమ భార్యలతో కలుసుకొనియే ఉన్నారు. విషయమేమంటే కొంత కాలము కామ వ్యాపారముంటుంది. దానితో ధర్మపూర్వకముగ కామాన్ని తీర్చుకోవాలి. భార్యాభర్తల సంయోగము మొదట కామ వ్యాపారముతో లంకించుకొని ఉంటుంది. కాలము గడువగా కామము క్షీణించి ప్రేమయై పరస్పర జీవితలక్ష్యానికది కారణభూత మవుతుంది. ఇది గృహస్థాశ్రమమునుండి గ్రహించవలసిన విషయము. ఈ విధముగ కర్దముడు భగవంతున్ని కోరితే ఆయన అంటాడు.

కర్దమఋషీ! మనుమహారాజు తన కూతురును దేవహూతిని నీవద్దకే పిలుచుక వస్తాడు. అపుడు నీవామెను వివాహం చేసుకో, ఆ విధముగ మీరిద్దరు దంపతులైనపుడు నేను మీ గర్భమున పుట్టుతాను. సాంఖ్యశాస్త్రము ప్రజలకు ఎరుకపరచాలి అంటాడు. చూడండి. వారిద్దరి దాంపత్యము ఎంతటి శ్రేష్ఠమైనదో. దాంపత్యము శ్రేష్ఠమైనదైతే ఆ గర్భములో మహాత్ములే పుట్టుతారు. కర్దముడు తన ఆశ్రమములో ఉంటాడు.

ఒక పర్యాయము ఒక యువకునికి సందేహము కలిగినది. ఏమని? వివాహము చేసుకోవడం సుఖమా? లేక సంన్యాసము తీసుకోవడం సుఖమా అని. దీనికి సమాధానం చెప్పేవాడెవరు? ఆ సందర్భ

ములో కబీర్దాసు ఉండినాడు. చక్కగ యువకుడా కబీర్దాసు వద్దకు పోయి ఈ విషయమడిగినాడు. ఇది విని కబీర్దాసు సమాధానము చెప్తా కూర్చోమన్నాడు. మధ్యాహ్నం పన్నెండు గంటల కాల మది. యువకుడు కూర్చున్నాడు. కబీర్దాసు భార్యను పిలిచినాడు. మగ్గం నేసుకుంటూండినాడు. 'పోగు తెగింది. లాంతరు తీసుకొనిరా!'' అన్నాడు. ఆమె ఈ మధ్యాహ్న కాలములో లాంతరు తీసుకొని రమ్మంటావు. నీకేమైనా మతి పోయిందా? అని అనక చెప్పినంత మాత్రములోనే లాంతరును వెలిగించుకొని తెచ్చింది. ''ఇంక సరిపోయింది పో, లోపల పెట్టు పో'' అన్నాడు. ఆమె తీసుకొని పోయింది. అపుడా యువకునితో చెప్పినాడు. పెండ్లి చేసుకుంటే బాగుంటుందా?'' అని ప్రశ్నించినావు కదా? ఇదుగో ఇటువంటి భార్య అయితే బాగుంటుంది. సంన్యాసాశ్రమము తీసుకునే విషయమై దానిని గురించి కూడ చెప్తాను. నా వెంట రా అని పిలుచుకొని ఊరి వెలుపలికి పోయినాడు. అక్కడ ఒక శిఖరము. దానికి మెట్లు దాదాపు రెండు వందలుంటాయి. ఆపైన ఒక సంన్యాసి కుటీరము వేసుకొని ఉన్నాడు. ఆయనను ''ఓ సాధూ మహారాజ్! కొంచెము ఇక్కడికి దిగి రావలసినది'' అన్నాడు. ఆయన దిగివచ్చి నాడు. క్రిందికి దిగిన తరువాత ఇంక పనిలేదు. పైకిపోండి అని పంపినాడు. ఆయన పూర్తి పైకిచేరుకున్న తరువాత మరల ''ఓ సాధూ మహారాజ్! కొంచెము క్రిందికి రాండి.'' అని పిలిచి నాడు. ఆయన పాపము పైనుండి క్రిందికి దిగినాడు. క్రిందికి దిగివచ్చిన పిమ్మట ''ఇంక పనిలేదు పోండి పైకి'' అన్నాడు. ఆ సంన్యాసి మరల పోయినాడు. ఏమన లేదు. అపుడా యువకునితో చెప్పినాడు. సంన్యాసియైతే ఇంత ఓర్పుంటే దానిలో కూడ సుఖ మున్నది. ఈ యువకునికి రెండును అసాధ్యము లనిపించినాయట. అయితే అసాధ్యములను సాధ్యము చేసేది తపస్సు.

కర్దముడు తపస్సుచేసి భార్యను కోరినాడు. భగవంతుడు చెప్పినట్లు ఒకనాడు కనకరథారూఢుడై స్వాయంభువ మనువు తన భార్యను, కూతురు దేవహూతిని పిలుచుకొని వచ్చినాడు. కర్దమ మహర్షికి ఆయన నమస్కారము చేస్తాడు. తన బిడ్డను చూపుతూ ఇట్లు పలుకుతాడు.

"వరయోగీశ్వర! దేవహూతియను నీవామూక్షిమత్పుత్రి దా
వరలావణ్య గుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదింగోర దా
తురయై నారదుపంపునన్ మిము వరింతున్నంచు నేతెంచె నీ
తరుణీ భిక్ష పరిగ్రహింపుము శుభోదాత్త క్రియాలోలతన్" 3-774

కర్దమయోగీ! ఈ దేవహూతి నా కూతురు. గుణవతి. ఎంతమందిని గురించి విన్నను మదిలో కోరక కేవలము నిన్నుమాత్రమే నారదుని వలన విని కోరి యిచ్చటికి మమ్ములను పిలుచుకొని వచ్చినది. శుభాయత్తమైనట్టి తరుణీభిక్ష నను గ్రహించగోరినాను.

అయితే నా మనవిని మొదట వినవలసినదని పలుకుచున్నాడు. మహాత్మా! ఫలారంభుడు కృపణున్ని అర్థిస్తే ప్రయత్నం వ్యర్థమవుతుంది. అపుడు అడిగేవాని యశస్సు, మానము చెడిపోతాయి. నీవు వివాహము చేసుకొనుటకు సిద్ధముగ ఉన్నావని ఎరిగి ఇచ్చటికి వచ్చినాను. కావున నా ప్రార్థన సఫలము చేయవలసినదని వేడుకుంటాడు. ఇది విని కర్దముడంటాడు. మీ మాటను స్వీకరిస్తాను. అయితే నాది ఒక షరతు. ఒక కుమారుడు పుట్టేవరకు నేను లౌకిక సంబంధాన్ని కలిగి ఉంటాను. నా వివాహము విలాసము కొరకుగాదు. కామనాశముకొరకు. కావున ఒక కుమారుడౌతూనే సంన్యాసము తీసుకుంటాను.

మనువు తన కూతురుతో "పెండ్లి కాకముందే సంన్యాసమును గురించి మాట్లాడుచున్నాడు. నీవు ఇతనినే వివాహము

చేసుకుంటానంటివి. ఇటు పిమ్మట నీ యిష్టము'' అంటాడు, అపుడు దేవహూతి నాకటువంటి పతియే కావాలి అంటుంది. అపుడు స్వాయంభువమనువు అచ్చటనే ఆమెను వివాహం చేస్తాడు. కలాచారం ప్రకారము వివాహముచేసి చింతనుండి దూరుడైనాడు. కాని ఆమె నప్పుడు వదలి పోవాలె. ఇంత కాలము అల్లారు ముద్దుగ పెంచి యిపుడు వదలి పోవలెనంటే ఆయనకు వ్యాకులము కలిగింది. ఆమెను కౌగిలించుకున్నాడు. గడ్డము పట్టుకొని, చెక్కిలి ముద్దాడినాడు. శిరస్సు మూర్కొన్నాడు. కళ్ళనిండ నీరు కారుతూంటే ప్రేమాతిరేకముతో అమ్మా! పోయి వస్తాము. కులమునకు కీర్తి తెచ్చేటట్లు ప్రవర్తించాలె తల్లీ అని చెప్పి దుఃఖముతో రథము నెక్కి పోయినాడు. ఈ విధముగ తన రాజ్యానికి పోయి నిరంతర హరి పదాయత్త చిత్తుండై కాలము గడపినాడు.

''దేవహూతి పతిభక్తి పరాయణయై భవునికి భవాని పరిచర్య సేయు తెరంగున యమ్మునీంద్రు చిత్తవృత్తి కొలది దిన దినంబునకు భక్తి తాత్పర్యంబులు రెట్టించేటట్లు సేవచేయ సాగింది. భార్య సద్గుణములు కలది ఆదర్శమైన స్త్రీ అని శాస్త్రము చెబుతుంది.

''కార్యేషు దాసీ కరణేషు మంత్రీ రూపేషు లక్ష్మీ క్షమయా ధరిత్రీ
భుక్తేషు మాతా శయనేషు రంభా షట్కర్మయుక్తా కులధర్మ పత్నీ''

సేవలో దాసి, ఆలోచనయందు మంత్రి, రూపమునందు లక్ష్మి, ఓర్పునందు భూదేవి, భోజనము పెట్టేటపుడు తల్లి, శయనమునందు రంభ ఈ ఆరు రూపములతో ఉండేది కుల ధర్మపత్ని అట.

ఇల్లాలి నేమి చూస్తావు. ఇల్లును చూడు అని ఒక సామెత ఉంది. అందువలననే శాస్త్రమంటుంది.

"వేదమూలమిదం జ్ఞానం భార్యా మూలమిదం గృహమ్।
కృషి మూలమిదం ధాన్యం ధనమూలమిదం జగత్" ॥
నీతిశాస్త్రము.

జ్ఞానమునకు మూలము వేదము. ఇంటికి మూలము భార్య. ధాన్యమునకు కృషి మూలము. జగత్తులోని భోగాలకు ధనము మూలము.

ఇల్లాలు మంచి భావాలు కలదై సాత్త్విక ప్రవర్తనకలదైతే ఇంటిలో పటాలటువంటివే ఉంటాయి. ఇల్లు శుభ్రముగ ఉంటుంది. వస్తువులన్నియు వాటి వాటి స్థలములలో ఉంటాయి.

అందువలన ఉత్తమమైన ఇల్లాలి లక్షణాలు ఇంకను చూడండి. ఎందుకంటే జీవితములో గుర్తించదగినవి చాలా ఉన్నాయి. ఈ విషయాలు తెలుసుకొని జీవితమును కొంత సవరణ చేసుకుంటే ఆ జీవితము దివ్యమైనదౌతుంది.

"అనుకూలాం విమలాంగీం కుశలాం కులజాం సుశీల సంపన్నామ్ ।
పంచలకారాం భార్యాం పురుషః పుణ్యాధికో లభతే॥"

గుణవంతురాలు దివ్యమైనట్టి యీ అయిదు గుణాలు కలిగి ఉంటుందట. మొదటి గుణం అనుకూలముగ ఉండడము. భర్తకు అనుకూలము లేకుండా ప్రతివ్యవహారాన్ని వ్యతిరేక ధోరణిలోనే చూచి తప్పులు పట్టుతూ కూర్చుంటే భర్తకా భార్య నరకాన్నే సృష్టిస్తుంది.

విమలాంగీం అనేది రెండవ లక్షణం. శుద్ధమైన ఆరోగ్యమైన శరీరం, సాత్త్విక గుణం కలిగియుండి నిరంతరము ఆనందముతో జీవితం గడపుతూంటే శరీరం సహజముగ విమలముగ ఉంటుంది. కుశలాం అనేది మూడవ లక్షణం. ఏదైనా ఒక విషయం ఆలోచన చేయవలసివస్తే కౌశల్యముతో దాని పరిష్కార మార్గాన్ని సూచించేది. కులజాం నాలుగవ లక్షణం. అంటే తన ప్రవర్తన

చేత కులమునకు వన్నె దెచ్చేదని అర్థం. పెద్దకులములో పుట్టినదని అర్థంకాదు. తన వ్యవహారముతో కులమునే పెద్దదిగా చేసేదని గ్రహించాలి. సుశీల సంపన్నాం అనేది అయిదవ గుణం. సౌశీల్య మైన నడక గలది. సంకల్పములలో కూడ ఆమె మనస్సు చేయ రాని దానిని తలంచుకొనేది కాదు. ఈ అయిదు లకారములు కలిగిన భార్య పుణ్యాధికుడైన పురుషునికి మాత్రమే లభ్యమవు తుందని శ్లోకార్థం. ఇట్టి గుణములు కలిగిన భార్య అమృతముతో సమానమైన పవిత్రురాలు. కనుకనే నీతిశాస్త్రములో ఇట్లు చెప్పినారు.

"అమృతాషడ్గుణా భార్యా, అమృతం బాలభాషితమ్ ।
అమృతం రాజసన్మానం అమృతం మాన భోజనమ్ ॥"

పైన చెప్పిన ఆరు గుణములు కలిగిన భార్య అమృత స్వరూపు రాలు. పిల్లల వాక్కులు అమృతతుల్యములు. రాజసన్మానం కూడ అమృత తుల్యము. గౌరవముగా ప్రీతిగా పొందే భోజనము కూడ అమృతముతో సమానము.

భార్యా విషయములో ఈ విధముగా గాక వ్యతిరేక మార్గ ములో నుంటే ఆ భార్య త్యాజ్యయోగ్యమని నీతిశాస్త్రము.

"వివాదశీలాం స్వయమర్థ చోరిణీంపరానుకూలాం పరిహాసభాషిణీమ్।
అగ్రాశనీం అన్యగృహప్రవేశినీం త్యజంతి భార్యాం దశపుత్ర భాషిణీమ్ ॥"

మాట మాటకు కొట్లాడుతూండేది, ధనాన్ని భర్తకు తెలియకుండా దాచిపెట్టుకునేది, ఇతరులకు అనుకూలమైనది, మాట పోట్లాడుటకు ముందు పరిహసించి మాట్లాడేది, భర్తకంటే మొదట తినేది, ఇతరుల యిండ్లలో ప్రవేశిస్తూండే దానిని పది మంది పుత్రులున్నను త్యజింపదగినది అని అర్థము.

ఇంతకు పురుషులకుగాని స్త్రీలకుగాని సన్మార్గములో నడచి నపుడే శాంతి, గౌరవములు లభించేది. కావున ఇన్ని వివరాలు యెందుకు తెలుసుకొనుట అంటే సన్మార్గములో జీవితమును నడపుకొనుటకు, సుఖశాంతులను పొందేందుకు ఇట్టి సదాచారము చాలా ప్రధానము.

దేవహూతి భర్తను దేవున్నిగా ఆరాధింపసాగింది. ఆ మునీశ్వరుని చిత్తవృత్తిని గుర్తించి దినదినానికి అధికమైన భక్తితో నమ్రపూర్వకముగ నడచుచూ, సేవలు చేయుచూ, కామ క్రోధ లోభ, దంభములను వదలినదై చతురమైన స్నేహార్ద్రములతో మృదువైన మాటలతో పతి భక్తిని పాటించింది. సేవలో కృశీభూత శరీరయైనది. అంటే శరీరము చిక్కిపోయినది.

కర్దముడెటువంటివాడు ? దైవయోగమును కూడ తన ఆత్మ శక్తి చేత తప్పింప సమర్థుడు. ఈ విధముగ రేయనక పగలనక సేవ చేస్తూండిన దేవహూతిని చూచి కరుణతో ఆయన అంతఃకరణము కరగిపోయింది, అపుడు ప్రేమార్ద్రచిత్తుడై ఆయన భార్యతో అంటాడు.

> "మానిత ధర్మమార్గ మహితస్ఫుట భూరితపస్సమాధి వి
> ద్యానిభృతాత్మయోగ సముపార్జిత విష్ణుకటాక్షలబ్ధశో
> భానఘ దివ్యభోగ బహుభద్ర వితానము లస్మదీయ సే
> వానిరతిన్ లభించు ననివారణ నిత్తును దివ్యదృష్టియున్"
>
> 3-797

దీని తాత్పర్యము రేపు చెప్పుకుందాము.

ఓం సర్వేవై సుఖనస్సంతు.

పందొమ్మిదవ రోజు ఉపన్యాసము సమాప్తము.

—o—



శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## ఇరువదవ రోజు ఉపన్యాసము

ఓం సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై ।
తేజస్వినావధీతమస్తు మావిద్విషావహై ॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

"నీ పద్యావళులాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరన్ బనిసేయు హస్తయుగమున్ నీ మూర్తిపై చూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరమున్ నీ సేవపై చిత్తమున్
నీపై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజ పత్రేక్షణా"

భక్తమహాశయులారా! భాగవతోత్తములారా!

పవిత్రమైన భాగవత కథాశ్రవణము. మనుష్యుడు ఆధారము కలిగి ఉండాలె. ఈ లైటు ఎట్లు వెలుగుచున్నది. ఇది మెయిన్ పవర్ హౌస్‌తో సంబంధము పెట్టుకొని ఉంది. అందువలన నిది ప్రకాశిస్తూ ఉంది. అటులనే మనుష్యుడు మెయిన్ పవర్‌తో సంబంధము పెట్టుకొని ఉండాలి. మనుష్యునికి మెయిన్ పవరు ఏది? పరమాత్మ. పరమాత్మతో సంబంధము పెట్టుకుంటే ఎంతో ధైర్యము ఎంతో శాంతి ఉంటుంది. కఠోపనిషత్తులో ఒక విషయమున్నది. దానిలోని మంత్రమిది:—

"ఏతదాలంబనం శ్రేష్ఠః ఏతదాలంబనం పరమ్ ।
ఏతదాలంబనం జ్ఞాత్వా బ్రహ్మలోకే మహీయతే॥"

ఇది మానవునకు నిజమైన ఆధారం. ఇదే శ్రేష్ఠమైనది. పరమమైనది. ఈ విషయాన్ని తెలుసుకొని ఆలంబనముగా చేసుకొని జీవితం గడపుతే వాడు బ్రహ్మలోకములో పూజింపబడుతాడు.

కాబట్టి మనుష్యునకు ఆధారమేది? ధనము, గృహము, భూములు బుట్టలు కాదు ఆధారము. అవన్నియు ఆధారమైతే మృత్యుభయమును పోగొట్టుతాయా అని. వాటికా శక్తి లేదు. ఆత్మజ్ఞానమే మరియు భగదాధార బుద్ధియే మానవునకు మృత్యుభయమును పోగొట్టేది. ఇటువంటి భాగ్యమును అంటే ఇట్టి మాటలను వింటూండే భాగ్యము నిశ్చయముగ ఆయన ప్రసాదమే. భగవంతునితో సంబంధము పెట్టుకోవడమంటే ఏమి? నా దేహేంద్రియ మనోబుద్ధులతో చేయునదంతయు ఆయన సేవయే. ఒక వేళ ఎప్పుడైనా మంచికార్యము జరిగితే ఆయన యీ ఉపకరణముల చేత చేయించుకున్నాడనే భావన ఉండాలి. అంతే కాదు. జరిగే ప్రతి సంఘటన ఆయన అనుగ్రహముగానే భావించాలె. ఈ విధముగా జీవితము గడపుతే అది భగవంతునితో సంబంధము పెట్టుకొన్నట్లు.

మాయకు మనము భగవంతునితో సంబంధము పెట్టుకోవడం, భగవంతున్ని ధ్యానము చేయడం ఇష్టము లేదు. ఆ మాయ అంటుంది. ఏమో కనబడని భగవంతుని కొరకు ఎందుకు పాటు బడుతావు మానవుడా? ఇదిగో భార్యను చూడు. బిడ్డలను చూడు. ధనధాన్యములను చూడు. వీటన్నిటిని చూడు. భోగములను చూడు. ఇప్పటికిప్పుడే ఆనందము కలుగుతుంది. వీటి వలన. ఎందుకు భగవంతుడనుకుంటూ శ్రమపడుతావంటుంది. అందువలననే ధ్యానానికి కూర్చున్నప్పుడు మనస్సును భగవంతునివైపు పోనీయక ప్రపంచమువైపు తిప్పుటకు ప్రయత్నం చేస్తుంది.

ఒక వ్యక్తి, వ్యాపారస్థుడు, ఉదయము స్నానము చేసి ధ్యానానికి కూర్చున్నాడు. నిన్న దుకాణములో ఇరవై రూపాయలు వ్యత్యాసం వచ్చింది. దానిని రాత్రి యెంతసేపో ఆలోచించినాడు. తేలలేదు. ఇప్పుడు ధ్యానానికి కూర్చుంటే ఇచ్చట తేలింది. ఇంకొక మనిషి ధ్యానానికి కూర్చున్నాడు. వీధిలో ఆలుగడ్డలో అని కేక వినపడింది. మనస్సు ఆలుగడ్డల మీదికి పోయింది. కండ్లు తెరచి భార్యతో ఆలుగడ్డలు తీసికొని యీ పూట కూర చేయమన్నాడు, మరి మాయ యేమి చేసింది వానిని? భగవధ్యానానికని వాడు కూర్చుంటే మాయ దానిని ఆలుగడ్డల మీదికి మార్చింది. ఈ విధముగ మనుష్యున్ని మాయ భగవంతునివైపు పోనీయదు. కాని మనుష్యుడు వివేకముతో తనకు నిజమైన ఆధారమేదని ఆలోచిస్తే భగవంతుడే నిజమైన ఆధారము ఆయనతో సంబంధము పెట్టుకొనుటయే జీవితములో ధన్యమైనదారి. ఆ విధముగా భగవదాధారముగా జీవితము గడపేవారికి అనంతమైన శక్తులు చేకూరుతాయి. కర్దమ మహర్షి అట్టి వారిలోనికి చేరిక.

కర్దమ మహర్షి సేవలో దేవహూతి కృశీభూత శరీరమైనది, అస్థిపంజరము మిగిలినట్లైనది. ఆమెను చూచి ఆయన మనస్సు కరగిపోయినది. అపుడు ఆమెతో అంటాడు.

నా సేవతో దేవహూతీ! నీకు దివ్యభోగము లెట్టివైనా లభిస్తాయి. నీవు పతివ్రతవు. కావున దివ్యదృష్టిగాని, విష్ణుసేవా సముపార్జితమైన తపఃఫలము గానీ ఏది కావలసినను యిస్తాను, కోరుకో, అంటాడు.

''అనుపమ రాజ్యదర్పాంధ చేతస్కులై
పాపవర్తనులైన పార్థివులకు
ధృతిబొందరాని యీ దివ్యభోగంబులు
నీతిపాతివ్రత్య నిష్ఠ జేసి

సంప్రాప్తములునయ్యె సమతభోగింపుము
　　కార్యంబు సిద్ధించుగాక నీకు
ననుటయు నతివయు ననుపమ
　　యోగ మాయావిచక్షణశాలియైన కర్ద
మునిఁ గనుంగొని విగతాధియును నపాంగ
కలితలజ్జానతాస్య పంకజయు నగుచు
వినయప్రణయములం జేసి విహ్వాంబులైన
పలుకుల బతికి నిట్లనియె ప్రీతి" 3-799

దేవహూతీ! అనుపమైన రాజ్యముచేత గర్వితులైన రాజులకు పొందరాని యీ దివ్యభోగములు పతివ్రతమహిమతో నీకు సంప్రాప్తములైనవి. వీటి ననుభవించు; నీకు ఇష్టసిద్ధి కలుగుతుంది. అని కర్దముడంటే ఆమె వినయవిధేయతతో ఇట్లని ప్రార్థిస్తుంది.

స్వామీ! నీవు అమోఘమాయావిభుడవు. నీ యెడల నిట్టి దివ్యభోగములు కలుగుట సులభమని నే నెరుగుదును. నీ సాంగత్యముచేత నాకివన్నియు కలుగుతాయి. ఐనా! స్వామీ! సంతానము కలుగు వరకు నీ శరీరస్పర్శ సుఖము నాకు ప్రసాదింపుము. నా శరీరము కృశీభూతమైనది. భవదీయ సంయోగ వాంఛకు యోగ్యమైనట్టి శరీరమును ప్రసాదింపుము. రతి రహస్యమునకు కావలసిన కామశాస్త్ర ప్రకారమును నాకు ప్రసాదించి అందులకు కావలసిన వివిధములైన ఆభరణములను, మాల్యానులేపన మందిరారామములును, తత్సంబంధమైన సమస్త విస్తారంబు కావించి నన్ను కరుణించవలసినది. ఇట్లు ఆమె ప్రార్థిస్తే ఆ మహాత్ముడు తక్షణమే నిజయోగ బలముతో నొక దివ్యమైన విమానమును సృష్టించినాడు, అది కామగమనము కలది. ఏ దేశమునకు, ఏ కాలమున కేది అవసరమో అన్నియు ఆ విమానములో నున్నవి.

"సకల ర్తుశోభితంబును సకలశుభావహము సకల సంపత్కరమున్
సకలోపభోగయోగ్యము సకలేప్సిత కామదంబు సదలంకృతమున్"
3-806

సర్వవిధములైన భోగములకు అనుకూలమైన దా విమానము. అట్టి దివ్యవిమానాన్ని కల్పించినాడు. ఆ విమానము ఊహించుటకు సాధ్యము కానంత సౌందర్యముతో, అద్భుతమైన సౌకర్యములతో విరాజిల్లుచున్నది. దానిని దేవహూతికి చూపిస్తే ఆమె సంతోష పడుటలేదు. ఈ కారణము కర్దముడు మహానుభావుడు తెలుసు కున్నాడు. ఆమె కొరతను దూరము చేయగోరి అంటాడు.

"నిమజ్జయాస్మిన్ హ్రదే భీరు విమానమిదమారుహ।
ఇదం శుక్లకృతం తీర్థం ఆశిషాం యాపకం నృణామ్॥"

ప్రియే! ఈ నదిలో స్నానము చేయి. ఈ విమానమెక్కు. ఇది అన్నిరూపములైన తీర్థములకు వెళ్ళుతుంది. సర్వాశీస్సులకు ఇది కారణమైతుంది.

ఈ మాటలు విని ఆ కువలయాక్షి ఆ సరస్వతీనదిలో పతి ఆజ్ఞప్రకారం మునుగుతుంది. దానిలో మునిగి లేచే సరికి ఆ నీటి మధ్యనుండి అతి సౌందర్యవంతులు, ఆరోగ్యవతులునైన సుందరీ మణులు అనేకులు పుట్టి ఆ దేవహూతికి చెలికత్తియలై దాస్యము చేయసాగినారు. ఆమెతో ఆ దాసీలన్నారు. అమ్మా! ఇంతవరకు నీవు కర్దమ మహర్షిసేవ చేసినావు. కావున ఇపుడు మేము నీ సేవ చేయుటకు వచ్చినాము. మమ్ములను కరుణతో చూడమ్మా. పుణ్యాత్మురాలవై నీ సేవచేయు భాగ్యము మాకు ప్రసాదించవలసి నది. ఇదేగాక నదిలోనుండి లేచు సరికి దేవహూతి శరీరము నిగనిగ లాడుతూ సర్వాంగసుందరమైనది. మంచి శక్తియుక్తులు లభించినవి.

ఇద్దరును విమానమెక్కి నూరు సంవత్సరములు ఆ విమాన ములో దేవతల ఉద్యానవనములు, అనేకములైన సుందర దృశ్య

ములను చూచుచు నిరంతరం భోగముల ననుభవించినారు. కర్దముడు భూమండలము నంతయు త్రిప్పినాడు. కామ కేళీవినోదమైన భార్యను బహువిధములైన రతిప్రసంగములతో అలరింప జేసినాడు. ఈ భోగాసక్తిలో నూరు సంవత్సరములు క్షణములో గడచినట్లైనది. తొమ్మిదిమంది కూతుర్లు కలిగినారు. నవధాభక్తులతో సమానమైనవారు వారు. తరువాత కపిలుడు జ్ఞాన స్వరూపుడు.

ఈ విధముగ తొమ్మిదిమంది ఆడపిల్లలు పుట్టిన పిదప ఇంక నేను సంన్యాసము తీసుకుంటానంటాడు. అపుడు దేవహూతి అంటుంది. "నాథా! కుమారుడు పుట్టిన పిమ్మట సంన్యాసము తీసుకుంటానని సెలవిచ్చినారు. కుమారుడింకను పుట్టలేదు. కుమారుడు పుట్టిన పిమ్మట సంన్యాసము తీసుకోండి" ఈ మాటలు విన్నాడు. మరల కుమారుడు పుట్టేంతవరకు భార్యతో భోగించినాడు. అపుడు దేవహూతి 'స్వామీ! ఈ తొమ్మిదిమంది కూతుర్ల వివాహము చేసి పోండి" అన్నది. అపుడు బ్రహ్మను పిలిచి వీరిని తగిన వరులకిచ్చి పెండ్లి సేయమనికోరుతాడు. వారందరికి బ్రహ్మదేవుని సహాయముతో వివాహమవుతుంది.

అపుడు తన భర్తతో దేవహూతి నమస్కరించి అంటుంది. స్వామీ!

"ఉపరతిపుట్టె నీ యిహసుఖాను భవంబులయందు మున్ను నే
చపలత కామభోగరతి సంగముగోరి మహాత్మ నిన్ను న
చ్చపుదల పొప్పగా దెలియజాలకయున్ వరియించుటల్ భవ
త్కృప ఫలియించె ముక్తినిను కేవల భక్తిభజింపగల్గదే" 3-821

ప్రభూ! ఇంద్రియ భోగములపైన విసుగు పుట్టింది. నేను చాపల్యముతో తమను కామోపభోగము కోరితి. దానికి నా యజ్ఞానమే కారణము. నిన్ను కేవలము ముక్తిగోరి నేను తరించే అవకాశమును పోగొట్టుకొంటి.

"సాచాహం భగవతో నూనం వంచితా మాయయాదృఢమ్ ।
యత్త్వాం విముక్తిదం ప్రాప్య నముముక్షేయ బంధనాత్ ॥"
3-23-57

అసాధారణ ప్రజ్ఞ, శక్తి; మహిమకల నిన్ను భర్తగా పడసియు ముక్తిని కోరకుండా నామతి మాయచేత వంచింపబడి అడుగజాలక పోయినాను మహాత్మా! అని యీ విధముగ వ్యాకులపడుతూంటె కర్దముడు చెప్తాడు.

"మనుసుత! నీ మది దుఃఖం
బును పొందకు మచిరకాలమున భగవంతుం
డనఘుండక్షరుడు జనార్దనుడు
భవద్గర్భమందు దగవసియించున్" 3-825

ప్రియురాలా! నీ గర్భమునందు జనార్దనుడు వసిస్తాడు. అతడు నీచేత ఆరాధింపబడి నీ హృదయగ్రంధిని ఛేదిస్తాడు. తత్త్వోపదేశం చేసి ముక్తిని కల్గిస్తాడు.

ఆమె కుమారున్ని ప్రసవిస్తుంది. కర్దమ మహర్షి పిల్లవాడు కొద్ది వయస్సుగలవాడౌతూనే సంన్యాసము స్వీకరిస్తాడు. అన్నిటిని త్యాగము చేసేదే సంన్యాసము. ఇపుడు చాలామంది రిటైరయి మరల ఉద్యోగము కొరకై అన్వేషణ చేస్తారు. రిటైరయితే తత్త్వానుసంధానానికి అవకాశము చిక్కిందని మోక్షముకొరకై ప్రయత్నం చేయాలి.

సన్న్యాసం రెండు విధాలు, విద్వత్సన్న్యాసము, వివిదిషాసన్న్యాసము. వివిదిషా అంటే వేత్తుం ఇచ్ఛావివిదిషా అని నిర్వచనము, తనకు బ్రహ్మజ్ఞానం తెలుసుకోవలెనని తీవ్రేచ్ఛయున్నది. కాని గృహములో ఉండి తెలుసుకొనుటకు సాధ్యము కాలేదు. అందువలన గృహమును వదలి సన్న్యాసము తీసుకొని జ్ఞానమును పెద్దల ద్వారా శ్రవణముచేసి తెలుసుకొని సాధన చేయ బూనుట వివిదిషా సన్న్యాసియొక్క పద్ధతి.

విద్వత్సన్న్యాసమంటే తాను తెలుసుకోవలసినది తెలుసుకున్నాడు. బ్రహ్మజ్ఞాన ప్రాప్తియైనది. కాని తాను నిస్సంగియై ఏకాంతముగ జీవితమును గడుపగోరి, ఆ యేకాంతములో బ్రహ్మానందమును తీవ్రముగ పొందగోరు నతడు విద్వత్సన్న్యాసి. ఇపుడు కర్దమమహర్షి విద్వత్సన్న్యాసి, ఆయనకింక తెలుసుకొన వలసినది లేదు. కేవలము బ్రహ్మానందమున తన మనస్సును పరినిష్ఠితము చేయుటయే ఆయనపని. ఈ విధముగా ఆయన గృహము వదలి పోతాడు. బ్రహ్మానందములో లీనమౌతాడు.

ఆయన పోయిన తరువాత కపిలదేవుడు తల్లితో "అమ్మా! నీ కేమైనా విషయాలను తెలుసుకోవాలి అనుకున్నట్లైతే అడుగు తల్లీ" అన్నాడు. అపుడు తల్లి కుమారునికి నమస్కారము చేసి భక్తి పూర్వకముగ పిల్లవాన్ని ప్రశ్నిస్తుంది. ఆ పిల్లవాడు తన కుమారుడే అయినను ప్రణామము చేస్తుంది. ఆత్మజ్ఞానోపదేశము చేసేవారెవరైనను గురువుతో సమానమే. అందునను మన భారతీయ సంస్కృతీ విధానములో వయస్సు ఎక్కువ ఉన్నంతమాత్రముతో పెద్దవారనిపించుకోరు.

"న తేన వృద్ధో భవతి యేనాస్య ఫలితం శిరమ్।
యోవై యువాప్యధీయానో తం దేవాస్థవిరం విదుః॥"

తల నెఱచినంతమాత్రముతో మనుష్యుడు వృద్ధుడుకాడు. యువకుడైనను విద్యను పొందినవానినే దేవతలు వృద్ధుడన్నారు.

ఈ నియమము ననుసరించి ఇపుడు తల్లియైనను కుమారునికి నమస్కారము చేసింది. అందునను ఆ కుమారుడు సాక్షాత్తు పరమాత్మ అనే విషయం ఆమెకు తెలుసు.

తల్లి కుమారున్ని ప్రశ్నవేస్తున్నది.

మహాత్మా! ఇంద్రియములను తృప్తిపరచుట సాధ్యముకాదు. వాటి ఘర్షణములో నాకు చాలా వ్యాకులము కలుగుచున్నది, ఇది

ఒక అసాధారణమైన మోహము. దీనిని తరించు మార్గము చూడవలసినది. ఇంకను ప్రార్థించుచున్నది.

"భూరిమదీయ మోహతమముం బెడబాప సమర్థులన్య లె
వ్వారలు నీవకాక నిరవద్య! నిరంజన! నిర్వికార! సం
సారలతాలవిత్ర! బుధసత్తమ! సర్వశరణ్య! ధర్మవి
స్తారక! సర్వలోక శుభదాయక! నిత్య విభూతి నాయకా!"
3-861

స్వామీ! నీవు తప్ప నా మోహమనే చీకటిని దూరము చేసే వారెవరు? కాబట్టి సర్వలోకేశ్వర! నిత్యవిభూతి నాయకా!

స్వామీ! అసాధారణమైన తపశ్శక్తి సంపన్నుడవైన నిన్నే శరణు పొందుచున్నాను. నన్ను కరుణతో రక్షింపుమా! అని దేవహూతి స్తోత్రము చేస్తే దయాళువైన కపిలుడు అనుగ్రహముతో తల్లి వాక్యములను విన్నాడు. ప్రసన్నవదనముతో చిరునగవుగల సంతోషముతో తన తల్లికి శాంతముగా ప్రబోధింప సాగినాడు. అమ్మా!

"చేతః ఖల్వస్య బంధాయ ముక్తయే చాత్మనో మతమ్।
గుణేషుసక్తం బంధాయ రతం వా పుంసి ముక్తయే" 3-25-15

అమ్మా! చిత్తమే బంధానికి కాని ముక్తికి కాని కారణము. అది గుణములయందు ఆసక్తమైతే బంధకారకము. అదే పరమాత్మ యందు లగ్నమైతే ముక్తి కారకము.

పరమాత్మయందు మనస్సు లగ్నమైతే అది శుద్ధమవుతుంది. అపుడు సుఖదుఃఖము లుండవు. అట్టి శుద్ధమైన అంతఃకరణమే పరమపురుషుని ఆనందమును బొందగలదు. ఆయానందమే పరమ పురుషానుభవము.

ఆ పరమ పురుషుడు ప్రకృతికంటే పైనుండువాడు. అతడు స్వయంజ్యోతి,సూక్ష్మస్వరూపుడు. అట్టి పరమాత్ముని జ్ఞాన వైరాగ్య

భక్తులచే కూడిన మనస్సుచే యోగులు దర్శిస్తారు. ఈ విధమైన భక్తి జ్ఞాన వైరాగ్య మార్గమే ఉత్తమమైనది. ఇతర మార్గములు దీనితో సరికావు విద్వాంసులు ఇంద్రియ భోగమార్గమును అస ద్విషయముగ చూస్తారు. ఇంద్రియ భోగమార్గమే బంధమునకు ముఖ్యకారణము. ఆ మనస్సును సద్విషయమునందు త్రిప్పుకొనుట మోక్షమార్గమని వారి అనుభవముతో కూడిన నిశ్చయము. ఇంద్రియార్థముల వైపు మనస్సుపోతే బంధమునకు కారణమై తుంది. అదియె సంయమనమై భావశుద్ధిని పొందితే అనర్గళమైన మోక్షద్వార మవుతుంది.

"భావసంశుద్ధిరిత్యే తత్తపోమానసముచ్యతే" అని భగ వద్గీత. భావశుద్ధిలేని మనస్సు స్వార్థమున బడి పాపకార్యములను చేయుటకు వెనుకాడదు. మనస్సుయొక్క సంస్కారము ననుస రించి సంకల్పములు పుట్టుతూంటాయి.

ఒకచోట ప్రతిదినం భాగవతము జరుగునట్లు ఒకరాజు తాను స్వయముగ ఏర్పాటు చేసినాడు. ఒక పండితుడు చక్కగ చెప్పగలడు. విన్నే శ్రోతలు ఆనందపడుతూంటారు. ఆ ఊరిలో ఒక గంధపు చెక్కల వ్యాపారస్థుడుండేవాడు. వాడు కూడ ప్రతి దినం భాగవతాన్ని వినుటకు పోవుచున్నాడు. వాడు పెద్ద ధనికుడు. కాబట్టి రాజుకు స్నేహితుడు. ప్రతిదినం ఇద్దరు భాగవతం వద్ద కలుసుకొని పురాణము సమాప్తమైన పిమ్మట కొంచెము మాట్లాడు కొని ఎవరి దారిన వారు పోయేవారు. ఒక పర్యాయము గంధపు చెక్కల వ్యాపారస్థునికి గంధపు చెక్కలు చాలా నిలిచిపోయి నాయి. వ్యాపారము జరుగుటయే లేదు. పుప్పిపడుతూండినట్లు తెలిసింది. ఆ దినం రాత్రి వానికి నిద్ర రాలేదు. గంధపు చెక్కలు ఎట్లైతే ఖర్చయితాయి? ఈ ఆలోచనలో వానికొక సంకల్పము తట్టింది. ఈ రాజు చనిపోతే ఆయనను కాల్చుటకు నా గంధపు

చెక్కలు ఖర్చైతాయి. ఈ రాజు చస్తే ఎంత బాగుండె! అని అనుకున్నాడు. అపుడు రాత్రి 12 గంటల కాలము. రాజుకు రాత్రి రెండు గంటలకు మెలకువ వచ్చింది. ఆ రాజుకు కూడ అకస్మాత్తుగా ఒక సంకల్పముదయమైంది, నా ఖజానాలో డబ్బు తరిగిపోతూంది. ఆ గంధపు చెక్కల వ్యాపారస్థునికి సంతానము లేదు. పెద్ద ధనికుడు. వాడు చస్తే వాని ఆస్తిని నా ఖజానాలోనికి కలుపుకోవచ్చు కదా! వాడు చస్తే ఎంత బాగుండె! అని లోపల నుండి సంకల్పము పుట్టింది. అయితే రాజుకు చింత, విచారము కల్గింది. "నా కెందుకీ దుష్టసంకల్పము పుట్టె. పాపమతడు ప్రతి దినం భాగవతానికి వస్తున్నాడు. ప్రతిదినం ఇద్దరము మిత్రులవలె కలిసి మాట్లాడుతున్నాము. అతడు చావవలెనను ఈ సంకల్పము మంచిది కాదు. అయితే ఈ సంకల్పమెందుకు పుట్టె?" అని ఆలోచన చేస్తే సమాధానము చిక్కలేదు. ఆయనకు తరువాత సరిగా నిద్రపట్టలేదు. దుష్టసంకల్పము మనిషికి వస్తే సజ్జనుడు చాలా విచారపడుతాడు. ఆ రాజు పాపము చాలా విచారపడ్డాడు. మరుదినము సాయంకాలము ఆ శేటు భాగవతానికి వచ్చినాడు. భాగవతమైన పిమ్మట రాజు శేటును ఏకాంతముగ పిలుచుకొని తనకావిధముగ దుష్టసంకల్పము వచ్చింది. దానికి కారణము తెలియలేదు. "నన్ను గురించి నీవేమైనా అనుకొని యుంటివా?" అని ప్రశ్నించినాడు. దానికా శేటు దాచుకోకుండా తాను రాత్రి గంధపు చెక్కలు ఖర్చగుటను గురించి రాజు చనిపోతే బాగుండె నను సంకల్పము చేసినట్లు చెప్పినాడు. అప్పుడు రాజుకు సమాధానము చిక్కింది. ఆ ధనికుడట్లు సంకల్పము చేస్తే అదే వచ్చి రాజు మనస్సులో నా విధముగ తనయందు ఉత్పన్నమగునట్లు చేసిందనుకున్నాడు. సంకల్పశక్తి చాల గొప్పది. అందువలన ఒకరిని గురించి మనము మంచిసంకల్పములనే చేస్తూండాలె. ఆ

సత్సంకల్పము ఎదుటివారిలో కూడ సద్రూపముననే ప్రతి ఫలిస్తూంటుంది.

రాజుకు విస్మయము కలిగి ఆ శేటుతో అన్నాడు. ఏమయ్యా! నీ గంధపు చెక్కలు ఖర్చు కావలసియుంటే నా మరణాన్ని కోరు కుంటివా? నీ మనస్సు చాలా మలినంగా ఉన్నది. ఎందుకంటే నీకు గంధపు చెక్కలు ఖర్చు కావాలె. దానికిగాను మరోరూప ములో కూడ నీవు సంకల్పించవచ్చు, రాజు గంధపు చెక్కల తోనే ఒకటి తన భవనములో చిన్న రూము మాదిరి ఏర్పాటు చేసుకొని సుగంధము యొక్క వాసనతో కాలము గడపుతే ఎంత బాగుండె! భగవంతునికి ప్రత్యేకముగ సుగంధపు చెక్కలతో దేవుని యిల్లుచేసి దానిలో తాను ధ్యానాదులు చేసుకుంటే బాగుండును కదా! అని ఎందుకు చేయలేదు. స్వార్థముతో పరుల చెడుపును లెక్కించక ఇతరుల నష్టము కోరుట తగని పని. ఏ రూప ములోగాని పరుల చెడుపు కోరరాదు. సంకల్పముయొక్క ప్రభావ మమోఘము. ఒకరిని గురించి మనమేమి సంకల్పిస్తామో! ఆ సంకల్పము అటువంటి వికారమునే ఎదుటివారిలో కలిగిస్తుంది. రాజు చనిపోతే బాగుండె అని వాడు సంకల్పిస్తే, అదే వచ్చి రాజు మనస్సులో శేటు చచ్చిపోతే ఎంత బాగుండె అని సంకల్పింప జేసింది. అపుడు రాజుకు కలిగిన సంకల్పానికి కారణము తెలిసి ఆ శేటును చీవాట్లు పెట్టినాడు. ఇది చెడ్డ సంకల్పానికి ఉదాహరణము.

మంచి సంకల్పానికొక ఉదాహరణము చూడండి.

ఒక గ్రామములో ఇద్దరు రైతులు, అన్నదమ్ములు, తమ్ముడంటే అన్నకు చాలా ప్రేమ. అటులనే అన్నపైనకూడ తమ్మునికి మంచి ప్రేమ. ఇద్దరికి వివాహాలైనాయి. తల్లిదండ్రులు చనిపోయినారు. తమ్మునికింకా పిల్లలు కలుగలేదు. అన్నకు ఇద్దరు కుమారులున్నారు. ఆడవాండ్లకు పడక వేరయియున్నారు. ఒక

పర్యాయము కళ్లెములో ధాన్యము కుప్పలు పోసుకున్నారు. ఆనాడు రాత్రి తమ్ముని మనస్సులో ఒక సంకల్పము కలిగింది. "అన్న! పెద్దవాడు. పిల్లలు గలవాడు. ఖర్చు యెక్కువ. వచ్చిన పంట చాలక పోవచ్చు. నేనేమైనా సహాయము చేయవలె. ఆయనకు తెలిసియిస్తే తీసుకోడు. కావున ఆయనకు తెలియకుండా కళ్లము లోని ధాన్యపు కుప్పలో నా ధాన్యము పోసిరావాలె" అనుకున్నాడు. అపుడే రాత్రి 12 గంటల సమయములో లేచి కళ్ళానికి వెళ్ళి తన కుప్పలో నుండి అన్న కుప్పలోనికి ముప్పై గంపలు పోసి వచ్చి నాడు. అన్నకు అదే రాత్రి 3 గంటల కాలములో మెలకువ వచ్చింది. అతనిలో సంకల్పము కలిగింది. "నా తమ్ముడు చిన్న వాడు. వానికింకా లోకానుభవము బాగా తెలియదు. భార్యతో వాడు నిశ్చింతగా ఉండుటకు పంట చాలక పోవచ్చును. నాకంటే కుమారులున్నారు. వారు నాకు తోడుచేస్తారు. కాబట్టి నేనెట్లో బ్రతుకగలను. వానికేమైనా సహాయము చేయాలె. వానికి తెలిసి సహాయము చేయబోతే తీసుకోడు. వానికి తెలియకుండా చేయ వలె"నని అపుడే లేచి కళ్లములోనికి పోయి 30 గంపలు తన ధాన్యాన్ని తమ్ముని కుప్పలో పోసివచ్చినాడు.

తెల్లవారిన పిమ్మట ఇద్దరు కళ్ళములోనికి పోయి చూస్తే కుప్పలు ఎప్పుడున్నట్లే ఉన్నాయి. ఇద్దరికి ఆశ్చర్యమైనది. చిన్న వాడు అన్నను కారణమడిగినాడు, అన్న తమ్ముని్న కారణమడిగి నాడు. ఒకరి సంగతి మరొకరు తెలుసుకొని ఆనంద బాష్పాలతో కౌగిలించుకున్నారు ఇది ప్రాకృతికమైన సైన్సు. ఈ సత్యాన్ని సర్వులు గుర్తించాలె.

ఈ రూపములో మంచి సంకల్పమైతే మంచి ఫలితము. చెడ్డ సంకల్పమైతే చెడ్డ ఫలితము. ఇంతకు భావ సంశుద్ధి ఉండాలె. దాని ద్వారానే మానవునకేనాటికైనా ఉన్నతి కలుగుతుంది.

ఆ భావశుద్ధిని కలిగియుండవలెనని దేవహూతికి కపిలుడు చెప్పు చున్నాడు. భగవద్భక్తి కలిగిన చిత్తమే భావశుద్ధి కలిగియుండు టకు సూటియైన బాట. ఆ భావశుద్ధిచేత సహజముగానే మానవుడు సర్వుల క్షేమాన్ని కోరుతాడు. తానెపుడు ఇతరుల క్షేమాన్ని కోరుతాడో ఇతరులు కూడ తన క్షేమాన్ని కోరుతారు. ఇది కంటికి కనిపించక రహస్యముగ జరిగే ప్రకృతిలోని పని. కావున అందరి యందు సద్బుద్ధి ఎట్లు కలుగుతుంది? అంతటిని, అందరిని దైవ స్వరూపముగ చూచినపుడు ఎవరిని గురించి కాని చెడ్డగా భావించ జాలము.

"నా కథను శ్రవణము చేయుటలో ఆనందము పొందు వారును, నా కథలను ఇతరులకు చెప్పుచూ ఆనందించు పరమ భాగవతోత్తములకు తాపత్రయము దరిజేరజాలదు. ఆ విధమైన పరమ భాగవతుల సంగమ మపేక్షణీయము. అది సకలదోషము లను దూరము చేస్తుంది. అట్టి సత్సంగములయందు సర్వప్రాణు లకు హృత్కర్ణ రసాయనములైన నా కథా ప్రసంగములు కలుగు తాయి భక్తితో నా కథలను వినుటవలన కైవల్యమార్గదములైన శ్రద్ధాభక్తులు ఉత్పన్నమవుతాయి.

"భక్త్యాపుమాన్ జాత విరాగ ఇంద్రియాత్
దృష్టశ్రుతాన్ మద్రచనాను చింతయా
చిత్తస్య యత్తో గ్రహణే యోగయుక్తో
యతిష్యతే ఋజుభి ర్యోగమార్గైః" 3-25-26

భక్తి కలిగిన పిదప చూచిన వినిన ఇంద్రియ భోగములపై హేయభావము కలుగుతుంది. అపుడు భక్తుడు చిత్తము నేకాగ్రము చేసుకొనుటయందు మగ్నుడౌతాడు. మాటి మాటికి నా రచనాను చింతన చేస్తూ యోగమును పొందుటకు ప్రయత్నిస్తాడు."

మద్రచనాను చింతయా=భగవంతుని రచన, ఆయన శిల్ప నైపుణ్యమును చూడుడు. సూర్యుడు ఎటువంటిదీపమో! మొత్తము ప్రపంచానికి ఒకే దీపము, ఆ దీపము కొద్దిగా క్రిందికి దిగిందంటే ప్రపంచము భస్మమవుతుంది. చంద్రుడు 10 అడుగులు క్రిందికి దిగి నాడంటే సముద్రము పొంగి భూమిని కప్పివేస్తుంది. ఎంత అద్భుతమైన గణితమది! ఇది అంతయు ఎవరికొరకు? మనకొరకు.

ఈ సృష్టి మన కన్నుల యెదుట ఉన్నది. దీని అద్భుతరచనా వైభవ కళాకౌశలమేమంటే మనకు ప్రియము కానట్టి వస్తువు ఒకటి లేదు!

ఒకతూరి ఒక మహాత్ముని వద్దకు కొందరు స్త్రీలు పోయి నారు. వారిలో ఒక స్త్రీ అద్భుతమైన సౌందర్యవతి. ఆయన ఆ స్త్రీవైపు రెప్పవాల్పకుండా చూస్తున్నాడు. ఒక వయస్సు వచ్చినామె "స్వామీ! ఆ విధముగ స్త్రీవైపు చూడడం మిము బోంట్లకు తగునా?" అని అడిగింది. దానికా మహాత్ముడన్నాడు. "అమ్మా! ఎవనిచేత ఈ బొమ్మ తయారైనదో వాడెంత సుందర ముగ ఉన్నాడోనని వాన్ని చూస్తున్నానమ్మా!" అన్నాడు. ఆయన రచనను చూచినపుడు ప్రతి దానిలో విశేషమును గమనిస్తూండాలె.

భూమిని చూస్తే ఆయనయొక్క వరాహావతారము చేత కాపాడబడినదిగా చూడాలె. సముద్రమును చూస్తే శేషశాయి స్మరణకు రావాలె. వాయువు ఆ విరాట్పురుషుని శ్వాస. సూర్యుడు, చంద్రుడు వారిలో నున్న ప్రకాశము ఆయనదే. ఆయన మనకు ప్రాణాధారుడు. ఇంటిలోని కొళాయినీళ్ళకు టాక్సు ఇచ్చుచున్నాము. పంఖాగాలికి టాక్సు యిచ్చుచున్నాము. వర్షానికి టాక్సు యిచ్చు చున్నామా! నిరంతరము తీసుకునే శ్వాసకు టాక్సు యిచ్చు చున్నామా? ఆయన కేవలము యిచ్చేవాడేగాని తీసుకునేవాడు కాదు. అదే పరమ ధర్మము. నిష్కామకర్మ భగవత్కర్మ.

మనము పరమాత్మకు ఋణపడి ఉన్నాము. ఈ సత్యమును గమనించి ఆయన స్మరణకువస్తే శరీరము పులకరించి కృతజ్ఞతాపూర్వకమైన ఆనంద బాష్పాలు ఉబికి రావాలె.

భక్తియొక్క విధము తెలుపమని దేవహూతి ప్రార్థిస్తే కపిలుడంటాడు.

"జననియ్రతి వినుమరి సకలపదార్థ
పరిజ్ఞాన తత్త్వ పారీణమైన
యామ్నాయ విహిత కర్మాచారములు
గల్గి తివుటమై వర్తించు దేవగణము
పూనినైసర్గికంబైన నిర్నిమిత్తకమగు
భగవత్సేవ మిగుల ముక్తి
కంటె గరిష్ఠంబు గావున నదియు
భుక్తాన్నంబు జీర్ణంబునందజేయు
దీప్తజఠరాగ్నిగతి లింగదేహ నాశకంబు
గావించునదియును గాక విష్ణు
భక్తి వైభవముల దేటపరతు వినుము
సద్గుణవ్రాత యోగలక్షణ సమేత" 3_869

తల్లీ! ఈ సృష్టియొక్క సకలవస్తు పరిజ్ఞానము కలిగి, మరియు తత్త్వజ్ఞానము కలిగి దేవగణము తృప్తితో నడిపిస్తూంటారు. వారు వేదశాస్త్రములయందలి సత్కర్మ లాచరిస్తూంటారు. కావున సృష్టిలోని ఆయా వస్తువుల కాయా లక్షణములుండుట వానివాని స్వభావమగుచున్నది.

దేవతలు భగవదాజ్ఞాబద్ధులై తాము కారకులు కామని ఆ దేవదేవుని ఆజ్ఞకు నతులై నడుస్తూంటారు. కావుననే వారున్నది స్వర్గలోకము. అంటే సు + వర్గము అంటే మంచివారి గుంపు. దానికి మరొక్క పేరు నాకము. నాకము = న + అకము అంటే

దుఃఖము లేనిది. ఇట్టి స్థితిని భగవత్పరచిత్తులై యున్నారు. కావున ఆ దివ్యత్వమును పొందినారు.

తల్లీ! మనుష్యులు కూడ వేదోక్తకర్మలాచరించుచు నా యందు నిర్హేతుకమైన భక్తి కలిగి నా సేవ చేయాలి. ఎందుకంటే భగవత్సేవ ముక్తి కంటే శ్రేష్ఠమైనది. అన్నము తింటే అన్నాన్ని జీర్ణము చేసేది జఠరాగ్ని. ఈ జఠరాగ్ని అన్నమును జీర్ణము చేసినట్లు భక్తి లింగదేహమును నశింపజేస్తుంది. ఇంకను భక్తి ప్రభావము వినుము తల్లీ అని కపిలుడు చెప్పుచున్నాడు.

"అమలిన భక్తి గొందరు
మహాత్ములు మచ్చరణారవిందయు
గ్మము హృదయంబునన్ నిలిపి
కౌతుకులై యితరేతరానులా
పముల మదీయ దివ్యతను
పౌరుషముల్ గొనియాడుచుండి మో
క్షము మదిగోర నొల్లరనిశంబు
మదర్పిత సర్వకర్ములై" 3–870

నిర్మలమైన భక్తితో కొందరు మహాత్ములు నా చరణముల యందు మనస్సును నిలిపినవారై కుతూహలముతో పరస్పరము నాదైన దివ్యజన్మ కార్యములను కొనియాడుతూ దానియందు రమిస్తున్న హృదయము గలవారై మోక్షమునుగూడ కోరరు. వారు సర్వకర్మలుకూడ నా కర్పిస్తూ చేస్తూంటారు. నాయొక్క రూప వైభవాదులను నిరంతరము స్మరణచేస్తూ ఆనందముతో జీవితము గడపుతూంటారు.

"తనరుదురప్పుణ్యాత్ములు జనయిత్రి
మదీయ కాలచక్రగ్రసనం
బును నొందక నిత్యంబగు ననుపమ
సుఖవృత్తినుందు రదియెట్లున్నన్" 3–880

అటువంటి పుణ్యాత్ములు నా కాలచక్రములో గ్రహింపబడక నిత్యము, అనుపమమునైన సుఖవృత్తితో ఉంటారు.

అట్టివారికి సమానుడనై స్నేహము చేతను, విశ్వాసముతో సఖుడుగాను, మేలు కోరుటకై మిత్రుడుగాను, ఉపదేశముచేత పూజ్యుడైన గురువుగాను, ఇష్టదైవమునునై కాలచక్ర భయములను పోగొట్టుతూంటాను.

భక్తి అంటే ప్రేమాత్మికావృత్తి. ప్రతి పదార్థము ప్రతి క్రియలో భగవంతుని స్మరించు. ప్రతి వస్తువును ఆయన కళా కౌశల నిర్మాణముగానే భావించాలె. అరటి పండును చూడండి. దానిలో నెట్టి శ్రేష్ఠమైన హల్వాను పెట్టినాడు. దానిని రక్షించుటకు కవచమువంటి తోలును తయారు చేసినాడు. దానివలన ఈగ దోమ లోనికి చేరలేవు. దానికేమాత్రము హాని కలిగించలేవు.

"కృష్ణ భక్తిరస భావితా మతిః
క్రీయతాం యదికుతోఽపిలభ్యతే ।
తత్ర మూల్యమపి లౌల్యకేవలం
జన్మకోటి సుకృతైర్న లభ్యతే ॥"

కృష్ణ భక్తి రసా స్వాదమతులు అది యెక్కడ లభ్యమవుతుందో అక్కడికి వెళ్ళి కొనండి. దానికి మూల్యము ఏమి! కేవలము దానియందు పరమాసక్తియే. అట్టిది కోటిజన్మల పుణ్యముతో కూడ లభించదు.

కపిలు డంటున్నాడు జీవాత్మ ఈ లోకమునను దివియందు కూడ తిరుగుతూ ధన పశు మిత్ర వనితా తతిపై స్నేహమును వదలుకొని నన్ను అనన్యగతిలో భజిస్తే అట్టివానిని మృత్యురూప సంసారమునుండి నేను తరియింపజేస్తాను.

ఓం సర్వేవై సుఖనస్సంతు.

ఇరువదవ రోజు ఉపన్యాసము సమాప్తము.



శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## ఇరువది ఒకటవ రోజు ఉపన్యాసము

ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం ।
వేద్యం వాస్తవమత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్ ॥
శ్రీమద్భాగవతే మహామునికృతే కిం వా పరైరీశ్వరః ।
సద్యో హృద్యవరుధ్యతేఽత్ర కృతిభిః శుశ్రూషుభిస్తత్క్షణాత్ ॥

పుణ్యాత్ములారా; భాగవత శ్రవణాసక్త చిత్తులారా!

పవిత్రమైన భాగవత కథా శ్రవణము, ధన్యజీవనమునకు దారియైన భాగవత కథాశ్రవణావకాశాన్ని ప్రసాదించిన శ్రీకృష్ణ పరమాత్మకు సాష్టాంగ మైమోడ్పులు చెల్లించుకొని కార్యక్రమమునకు పూనుకుందాము. ఏదైనా కాని కార్యక్రమము అనుకున్నట్లు సాంగమంగళముగా జరుగవలసియుంటే అది భగవదనుగ్రహము చేతనే సాధ్యము. భగవంతుడు మనమనుకున్నట్లు కార్యక్రమమును మంగళప్రదముగా జరుగుటకు కృపచూపినాడు.

కపిలదేవుడు తల్లికి ఆత్మజ్ఞానమును ఉపదేశించుచున్నాడు. ఇటువంటి విషయాలను శ్రవణము చేస్తే అది అదృష్టరూపమున మనకు సుసంస్కారమును ప్రసాదింపజేస్తుంది. అదృష్టము అంటే కంటికి కనిపించేది కాదు. ఆలోగా అది భాగ్యముగా భావింపబడుతుంది. దీనికి వ్యతిరేకముగా భోగలాలసుడు భోగమునకే జీవితమును బలిపెట్టువాడు పాపమునకు గురియై దుఃఖభాజనుడగుచున్నాడు.

పెద్దలు "ముహూర్తమపి జీవేత నరః శుక్లేన కర్మణా" అన్నారు. మనిషి ఒక ముహూర్తము జీవించినను ప్రకాశవంత మైన కర్మచే శోభించాలి. దీర్ఘకాలము బ్రతికినందువలన మానవు నికి ప్రయోజన మేమాత్రము లేదు. ఇంకొక మహాత్ముడు "ముహూర్తం జ్వలితం శ్రేయః న తు ధూమాయితం చిరమ్" అన్నాడు. ప్రకాశవంతమైన జీవితము అల్పమైనను చిరకాలము పొగతో రాచుకున్నట్లు జీవించుటకంటే శ్రేష్ఠమైనది. కావున భర్తృహరి చెప్పిన విషయమీ సందర్భమున స్మరణీయము.

"ఉరుతర పర్వతాగ్రమున నుండి దృఢంబగు రాతిమీద స
త్వరముగ ద్రెళ్ళి కాయము హతంబుగ జేయుట మేలు గాలిమే
పరి దొరవాత కేలిడుటబాగు హుతాశను మధ్యపాతముౕ
వరమగు చారుశీల గుణవర్జన మర్హము గాదు యేరికిౕ"

అంటే ఎత్తైన పర్వతముమీద నుండి క్రిందికి పడి శరీరమును ముక్కలు ముక్కలుగా చేసుకొనుటయు, భయంకరమైన సర్పము నోట్లో వ్రేలు పెట్టి కరిపించుకొని చచ్చుటయు, అగ్ని మధ్య భాగ మున దుమికి ప్రాణము పోగొట్టుకొనుటయు, శోభాయమానమైన శీలమును పోగొట్టుకొనుట కంటే శ్రేష్ఠమార్గములు.

చూడండి. ఈ విషయమెంత అద్భుతమైన ఆకర్షణీయ మైనదో! మానవుడు తన చరిత్రను బాగుపరచుకొనుటకు పాటు పడవలె. తన శీలము పోవుటకు పరిస్థితులు కారణభూతమైతే ప్రాణాన్ని తృణముగ అర్పించుట ఎంతో శ్రేష్ఠము. కావున జీవి తాన్ని భాగ్యవంతముగ చేసుకొనుటలో భాగవత శ్రవణము అగ్ర గణ్యమైనది. ఇంక కథలోనికి ప్రవేశిద్దాము. కపిలదేవుడంటున్నాడు.

నేను సృష్టికి నాయకుడను, భగవంతుడను, జగత్ప్రభువును. నా కంటె అన్యులను ఆలంబనము చేసుకొని జీవించేవారు భవ భయమును పొందుతారు.

"మద్భయాత్ వాతి వాతోఽయం సూర్య స్తపతి మద్భయాత్।
వర్షతీంద్రో దహత్యగ్నిః మృత్యుశ్చరతి మద్భయాత్॥"
3-25-41

నా భయముచేత గాలి వీచుచున్నది. సూర్యుడు తపించుచున్నాడు. ఇంద్రుడు వర్షించుచున్నాడు. మృత్యువు నా భయముతో చరించుచున్నది.

"గాన విజ్ఞాన వైరాగ్య కలితమైన భక్తి
యోగంబునం జేసి పరమపదము
కోరకు నయ్యోగివరులు మచ్చరణ భజనులగుచు
జరియింపుదురు నిర్భయాత్ములగుచు" 3-877

కావున ఈ భక్తి యోగముచేత పరమ పదము పొందగోరి నిర్భయాత్ములై యోగులు మచ్చరణభక్తులై చరిస్తూంటారు.

గురుభక్తిచేత చిత్తము మత్పరమయ్యే పర్యంతము సత్పురుషులకు ఇహలోకమునందును, పరలోకమునందును చింతరమైన మోక్షోదయము లభిస్తూంటుంది. ఈ విధముగ చెప్పి కపిలుడు కొంచెము కన్నులు మూసి మౌనము వహించి మరల నిట్లు చెప్పదొడగెను.

తల్లీ ఇంతవరకు భక్తి తత్వము చెప్పితిని ఇంక ఆత్మతత్త్వము చెప్పుతాను.

ఆత్మ తత్త్వము:

"అనాదిరాత్మాపురుషః నిర్గుణః ప్రకృతేః పరః।
ప్రత్యగ్ధామా స్వయంజ్యోతిః విశ్వం యేన సమన్వితమ్॥"
3-26-3

"స ఏష ప్రకృతిం సూక్ష్మాం దైవీం గుణమయీాం విభుః।
యదృచ్ఛయై వోపగతా మభ్యపద్యత లీలయా॥" 3-26-4

"గుణై ర్విచిత్రాః సృజతీం సరూపాః ప్రకృతిం ప్రజాః।
విలోక్యముముహే సద్యః స ఇహ జ్ఞానగూహయా॥" 3-26-5
"ఏవం పరాభిధ్యానేన కర్తృత్వం ప్రకృతేః పుమాన్।
కర్మసు క్రియమాణేషు గుణై రాత్మాని మన్యతే॥" 3-26-6
"తదస్య సంసృతిర్బంధః పారతంత్ర్యం చ తత్కృతమ్।
భవత్య కర్తురీశస్య సాక్షిణో నిర్వృతాత్మనః॥" 3-26-7
"కార్యకారణకర్తృత్వే కారణం ప్రకృతిం విదుః।
భోక్తృత్వే సుఖదుఃఖానాం పురుషం ప్రకృతేః పరమ్॥"
3-26-8

తల్లీ! పురుషుడు అనాది. అనంతుడు. గుణశూన్యుడు, ప్రత్యక్స్వరూపుడు, స్వయంప్రకాశుడు. త్రిగుణాత్మకమైన ప్రకృతి భగవత్సంబంధి. దానియందు యదృచ్ఛచేత భగవంతుడు లీలావశంబున ప్రవేశిస్తాడు. ఆ ప్రకృతి గుణత్రయమయమై సరూపమైన ప్రజాసృష్టిని చేస్తుంది. దానిచేత పురుషుడు మోహితుండై తన స్వరూపమును మరచి గుణత్రయాత్మకంబైన ప్రకృత్యధ్యాసంబున అన్యోన్యము కలసిపోతాడు. అపుడు ప్రకృతి గుణాలను తన యందారోపించుకొని కర్మలయందు కర్తృత్వాన్ని వహిస్తాడు. పరిణామమున సంసారబద్ధుడై పరతంత్రుడౌతాడు. ఇది అవిద్యోపాధికుడైన జీవ విషయము.

మాయోపాధికుడైన ఈశ్వరుండు సాక్షియై ఆత్మకు కార్యకారణంబులు ప్రకృతి యధీనములనియు, సుఖదుఃఖ భోక్తృత్వములు ప్రకృతి విలక్షణుడైన పురుషునివని యెరుంగుదురు.

ఈ మాట విని దేవహూతి మహాత్మా! ప్రకృతి పురుషులు ప్రపంచమునకు కారణభూతులు. వారి లక్షణము సదసద్వివేకముగా నాకు చెప్పవలసినదని అడుగుతుంది. భగవంతుడంటాడు. తల్లీ! ప్రకృతి క్రమముగ త్రిగుణము, అవ్యక్తము, నిత్యము,

సదసదాత్మకము, మరియు ప్రధానమునని అవి అయిదు విధములుగ పేర్కొనబడుతుంది.

పంచభూతములు, శబ్ద స్పర్శ రూప రసగంధములనే పంచ తన్మాత్రలు, పంచజ్ఞానేంద్రియములు (చెవి, త్వక్కు, కన్ను, నాలుక, ముక్కు ననునవి) పంచకర్మేంద్రియములు (వాక్కు, చేయి, కాలు, మర్మేంద్రియము, గుదము) మనోబుద్ధి చిత్తాహంకారములనే అంతఃకరణ చతుష్టయము యీ యిరవై నాలుగు సగుణబ్రహ్మ. ఇవి యన్నియు ఆ పురుషునిచేతనే చేతనత్వంబు పొందుతాయి. ఈ యిరువది నాలుగు తత్త్వములు దేనియందు పుట్టి పెరిగి వర్తించునో అది ఇరువదియైదవ తత్త్వము. అది కాలమనబడును. ఇది ఈశ్వరుడైన పురుషుని తత్త్వము. వీటిలో వర్తించే పురుషుడు జీవుడు. వర్తింపనివాడు దేవుడు. జీవుడు అహంకారముచే మోహింపబడి ప్రకృతిని పొంది భయము చెందును. ప్రకృతి గుణము లన్నింటియందును సమానమైన అంతర్యామి భగవంతుడు. అతడు ప్రకృతిలోని లక్షణము లంటనివాడు. అతని చేష్టలలోని విశేషములే ప్రకృతి వ్యవహారములు.

ఈ చేష్టలు అతనికి లీలలు. దానినే కాలమనవచ్చును. అది జీవరాసులలో అంతర్గతంబగుటచేత పురుషుడనియు, అదియే బహిర్భాగముగ వెలువడునపుడు కాలమనిపించుకుంటుంది. ఆత్మమాయచేతనే ప్రకృతియందు పురుషుండు తన వీర్యమును నిలిపితే ఆ ప్రకృతి హిరణ్మయమై మహత్తత్వంబును పుట్టిస్తుంది. అక్కడి నుండి ప్రపంచము విస్తరిల్లినది.

పురుషుడు ప్రకృతియందు చరించుటకు నాలుగు వ్యూహము లేర్పడుతాయి. అవి చరించుటకు మూడు జగము లేర్పడును. మూడు జగములే భూః భువః సువః లోకములు.

వ్యూహములు అనగా సృష్టి వహింపబడునవి. వీరు వాసు దేవుడు, సంకర్షణుడు, ప్రద్యుమ్నుడు; అనిరుద్ధుడు. వీరు మనలో మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారముగ పని చేయుదురు.

వాసుదేవము అనబడు వ్యూహము సత్త్వగుణప్రధానమై, నిర్మలమై శాంతమై ఉంటుంది. అతడు భవసాగరము యొక్క ఊర్మ్మలకు లొంగడు. ఊర్మ్మలు=ఆకలి, దప్పి, శోకము, మోహము, ముసలితనము, మృత్యువులు. వీటి స్పర్శ లేకుండా ఉండే తత్త్వమే వాసుదేవ తత్త్వము. ఇది మహత్తు (బుద్ధి) కన్న అవ్వల ఉండే శాశ్వత తత్త్వము. భక్తజనులు దేవుడని వివిధరూపములలో ఆరాధించు తత్త్వమిది ఒకటే. అది తపస్సు, దానము, శమము, దమము, సత్యము, శౌచము నాద తత్త్వముల చేత పరిపూర్ణమై ఉంటుంది. ఈ వాసుదేవ తత్త్వ క్రియాశక్తి రూపము ధరిస్తుంది. దానినే అహంకారమంటారు. ఆ అహంకారము సత్త్వరజస్తమ విభాగము నొందుతుంది. వైకారిక మనబడు సాత్త్వికాహంకారము మనస్సునకు, ఇంద్రియములకు, పంచభూతములకు ఉత్పత్తి స్థానముగ పని చేస్తుంది.

తైజసాహంకారము వలన అనిరుద్ధవ్యూహము పుట్టుతుంది, అది మనస్సే. అనిరుద్ధుడు ఇంద్రియములకు దేవుడు. సకల యోగులును ఇంద్రియములను అంతర్ముఖము చేసి ఇతనిని హృదయమున సేవిస్తారు. ఇతని నుండియే బుద్ధితత్త్వము పుట్టుతుంది. మనస్సు సంకల్పిస్తుంది. బుద్ధి నిశ్చయించుతుంది. ఈ తైజసాహంకారము వలననే ప్రాణమునకు క్రియాశక్తి బుద్ధికి జ్ఞానశక్తి పుడుతుంది. ఈ శక్తులు రెండును ఇంద్రియములకు సంక్రమిస్తాయి.

తామసాహంకారము వలన శబ్ద తన్మాత్రలు పుడుతాయి. వాటి నుండి పంచభూతములు, వాటి గుణములు, ఇంద్రియములు, ఇంద్రియ వ్యవహారములు కలుగుతాయి.

విరాట్పురుషుని వలన శరీరేంద్రియములు ఇవన్నిటి వివరము సమస్తేంద్రియములు వాటి అధిదేవతలు వాటి వ్యవహారములు ఉద్భవిస్తాయి.

తల్లీ! శరీరము త్రిగుణములతో నిండి ప్రకృతితో నేర్పడినది. పురుషుడందుండియు ప్రకృతికి సంబంధించినట్టి సుఖదుఃఖములచే ననురాగము లేనివాడై మార్పులు చెందకుండా త్రిగుణములచే వికారము పొందక యుండవచ్చును. అపుడతడు స్వచ్ఛమైన నీటి యందు ప్రతిబింబించిన సూర్యునివలె ఉంటాడు. ప్రకృతి గుణముల యందు తాననే భావము తగులుకుంటే అదే అహంకారమవుతుంది. ఆ అహంకారముతో మోహము పుడుతుంది. జరుగుచున్న సన్ని వేశాలకు తానే కర్తనని ప్రకృతి గుణదోషాలకు బద్ధుడౌతాడు.

"పూనిచరించుచు విషయ
ధ్యానంబునజేసి స్వాప్నికార్థాగమ సం
ధానము రీతి నసత్పథ
మానసుడగుచుఁ భ్రమించు మతిలో లుండై" 3-897.

సంసార బద్ధులై ఇంద్రియార్థముల ననుసరించుచూ కల లోని సంపదలవలని తృప్తివలె దారితప్పి అసన్మార్గమున మతిభ్రమిం చిన వానివలె జీవుడు తిరుగుతాడు.

"అత ఏవ శనైశ్చిత్తం ప్రసక్త మసతాం పథి।
భక్తియోగేన తీవ్రేణ విరక్త్యా చ నయే ద్వశమ్" 3-27-5

మోక్షార్థియైనట్టివాడు మనస్సును వశపరచుకుంటాడు. యమ నియమాదులను సాధిస్తాడు. ఈ అభ్యాసము కుదరవలెనన్న మిగతా వాటిపైన వైరాగ్యము కలుగవలె. దానికి తీవ్రమైన భక్తి యోగమే సాధనము.

నా కథా కర్ణనము, మత్పాదసేవ, భూతములయందు సమ త్వము, నిర్వైరత్వము, బ్రహ్మచర్యము, మౌనము వహించి

యుండుట సంతుష్టుడు, మితముగ భోంచేయువాడుగను, మననశీలుడు, మత్సరము లేనివాడు, మిత్రత్వముచే సర్వులయందు కృపగలిగియుండుటయు, దేహాత్మబుద్ధిని వర్జించి చరిస్తే తీవ్రమైన భక్తియోగము లభ్యమవుతుంది

"సర్వభూత సమత్వేన నిర్వైరేణాప్రసంగతః ।
బ్రహ్మచర్యేణ మౌనేన స్వధర్మే బలీయసా॥" 3_27-7
"యదృచ్ఛయోపలబ్ధేన సంతుష్టో మితభుక్ మునిః ।
వివిక్తశరణః శాంతో మైత్రః కరుణ ఆత్మవాన్॥"
3-27_8

సర్వభూతములయందు సమత్వము, నిర్వైరత్వము అనవసర ప్రసంగము చేయకుండుట, బ్రహ్మచర్యము, మౌనము, నిష్కామభావముతో స్వధర్మాచరణము, సమయమునకు లభ్యమైన దానితో సంతోషించి తృప్తిపడుటయు, మితముగ భుజించుట, ఏకాంతముగనుండుట శాంతితో నుండుట, మైత్రి, కరుణ. ఆత్మనిగ్రహము కలిగియుండవలయును.

ఈ సాధనములచేతి జీవుడు, ఈశ్వరుడు యను వారి నిజ స్వరూపము తెలుస్తుంది. జీవుడంటే గుణములతో కూడిన ప్రకృతి మధ్య చిక్కుకున్నవాడు. ఆ ప్రకృతిని తన కధీనముగ చేసుకున్నవాడే యీశ్వరుడు. ఈ జ్ఞానముచేత బుద్ధి అంతర్ముఖమవుతుంది. అప్పుడు బుద్ధిలోని అనేకములైన పరిణామములు గోచరిస్తాయి. ఇవన్నియు తనయందే యేర్పడిన రూపములని తెలుస్తుంది. మరి యొకటి కాని, వ్యక్తిగాని లేదు. తానే యీ సమస్తమునకు కారణమని బోధపడుతుంది. అట్టి స్థితిలో కంటితో సూర్యున్ని దర్శించినట్లు నారాయణుని దర్శనమవుతుంది. దేహమున నేను అనే భావము అంతరిస్తుంది. దేహమునకు అస్తిత్వమే లేదు. సర్వమునకు తానే ఆధారము. దేహము నేననే భావమే అహంకారము. సర్వమునకు

నారాయణుడే ఆధారము. ఆయనను కాదని వేరే యేదియు లేదని తెలియుటతో ఆ అహంకారము తొలగిపోతుంది.

దేహమునందు సప్తధాతువులుండును. అవి త్రిగుణాత్మికమైన ప్రకృతితో ఏర్పడినవి. ఈ మూలప్రకృతియే సమస్తమును పుట్టించు స్వభావము గలది. దానినే ప్రధానమంటారు. దానియందు కూడ ఈ సాధనలో అంతర్యామి ప్రకాశదర్శనమగుటచే నారాయణుడే ప్రధానమున కాధారమని తెలుస్తుంది. ఆయన నుండి ప్రధానము వెలువడుటకు కారణమేమి? త్రిగుణములు, పంచభూతాలతో కూడిన నానావిధములైన నామరూపాల సృష్టి యెందుకు? అంటే దానికి కారణములేదు. ఇది తన లీల. లీలకు కారణముండదు. సృష్టియందున్న కార్యకారణములన్నియు నారాయణస్మరణయందు చెందుతాయి. ఆ యనుభూతిలో భగవంతుడు సర్వవ్యాపి యనియు, ఈ సృష్టి వానిచే పరిపూర్ణమనియు మనకు స్పష్టముగ బోధపడుతుంది.

"వినుమాత్మవేత్తకు విష్ణు స్వరూపంబు
నెరుగంగబడునది యెట్లనన్న
గగనస్థుడగు దినకరు కిరణచ్ఛాయ
జలముల గృహకుడ్య జాలకముల
వలన దోచిన ప్రతిఫలితంబు చేతి
నూహింపంగ బడిన యయ్యినుని పగిది
నర్థిమనోబుద్ధ్య హంకరణత్రయ
నాడీప్రకాశమునను నెరుంగ
వచ్చు నాత్మస్వరూపంబు వలతిగాగ
చిత్తమున దోచు సంచితశ్రీదనర్చి
యమ్మహామూర్తి సర్వభూతాంతరాత్మ
డగుట నాత్మజ్ఞులకు గానగును మరియు" 3–902

ఆత్మవేత్తకు విష్ణుస్వరూపము పగటివేళ సూర్యుడున్నప్పుడు అతని ఉనికి ఎట్లు తెలియునో ఆ విధముగ తెలుస్తుంది. సూర్యుని ఎండ కిటికీల ద్వారా, గవాక్షముల ద్వారా ప్రకాశిస్తూండినట్లు మనో బుద్ధ్యహంకరణములనుండి సర్వగోళకముల ద్వారా ప్రకాశించు చున్న అంతరాత్మున్ని ఆత్మజ్ఞులు తెలుసుకుంటారు.

జీవుడు పరమాత్మాసక్తుడైనపుడు పంచభూతములు ప్రకృతి యందు లీనమై వాసనామాత్రములుగా ఉంటాయి. అపుడవి కర్మ ములు కలిగింపలేవు. నిద్రలో మనకు దేహము లెట్లుండునో అట్లుం డును. పురుషుడు మాత్రము తనయందు తాను మేల్కొని ఇతరముచేత కప్పబడనివాడై పరమాత్మానుభవమును పొందు తూంటాడు. ఇది విని దేవహూతి అంటుంది.

మహాత్మా! ఇచ్చట నా కొక సందేహము కలుగుచున్నది. పృధివికిని గంధమునకును, నీటికి రసమునకును అన్యోన్యమైన అవి నాభావ సంబంధమున్నది. అంటే ఒక దానిని విడిచి మరియొకటి ఉండదు. అట్లే జీవులయందు ప్రకృతికిని, ఆత్మకును అన్యోన్య సంబంధమున్నది కదా? అపుడా ప్రకృతికిని ఆత్మకు వియోగ మెట్లు సంభవము? ఈ తత్త్వబోధముచేత సంసార బంధములెట్లు దూరమౌతాయి? మరణించిన పిమ్మట మరల పుట్టని మార్గమేది? ఇవి నాకు తెలిపి నన్ను రక్షింపవలసినది.

అపుడు భగవంతుడు చెప్పుచున్నాడు. తల్లీ! నిష్కామ కర్మచేతఁ నిర్మలమైన అంతఃకరణము కలుగుతుంది. తీవ్రమైన భక్తి యోగముతో, నా కథలను శ్రద్ధగా వినుటవలన కలిగిన వైరాగ్యముచేత, ప్రకృతి పురుషుల యథార్థజ్ఞానము జనిస్తుంది. కామములు తొలగిపోవుట వలన, యోగాభ్యాసమును నిరంతరము ఆచరించుట వలననూ, తీవ్రమైన చిత్తైకాగ్రత సంభవమవుతుంది.

అట్టితరి పురుషుని ప్రకృతి దగ్ధమై వెనుకకు మరలి మాయమవు తుంది. అరణిని మథిస్తే అగ్ని పుడుతుంది. దానిచేత నా అరణి దహింపబడునట్లు జ్ఞానము చేతనూ, తత్త్వదర్శనము చేతనూ, నిరంత రము బలవంతమూ, దోషదర్శనమూనగు ప్రకృతి జీవునిచేత అనుభవింపబడి విడువబడుతుంది,

"విను ప్రకృతి నైజ మహిమంబున
తనలో నున్న యట్టి పురుషునకు మహే
శునకు నశుభవిస్ఫురణంబనయము
గావింప జాలదది యెట్లనినన్" 3-906

ప్రకృతి అంటే స్వభావమే. అది నైజముగా గొప్పతనము కలది. దాని పురుషుడు దానికి మహేశుడు అంటే ప్రకృతిపైన అధికారము కలవాడు. అట్టి పురుషునికి ప్రకృతి ఎల్లప్పుడు అశు భము గావింపజాలదు. ఎట్లంటావా ?

"పురుషుడు నిద్రవోగలల బొందు ననర్థకముల్ ప్రబోధమం
దరయగ మిథ్యలై పురుషునందు ఘటింపని కైవడిన్ బరే
శ్వరునకు నాత్మనాథునకు సర్వశరీరికి గర్మసాక్షికిన్
బరువడి బొంద వెన్నటికి బ్రాకృత దోషములంగనామణీ"
3-907

పురుషుడు నిద్రపోయినపుడు రకరకాలైన స్వప్నములు వస్తాయి. మెలకువ వస్తే అన్ని స్వప్నములు మిథ్యలని తెలుస్తుంది. వాటికి ఆ పురుషునికి సంబంధమే ఉండదు. ఆత్మనాథుడు సర్వ శరీరి. కర్మ సాక్షియైనట్టి పరమేశ్వరునకు ఆ దోషము లెన్నటికి అంటవు.

జన్మము లెత్తువాడు కర్మబంధములు పెంచుకుంటాడు. అధ్యాత్మ తత్పరుడు అనేకజన్మలెత్తుతూంటాడు. బ్రహ్మపద ప్రాప్తి పర్యంతము సాధన జరుగుతూనే ఉంటుంది. నా భక్తుల సాంగ

త్త్వము పొందుతూంటాడు. వారి ఉపదేశములచే మెలకువ పొందు తూనే ఉంటాడు. వాటియొక్క విజ్ఞానసంపత్తితోడ హెచ్చరిక కలవాడై చాలామార్లు నా పదప్రాప్తిని పొందవలెననే మతి కలుగుతుంది.

''మద్భక్తః ప్రతిబుద్ధార్థో మత్ప్రసాదేన భూయసా।
నిఃశ్రేయసం స్వసంస్థానం కైవల్యాఖ్యం మదాశ్రయః॥''
3-27-28

''ప్రాప్నోతీ హాంజసాధీరః స్వదృశాఛిన్న సంశయః।
యద్గత్వా న నివర్తేత యోగీలింగాద్వి నిర్గమే॥'' 3-27-29

నా భక్తుడు ఆత్మానుభవము ద్వారా సర్వసందేహములను దూరము చేసుకున్నవాడై మన్మహతీ కృపచేత నా యాశ్రయమున నుండే కైవల్యమనే పరమమంగళ పదవిని సుగమముగ పొందు తాడు. ఆ స్థానమున చేరి యోగి విడువబడిన లింగదేహుడగుచూ యోగీంద్రుల హృదయములలో నుండు నా దివ్యధామమును పొందు తాడు.

అణిమాద్యష్టైశ్వర్యములు మోక్షానికంతరాయములని భావించి వానియందు ఆసక్తిలేనివాడౌతాడు. నా పాదపద్మముల యందు భక్తిగలవాడౌతాడు. అట్టివాడు మృత్యుదేవతను తిరస్కరించి మోక్షము ననుగమిస్తాడు.

ఇంక ఇప్పుడు యోగలక్షణ ప్రకారములు చెప్పుచున్నాడు.

ఎంతటి బుద్ధిబలముండినను మనస్సును నిర్మలముగా నుంచుకొనే సాధనము చేయవలెను. దానికి యోగాభ్యాస మొకటే మార్గము, ఆ యోగాభ్యాసమును చేయవలసిన ధర్మము లను చెప్తాను. విను తల్లీ!

దానికి స్వధర్మాచరణము తప్పక ఉండాలి. శాస్త్రములో చెప్పబడిన నిషిద్ధ ధర్మ కర్మములను మానుకోవాలి. దైవికముగా తనకు లభించిన ధనముతో సంతోషిస్తూండాలె. మహాభక్తుల పాదపద్మములను పూజిస్తూండాలె. గ్రామ్యధర్మమును వదలవలె. (పరుషములు పలుకుట, శుచిశుభ్రతలను లెక్క చేయకుండుటలు మొదలగునవి గ్రామ్యధర్మములనిపించుకుంటాయి.) మోక్షధర్మ ములయందు మిక్కిలి అభిలాష ఉండవలె. అంటే వైరాగ్యము, శాంతము, భగవత్ప్రాప్త్యాసక్తి మొదలగునవి ఉండవలె. మితము, శుద్ధమునైన ఆహారమును సేవిస్తూండాలె. ఏకాంతమున నుండ వలె. హింస లేకుండుట, సత్యము, అస్తేయము, తనకు కావలసినంత ధనమును మాత్రమే స్వీకరించుటయు, బ్రహ్మచర్యము, తపస్సు, శౌచము, స్వాధ్యాయము, పరమ పురుషుడైన సర్వేశ్వరుని అర్చ నము, మౌనము, ఆసన జయము, దానివలన స్థైర్యము, ప్రాణవాయు వశీకరత్వము, ఇంద్రియనిగ్రహము, ప్రత్యాహారము, మనస్సుచేత ఇంద్రియములను వెనుకకు మరలించి హృదయంబున నిలుపుట యును, వైకుంఠుడైన సర్వేశ్వరుని దివ్యలీలా చరిత్రలను ధ్యానించుటయు, మనస్సును ఏకాగ్రపరచుకొనుటయు, భగవంతు నితో సమానమైన ఆకారమును తన హృదయమున నిలుపు కొనుటయు, ఇంతేగాక ఇతర వ్రతాదుల వలన మనస్సును దూషితముచేయు మార్గములను విడువవలెను. ప్రాణములను జయించి, శుచియైన ప్రదేశమున ఆసనసిద్ధి కలిగినవాడై, మొదట దర్భాసనము, దానిపై జింకచర్మమును, దానిపై శుభ్ర మైన తెల్లని గుడ్డను వేసుకొను నభ్యాసము కలవాడుగ నుండ వలెను. నిటారుగ కూర్చొని ప్రాణాయామము చేయుట, చంచల మైన చిత్తమును స్థిరము చేయుట, తీవ్రమైన యమమును సాధించుటయు, అనగా అహింసా, సత్య, అస్తేయ, బ్రహ్మ

చర్య, అపరిగ్రహము కలవాడై, యోగాంగమును తీవ్రముగ అభ్యసింపవలయును. దాని వలన రజోగుణ దోషము పోతుంది. అగ్నిచేత దోషరహితమైన బంగారమువలె ప్రాణమును జయించి యోగి ప్రకాశిస్తాడు. ప్రాణాయామముచేత వాత పిత్తశ్లేష్మములు భస్మమవుతాయి. ప్రత్యాహారము నభ్యసించుటచేత పూర్వవాసనలు అంతరిస్తాయి. ధ్యానముచేత రాగద్వేషాదులుండవు. ఈ ధ్యానమును నాసాగ్రమును చూచుచూ అభ్యసించవలయును. నాసాగ్రమంటే భ్రూమధ్యమని గ్రహించవలెను.

అట్టి నాసాగ్రమందు భగవంతుని రూపమును ధ్యానించవలెను. పద్మములవంటి కన్నులు, శ్రీవత్సమను పుట్టుమచ్చతో అందమైన వక్షస్థలమును, నీలాకాశముతో, నల్లకలువలతో సమానమైన చామనఛాయ, తుమ్మెదల గుంపులతో వరుస తీరిన ముంగురులు, కౌస్తుభ మణి ముత్యాలహారములు గలిగి, అమూల్యమైన మణికుండలములు, కిరీటము, హారములు, కంకణములు, కడియములు, బాహుపురులు, ఉంగరములు, అందెలు, మొలనూలుతో బిగించిన పటకా ధరించి ప్రసన్నమైన హాసన్ముఖముతో కోటిసూర్యుల దీప్తితో వెలుగొందుచు యోగుల మనఃపద్మములకు సమీపమైయున్న రూపమును ధ్యానించవలయును.

ఇంకను నారాయణు నిట్లు ధ్యానించవలెను. కమలములలోని కేసరముల వంటి రంగు గల పట్టును ధరించినవాడు, శత్రు భయంకరములైన శంఖచక్రములు, గద, పద్మము ధరించిన నాల్గు భుజములవాడు, భక్తుల మోహము పోగొట్టువాడు, ఉత్తమ భక్తుల మనోనేత్రమును వికసింపజేయువాడు, సమస్త సద్గుణములచే నొప్పువాడు, నిత్యయౌవనమున వెలుగొందువాడు, సుందర

మైన ఆకారము కలవాడు, భక్తుల ననుగ్రహించు భావప్రకటన కలవాడు, సమస్త కోరికల నిచ్చు విష్ణువును ధ్యానించవలెను.

ఆయన అనుపమమైన గుణములతో కూడియున్నవాడు; అనఘుడు, నిలబడిన, కదలుచున్న, కూర్చుండిన, శయనించిన రూపములన్నిటిని వాడుగ ధ్యానించవలెను. ఆయన భక్తుల హృదయ గుహాలలో నుండువాడు, సర్వేశ్వరుడు, అనంతుడు. సచ్చరిత్రులచే ప్రశంసింపబడువాడు.

పరిశుద్ధమైన విజ్ఞాన తత్త్వముతో ప్రబోధము జెందిన మనస్సునందు ఆ మూర్తిని నిల్పి ధ్యానము చేయవలెను. ఆ ధ్యానములో చిత్తమును ఆ మూర్తి యొక్క అంగప్రత్యంగములను గమనించుటయందు లగ్నము చేయవలెను.

ఈ ధ్యానమువలన నారాయణమూర్తి వైభవమున చిత్తము లగ్నమగును. వేరే మాటలలో ఆ చిత్తమే నారాయణ మయమగును. మొదట పాదములనుండి ప్రారంభించవలయును. పిమ్మట చీలమండలు, పిక్కలు, మొదలుగాగల ఒక్కొక్క భాగముగా శిరస్సుపైనున్న కిరీటము వరకు ధ్యానించవలయును. ఇట్లు ధ్యానించుటచే హృదయము పవిత్రమవుతుంది. దీనినే మహాధ్యానమంటారు.

భగవంతుని పాదములను మనస్సులో ధ్యానించుకొను విధానమిందు చెప్పబడినది. ఆ పాదములందు హలరేఖ, వజ్రము, అంకుశము, పద్మము, పతాకము, ఛత్రములనే శుభలక్షణములుంటాయి. అందమైన గోర్లు చంద్రకళలవలె ప్రకాశిస్తూ భక్తుల మనస్సులలో నున్న చీకట్లను పారద్రోలుతాయి. కాలి బొటనవ్రేలినుండి పుట్టిన గంగ శివుని జడల నలంకరించుతుంది. ధ్యానము, పారాయణము చేయు జనులయొక్క పాపపర్వతములను వజ్రా

యుధమువలె ప్రబద్దలుకొట్టు మహిమగల పాదపద్మములు ఆయనవి. అవి భక్తుల కోర్కెలను తీర్చును. యోగుల మనస్సులను పద్మములను భ్రమరములవలె నాక్రమించుతాయి. ఇంకను —

"కమలజుమాతయై సురనికాయసమంచిత సేవ్యమానయై
కమలదళాభనేత్రములుగల్గి హృదీశ్వర భక్తి నొప్పు న
క్కమల నిజాంక పీఠమున గైకొని యొత్తు పరేశుజాను యు
గ్మము హృదయారవిందమున మక్కువ జేర్చి భజింపగాదగున్"
3-928

బ్రహ్మదేవునకు తల్లియై దేవతాసమూహముచే సేవింపబడుచున్న లక్ష్మీదేవి పద్మములవంటి నేత్రములతో హృదయమునకీశ్వరుడైన విష్ణునియందు భక్తిగలిగి అతని పాదము లొత్తుచున్న దృశ్యమును మక్కువతో హృదయమందున భావించవలెను.

ఈ విధముగా ఆయనయొక్క దివ్యావయములను గురించి మానస ధ్యానము చేయవలెను. ఆ భగవంతునిపై దత్తచిత్తముతో ఆయనను గురించియు ఆయన అంగ ప్రత్యంగములను ధ్యానము చేయగా చేయగా చిత్తముకూడ దివ్యమవుతుంది. ఈ విధముగా చిత్తము దివ్యమవుతే దానియందు నిత్యానందమే గోచరమవుతుంది.

ఓం సర్వేవై సుఖనస్సంతు.

ఇరువది ఒకటవ రోజు ఉపన్యాసము సమాప్తము.





శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః

# భాగవత రహస్యోపన్యాసములు

## ఇరువది రెండవ రోజు నుండి ఇరువది ఎనిమిదవ రోజు వరకు

## ఉపన్యాసములు

"గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురవే నమః ॥

"హరినామ కథన దావానల జ్వాలల
గాలవే ఘోరాఘ కాననములు

వైకుంఠదర్శన వాయుసంఘంబుచే
దొలగవే భవదుఃఖ తోయదములు

కమలనాభ ధ్యానకంఠీరవంబుచే
గూలవే సంతాపకుంజరములు

నారాయణ స్మరణ ప్రభాకరదీప్తి
దీరవే షడ్వర్గ తిమిరతతులు

నళిన నయన భక్తినావచేగాక
సంసారజలధి దాటిచనగరాదు

వేయు నేల మాకు విష్ణుప్రభావంబు
దెలుపవయ్య సూత ధీసమేత"

"వరగోవింద కథా సుధారస మహావర్షోరుధారా పరం
పరలంగాక బుధేంద్ర చంద్ర! యితరోపాయాను రక్తింప్రవి
స్తర దుర్దాంత దురంత దుస్సహజ సుస్సంభావితానేక దు
స్తరగంభీర కఠోర కల్మష కనద్దావానలం బారునే?"

భక్తమహాశయులారా! భాగవత దత్తచిత్తావధానులారా!

పరమపవిత్రమైన భాగవతము, భగవంతుని అపారమైన అనుగ్రహప్రభావ విశేషము వలననే మనకిట్టి భాగ్యము లభిస్తుంది. మనుష్యుడు సద్గ్రంథములను శ్రవణము చేసినను, అధ్యయనము చేసినను పుణ్యలోకములు ప్రాప్తమవుతాయని పెద్దలు చెబుతారు. అందువలననే గీత, ఉపనిషత్తులను పారాయణము చేస్తూంటారు.

సృష్టి అంతయు భగవంతుని లీలావిలాసము. ఆయనను స్మరిస్తే యీ సృష్టిలోని ప్రతివస్తువు మహాత్మ్యపూర్ణమవుతుంది. ఒక వ్యక్తి "అయ్యా! మామిడిపండు ఎందుకంత తీయగా ఉంది?" అని ప్రశ్నించినాడట. దానికి సమాధానమొక మహాత్ముడన్నాడు. "సోఽయం రామపద ప్రసంగ మహిమాలోకే సముజ్జృంభతే" అంటే ఆమ్రమనే శబ్దములో ర్ + అ + మ్ = రామ్ అనే భగవంతుని నామముంది. అందువలన అది అంత తీపిగా నున్నదన్నాడు. కావున మేఘమును చూచి మేఘశ్యాముడు, కమలమును చూచి కమలలోచనుడు స్మరణకు రావాలి. సామాన్యముగ మనుష్యుని మనస్సు అన్యవిషయగ్రస్తమై ఉంటుంది. అందువలన ఆయన దివ్యత్వము, ప్రతివస్తువులోనూ ఆయనదయ ప్రతి సంఘటనలోను మానవుడు గుర్తించ లేకున్నాడు.

నిరంతరము ప్రపంచమును గురించియు, ప్రాపంచిక వస్తువులను గురించియు యీ మానవులు చర్చ చేస్తూంటారు. విద్యారణ్యస్వాములవారు వేదాంతపంచదశిలో నొకఅద్భుతమైన విషయము వ్రాసినారు. "రాత్రిపూట దొంగ యింటికి కన్నము వేసి లోనికి ప్రవేశించినాడు. నీవు వాడెవడైనది కనుగొన్నావు. వాన్ని పేరు పెట్టి పిలువవద్దు. అట్లు పిలిస్తే వాడు నిన్ను చంపుతాడు. ఊరక తూష్ణీంభావముగా ఉండు." ఇటులనే నిరంతర సంసార చర్చ

నిన్ను జాలములో పడవేస్తుంది. జన్మనే బలిగొంటుంది భగవం తుని కథలు హృత్కర్ణ రసాయనములు. ఆయన కథను శ్రవణము చేస్తే ఆనంద హాస్యోల్లాసములు కలుగుతాయి. జన్మ ధన్యమవు తుంది.

ఆయన "వినుతగుణోత్తరుండు ఉరువిక్రముడు" ఆయన గుణములను, విక్రమములను తత్పర చిత్తముతో శ్రవణము చేస్తే భక్తి జనిస్తుంది. ప్రపంచములోని ప్రజలు లౌకిక వస్తువులపై భక్తి గలిగివున్నారు. ఆ భక్తి "నహి నహి రక్షతి" రక్షించలేదు.

ఒక వ్యక్తి బొంబాయికి పోయి చట్టావ్యాపారము చేసి నాడు. బాగా లాభము కలిగింది. అతడు తన ప్రియమైన భార్యకు ముక్కుకు పెట్టుకునే విలువైన ఆభరణాన్ని తెచ్చాడు. అది పల్లెటూరు. కావున ఇది విచిత్రమైన ఆభరణము. దాన్ని చూచుటకు జనము ఊరిలోని వారందరు కదిలి యీ యింటికి రాబట్టినారు. ఒక సాధు భిక్షానికి వచ్చినాడు. ఎవరు కూడ ఆయన మాట వినిపించుకోకుండా ఆ యాభరణాన్ని చూచుటకు పోవుచున్నారు. ఈ సాధువు విషయము తెలుసుకొని ఆ ముక్కర తెచ్చిన ధనికుని యింటి ముందరికి పోయి విపరీతముగ నవ్వబట్టి నాడట. ఆ వచ్చే పోయే జనులు ఎందుకట్ల నవ్వుచున్నావంటే "ముక్కరను చూచే మీరు మురిసిపోతూన్నారు. ముక్కు నిచ్చిన ముకుందునిపై మీకు మనస్సు లేదే! ఒకవేళ ఆయన ముక్కు నే యివ్వకపోయి యుంటే ఈ ముక్కరకు ఏమైనా విలువ వుండేదా?" అన్నాడట. అందువలన అన్నిటిని ప్రసాదించిన ఆ ఆదిదేవునిపై భక్తి గలిగి ఉండుట ప్రతిమనుష్యుని ప్రధాన కర్తవ్యము.

ఒక మహాత్ముడంటాడు. మానవుడు ధ్యానములో పర మాత్మను గురించి ధ్యానము చేయకపోతే పోనీ, ప్రపంచమును

గురించి దాని భోగములను చేయకుంటే చాలు." ప్రకృతి చింతన మానవుడు భగవంతున్ని గురించి ధ్యానము చేసేటప్పుడు చొచ్చుకొని చొచ్చుకొని వస్తుంది. ఒకడు లోభి ఉండినాడు. ఒక భక్తుని వద్దకు పోయి నాకు పైస ఖర్చు కాకుండా భగవధ్యానము, భగవద్భక్తి చేసే మార్గముంటే చెప్పుమని కోరినాడు. ఆయన యీ మానసిక ధ్యానమార్గము చెప్పినాడు. ఉదయమే ఆ స్వామిని లేపుట. గంగానదికి తీసుకొనిపోయి స్నానము చేయించుట. పీతాంబరాదులను ధరింపజేయుట. తరువాత పాలను చక్కెర వేసి యిచ్చుట మొదలగు మానసిక పూజాంశాలను చెప్పినాడు. ఒకనాడు ఆ లోభి మానసిక ధ్యానములో ఆ కృష్ణునికి పాలలో చక్కెర వేయుటలో రెండు స్పూన్లకు బదులు మూడు స్పూన్లు వేసినాడట. "అయ్యో! ఒక స్పూను వ్యర్థమాయెనే" అని విచారించడం మొదలు పెట్టినాడట. వాని వ్యవహారము చూడండి. కేవలము కల్పనలోనే ఒక స్పూను చక్కెరకు అంత విషాదపడ సాగెనే! నిజముగాగల వస్తువు వ్యర్థమైతే వాని దుఃఖానికి మేర ఉంటుందా? ప్రపంచ వస్తువులతోనూ, ప్రపంచముతోను అంత గాఢమైన సంబంధము పెట్టుకున్నారు మానవులు. పరమాత్మ ధ్యానము లేక పోయినా పరవాలేదు. ప్రపంచ ధ్యానము లేకుండా ఉంటే చాలు. కాని సామాన్యమానవులకు సాధ్యముకాదు. అయితే వారుకూడ ఉద్ధరింపబడాలి కదా! అంటే కపిలదేవుడు చెప్పిన యీ బోధను సర్వులు శ్రద్ధతో విని ప్రపంచధ్యానమును మాని పరమాత్మ ధ్యానము ననుష్ఠించాలె.

కపిలుడేమంటాడో చూడండి.

"సుమహిత ధ్యానమున బరంజ్యోతి యందు
మనము జాల నియోచించి మహిమదనరు

మోక్షపద మాత్మలో నపేక్షసేయు
ననఘ వర్తనుడైన మహాత్ముడెపుడు''           3-940

పరినిష్ఠితమైన ధ్యానములో ఆ పరంజ్యోతియందు మనస్సును నియమించి మహిమాన్వితమైన మోక్షపదమును ఆత్మలో ఆ మహాత్ముడు కోర్తాడు.

కావున ముక్తిని గోరు భక్తుని చిత్తము భగవంతుని కితరమైన వస్తువుల యందు నిలువరాదు. భగవంతుని కన్న మరియొక భావము మనస్సులో శూన్యమై పోవాలి. ఆ స్థితి కలుగుటయే నిజమైన వైరాగ్యము. దానిచే జీవుడనన్యమైన భక్తిని కలిగి ఉంటాడు.

జీవుడు నిరంతరము చిట్ట చివరి లక్ష్యమునే భావిస్తూండాలి. ఇతర విషయముల కతని మనస్సులో తావుండదు. చిత్తవృత్తులన్నియు భగవదంతర్యామిత్వములో ఏకమైపోతాయి. దానితో నిశ్చలత్వము సిద్ధిస్తుంది. సుఖదుఃఖములు వస్తూ పోతూంటాయి. వాటియందు లక్ష్యము పెట్టడు. అంతర్యామిపైననే అతని దృష్టి కేంద్రీకృతమై ఉంటుంది. అట్టితెరి ఆత్మతత్త్వము సాక్షాత్కరిస్తుంది. ఈ యనుభవము కలవాడే జీవన్ముక్తుడనబడ్తాడు. తన శరీర మెట్లున్నది. తనకు స్పృహ యుండదు. కేవల మాత్మతాదాత్మ్యము కలిగి వుంటాడు.

మద్యము త్రాగి యొడలు తెలియనివాడు దేహముపై వస్త్రమున్నదో లేదో చూచుకొనని వానివలె మోక్షస్థితియందుండువాడు తనకు దేహమున్నదో లేదో జ్ఞప్తియందుంచుకొనక ప్రవర్తిస్తాడు. తన శరీరమును కూడ దైవశరీరమని భావిస్తాడు. కనుక దానిని దైవాధీనమని నిర్లక్ష్యముగ ఉంటాడు. అతడు సమాధి యోగముచేత ఆత్మతత్త్వసాక్షాత్కారము కలవాడై

స్వప్నమువలె శరీర వ్యవహారమును భావిస్తాడు. కర్మఫలాను భవము వరకు మాత్రమే భార్యాబిడ్డలతో కూడిన సంసారముం టుంది. ఆ మీాద వీరందరు దూరమగువారే నని తెలిసి వర్తిస్తాడు.

సుతులు, భార్య, మిత్రులు, సోదరులకంటె మానవుడు భిన్నుడై వ్యవహరించుచున్నాడు. నిప్పురవ్వలు, పొగకంటె అగ్ని వేరుగనున్న విధముగనే జీవాత్మ దేహముకంటే వేరుగా ఉంటాడు. పంచభూతములు, ఇంద్రియములు, అంతఃకరణరూపమున మెలగు చున్న యీ ప్రకృతికూడ బ్రహ్మమయమే. అయినను దానికన్న వేరై ఆత్మ ప్రకాశించుచున్నది. అది బ్రహ్మ అనే పేరుతో ద్రష్టగా ఉన్నది. దానియందే ఈ సర్వసృష్టి ఉంది. ఈ సృష్టియందు బ్రహ్మమే ఉన్నాడు.

ప్రకృతియందు, జీవులయందు, పరబ్రహ్మము అంతర్యామిగా నున్నది. పరబ్రహ్మమే యైనను మూడుగా మెలగుచున్నది. అందు రెండవవాడగు జీవుడు ప్రకృతితో గూడి యున్నప్పుడు బద్ధు డనియు, పరబ్రహ్మముతో కూడియున్నప్పుడు పరబ్రహ్మమనిపించు కుంటాడు.

ఈ మూడును జీవ, ఈశ్వర, బ్రహ్మలు వేరుగాదని ఆత్మ తత్త్వముకన్న అన్యమైనది. మరియొకటి లేదని జీవులయందు ఆత్మను చూడవలెను. ఆధారముగ నేర్పడిన దేహములందు వెలుగుచున్న దివ్యజ్యోతి ఒక్కడే యైనను అనేక భావములతో తోచుచున్నాడు. ఇట్లు ప్రకృతి గతుడైన ఆత్మయే దేవతలుగా, నరులుగా, జంతువులుగా, స్థావరాదులుగ నడుచుచూ వివిధములైన ఉత్పత్తి కారణములను కల్పించుకొని గుణముల హెచ్చు తగ్గులచే భిన్నరూపుడుగా గోచరించుచున్నాడు.

ప్రకృతి సదసదాత్మకమైనది. నానా విధమైన నామ రూపాత్మకములతో గోచరించుటచే అసదాత్మకము బ్రహ్మగా తన

కస్తిత్వముండుటచేత అది సదాత్మకము. అంతరాత్మ నిరంతరము సద్రూపకము. సాధకుడు అసదాత్మకమైన ప్రకృతిని తిరస్కరించి భవ్యస్ఫూర్తితో వ్యవహరిస్తాడు. ఈ యాత్మ తన నిజస్వరూపముతో వర్తిస్తుందంటే దేవహూతి అడుగుతుంది.

''మహాత్మా! మహదాది భూతంబులకును, ప్రకృతి పురుషులకను గల్గిన పరస్పర లక్షణంబులను, దత్స్వరూపంబుల నెరింగించితివి. ఇక నీ ప్రకారంబున సాంఖ్యంబునందు నిరూపింపబడునట్టి ప్రకారంబును, భక్తి యోగ మాహాత్మ్యంబును, పురుషుండు భక్తి యోగంబునం జేసి సర్వలోక విరక్తుండగునట్టి యోగంబును, ప్రాణి లోకంబునకు సంసారంబనేక విధంబై యుండు గావున బరాపరుండవై కాలస్వరూపివై యీశ్వరుండవైన నీ భయంబునం జేసి జనులు పుణ్యకర్మంబులు సేయుచుందురవ్విధంబును, మిథ్యాభూతంబైన దేహంబునందు, నాత్మాభిమానంబు సేయుచు మూఢాత్ముండై కర్మంబుల నాసక్తంబైన బుద్ధిం చేసి విభ్రాంతుండగుచు సంసారస్వరూపంబగు మహాంధకారంబునందు జిరకాలప్రసుప్తుడైన జనుని ప్రబోధించుకొఱకు యోగభాస్కరుండవై యావిర్భవించిన యా పుణ్యాత్ముండవు నీవు గావున నాకు నన్నియుం దెలియ సవిస్తరంబుగా నానతియ్యవలయుననిన దేవహూతికి గపిలుండిట్లనియె''.

3–948

కపిలుడు దేవహూతికి భక్తియోగమును దెలియజేయుట.

తల్లీ! జనులయొక్క సంకల్పభేదముల ననుసరించి భక్తి యోగమహిమకూడ పలువిధములుగ ఉంటుంది. అది తామస, రాజస, సాత్త్విక భేదములతో మూడు విధములు.

''సతతహింసాతి దంభ మాత్సర్యరోష
తమములను జేయుచును భేదదర్శియగుచు,

బరగ నాయందు గావించు భక్తిదలప
తామసంబనదగు వాడు తామసుండు.'' 3-944

తామసభక్తుడు సతతము హింస, దంభ, మాత్సర్యము, ఆడంబరము, కోపము, అజ్ఞానము, భేదదృష్టి కలిగి ఉంటాడు.

రాజసభక్తుడు ఇంద్రియార్థములను ప్రావీణ్యముతో పూజిస్తాడు. ఐశ్వర్యము కీర్త్యాదులను కోరి నన్ను భజిస్తాడు.

ఇంద్రియార్థముల ప్రావీణ్యమంటే పూజార్చనలయందు ఆడంబరము విలువగల వస్తువుల నుపయోగిస్తాడు. సుగంధద్రవ్యములు, రుచ్యములైన భోజనములు, చాలా ఖరీదైన కాషాయాంబరాదులు, భక్తికై మధురసంగీతము అనగా అధికమైన విలువ కలవై ఇంద్రియములకు సుఖము గొలుపునవి అని తెలియవలెను.

ఇంక సాత్త్విక భక్తుని విషయము చూడండి.

''అనుపమ పాపకర్మ పరిహారముకై భజనీయుడైన శో
భన చరితుం డితండనుచు భావమునం దలపోసి భక్తిచే
ననితర యోగ్యతన్ భగవదర్పణబుద్ధి నొనర్చి కర్మముల్
జనహిత కారియై నెగడ సాత్త్విక యోగమనంగ జొప్పడున్.
3-946

పాపకర్మ పరిహారానికి భగవంతున్నే భజించవలెనను బుద్ధి కలవాడు, తాను చేసే సమస్త కర్మలు భగవదర్పిత బుద్ధితో చేసేవాడు, పరుల హితమును వాంఛించు కర్మలు చేసేవాడు సాత్త్వికు డనబడ్తాడు

తల్లీ! సాత్వీక స్వభావము కలవారికి నా గుణములను శ్రవణము చేసినంత మాత్రముననే భక్తి జనిస్తుంది. నన్నర్చిస్తూ వారి మనస్సులు ఉత్తమమైన శాంతిని పొందుతాయి. నన్ను స్తోత్రము చేస్తే ఆ సుగుణములు వారియందు ఫలిస్తాయి. వారి మనస్సంకల్ప

ములు అన్నియు,నదులవలె ప్రవహించి సముద్రమున కలిసినట్లు నాయందు చేర్తాయి.

అమ్మా! శ్రేష్ఠము కాని గుణములు నాయందుండవు అందు వలన నన్ను భక్తితో భజించువారు దుర్గుణములనుండి దూరులై వారు సమస్త సద్గుణసంపన్నులౌతారు. వారు నిర్హేతుకముగ నాయందు భక్తిగలిగి వారి జీవితములను నాకు సమర్పిస్తారు.

నిష్కాములైన నా భక్తులకు నా భక్తితో సమకూరని ప్రయోజన మొకటియుండదు. వారికి సాలోక్యము, సార్ష్టిత్వము, సామీప్యము, సారూప్యము, సాయుజ్యములనే ఫలములను కలిగిస్తాను. సాలోక్యమనగా దేవుని దృష్టిలో పడుట, సార్ష్టిత్వమనగా సకల సంపదలు, ఐశ్వర్యములు సమకూరుట. సామీప్యమనగా భగవంతునికి సమీపమున నుండగలుగుట సారూప్యమనగా దేవునితో సమానమైన రూపమును కలిగియుండుట. సాయుజ్యమనగా దేవునితో ఒకటిగా నుండుట. కొందరు సాలోక్యమనగా దేవుని చూచుచుండుట అని చెప్తారు. ఇవి కాక ఈ పదములకు చక్కని సంకేతార్థములివి. సాలోక్యము = దేవుని చూపుతో సమానమైన చూపు కలిగి లోకమును చూచుట. సార్ష్టిత్వము = లోకములోని సంపదలు భగవంతునివి గనుక వాటిని లోకహిత కార్యములయందు సద్వినియోగము చేయగలుగు సామర్థ్యమును పొందుట, సామీప్యము = భగవంతుడు సమస్త దృశ్యాదృశ్య వస్తువుల యందంతర్యామిగ ఉన్నాడని తెలిసి తన దేహమునందును, ఇతర దేహాదులందును ఆయనే భాసించుట. సారూప్యము = ధ్యానమున తన రూపము దేవుని రూపముగ నర్పితమగుట. ఆ రూపమున దేవుడే ప్రపంచరూపమున చరించుచున్నాడని తెలియుట. సాయుజ్యము = తనకు భగవంతునికి భేదమే లేదనియు, ఆయనే యీ యుపాధుల

నుండి పని చేయించుచున్నాడని తెలియుట, ఇట్టి ఫలములను పొందించే భక్తియోగము శ్రేష్ఠమైనది.

తల్లీ! నిత్యనైమిత్తికాది నిజ ధర్మమునందు మిక్కిలి శ్రద్ధ గలిగి ఉండాలి. హరియొక్క సమారాధన క్రియలను నిష్కామముతో చేయాలి. విగ్రహములను దర్శించినపుడు స్తోత్రము, పూజ, వందనము, ధ్యానము చేయాలి. జీవుల దేహములు విగ్రహములనియు, వారియందు గల సద్గుణములను ప్రశంసించవలెను. కర్మలలో సంగబుద్ధి ఉండరాదు. సజ్జన సమూహమును గౌరవించాలి. నీచులను చూచినపుడు జాలిపడాలి. తనతో సమానమైన వారితో మైత్రి కలిగియుండాలి. యమ, నియమాదులతో యోగాభ్యాసము చేయాలి. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనబడు శాస్త్రమార్గములలో సృష్టి రహస్యములను గ్రహింపవలెను. తనకు తెలిసిన విషయాలను శ్రద్ధ గలవారికి తెలుపవలెను.

"హరిగుణమంగళకీర్తన పరుడై తగనార్జవమున భగవత్పరులన్
గరమనురక్తి భజించుట నిరహంకారమున నుంట నిశ్చలుడగుటన్." 3-952

తాను హరిగుణములను మంగళకీర్తనముల ద్వారా గానము చేయుట, ఋజుత్వము కలిగియుండుట, భగవత్పరులను భక్తితో భజించుట, నిరహంకారముతో నిశ్చలుడై యుండాలి.

ఈ విధముగా చెప్పబడినవి భగవదాదేశములుగా భావించి, స్వధర్మపరుడై తన మనస్సును పరిశుద్ధముగా నుంచుకొన్నవాడు పుణ్యాత్ముడౌతాడు. ఇతరములైన ఆధారములను నమ్మవలసిన పనిలేదు. నన్నే ఆశ్రయిస్తే చాలు. నాయందు కల్యాణగుణము లున్నవి. కనుక గాలికి పువ్వుల వాసన ముక్కు దగ్గరికి ప్రసరించినట్లు భక్తిమహిమచే నా కల్యాణగుణములు భక్తులకు ప్రాప్తము లౌతాయి. తల్లీ!

''అనిశము సర్వభూత హృదయాంబుజవర్తియనం దనర్చు నీ
శు నను నవజ్ఞజేసి మనుజుండొగి మత్ప్రతిమార్చనా విడం
బనమున మూఢుడై యుచిత భక్తిని నన్ను భజింపడేని య
మ్మనుజుడు భస్మకుండమున మానక వేల్చిన యట్టివాడగున్.
3-955

సర్వజీవుల హృదయములయందు నే నీశ్వర రూపమున నున్నాను. అట్టి నన్ను అవమానము చేసి నా విగ్రహములను మాత్రము ఆడంబరముగ పూజించువాడు లోకమున మోసగాడు. అంతేగాదు, తన్ను తానే వంచించుకొనుచున్నాడు. అట్టి భక్తి బూడిదలో పోసిన హోమము వంటిదే.

''అబ్జాక్షి! నిఖిలభూతాంతరాత్ముడనైన
నాయందు భూతగణంబునందు
నతిభేదదృష్టి మాయావులై సతతంబు
పాయక వైరానుబంధ నిరతు
లగువారి మనముల దగులదు
శాంతి యెన్నటికైన నేను నా కుటిల జనుల
మానక యెపుడు సామాన్యాధిక
ద్రవ్య సమితిచే మత్పదార్చన మొనర్ప
నర్థి నా చిత్తమున ముదంబందకుందు నను చు
నెరిగించి మరియు నిట్లనియె కరుణ
గలిత సద్గుణ జటిలుడ క్కపిలుడెలమి
దల్లితోడ గుణవతీమత ల్లితోడ.'' 3-956

తల్లీ! సర్వజీవులలో అంతరాత్మగా నున్న నాకును, నాయందున్న జీవులకును భేదము పాటించువారు మోసగాండ్రు. వారితో మైత్రి శాంతికి కారణము కాదు. అట్టి వక్రబుద్ధులుకూడ

నా పూజలు చేస్తూంటారు. వారు నా పాదార్చనలు చేస్తూండినను నేను వారి కార్యములకు సంతోషపడను కొంచెము సేపు మరల కనులు మూసి తల్లితో —

నిర్జీవ విగ్రహములకన్న జీవులు భక్తిసాధనకేవిధముగా శ్రేష్ఠులో చెప్పుచున్నాడు. తల్లీ! రాళ్లు, ఖనిజములు, లోహములు మొదలగు అచేతన వస్తువులకన్న చేతనముగల వృక్షములు శ్రేష్ఠములు. వాటికి స్పర్శజ్ఞానమున్నది, అచేతనములకు లేదు. అందువలననే వృక్షములకు నీరుపోస్తే ఫలములు, పుష్పములిస్తాయి. అచేతనములకు పోస్తే యేమియు ఇవ్వవు. ఒక్క స్పర్శజ్ఞానమే కల వృక్షములకన్న రుచికూడ తెలిసిన జంతువులు శ్రేష్ఠములు. జంతువులు ఆహారపానీయములిచ్చిన మైత్రి కలిగి మేలు చేయును.

ఒకచోట జరిగిన సంగతి. ఒక వ్యక్తి అరణ్యములో పోతూండినాడు. ఒక ఏనుగు కాలిలో పెద్దముల్లు గుచ్చుకొని బాధపడుతూండినది. దారిన పోయే ఒక వ్యక్తి దాని బాధను గమనించి ముల్లును పెరికి వేసినాడు. ఆ ఏనుగు సంతోషముతో వెళ్ళిపోయినది. కొన్ని దినాల కా యేనుగును ఒక రాజు పట్టి దానికి దోషులను త్రొక్కి తొండముతో త్రిప్పికొట్టి చంపే శిక్షను నేర్పినారు. దోషులను శిక్షించే ఆ యేనుగు వద్దకు దోషియై ఒకనాడు కాలిలో ముల్లు తీసివేసిన వ్యక్తి వచ్చినాడు. అతనిపైకి దానిని వదలినారు. అది ఆ మనిషివద్దకు వెళ్ళి తొండముతో మీదికి ఎక్కించికొని కూర్చోబెట్టి అందరిలో తిరగసాగినది. దాని కేమి కారణమని ఆ దోషి నడిగినారు. వాని కథనము ద్వారా నా యేనుగు కృతజ్ఞతను చూపుతున్నదని తెలిసి అందరు ఆశ్చర్యనిమగ్నులైనారు.

ఆ విధముగ చెట్లకంటే జంతువులు శ్రేష్ఠులు. తల్లికి కపిలుడు చెప్పుచున్నాడు. రుచిమాత్రము తెలుసుకొనే జంతువులకన్న

వాసన చూచే కుక్కలు మున్నగు జంతువులు శ్రేష్ఠములు. కుక్కలు దొంగలనుండి తమ యజమానులను రక్షింపగలవు. రెండు పాదములు గల కాకులకన్న నాలుగు పాదములు గల జంతువులు శ్రేష్ఠములు. దానికన్న రెండు కాళ్లున్న మానవులు శబ్ద స్పర్శ రూప రస గంధములను తెలుసుకొనుటలో పరిపూర్ణులు గనుక వీరు శ్రేష్ఠులు.

"తలప బ్రాహ్మణు లుత్తములు వారికంటెను
వేదవేత్తలు వేదవిదులకంటె
విలసిత వేదార్థ విదులు వారికంటె
సమధిక శాస్త్ర సంశయము మాన్పు
మీమాంసకులు మరి మీమాంసకులకంటె
నిజధర్మ విజ్ఞాననిపుణు లరయ
వారికంటెను సంగవర్జితచిత్తులు
దగవారికంటె సద్ధర్మపరులు
ధార్మికులకంటె నుత్తమోత్తముడు వినుము
మత్సమర్పిత సకలకర్మ స్వభావ
మహిమములు గల్గి యితర కర్మములు విడిచి
సమతవర్తించు నప్పుణ్యాతముడు ఘనుడు." 3-960

వారిలో బ్రాహ్మణులుత్తములు. వారికన్న వేదము చదివిన వారు శ్రేష్ఠులు. వేదము చదివిన వారికన్న వాటి అర్థము తెలిసిన వారుత్తములు. వారికన్న వేదమందలి సందేహములను తీర్చునట్టి శాస్త్రము తెలిసినవారు శ్రేష్ఠులు. వారినే మీమాంసకులంటారు వారికన్న స్వధర్మ మాచరించుట తెలిసినవారు శ్రేష్ఠులు, వారికన్న కర్మలంటనివారుత్తములు. వారికన్న చక్కని ధర్మకార్యములు చేయువారుత్తములు. వారికన్న నా పాదము లర్చించువారు శ్రేష్ఠులు. తామెరిగిన సకల ధర్మములను, మంచి

చెడ్డలను నాయందు సమర్పించిన వారు నా భక్తులు. అట్టివారు అందరితోను సమత్వబుద్ధితో వ్యవహరిస్తారు.

"కని సకల భూతగణములు మనమున
నానంద జలధి మగ్నములగుచుఁ
ఘన బహుమాన పురస్సర మనయము
బాటిల్ల వినుతు లర్థింజేయుఁ" 3_962

అట్టివారిని చూచి సకలజీవులు మనస్సులో ఆనందపడుతూంటారు. వారిని గౌరవిస్తూ స్తుతిస్తూంటారు.

తల్లీ! ఈశ్వరుడే జీవరూపముతో ప్రవేశించి ఉంటాడు. జీవస్వరూపముతో ఈశ్వరుడే ఉంటాడు. కావున తనలో కాని ఇతరులలో కాని ఈశ్వరున్ని దర్శించే అపేక్ష ఆత్మజ్ఞానమునకు కారణభూతమవుతుంది. భగవంతుని స్వరూపము ప్రకృతి పురుషుతోడి నానావిధ రూపములుగను, వాటికి అతీతమైన రూపము గను రెండు విధములుగ ఉంటుంది. ఇట్లు జీవులుగా వర్తించుచున్న భగవంతుని రూపము కర్మ విచేష్టితమై ఉంటుంది. ఈ విధముగ కనిపించుటలో భగవంతుడు కాలస్వరూపుడై ఉంటాడు. అట్టి కాలము మహత్తు మొదలైన తత్త్వములకు ఆద్యంతములు చూచేదిగా ఉంటుంది, అది మరణమును కలిగించుటచేత భయావహముగ కూడ ఉంటుంది. కాలరూపుడైన తానే సకలభూతములకు ఆశ్రయుడు, యజ్ఞఫలప్రదాత. అన్నిభూతములకు ఆయన ప్రభువు. ఆ ప్రభువుకు మిత్రుడు, శత్రుడు, బంధువనే భేదము లేదు. ఆ విష్ణువే సకలజనులయందావేశించి అప్రమత్తుడై ప్రమత్తులైన నరులకు సంహారకుడై ఉంటాడు. ఆతని భయముతో గాలి వీస్తుంది, సూర్యుడుదయిస్తాడు. ఇంద్రుడు వర్షిస్తాడు. నక్షత్రాలు ప్రకాశిస్తాయి. చంద్రుడు వెలుగుతాడు. ఆయా కాలఋతువుల ననుస

రించి వృక్ష లతాదులు ఫలపుష్పముల నిస్తూంటాయి, నదులు ప్రవహిస్తాయి. సముద్రములు హద్దులలో ఉంటాయి. భూమి కొండల బరువుకు క్రుంగదు. ఆకాశము సకల జనులకు అవకాశా న్నిస్తుంది. మహత్తత్త్వము జగత్తునకు మొలకరూపమైనది. అది సప్తావరణములతో అంటే మహత్తు, అహంకారము, పంచభూత ములతో స్వదేహమును విస్తరింప జేస్తాయి. బ్రహ్మాదులు జగ త్సృష్టి విషయములో అప్రమత్తులై ఉంటారు. పితరాదులు పుత్రోత్పత్తి చేస్తారు. యముడు మృత్యు సహాయముచేత మారకుడై ఉంటాడు. చరాచరాత్మకమైన ప్రపంచము భగవదధీనమై ఉంటుంది. అని చెప్పి కపిలుడు కొంచెము మౌనమూని మరల చెప్పుటకు ప్రారంభించినాడు.

> "సెజ నిట్టి నిఖిల లో
> కేశ్వరుని పరాక్రమము దెలియ సామర్థ్యం బె
> వ్వరికిని గలుగదు మేఘము
> కరువలి విక్రమము దెలియగా లేని గతిన్" 3–964

ఇట్టి సర్వేశ్వరుని పరాక్రమమును తెలుసుకునే సామర్థ్యము ఎవ్వరికిని కలుగదు. మేఘము గాలి శక్తిని తెలుసుకోజాలనట్లు ఆయన ప్రతాపమెవ్వరును తెలుసుకొనలేరు కదా!

జీవులు సుఖమును కలిగించు వస్తువును కోర్తారు. అది లభించకపోతే మహాదుఃఖమును పొందుతారు. ఇది యంతయు భగవద్విలాసము. ఒక వస్తువు తనను సుఖపెట్టునసే భావములోనే దుఃఖకారణమున్నది. అంతర్యామియైన భగవంతుడు తనలో సుఖస్వరూపుడై యుండగా తానింకొక వస్తువు నుండి సుఖమును కలుగు ననుకొనుట అజ్ఞానము. అదియే దుఃఖకారణము. అది లభింపనిచో ఏడ్వాటము జరుగుతుంది.

"పూని యనిత్యంబులైన గృహక్షేత్ర
పశు ధన సుతవధూ బాంధవాది
వివిధవస్తువులను ధ్రువముగా మది నమ్మి
వరలు దుర్మతి యగువాడు జంతు
సంఘాతమగు దేహసంబంధమున
నిల్చియర్థినయ్యా యోనులందు జొరగ
ననుగమించును వానియందు విరక్తుండు
కాకయుండును నరకస్థుడైన
దేహి యాత్మీయ దేహంబు దివిరి
వదలలేక తనకది పరమసౌఖ్యాకరంబు
గాగ వర్తించు నదియును గాక యతడు
దేవమాయా విమోహిత భావుడగుచు" 3-973

అనిత్యములైన ఇల్లు, పొలము, పశువులు, ధనము, పుత్రులు, భార్య, బంధుబాంధవులనే వివిధ వస్తువులను సత్యములని నమ్మే వాడు దుర్మతి. అట్టివాడు దేహములో నిల్చి ఆయా యోనులందు తిరుగుచూ వాటి భోగములయందు విరక్తుడు కాకుండా ఉంటాడు. నరకరూపమైన దేహములో నుండినను దానిని వదలుట కిష్టపడడు. అది తనకు పరమమైన సౌఖ్యంబు కలిగిస్తుందనే మోహములో ఉంటాడు. అట్టివాడు దేవమాయా భ్రాంతిలో పడిపోతాడు.

"ఘనముగ తనయ వధూపశుధన
గృహ రక్షణమునందు దత్తత్క్రియలన్
మనమున దలపోయుచు దినదినమున్
దందహ్యమాన దేహుండగుచున్" 3-974

ఇంకను భార్యను, పశువులను, ధనమును, గృహమును రక్షించుకొనుటకై తిప్పలు పడుచూ ఇట్లు చేయవలె, అట్లు చేయ

వలెననే ప్రణాళికను వేసుకుంటూ చింతాశ్రమలచే దహింపబడు తూంటాడు.

మోహము చెందిన హృదయముకలవాడై పాపకార్యములు చేస్తూంటాడు. స్త్రీలతో రహస్యార్థములనిచ్చే సంభాషణ చేస్తాడు. అది సుఖమని పొంగి పోతూంటాడు. అల్లే బిడ్డలతో ముద్దుమాటలతో పరవశుడౌతూంటాడు.

ఇంద్రియ పరవశుడై కపటధర్మమున ప్రవర్తించుచూ దుఃఖపడుతూంటాడు. ఆ దుఃఖములోనే సుఖము వస్తుందని దాని యందభిమానుడౌతూంటాడు. ఒక్కొక్కడు తాను సంపాదించిన డబ్బుతో అధికారమును పొంది దుర్మార్గుడై ఇతరులను హింసిస్తూంటాడు. తనవారిని ప్రయత్నపూర్వకముగ పోషిస్తూ సంపాదించిన దానిని తనవారికి కట్టబెట్టి మిగిలినదానినే తానను భవిస్తూంటాడు. తనకు చాలకపోతే దానిని సంపాదించుటకై మరల పాపకార్యాలు చేస్తూంటాడు.

"బలిమిసాలక మందభాగ్యుడై కుమతియై
పూనియప్పుడు క్రియాహీనుడగుచు
దవిలివృథాప్రయత్నములు సేయుచు
మూఢుడై కార్పణ్యమున జరించు
నట్టి యకించనుడగు వానిజూచి
తద్దారసుతాదులాత్మలను వీడు
గడునశక్తుడు ప్రోవగా జాలడితడని
సెగ్గింతు రర్థి కృషీవలుండు
బడుగు ముసలెద్దుబోసిన పగిది నంత,
నతడు నే వెంటలను సుఖంబొందలేక
తాను బోషించు జనులు దన్ దనరబ్రోవ
బ్రతుకు ముదిమియు మిక్కిలి బాధపరుప" 3-979

శక్తిగలిగిన వయస్సులో కామాది వ్యామోహములతో తనవారిని సంతోషింప చేయుటకై ఇతరులను మోసగించి ఉంటాడు. ఇప్పుడు బలములేక మందభాగ్యుడౌతాడు. ఏది చేస్తామన్నను చేతకాదు. క్రియాహీనుడై వృథాప్రయత్నాలు చేస్తాడు. కృపణత్వములో మూఢుడై చరిస్తాడు. ఇట్లు శక్తి లేని వానినిగా భార్యా బిడ్డలు చూచి వీడు తమను పోషింపజాలడని రైతు ముసలెద్దును చూచినట్లు నిర్లక్ష్యము చేస్తారు. అట్టితరి యే మార్గమునందును సుఖము పొందలేక తనచేత పోషింపబడేవాడు తనను పోషిస్తూండగా ముదిమిచేత దీనుడై బ్రతుకుతాడు.

ముసలితనములో వికారరూపుడై బాంధవులు అసహ్యించుకొనుచుండగా చావుకు దగ్గరవై కుక్కవలె ఇల్లు వదలజాలక శరీరము వణకుతూండగా దైన్యజీవితము గడపుతాడు.

మరణమును కలుగజేయు రోగముతో అన్నము జీర్ణము కాక అల్పముగా భోంచేస్తూంటాడు. కన్నులు, ముఖము చాలా వికారముగా మారిపోతాయి. కంఠములో నుండి ఘురఘుర శబ్దము వస్తుంది. బంధుజనుల మధ్యలో పడి అందరు నిర్లక్ష్యము చేయగా కాలపాశవశుడౌతాడు. ఇంద్రియములన్నియు వికలములై పోతాయి. అతికష్టాన్ననుభవిస్తాడు.

మరణకాలములో ఇద్దరు అతిభయంకరులైన యమభటులు వస్తారు. వారు పాశములచే బంధిస్తారు. వీడు మలమూత్రములను భయముచే వదలుతాడు. శరీరము వదలి యాతనాశరీరాన్ని పొందుతాడు. బలాత్కారముగ పీడ్వబడుచు శిక్ష ననుభవించు అపరాధి విధముగ పోతూ మూర్ఛను పొందుతాడు. కుక్కలచేత యాతనాశరీరము తినబడుతుంది. కాలకింకరులయొక్క గర్జనలచే భయకంపితుడై పూర్వకర్మములను చిత్తములో తలుస్తాడు. ఇట్లు

విపరీతములైన యమయాతనల ననుభవించి క్షీణపాపుడై పునర్నర త్వమును పొందుతాడు. ఇట్లు చెప్పి కపిలుడు కొంచెము ఆగి మరల చెప్పుటకుపక్రమిస్తాడు.

ఈశ్వరుడు పునర్జన్మ ఘటకుడు కాబట్టి పురుషునికి జన్మనెత్తే అవకాశాన్ని కలిగిస్తాడు. మొదట పురుషుని గర్భములో మూడు మాసములుండి ఇంద్రియరూపమున స్త్రీ గర్భమున పడి తొమ్మిది మాసములుండి పుడ్తాడు. ఆ వివరమిందు తెలుపబడ్తుంది.

ఒక్క రాత్రి కలిలమవుతుంది ఆ వీర్యము. అంటే శుక్ల శోణితముల ద్రవమవుతుంది. ఐదురోజులకు బుడగవంటి దవుతుంది. పదిరోజులకు పిండమై రేగుబండంతవుతుంది. అటుపైన మాంసపు ముద్దయాతుంది. పిమ్మట గ్రుడ్డువలె పొరలేర్పడుతాయి. ఒక నెలపూర్తి యగుసరికి తల యేర్పడుతుంది. రెండుమాసములకు కాళ్ళు చేతులు మొలుస్తాయి. మూడు మాసములగు సరికి గోళ్లు రోమము లేర్పడుతాయి. ఎముకలు, చర్మము నవరంధ్రములు కలుగుతాయి. నాలుగవమాసమున సప్తధాతువులు, అయిదవమాసమున ఆకలి దప్పులు పుడుతాయి. ఆరవమాసమున మావియందు పొదుగబడుతుంది. తల్లిగర్భమున కుడిప్రక్కన మెదలుచు తల్లిచే స్వీకరించబడిన అన్నపానీయములతో ఆకలిదప్పులు తీర్చుకుంటాడు.

ధాతువులు పెరిగి దేహప్రమాణము పెరుగుచుండగా క్రమముగా స్పర్శాది జ్ఞానములు పూర్వవాసనాబలముచే సమకూరుతాయి. చుట్టూ పరిసరముల అనేక జీవులు తిరుగుతూంటాయి. మలమూత్రాదులకు దగ్గరగా ఉంటాడు కనుక తల్లి శరీరమున రోగాదులున్నచో క్రిములు తిరుగుతూంటాయి. తల్లి దండ్రులు ఆచారము శుచిత్వము నెరుగని పశుప్రవృత్తికల మోటు మనుషులైన గర్భస్థుడైన జీవునకు రోగాదులును, క్రిములుకూడ సంక్ర

మించుతాయి. మూర్ఛాదులుకూడ కలుగుతాయి. తెలివి తప్పుట కూడ సంభవిస్తుంది. తల్లి ఆహారాది నియమముల నెరుగని పశుస్వభావమైన రుచులనుబట్టి ఉప్పు, కారము, చేదు, పులుపు మొదలగు ద్రవ్యముల నెక్కువగా మసాలా ఆహారము తిన్నప్పుడెల్ల గర్భస్థునికి ఒడలు మంటలెత్తుతూంటాయి. ఇంకను పులిసిన పదార్థములను తినునప్పుడు శిశువు దేహము తీవ్రబాధలకు గురియవు చుండును. మావిచే కప్పబడి రక్షింపబడుచున్నను ఒక్కొక్కప్పుడు తల్లి వికృతచేష్టలచేత ప్రేవులలో చిక్కుకుంటాడు. గర్భమున శిరస్సుమోపి ఉంటాడు. ముడుచుకొని పండుకుంటాడు. అవయవములను కదిలించుటకు తావుండదు.

అపుడా జీవునకు దైవదత్తమైన జ్ఞానము కలుగుతుంది. పూర్వజన్మమందు తాను చేసిన దుష్కర్మలు తలపునకు వస్తాయి. పూర్వము చేసిన పాపములకు ఉలికిపడుతూంటాడు. పెద్దగా నిట్టూర్పు విడుస్తూంటాడు. సుఖమనునది ఉండదు.

ఏడవ నెలయందు జ్ఞానము చేష్టలు కలుగును. తన మనస్సునకు అపరిశుద్ధ ప్రదేశమున నుంటినన్న జ్ఞానము కలుగును. దీనితో బాధపడ్తాడు. మలముతోను, క్రిములతోను సోదరుడై ఒక దిక్కున నుండజాలక అటు ఇటు సంచరిస్తాడు. అప్పటినుండి తల్లికి నొప్పులు కలుగుతూంటాయి. అప్పటి స్పందనలతో గాలి కూడిన్లు వణకింపబడుతూంటాడు. అప్పుడు వానికి దేహము వేరుగా ప్రజ్ఞవేరుగా గోచరిస్తుంది. దీనినుండి బయటపడవలెనను తొందర కలుగుతుంది. దేహమందలి సప్తధాతువులు బంధనముల వలె తోస్తాయి. చేతులు ముడుచుకొనియుండుటవలన దేవునికి నమస్కారము మాత్రము చేస్తాడు. పూర్వమున పుణ్యాధిక్యత ఉంటే దైవము, భక్తి, నమస్కారము మొదలగునవి తెలుస్తాయి. గొప్ప విచారముతో "నేనిందెట్లుంటిని? ఎవరివలన నిది జరిగినది?"

అను మనసుపుట్టి దైవముపై భక్తిని పొందుతాడు. అపుడు భగవంతునిట్లని ప్రార్థిస్తాడు.

"నెలకొని బహుదుఃఖములకు నాలయమైన
యీ గర్భనరకము నేను వెడల
జాల బహిఃప్రదేశమునకు వచ్చిన
ననుపమ దేవమాయావిమోహి
తాత్ముండనై ఘోరమైనట్టి సంసార
చక్రమందును బరిభ్రమణ శీలి
నై యుండవలయు దానదిగాక
గర్భంబునందుండు శోకంబు నపనయించి
యాత్మకనయంబు సారథియైన యట్టి
రుచిర విజ్ఞానమునఁ దమోరూపమైన
భూరిసంసారసాగరోత్తారణంబు సేసి
యీ యాత్మ నరసి రక్షించుకొందు." 3-999

చాల దుఃఖములకు నిలయమైనట్టి ఈ గర్భనరకము నేను వెడలజాలను. బయటకు వచ్చిననూ అద్భుతమైన దేవమాయచేత మోహితుడనై ఘోరమైన సంసారచక్రమందు తిరుగుతూండవలసి వస్తుంది. గర్భశోకమును పోగొట్టువాడు, ఆత్మకు సారథియైన విజ్ఞానముచేత తమోరూపమైన సంసారసాగరము దాటి ఆత్మ స్వరూపమును తెలుసుకుంటూ ననుకుంటాడు.

దుర్వ్యసనములకు తావై, గొప్పదుఃఖానికి మూలమై, పెక్కురంధ్రములు గలదై, క్రిములతో కూడియున్నట్టి దుస్తరమైన గర్భవాసములనుండి విడివడుటకై భగవంతా! నీ పాద పద్మములను సేవిస్తానని ప్రార్థిస్తాడు. ఆ విధముగ ప్రార్థిస్తూ జీవుడు బయటికి పోకుండా గర్భములోనే ఉంటాడు. పదియవ మాసమునందు తల క్రిందికి కాళ్ళు పైకి గావించి అక్కడనుండి బయటికి

త్రోయబడుతాడు. రక్తపు ముద్దవలె మలముతో కూడి క్రిందబడి యేడుస్తాడు. జ్ఞానహీనుడు జడుడుబోలె ఉంటాడు. తన అభిప్రాయములను తెలుసుకోనజాలని వారితో వృద్ధిబొందుతూ తన అభిప్రాయములను చెప్పజాలని స్థితిలో ఉంటూ క్రిమి కీటాదులచేత కరువబడుతూ పండుకొని, నవ్వాపెడుతూంటే గోకుకొనజాలక దీనుడై ఉంటాడు. లేచుట, కూర్చొనుటలో అశక్తుడై దోమ, నల్లి, మక్షికాదులు కరుస్తూంటే తాను ఒక క్రిమివలె ఉంటూ రోదనము చేస్తూ జ్ఞానములేనివాడై శైశవమును గడపుతాడు. బాల్యమున చదువు మున్నగు ప్రయత్నములలో కష్టపడుతాడు. యౌవనములో సాహసవంతుడై తాను కోరిన ఫలములను సాధించుటకు కాలము వ్యర్థము చేసుకుంటాడు. పంచభూతమయమైన శరీరమున వర్తించుటచేత పలు మార్లు అహంకారము మమకారము పొందుతూంటాడు. తత్సంబంధములైన పనులలో సంసారబద్ధుడై దుష్టుల సహవాసములోపడి వ్యభిచారమునందు చిక్కుకుంటాడు. అజ్ఞాన పూర్వకములైన కార్యములు చేయుచూ వాటి ఫలము దుఃఖరూపమున అనుభవిస్తూ కాముకుడై నాశమునకు కారణములైన కర్మలయందు ప్రవర్తిస్తాడు. అని కపిలుడు కొంత మౌనమూని మరల చెప్పుచున్నాడు.

తల్లీ! సత్యము, శౌచము, దయ, ధైర్యము, మౌనము, బుద్ధి, సిగ్గు, క్షమ, యశస్సు, ఇంద్రియనిగ్రహము మొదలగు ఉత్తమగుణములు చెడ్డవారిస్నేహమున నశిస్తాయి. అని తెలిపి మరల తల్లితో అంటాడు. మూఢ హృదయులు, శాంతిలేనివారు, దేహాత్మబుద్ధులు, స్త్రీల మోహపాశమునందు కట్టివేయబడిన ఆట మృగములవలె పరవశులై దుఃఖితులై ఉంటారు. అట్టివారి సంగతి మనము ఉపేక్షించవలె. పరస్త్రీ సాంగత్య మద్భుతమై దోషముతో కూడినది. దీనికొక కథ చెబుతాను.

పూర్వకాలమున బ్రహ్మ తన కూతురైన భారతి ఆడ జింక వేషముతో నుండగా తాను మగ జింకయై దానివెంట పరుగిడ సాగినాడు. ఆ కార్యము హేయమని కూడ తలంచక సిగ్గువదలి యీ కార్యమునకు పాల్పడినాడు. కావున స్త్రీ సంగమము వద్దు. అయినను స్త్రీ సాంగత్యమునకు లోకువ కానివాడు లేడు. నా నాభి నుండి పుట్టిన చతుర్ముఖుడే యిట్లు చేసినాడు. వానిచే సృష్టింప బడిన మరీచి, కశ్యపుడు మొదలగువారు, వారిచే సృష్టింపబడిన దేవతలు, మనుష్యులు స్త్రీ నిమిత్తముగా బద్ధులు కానివారు లేరు. మనస్సు దెబ్బతిననివారు లేరు. స్వయముగా భగవంతుని స్వరూప మైన నారాయణ ఋషి ఒక్కడే స్త్రీ సంగమునకు లొంగనివాడు.

"రూఢి నా మాయ గామినీరూపమునను
బురుషులకు నెల్లమోహంబు బొందజేయు
గాన పురుషులు సతుల సంగంబు మాని
యోగవృత్తి జరించుచు నుండవలయు" 3-1006

(అర్థము సులభము) ధైర్యముతో నా పాదకమలములయందు సేవానురక్తి పొందినవారు నారీసంగమము నరకద్వారముగ తమ మనస్సులలో తలంచవలయును.

"హరిమాయా విరచితమై
తరుణీరూపంబు దాల్చి ధర బర్విన బం
ధుర తృణ పరివృతకూపము
కరణి నదియు మృత్యురూపకంబగు మరియున్" 3-1008

విష్ణుమాయచే నిర్మితమైన స్త్రీ యొక్క రూపము పురుషు నకు గడ్డితో కప్పబడిన బావివంటిది. అది మృత్యువును కల్గిస్తుంది.

"ధన పశు పుత్ర వనితా గృహ కారణ భూతమైన యీ
తనువున నున్న జీవుడు పదంపడి యిట్టి శరీరమెత్తి తా

నను గతమైన కర్మఫలమందక పోవగరాదు మింట బో
యిన భువి దూరినన్ దిశలకేగిన నెచ్చటనైన దాగినన్"
3-1009

ధనము, పశువులు, పుత్రులు, మిత్రులు, పుత్రులు, భార్య, ఇల్లు, మొదలగునవన్నియు కారణమైన యీ శరీరమున గల జీవుడు వాటికి సంబంధించిన అనేక కర్మలు చేస్తాడు. ఆ విధముగ చేసి కర్మఫలము నుండి తప్పించుకొనుటకు ప్రయత్నిస్తాడు. వాడు ఆకాశములోనికి పోయినా, భూమిలోనికి దూరినా, దిశలల్లో దాగు కున్నా ఫలానుభవము నుండి తప్పించుకోలేడు.

ఆ విధముగ పురుషరూపము నొంది భోగించిన జీవుడు నిరంతరము స్త్రీ సాంగత్యము, ధనము, సంతానమును పొంది స్త్రీత్వమును పొందుతాడు. నిరంతరము స్త్రీని కోరేవాడు స్త్రీ జన్మ నెత్తుతారని గ్రహించవలయును. ఇట్లు పుట్టిన ఆ స్త్రీ రూప మున నున్న జీవుడు నా మాయచేత కూడుకున్నట్టి పురుషుడు ఆత్మ బంధకారకుడగును. సంసారబంధమే మృత్యువు.

లింగదేహము జీవున కాధారముగ నిలిచియున్నది. లింగ మన గుర్తు. తన నామము, రూపము, బాగున్నది. బాగలేదు అనేవి లింగదేహపు కారణములు. తన్ను గురించి తానెరిగిన స్మృతులన్నియు ఒక ముడివలె ఏర్పడినదే లింగదేహము. దాని వలన పాంచ భౌతిక శరీరమునుండి ప్రజ్ఞ అనేక లోకములలో విహ రిస్తుంది. కూడబెట్టుకొన్న కర్మల ఫలము అనుభవిస్తాంటాడు. ఈ అనుభవములవలన మరల కర్మయందాసక్తి పుట్టుచుండును. జీవునకు మనస్సు, ఇంద్రియములు, పంచభూతములతో నిండిన దేహము సుఖములనుభవించుటకు సాధనమైనను ఆ సుఖాసక్తి వల ననే మృత్యువును పొందుతాడు. ఏ దేహము సుఖముల నిచ్చునో ఆ దేహమే శుష్కించుటయు నశించుటయు జరుగుతుంది.

అడవిలో వేటకాడు జంతువులకు సదుపాయములైన ఆకర్షణాలను సమకూర్చి ఆ జంతువులను చంపుతున్నాడు. అటులనే ప్రాపంచిక సుఖములు మానవున్ని మరణమునకు గురి చేయుచున్నవి. ఈ దేహము తొలగుటయే మరణము. పుట్టుటయే జననము. జీవునకు సకలవస్తు జ్ఞానానికి కన్ను కారణము. కొందరు చూచిన దానిని చూచినంతవరకే గ్రహిస్తారు. మరికొందరు చూచి అనేక విషయములను గ్రహిస్తారు. దేహమువరకే చూడగలిగినచో జనన మరణములున్నట్లు తెలియును. కనుక భయము, లోభము, దీనత అనావశ్యకములు. కంగారుపడ నవసరములేదు. జీవుని వృత్తాంతమును సమగ్రముగా తెలిసి జీవుడు ధీరుడై సంగమును విడుస్తాడు. యోగాభ్యాసముచే వైరాగ్య మార్జించి సక్రమమైన సంపూర్ణ జ్ఞానమును పొంది వర్తింపవలెను. మాయచే నేర్పడిన లోకమున పుట్టి పోవుచుండు దేహాదులయందు ఆసక్తిమాని జీవింపవలెను.

ఇచ్చట నొక విషయము గమనింపదగియున్నది. ఇపుడు చెప్పబడిన జీవుని జననమరణములతో కూడిన సంసారము యొక్క అనుభవము సంగ్రహరూపముగ చిత్రింపబడినది. దీని ద్వారా గర్భనరకము, జరామరణ దుఃఖము మొదలగునవి యన్నియు దుఃఖరూపములుగ చిత్రింపబడినవి. ఇవన్నియు దుస్సాంగత్యము వలనను, అధర్మపూర్వకమైన ఇంద్రియాది వ్యభిచారాదులవలన నేర్పడునవి. ఎట్లు ప్రవర్తించిన యీ జీవితము దుఃఖమయమగునో, ఎట్లు ప్రవర్తించిన ఆనందమయమగునో, వేరువేరుగా తెలుపబడినది. సాంఖ్యము, యోగము, భక్తి సమన్వయించి జీవుడానందమయుడని కేవల పరబ్రహ్మమని బోధింపబడినది. ఆ మార్గమవలంబించినచో నిత్యానందమార్గము లభించును

ఇందు వైరాగ్యము కొరకై స్త్రీనింద చేసినట్లు కనిపించును. అది స్త్రీసంగమమును కూర్చిన నిందయే కాని స్త్రీ నిందకాదు.

సంగమనగా మనస్సొకచోట అంటుకొనుట. సంగములలో స్త్రీ సంగము మిక్కిలి హానికరమని నిరూపింప బడినది. స్త్రీ పురుష సంబంధమైన ఆకర్షణము జీవితములో చెలగాటమువంటిది. అది ప్రజాసర్గమునకే గాని భోగలాలసత్వముకొరకు కాదని తెలియవలెను. ఈ విలువలు తెలియనంతవరకు సంగమును గూర్చి జన్మాంతమువరకు జాగరూకత వహింపవలెను.

చతుర్ముఖుడు సరస్వతి వెంటపడి ఆమెతో క్రీడించెనన్న ఇతిహాసము కేవలము సంకేతము. ఇది వేదవాఙ్మయమునందును కలదు. దీని ప్రయోజనము వేరు. జ్ఞానమునుండి వాక్కును సృష్టించుకొనగా జ్ఞానము ఆ వాక్కు వెంటబడి అందలి శబ్దార్థములుగా క్రీడించెనని దీని పరమార్థము. స్త్రీసంగమునందు హేయబుద్ధి కలిగించుటకు మాత్రమే కవి దీని నచ్చట ఉటంకించెను. స్త్రీ సాంగత్యము తగదని గ్రహింపజేయుటకే యుదాహరణ చెప్పబడినది. చతుర్ముఖుడంతటివాడు కూడ స్త్రీసంగమున పడుతాడని చెప్పుట మాత్రమే ఇందలి పరమార్థము.

కొందరు గృహస్థాశ్రమము నిర్వహించుటకొరకై ధర్మార్థకామములను చక్కగా సాధించుకొని ధర్మమార్గమున కర్తవ్యనిర్వహణ చేయుచూ దానివలన అర్థసంపద లార్జించి కామములను నెరవేర్చుకుంటారు. తమ ప్రయత్నముతో లభించిన స్థితి గతులకు సంప్రీతి పొందుతూంటారు. వేదములయందు నిర్ణయింపబడిన మార్గమున భగవద్భక్తి నభ్యసింపక కేవలము వేదమునందలి దేవగణములను పూజిస్తూంటారు. యజ్ఞ యాగాది క్రతువులను చేస్తూ భక్తితో పితృకర్మల నాచరిస్తూ సజ్జనులై ప్రవర్తిస్తారు. దేవ పితృ కర్మలయందు, శ్రద్ధ గలవారై, సత్కర్మపరులై కోరికలు తీర్చుకొనువారు మోక్షమును పొందరు. ధూమగతి యనబడు చంద్రలోకమును పొందుతారు. తాము జేసిన సత్కర్మముల

పుణ్యము ననుభవించుచు ఆయాలోకములలో ఉంటారు. అనుభవముతో పుణ్యము తరిగి పోతుంది. అపుడు మరల భూలోకానికే వచ్చి తిరిగి జన్మనెత్తుతారు.

సజ్జనులైన వారు శమదమాది గుణ సంపన్నులు. పరహిత చింతులు. సకామముతో సత్కర్మలు చేసేవారు, యోగాభ్యాసము చేసేవారు, తత్త్వజ్ఞాన మభ్యసించువారు అనబడువారిలో మోక్షమును పొందజాలరు. వీరు చేసేది గొప్ప పుణ్యమైన కార్యములే. అయినను సకామముతో చేస్తే మోక్షముండదు. నిష్కామముతో నిట్లు చరిస్తే అపుడు కూడ అందరు శీఘ్రముగా మోక్ష ప్రాప్తిని పొందలేరు. సత్కర్మలచే పుణ్యము కూడబెట్టుకొంటారు. అది అనుభవిస్తే తీరిపోతుంది. ఇట్లుగాక భగవదర్పణముగా వీని నాచరించువారు మోక్షాపేక్షకూడ లేనివారు మోక్షమును పొందుతారు. ఇది తరిగిపోయేది కాదు. సత్కర్మలతో భక్తి యోగమును జతపరచి సమర్పణ బుద్ధితో వ్యవహరించినపుడు మాత్రమే మోక్షము కలుగుతుంది. లేనిచో సత్కర్మలు సుఖమునిస్తాయి. ఆ సుఖము చంద్రలోకమునకు సంబంధించినది. అంటే పెరుగుట తరుగుట అనే కళలు గలది. చంద్రుడు మనస్సున కధిపతి కనుక వారు పొందునవి మానసిక సుఖములు.

మోక్షమార్గమును అర్చిర్ మార్గమనియు, పుణ్యలోకముల మార్గమును ధూమ్రమార్గమనియు శాస్త్రములు చెప్పుచున్నవి. అర్చి అనగా వెలుగు. ధూమమనగా పొగ. మోక్షమార్గము వెలుగుదారి. భోగమార్గము పొగదారి. కాష్ఠము కాలుచున్నప్పుడు భస్మము, పొగ, మంట వ్యక్తమగును. భస్మమువంటిది భౌతిక సృష్టి, పొగవంటిది మానసిక సృష్టి, మంటవంటిది ఆత్మ. దానికేదియు అంటదు. దాని నంటినది భస్మమవుతుంది.

ఏ వస్తువైనా తగులబడుట అనగా స్థూలమునుండి సూక్ష్మ మునకు ప్రయాణము చేసినట్లు. పరమాత్మయందు మాయావశ మున సూక్ష్ముడైన తాను స్థూల స్థూలముగ దిగివచ్చి భౌతిక సృష్టి యగుట, స్థూల తత్త్వములు జీవుని మార్గమున సూక్ష్మ సూక్ష్మముగా ఆత్మమయములగుట నిరంతరము జరుగుతూంటుంది. ఆత్మయే దిగివచ్చి సృష్టి యగుచున్నది. సృష్టియే ఆరోహణ చేసి పరమాత్మయందు లయమగుచున్నది. ఇట్లు సృష్టిలో దిగివచ్చు దారి ఒకటి, ఎక్కిపోవు దారి ఒకటి ఉన్నాయి. మొదటి దానిని కృష్ణగతి యనియు, రెండవ దానిని శుక్లగతి యనియు చెప్తారు. ఇవియే ధూమ్రమార్గము. అర్చిర్ మార్గము. మన మెరిగిన సృష్టిలో ''నిప్పుమంట, వెలుతురు, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము ఊర్ధ్వగతులు, పొగ, చీకటి, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము, అధోగతులు.'' ఇవి గీతలో చెప్పబడియున్నవి. కృష్ణగతివలన జీవుడు గర్భస్థుడగుచున్నాడు. శుక్లగతివలన విమోచనము చెందుచున్నాడు. వీనిని చక్కగా తెలుసుకొని వివేకముతో జీవితము గడపువారు పుణ్యజన్మ నెత్తుటకు తిరిగి వచ్చుటకాని, రాకండా మోక్షమార్గమును జెందుటగాని జరుగుతుంది.

చంద్రుడు పితృలోకముల కధిపతి. పితృదేవతలు మనలో చంద్రలోకమున పని చేస్తూంటారు. అనగా మనస్సునందును, స్త్రీ పురుష సంబంధమునందును, గర్భధారణము, పిండోత్పత్తి దేహనిర్మాణమునందును పని చేస్తారు. పితృకర్మల నాచరించి వేదోక్తముగ పితృదేవతల నారాధించుట యనగా సక్రమమైన గృహస్థాశ్రమమున సత్సంతానమును కనుట అని తెలియవలె. ఇట్టి సుఖములకై వేదోక్తకర్మ లాచరించువారు చంద్రలోకములో ఉంటారు. నిష్కాములై భగవదర్పణముగా అవే వేదోక్త కర్మలను

ఆచరించినవారు గృహస్థులైనను, సంతతిని పొందినను సూర్య మార్గములో సూర్యమండల భేదనము చేయుదురు. అనగా మోక్షమును పొందుతారు. దీనికి కావలసినది నిస్సంగత్వము.

అనంతభోగి అనగా ఆదిశేషుని శయ్యపై హరి నిద్రాళువై ఉన్న సమయములో లోకములన్నియు విలయము చెందుతాయి. అట్టి సర్వేశ్వరున్ని భజించేవారు కొందరు.

వారు శ్రేష్ఠమైన భక్తిచేత పరమేశ్వరు పాదపద్మముల యందు తమ చిత్తము నుంచినవారై, శాంతస్వభావులై, సంగమును వర్జించి, శుద్ధమనస్కులై నిరంతరము పరమాత్మనే చింతిస్తూ అన్ని కార్యములయందు పాల్గొనకుండా ఉంటారు.

వారు అహంకార మమకారములు లేనివారై అర్చిరాది మార్గమున లభ్యుడగువాడును, మహనీయ చరితుండును, విశ్వమునంతయు వ్యాపించినవాడును, జగత్తును పుట్టించి, పెంచి, లయము చేయువాడు, అవ్యయుడు, సర్వాధారుడు, పురుషోత్తముడు, పుండరీకాక్షుడు నగు సర్వేశ్వరున్ని పొందుతారు. వారిని కపిలుడెట్లు చెప్తాడో చూదుడు.

> 'మానితా పునరావృత్తి మార్గమైన
> ప్రవిమలానంద తేజోవిరాజమాన
> దివ్యపదమున సుఖియించు ధీరమతులు
> మరలిరారెన్నటికిని జన్మముల బొంద'' 3-1017

వారు తిరిగిరాని మార్గమున ఆనంద తేజస్సులతో కూడుకున్న దివ్యమార్గమున సుఖిస్తూంటారు. వారు మరల జన్మల నెత్తరు.

కొందరు దేవుడని హిరణ్యగర్భున్ని సేవిస్తారు. దేవుని యీ సృష్టియందంతర్యామిగా మాత్రమే సేవించుచూ దీని కతీతుడగు పురుషోత్తముని కొలువనివారు వారు. వారు సత్యలోకమునందు చతుర్ముఖుని పరమాత్మగా ధ్యానిస్తారు ఆ చతుర్ముఖుడు

రెండు పరార్ధములు పూర్తియౌతూనే ప్రళయమును పొందు తాడు. అంతవరకు వారు బ్రహ్మయందుంటారు. బ్రహ్మలయ మగుటతో పంచభూతములు, మనస్సు, ఇంద్రియములు, తన్మాత్రలు, వాని లోకములు కూడ సర్వేశ్వరుని యందు లీనమవు తాయి. అపుడు వారు బ్రహ్మలోకముపై అభిమానము వదలి బ్రహ్మతో గూడి పురాణపురుషునిలో ప్రవేశించి లయమవుతారు. సృష్టిలో అంతర్యామిగా నున్న దేవుని మాత్రము పూజింపగల వారు సృష్టియు, సృష్టికర్తయు లీనమగు వరకు ప్రజ్ఞామయులై ఉంటారు. అటుపైన నారాయణుని యందు లీనమవుతారు.

కనుక తల్లీ! నీవు సర్వజీవుల హృదయపద్మముల యందు విరాజమానుడై యుండు పరమేశ్వరునే సర్వభావములతో శరణు పొందుము. అతడన్ని యెడలను నీకు దర్శన మిస్తాడు. ఆయన శ్రుతానుభావుడు. అంటే వాక్కు నుచ్చరించి విన్నచో వాక్స్వరూపుడై వినబడుతాడు. అందరి కంఠధ్వనులలో శబ్దబ్రహ్మ స్వరూపుడై తన్నుచ్చరించుచున్న మూర్తిగా దర్శన మిస్తాడు. ఆయన కళంకరహితుడు, నిరంజనుడు, రెండవది లేనివాడు. అతనినే శరణు పొందుమంటాడు కపిలుడు.

స్థావరములకు, జంగమములకు కూడ అంతర్యామియై శబ్దబ్రహ్మమైన వేదస్వరూపుడై అన్నింటికి అతీతుడై యున్న సర్వేశ్వరుని భజింపుము. యోగులు, సనకసనందనాదులు, సిద్ధులు, మునులు, దేవతలు, వానినే పూజిస్తారు. యోగాభ్యాసము పొంద దగిన పరముడు అతడే. తాను సగుణమూర్తియై యిన్నికోట్ల రూపములతో దర్శనమిచ్చుటలో అర్థమేమి? తనను దర్శింపమనియే అర్థము.

అతడే ఆయా కాలములయందు తన మహనీయ గుణముల కలయికచేత యిన్నిరూపములుగ దిగివస్తూంటాడు. అతడే యీ

ఋషులుగా, దేవతలుగా, రూపములు ధరించి సముచితములైన కర్మలు నిర్మింపగా అందలి ఋషులు, దేవతలు, ఆ కర్మలనే ఆచరించి అతని మహిమలనే పొంది ఆ మహిమల వలన తమ తమ పదవులను అలంకరించి సృష్టికధికారము వహించి, తమ పనులు నిర్వర్తించి తిరిగి వానిలోనికి వచ్చిచేరుచున్నారు.

మరి కొందరు తమ కర్మముల నాచరించుటలో మనస్సు నిలిపి, శ్రద్ధతో ఆ కర్మలను తమవిగా ఆచరించి, నిషిద్ధములైన కర్మలు మాని ప్రవర్తిస్తున్నారు. వారికి తమ నిత్యనైమిత్తికాచారములయందు శ్రద్ధ ఎక్కువగా ఉంటుంది.

కొందరు సకాములై ఇంద్రియ జయము లేనివారై తల్లి తండ్రులను, పితృల నెల్లప్పుడు పూజించుచూ గృహాసక్త మనస్కులై వర్తించి త్రైవర్గిక పురుషులని చెప్పబడుతారు. త్రివర్గ జీవులంటే ధర్మార్థ కామములను సమన్వయించుకుంటారు. మోక్షమును వారెరుగరు. ఇది సరికాదు.

> "వినుత గుణోత్తరుండు గురు విక్రముడైన హరిం భజించి త
> న్మనన లసత్కథామృతము మానక గ్రోలుట మాని దుష్కథల్
> విని ముదమందుచుందురు వివేక విహీనత నూరబంది యా
> త్మను మధురాజ్యభక్ష్యముల వీడి పురీషము కేగు చాడ్పునన్"
> 3_1020

గుణశ్రేష్ఠుడు సమస్త శక్తి సమన్వితుడు నగు భగవంతుని భజించి ధ్యానించి, వాని కథామృతమును త్రాగుట మాని లోకాభిరామాయణమైన దుష్కథలు వింటూ సంతోషపడ్తారు. వారి వ్యవహారమెట్టిదంటే పంది ముందర పంచభక్ష్య పరమాన్నములు తెచ్చిపెట్టితే దానిని తినక అది మలమ్మువైపు పోవునటువంటిది. లోకము మాయామయము. అనేకములైన ప్రసంగా

లుంటాయి. వాటితో మనకేమి పని అనుకొని భగవత్కథామృత మును గ్రోలువారు యీ లోకములో శ్రేష్ఠులు. అట్లు కాని వారా పందితో సమానులు.

తల్లీ! ధూమమార్గమున వెళ్ళినవారు పితృలోకమును పొంది ఆ పుణ్యము అక్కడ ఖర్చైతే మరల వారు తమ పుత్రులకు పుత్రులై పుడ్తారు. గర్భనరకము మొదలు యమనరకము వరకును అనుభవించి మరల కర్మఫలాను సారముగ జనన మరణ చక్రప్రవాహములో తిరుగుతూంటారు. కావున —

"విను సర్వభావముల బరముని
ననఘు ననంతు నీశుపురుషోత్తము న
న్మనమున భజియింపుము ముదమున
బునరావృత్తిలేని ముక్తి లభించుఁ!" 3-1022

సర్వభావములతో పురుషోత్తముని ధ్యానించుము. జనన మరణములు లేని స్థితి ఈ మార్గము చేత లభిస్తుంది. వాసుదేవుని యందు అభ్యసించే యోగముచేత భక్తి యోగముచే బ్రహ్మ సాక్షాత్కార సాధనములైన వైరాగ్యజ్ఞానములు కలుగుతాయి. వైరాగ్య జ్ఞానములకన్న బ్రహ్మసాక్షాత్కారమునకు వేరు సాధన ములు లేవు. భక్తితో భగవంతునికి సమర్పింపబడిన చిత్తము ఇంద్రియ వృత్తులయందు సమముగా వర్తించును. అది కలవానికి హెచ్చుతగ్గులు లేవు. ఇష్టానిష్టములుండవు. తానన్న నేమో తనకు తెలిసి ఆ తెలివియందు తానుండును. పరబ్రహ్మము జ్ఞాన స్వరూపుడు. ఈశ్వరుడు పరమ పురుషుడు. ఆయన ఏకరూపము కలిగియుండియు చూచువాడు, చూడబడునది, చూచునట్టి ఇంద్రి యములు సమ వివిధత్వములను పొందుచున్నాడు. ఇందలి ఏకత్వము యోగవిద్యచే యోగికి లభించును. వాని ఇంద్రియ ములు తమ లక్ష్యమునుండి వెనుకకు మరలును. అపుడు త్రిపుటి ఏకమగును.

అట్టి పరబ్రహ్మమే మనస్సుయొక్క కదలిక వలన శబ్దము, స్పర్శము, మొదలగు ధర్మములుగా ప్రసరించుచున్నది. అది అహంకారమున నెట్లు తోచునని అడిగితే అహంకారము త్రిగుణములచేత మూడు విధములు. అవియే సత్త్వ, రజస్తమస్సులు. ఆ ప్రజ్ఞయే పంచభూతములుగా అయిదు రూపములు ధరించును. ఇంద్రియముల రూపమున పదునొకండు విధములుగా భాసించును. ఇట్లు అహంకారమే నానాత్వము జెందుచున్నవి. దీనితో కూడినవాడే జీవుడు. ఇట్టి జీవులతో కూడినవాడే విరాట్పురుషుడనబడును. ఇట్టి స్వరూపమే ఒక అండమనబడును. అదియే మనకు జగత్తుగా తోచుచున్నది. దీనియందు గల నానాత్వ భ్రాంతి తొలగుటకై అంతర్యామి భావన చేయవలె. యోగాభ్యాసమును జోడించవలె. శ్రద్ధారూపమైన భక్తిని ప్రయోగింపవలెను. వీటిచే నిస్సంగిత్వము కలుగును. అపుడు వైరాగ్యము లభించి సమస్త స్వరూపుని సమగ్రముగా దర్శింపగలడు. అమ్మా! నీవు పెద్దలచే గౌరవింపదగిన ప్రవర్తనగల దానవు కనుక దీనిని సమగ్రముగ విప్పి చెప్పితిని. సర్వవిధములైన యోగసాధనలచేత పొందదగిన పరమాత్మ నిర్గుణ పరబ్రహ్మమని చెప్పితిని. నాయందు భక్తితో సర్వము సమర్పణ చేయమని చెప్పితిని. ఇందు మొదటిది జ్ఞానయోగము. రెండవది భక్తియోగము. పరిణామమున రెండును ఒకటే.

అన్ని శాస్త్రములు చదివినను, యజ్ఞములు చేసినను, జపము, తపము, అధ్యయనము, యోగసాధన చేసినను, దాన ధర్మాలు చేసినను భగవంతుడు కనబడడు. ఇంద్రియములను తన స్వాధీనములో నుంచుకొని సకల కర్మలు, భగవదర్పిత బుద్ధితో చేయుచూ, ఆత్మతత్త్వము నెరిగి, వైరాగ్యమభ్యసించి, సర్వ కర్మల ఫలము నాకర్పణముచేసి చరించు పురుషుడే సకల కల్యాణ గుణములచే నొప్పు శ్రీహరియైన పరమాత్మను పొందుతాడు.

తల్లీ! నీకు నాలుగు విధములైన భక్తి యోగములను వివరించితిని. ఆర్తితో బాధల నుండి విముక్తికై అభ్యసించు భక్తి, కారణములను దెలుసుకొన గోరిన భక్తి, ప్రయోజనముల కేర్పడిన భక్తి, జ్ఞానభక్తి అనునవి నాలుగు భక్తులు, నా సంకల్పము జీవులయందు సృష్టి, స్థితి, లయరూపములుగా ఉంటుంది. అవిద్యచే పుట్టిన కర్మలచే నిర్మించుకొనిన జీవుని మార్గము లనేక విధములుగా ఉంటాయి. జీవాత్మ అవిద్యయందు కర్మయందు ప్రవర్తించి తన స్వరూపమెట్టిదో తెలియక వ్యవహరిస్తూంటాడు. ఇది సాంఖ్యయోగ ప్రకారము మిక్కిలి రహస్యమైన విషయము. దీనిని దుష్టునకు నీతి లేనివానికి, దురాచారునకు, అర్థము చేసుకొన లేనివానికి, డాంబికునకు, ఇంద్రియ లోలునకు చెప్పకూడదు. భార్యాబిడ్డలు, ఆస్తిపాస్తులు మొదలగు వానికై ఆసక్తితో తిప్పలు పడేవానికి చెప్పి లాభము లేదు. భగవద్భక్తి లేనివానికి, భక్తులను ద్వేషించువానికి చెప్పరాదు.

శ్రద్ధ, భక్తి, వినయము, సర్వభూతదయ, శాంతచిత్తము కలవారికి చెప్పవచ్చు. అసూయ లేనివారికి, శుశ్రూషయందు ఉత్సాహపడువారికి మాత్సర్యము లేనివారికి చెప్పవచ్చును. ఇతర స్త్రీలకై ఆశపడనివారికి, ప్రేమగలవారికి వివరించి చెప్పవలయును. నా భక్తులయందు ప్రేమగలవారికి ప్రేమతో చెప్పాలి. ఈ విధమైన వారీవిద్య కధికారులు.

శీలవంతుడైన పురుషుడుగాని, పతివ్రతయైన ఉత్తమ స్త్రీగాని, శ్రద్ధాభక్తులు గలిగి, మనస్సు నాయందు సన్న్యసించి దీనిని విన్నను, చదివినను నా దివ్యస్వరూపమును పొందుతారు. స్త్రీలు బ్రహ్మవిద్యకు, యోగాభ్యాసమునకు, వేదము చదువుటకు అర్హులు కాదనునది అసత్యమని ఋజువైనది.

ఈ వృత్తాంతము జెప్పి మైత్రేయుడు విదురునితో అంటాడు. ఇట్లు కర్దముని భార్య దేవహూతి మోహమునుండి విమోచనము పొంది కపిలునకు సాష్టాంగ ప్రణామము చేస్తుంది. అతని నిట్లని స్తోత్రము చేస్తుంది.

నారాయణుడను పేరుగల దివ్య మంగళ మూర్తియగు నీ రూపమునందు ఇంద్రియార్థములు, ఇంద్రియములు, మనస్సు పంచభూతములు, సృష్టికి విత్తనములైన త్రిగుణములు, వాని వాని ప్రవాహరూపమైన కాలము భాగములై యున్నవి. ఇట్టి నీ రూపమును సాక్షాత్కరింప జేసుకొనలేక నీ గర్భమున బుట్టిన చతుర్ముఖుడే ఎట్టకేలకు మనస్సున దర్శించెను. ఈ విశ్వమును భరించుటలో అనేక శక్తుల వర్గములను తన మనస్సున సృష్టించుకొని, కొన్ని వేల శక్తులతో కూడియున్నవాడై అతడు సర్వసృష్టి కార్యములను నెరవేర్చుచున్నాడు.

మహాకల్పమనెడు పెద్ద యుగము చివర నీవు కపటరూపమున శిశువై గర్భమున సమస్త జగముల నిముడ్చుకొని, మహా సముద్రము నడుమ చక్కని వటపత్రమను శయ్యపై నిలుచుంటివి. ఆ విధముగ పవళించి, నీవు నీ కాలి బొటనవ్రేలి నుండి వెలువడిన అమృతము గ్రోలితివి. నా పూర్వపుణ్యము వలన నా గర్భమున పుట్టితివి. అమృతమనగా ఆద్యంతములు లేనిది. సృష్టికి నారాయణుడు ఆదియు, అంతములైనా ప్రళయమున శిశువై యున్నాడు. అంతమగు కాలివ్రేలిని ఆదియను నోటియందుంచుట అమృతత్వమునకు సంకేతము.

పాదాంగుష్ఠమున వెలువడిన గంగ యనగా నాకాశగంగ, అది మేఘరూపమున భూమికి వర్షించి, ఆవిరి రూపమున మేఘమున కెక్కుచున్నది. ఇది ఆయన నారాయణత్వమనబడు అనా

ద్యంతతత్త్వమునకు చిహ్నము. నారమనగా జలము. అయన మనగా మార్గము నారాయణమనగా జలముల దిగివచ్చు మార్గము.

అట్టి నీవు వింత వింతల నీ విగ్రహములను నిర్మించి మా కొసగుటకు పరవశపడుతూన్నావు. రఘురాముడు, కృష్ణుడు, వరాహమూర్తి, నారశింహుడు మొదలగు విచిత్రములైన మీ అవతారములను మా ధ్యానముకొరకై ప్రసాదించితివి. ఆ మూర్తులతోనే నీవు దుష్టశిక్షణమును, శిష్టరక్షమును కలిగి వర్తించుచున్నావు. చక్కని ధర్మమునందు నిష్టగలవానికి, వర్ణనీయములైన నీ నాలుగు తత్త్వముల విజ్ఞానమును ప్రసాదిస్తావు. నీ మహత్త్వము వర్ణించుటకు బ్రహ్మకైనా అలవికాదు. వేదములు కూడ వర్ణింపలేవు. నే నెంతదానను ? నీ మంగళనామ స్మరణముననూ, కీర్తనముననూ, హీనులుకూడ శ్రీమంతులౌతారు. అగ్నిష్టోమము మొదలగు యజ్ఞము చేసినవారికన్న శ్రేష్ఠులగుదురు.

"నీ నామము శ్వపచుండైనను జిహ్వాగ్రమందు నను సంధింపఁ
వానికి సరి భూసురుడుం గానేరడు చిత్రమిది జగంబులయందున్"
3-1035

చండాలుడైనను నీ నామాన్ని తన జిహ్వాగ్రమునందు అనుసంధానము చేసిన వాడైతే, వానికి బ్రాహ్మణుడు కూడ సాటిరాడు. ఇది చిత్రము.

"ఈ విధమాత్మలం దెలిసి యెప్పుడు సజ్జనసంఘముల్ జగ
త్పావనమైన నీ గుణకథామృత మాత్మల గ్రోలి సర్వతీ
ర్థావళి గ్రుంకినట్టి ఫలమందుదు రంచును సర్వవేదముల్
వావిరి బల్కు గావునను వారలు మాన్యులు ధన్యులుత్తముల్"
3-1036

నిన్ను తెలిసిన సజ్జనులు జగత్పావనమైన నీ గుణకథామృతమును గ్రోలినచో సర్వతీర్థములయందు స్నానము చేసిన ఫలితమును

పొందుతారు. వారి నోట సమస్తవేదములను చదివిన ఫలితము పొందుతారు. అట్టివారే పూజ్యులు, ధన్యులు.

పరమాత్మా! నీవు పరబ్రహ్మవు. అంతర్ముఖమైన మనస్సున గోచరించువాడవు. సమస్తజనుల పాపములను నివారించుటకై వారిలో స్వయం ప్రకాశమూర్తిగా నున్నావు. వేదస్వరూపుడవు. అట్టి నీకు నమస్కారము. అని దేవహూతి స్తుతింపగా కపిలుడు కరుణార్ద్రహృదయుడై తల్లితో అంటాడు.

అమ్మా! సుఖరూపము మోక్షదాయకమునగు నీ యోగ మార్గమును నీకు వివరించితిని. దృఢమైన భక్తితో దీని ననుష్ఠింపుము. నీకు జీవించియుండగనే ముక్తి కలుగుతుంది. ఇష్టము లేని వారికి దీనిని బోధింపజూచినచో మృత్యుభయము కలుగును. సుఖము దూరమవుతుంది. ఈ విధముగా కపిలుడు దేవహూతికి వినిపించెనని చెప్పి విదురునితో మైత్రేయుడు పలుకుతాడు.

ఇట్లు కపిలుడుపదేశించి వెళ్ళిపోతాడు. అతని యోగమార్గమున జ్ఞానము పొందియూ దేవహూతి కపిలుని ఎడబాటు సహింపలేక పోతుంది. ఇట్టి పుత్రుని ప్రసాదించిన కర్దముని స్మరిస్తుంది. కాని మనస్సు నిలువదు. దూడ కనిపింపని గోవువలె తల్లడిల్లుచూ కపిలుని తలంచుకుంటూంటుంది. ఆ స్మరణలో తన భర్త సాధించి పెట్టిన ప్రదేశములను పరిత్యజిస్తుంది.

పరిమళభరితమైన పుష్పములతో, పండిన తియ్యని ఫలములతో, చిగుళ్ళతోనిండిన వనములను, కాపునకు వచ్చిన మామిడి తోటలను, ఆ వృక్షములపై ఆలాపించుచున్న చిలుకల యాలాపములను కలిగిన కర్దముని ఉద్యానములను, తపోవనమును, పద్మములతో గూడిన కొలనులను పరిత్యజిస్తుంది.

కర్దముడు భార్య సుఖమునకై సాధించి పెట్టిన చక్కని భవనమున్నది. అందు స్ఫటికముల స్తంభములు, మరకతముల

గోడలు, జాతివజ్రముల గవాక్షములు, నీలమణుల మెట్లు, చంద్ర కాంతశిలల వేదికలు, రత్నములు తాపిన బంగారు తలుపులు, విశాలమైన శాలలుగల ఆ భవనము శోభించుచున్నది. పాల నురుగుల వంటి ఏనుగు దంతముల కోళ్ళతో చేయించిన మంచము లున్నవి. తళుకుగల పట్టు పాన్పులున్నవి నట్టింట్లలో బంగారు పీటలున్నవి. దేవహూతి ఇట్టి భవనమును త్యజించింది.

ఆవరణలో దొరువులున్నవి. అందువిచ్చిన కలువల, తామర పూల వాసనలతో మందమారుతుడు విహరిస్తూంటాడు. తమ్మి పూలలోని తేనె త్రాగి మదించిన తుమ్మెదల ఝుంకారములు వినిపించుచుండినవి. ఒకనాడు ఇంద్రలోకమునందలి సుందరీజనము అచ్చటికి దిగివచ్చి ఆమెకు పరిచర్యలు చేసియుండిరి. ఇట్టి సమస్త వైభవములను సన్న్యసించి దేవహూతి తన వంపులు తిరిగిన ముంగురులను జడలు కట్టించుకొని సరస్వతి నదియందును, బిందుసరము నందును మూడు వేళల స్నానముచేసి ఉగ్రతపస్సు చేయసాగెను. దేహము శుష్కించెను. కుమారుని ప్రసన్నవదనముపై దిగులు చెందినదై కపిల నామముచే నారాయణ ధ్యానము చేయుచూ భక్తి యేరులై ప్రవహింపగా వైరాగ్యము కలిగెను. అనుష్ఠానమున మనస్సు నిర్మలమై బ్రహ్మజ్ఞానము సిద్ధించెను.

ఆత్మలకు నాయకుడు, అన్నిదిక్కుల ముఖములు కలవాడు మాయాంధకారము పోగొట్టువాడైన పరబ్రహ్మమునందు నిష్ఠ కుదిరెను. తత్త్వజ్ఞానము ప్రకాశించినది. జీవత్వము తొలగి పోయి నిర్మల పరబ్రహ్మ సమాధి సిద్ధించినది. పునరావృత్తి లేని గతి కలిగినది.

కలలో కనిపించిన వస్తువులను మెలకువలో చూడలేని మనుష్యునివలె దేవహూతి తన అస్తిత్వమును మరచినది. పొగ లేని అగ్నివలె వెలిగినది.

యోగశక్తిచేత దేహము నుండి ఆకాశములోనికి ఎగిరి దయామయుడైన వాసుదేవుని పదముల యందు హృదయమును నిలిపినది. కపిలుడు చెప్పిన మార్గమున దేవహూతి నారాయణుని యందు కలిసినది. ఆమె ముక్తిపొందిన పుణ్యభూమికి సిద్ధిపదమనే పేరు కలిగింది.

తల్లివద్ద సెలవు గైకొని బయలుదేరిన కపిలుడు సమస్త దేవ, గంధర్వ, సిద్ధ, చారణ, మునివరులచే స్తుతింపబడుచూ, సముద్రునిచే పూజలంది, గౌరవింపబడి నివాసగృహమునుపొందెను. సాంఖ్యయోగమవలంబించి శాంతికొరకు తండ్రి ఆశ్రమము విడిచి ఉత్తరదిక్కుగా నడచి వెళ్లెను.

ఈ వృత్తాంతము చెప్పి మైత్రేయుడు విదురునితో అంటాడు. ఈ కపిల దేవహూతి సంవాదము మిక్కిలి పవిత్రము. ఇతని యోగ మార్గమును భక్తితో అధ్యయనము చేసినవారు పుణ్యాత్ములై నారాయణుని పాదపద్మములను పొందుతారు. ఇట్లు మైత్రేయుడు కీర్తించెనని పరీక్షిత్తునకు శ్రీ శుకయోగి చెప్పెను. సూతుడు శౌనకాదులకీ కథ చెప్పగా వారు సంతుష్టహృదయులైరి.

పుణ్యాత్ములైన శ్రోతలారా! ఈ విధముగా భాగవతము లోని ప్రథమ, ద్వితీయ స్కంధములు, తృతీయ స్కంధము హిరణ్యాక్ష హిరణ్యకశిపుల జనన సందర్భమున వారి కథను పూర్తి చేయుటకు సప్తమస్కంధమును, మరల తృతీయ స్కంధ శేషభాగ మును మొత్తము నాలుగు స్కంధములను పూర్తిగా చెప్పు కున్నాము.

ఈ సదవకాశము కల్పించి సాంగమంగళముగ నెరవేరునట్లు అనుగ్రహించిన శ్రీకృష్ణపరమాత్మకు, మనము ప్రతిదినము ఉదయము వచ్చుసరికి ఇచ్చట అన్ని సౌకర్యములను కలుగజేసి మీకు నాకు పరమానందమును కలుగజేసిన పూజ్యులు శ్రీ శ్రీ ముదుంబై

రామానుజాచార్యులవారికి నా కృతజ్ఞతాపూర్వక సాష్టాంగప్రణామములర్పించుచూ కార్యక్రమమును సమాప్తి చేయుచున్నాను. సమాప్తి అంటె భగవదర్పణ మని భావించాలి. సమ అంటే పరమాత్మ అని అర్థము. "నిర్దోషం హి సమం బ్రహ్మ" అని భగవద్గీత. దోషరహితమై, సమమైనది బ్రహ్మస్వరూపమే. ఆ బ్రహ్మస్వరూపమును ఆప్తి అంటె పొందుట అని తెలుసుకోవాలి. అంటే బ్రహ్మప్రాప్తికొరకై మనమందరమిచ్చుట నీ మహత్తర కార్యమును భగవదనుగ్రహముచే భగవదర్పణము చేసుకొనుచున్నాము.

దీనిలో నేను చెప్పిన దంతయు నా సొంత సొత్తు కాదు. అంతా పెద్దల ఉచ్ఛిష్టమే. పరమాత్మ సొత్తు. "త్వదైవ వస్తు గోవింద తుభ్యమేవ సమర్పయే" స్వామీ! ఏమి పలికించినావో అదంతా నీదే. నీ వస్తువు నీకర్పించుచున్నాను, ప్రభూ! అని ఆ సర్వేశ్వరునకీ జ్ఞానయజ్ఞమును సమర్పించుకొనుచున్నాము. పలికిన పలుకులలో దొసగులు నావి. ఒప్పులన్నియు దేవునివి. ఆయన అపారకృపతో నీ కార్యమింతవరకు జరిగినది.

భాగవతములో ఇంకను ఎనిమిది స్కంధములు మిగిలియున్నది. ఆ సర్వేశ్వరుని యనుగ్రహము కలిగినపుడు, మీ యందరి హృదయాలలో మరల శ్రవణాసక్తి తీవ్రముగ కలిగినపుడు మిగిలిన భాగవతము చెప్పుకుందాము.

అంతవరకు శెలవు.





శ్రీకృష్ణ గోవింద హరే మురారే హేనాథ నారాయణ వాసుదేవ।
జిహ్వే పిబస్వామృతమేత దేవ గోవింద దామోదర మాధవేతి ॥

విక్రేతుకామాకిల గోపకన్యా మురారి పాదార్పిత చిత్తవృత్తిః ।
దధ్యాదికం మోహవశాదవోచత్ గోవిందదామోదరమాధవేతి ॥

గృహేగృహే గోపవధూకదంబాః సర్వేమిళిత్వా సమవాప్య యోగమ్ ।
పుణ్యాని నామాని వదంతినిత్యం గోవింద దామోదరమాధవేతి ॥

సుఖం శయానా నిలయే నిజేపి నామాని విష్ణోః ప్రవదంతి మర్త్యాః ।
తే నిశ్చయం తన్మయతాం వ్రజంతి గోవింద దామోదరమాధవేతి ॥

జిహ్వే సదైవం భజసుందరాణి నామానికృష్ణస్యమనోహరాణి ।
సమస్త భక్తార్తి వినాశనాని గోవింద దామోదర మాధవేతి ॥

సుఖావసానే ఇదమేవ సారం దుఃఖావసానే ఇదమేవ జ్ఞేయమ్ ।
దేహావసానే ఇదమేవ జాప్యం గోవింద దామోదర మాధవేతి ॥

శ్రీకృష్ణరాధావర గోకులేశ గోపాల గోవర్ధననాథ విష్ణో ।
జిహ్వే పిబస్వామృతమేతదేవ గోవింద దామోదర మాధవేతి ॥

జిహ్వేరసజ్ఞే మధురప్రియత్వం సత్యం హితంత్వాంపరమంవదామి ।
ఆవర్ణమేథా మధురాక్షరాణి గోవింద దామోదర మాధవేతి ॥

త్వామేవయాచే మమదేహి జిహ్వే సమాగతే దండధరే కృతాంతే।
వక్తవ్యమేవం మధురం సుభక్త్యా గోవింద దామోదర మాధవేతి॥

కృష్ణార్పణమ్.

